# ఆంధ్రపత్రిక



ఖర సంవత్సరాదిసంచిక 1951-5

నూతన సంవత్సరోదయ సందర్భమున

మా ఖాతాదారులకు హృదయపూర్వక

అభినందనములు

“ఉమా” ఆభరణములు మిశ్రమలోహముపైన అసలు బంగారురేకు అంటించి తయారుచేయబడినవి. నల్లబడవు. 10 సం. గ్యారంటీ.

రు 500 బహుమానము.

★ ఉమా ఆభరణములు మహా ద్రావకములో వేసిన అయిదు నిమిషములకు బంగారురేకు వెడలివచ్చును. ★




★ అట్లు లేదని నిరూపించిన వారికి రూ 500లు బహుమానము. ★

మేము తయారుచేయు ప్రతివస్తువుపైనను ‘ఉమ’ అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించవలెను.

**800** ఆభరణముల క్యాటలాగు ఉచితముగా పంపబడును

ఆభరణముల పార్సిలు చార్జి రు **0-15-0** ప్రత్యేకం

**ఉమాగోల్డు కవరింగు వర్క్సు, ఉమామహల్: మచిలీపట్టణం.**

ఉమాగోల్డు కవరింగు వర్క్సు పోష్టు ఆఫీసు.

Tel-“UMA” Masulipatam-

*N. B:*—ఆర్డర్లు వ్రాయునపుడు “ఆంధ్రపత్రిక ఉగాది సంచిక”లో చూచినట్లు వ్రాయవలయును.

# పరిపూర్ణత్వము





# సీపో

## హేరాయిల్

## గావో చందన సబ్బు

ప్రశాంతము మరియు ప్రధమశ్రేణి

GANGA WORKS - ADYAR - MADRAS - 20


EP

## పండిత డి. గోపాలాచార్యులవారి

# రత్నత్రయం






## జీవామృతము.

స్త్రీ పురుషులకు, బాలబాలికలకు అధునాతన రసాయనౌషధంగా జీవామృతం స్వశక్తిచే పేరు గడించుకున్నది. మీ ఎముకలను నరాలను, కండరాలను బలంగా పెంచుతుంది. అంతేకాదు— ఈ ఔషధం వ్యాధిపీడితుడు కోలుకొనే కాలాన్ని తగ్గిస్తుంది.



## అరుణ....

నమ్మకమైన గర్భాశయరసాయనౌషధంగా అరుణ రుజువుచేసుకుంది. బహిష్టు సమయ బాధలలో స్త్రీలకు వరప్రసాదమనికూడా అరుణ రుజువుపరచుకుంది. ఋతుదోషాలు, శారీరక, మానసిక బలహీనత, గర్భాశయ రోగాలు—వీటినుండి విముక్తి పొందడానికి అరుణ అత్యంత సహకారిగా వుంటుంది.




## బాలప్రాశ....

పసిపాపలను పెంచడంలో ఆదర్శప్రాయమైనది. పసిపాపలకు చురుకు పెరుగుదలను, బలమైన శరీరాన్ని కలుగజేస్తుంది. ఇది తియ్యని చక్కని ఔషధం. బాలప్రాశ పసిపాపల వ్యాధులన్నిటినీ తొలగించి వారికి ఆకలిని, జీర్ణశక్తిని కలిగిస్తుంది.

## ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మద్రాసు 17.

5854/J

# 4 వ వారం

ఆంధ్ర, నైజాము, మైసూరు, రాష్ట్రములలో
విజయ భేరి
మ్రోగించుచున్నది!

విజయ వారి

# పాతాళ భైరవి



డైరెక్టర్... కె. వి. రెడ్డి, B.SC.(HONS)

నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి

# SHOCK-PROTECTED!
## WATER-PROOF & STAIN-PROOF!




## *West End* ALL-PROOF
### "MULTIFORT AUTOMATIC"

అకస్మాత్తుగా పైన దెబ్బలతగాని, అదుర్లుతగాని.
పడిపోవటంవల్లగాని. చెడిపోదని, నీరు, తేమ,
చెమట, దుమ్ములోనికి ప్రవేశించి మూ
మెంటుకు హానిచేయదని. తేను త్రుప్పు
పట్టకుండ ఏ పరిస్థితులలోను మానిపో
దని. హుషారుగల స్త్రీపురుషులు తమకు
తాము రుజువుపరిచియున్నారు. ఆల్
ప్రూఫ్ మల్టిఫోర్టు ఆటోమటిక్ వాచి
నమ్మకంగా పనిచేయు టైం కీపరు.






10½" సైజు
మల్టిఫోర్టు ఆటోమటిక్
(సెల్ఫ్‌వైండింగ్)
ఎవర్‌బ్రైట్‌స్టీల్ రు 250/-

# WEST END WATCH Co.
**BOMBAY** **CALCUTTA**



# ఆంధ్రపత్రిక

(నలువది రెండవ
ఉగాది సంచిక)

## ఖర సంవత్సరాదిసంచిక

(1951-52)

*

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాదు

*

[వెల రూ. 2]

42
సంచిక

ఆంధ్రపత్రిక

సంవత్సరము
1951-52

# ఖర ఉగాది సంచిక

## విషయానుక్రమణిక

## త్రివర్ణ చిత్రములు



## సాధారణ చిత్రములు:





బాతులు

(లినోకట్ చిత్రము) శ్రీ బంకిం సర్కారు. శాంతినికేతన్.



"దూరదృష్టి"

(వస్త్రంపై టెంపోరా త్రివర్ణ చిత్రము)

చిత్రకారుడు :

శ్రీ దేవీప్రసాద్‌రాయ్ చౌదరి

ॐ

# ప్రస్తావన

ఇది శతాబ్దమధ్యము. ఇట వత్సరము లన్నియు విషమగమకమునే సాగించుకొనుచున్నవి. విరోధి, వికృత్యాది నామములను సార్థక మొనరించుకొనుచున్నట్లే ప్రవర్తించుచూ వచ్చినవి. కాని ఎప్పటికప్పుడు భవిష్యత్తు నాశాజనకముగ కన్పింపచేయగల పరిస్థితులను విడనాడక వెంట నిడుకొని తెచ్చుకొనుచునే ఉన్నవి. ఈ ఆశానైరాశ్యముల విషమ సంరంభమే, ప్రపంచవ్యాప్తముగ మానవజాతిని గుప్పిట నిడుకొని ఇదమిత్థమను నిర్ణయము గాన్పింపనీక, నిశ్చిత గమనమున కాలుసాగనీక, ఊరకనూ నిలవనీక, కదలాడించి వైచుచున్నది. నరుడే నిశ్శేషమైపోగల విలయావకాశము, మానవజాతికి అపార అభ్యుదయావకాశము, ఏకకాలముననే మానవుని కన్నుల ముందాడుచు, మరుక్షణము స్వర్గతుల్యమో, నరకతుల్యమో, తెలియని సంశయస్థితిలో మానవుని చైతన్యమును స్తంభింపచేయుచున్నది.

19 వ శతాబ్దము, సర్వవిధముల మానవునికి తాను స్వయంసంపూర్ణుడ నని, భ్రమనుగాని, యాథార్థ్యమునుగాని కల్పించినది. ఆనాటి భౌతికాది విజ్ఞాన శాస్త్రము విశ్వరహస్యమంతయు కరతలామలకమైపోయినట్లు, త్రిగుణాత్మకమైన ప్రత్యక్ష భౌతిక రూపమందుకొన్నట్లు, సంశయరహితమగు సర్వజ్ఞత్వ ఆభాసముత్తో వెలిగినది. ఆనాటి సాంఘికశాస్త్ర సర్వస్వము, ఆ సర్వజ్ఞత్వముతోనే, అతిభౌతికశక్తుల ప్రమేయము లేకుండ, మానవజాతి పురోగతి సర్వస్వమునకు సంశయరహితమగు బాట ఆసాంతముగ వైచికొన్నదని తృప్తి నిచ్చినది. ఆనాడు ఆర్థిక సాంఘిక శాస్త్రజ్ఞులచే సాయింపబడ్డ, సాంఘిక, ఆర్థిక రాజకీయ జ్ఞాన సూత్రములన్నియు ఋక్ స్థిరత్వము నందుకొని, ఈనాటికి కదలింపబడలేక నిలచినవి.

భౌతికవిజ్ఞానశాస్త్రమున కున్న ప్రయోగావకాశము ముందు, ఆపురోగతమార్గములోనే ఇరువదియవ శతాబ్దము ముందంజవైచి, ఆ సర్వజ్ఞత్వమును పటాపంచ లొనర్చినది. భౌతిక వాదముల స్వయంసంపూర్ణత్వము ఛిన్నాభిన్నమైపోయినది. కాని ఆ శాస్త్రమున కున్న నిర్వికారగుణవిశేషమువల్ల భౌతికాధారముల మూలవిచ్ఛేదము, జ్ఞానమార్గమున గుదిగొయ్యలనుండి విముక్త మొనర్చినదితప్ప, విజ్ఞానవికాసమే ఆధారము లేక నేల రాలిపోవునట్లు చేయలేదు. భౌతికశక్తులలోని విశ్వాసము అధిభౌతికశక్తుల సమన్వయముపైకి మరల్పబడి, శాస్త్రపురోగమనమునకు చైతన్య మొసగినది.

ఆ శతాబ్దపు సాంఘిక ఆర్థికశాస్త్రము లన్నియు ఆనాటి భౌతికశాస్త్ర స్వయంసంపూర్ణగుణము మూలాధారముగ గొని బయలుదేరినవి. కాని భౌతికశాస్త్రము గతిమార్చుకొన్నను, ఆ శాస్త్రమున కున్నంత ప్రయోగావకాశములు, నిర్వికార గుణసౌలభ్యము లేనందున, అతి శీఘ్రముగా తమను తము మార్చుకోలేకపోయినవి. తాము స్వయం సంపూర్ణములన్న దృష్టి వదుల్చుకోలేక పోయినవి.

ఆనాటి కాపిటలిజమ్, ఆనాటి కమ్యూనిజంల, స్వయంసంపూర్ణ దృక్ప్రభావమే, నేడు ఇరుదవ శతాబ్దమధ్యమునకు వచ్చునప్పటికి, సాంఘికావకాశముల స్వల్పప్రయోగములోనే సంపూర్ణత నందుకొన్నట్లు పెచ్చుపెరిగి, వికృతరూపము లందుకొని, ప్రపంచ ఆర్థిక, సాంఘిక స్వత్వ సర్వస్వమును ఆవాదములకు కైవస మొనర్చుకొను భీషణదాహములో రెండు ప్రపంచయుద్ధములతో విలయతాండవ మొనర్చి, ఆ జిగీషతోనే మూడవ ప్రపంచ సంగ్రామమునకు సన్నద్ధమై ఆర్భాట మొనర్చుచున్నది. బలాబల పరీక్షలకు నాందీ ప్రస్తావనగా కొరియాయుద్ధ మీ సంవత్సరము ప్రారంభమైనది.

ఇరువదవ శతాబ్దపు మొదటి ఇరువది ఏండ్లలో ప్రపంచమున లయించినది ధనికవాద దుష్ప్రభావము. దీని నెదిర్చి మానవకల్యాణ ఆదర్శముతో ప్రారంభ

మై్యి, సామ్యవాదము ప్రామాణికత్వ మందుకొని ఆశాజనకముగ, ప్రయోగబలయుతముగ పెరిగి ధనిక వాదము నెదిర్చినది. సామ్యవాదము కల్యాణాత్మక మగు సంస్థగానే శక్తివంతము కాగల అవకాశము లభించు తరుణములో, ధనికవాదము నియంతృ శక్తులను రెచ్చగొట్టి సామ్యవాదముపై నుసిగొల్పినది. ఆ రాక్షస శక్తులు ఇరువురిపైనను విజృంభించినవి. వాటిని రూపుమాపుటలో, ఇరుపక్షములు గూడ నియంతృ స్వభావమునే తాము జీర్ణించుకొనిరి. నియంతృగుణమును నిర్మూలమొనర్చు ఆదర్శములతో బయలు దేరిన, ప్రజాస్వామ్య, సామ్యవాదములకు, అమెరికా, రష్యాలు, నేడు లోకనియంతలై యావత్ప్రపంచమునకు ప్రజాస్వామ్య నియంతృత్వము, సామ్యవాద నియంతృత్వము, అను స్వవచోవిఘాతకములగు, ఆదర్శములను సృష్టించి, లోకవినాశకరమగు అణ్వాస్త్రములు ఝళిపించుచు, కయ్యమునకు కాలు ద్రవ్వుచున్నవి.

రష్యా అమెరికాలమధ్య రాజుతూ రాజుతూ వచ్చిన విరోధము ఈ సంవత్సరమున సుస్పష్టరూపము దాల్చి కొరియాయుద్ధముగా పరిణమించినది. కొరియా యుద్ధములో రష్యా ప్రత్యక్షప్రమేయము కనుపించనీయకుండా, నాగరసంస్కారమర్యాదను అడ్డముచేసుకొనుచునే గౌరవించినది. అమెరికాకు ఆ ఆస్కారము చిక్కలేదు. ఐక్యరాజ్యసమితి అమెరికా చేతిలోని కీలుబొమ్మ ఐపోయినదని రష్యా ఇన్నాళ్లుగా చేసిన ఆరోపణలకు మరింత బలము చేకూర్చునట్లే ఈ సంవత్సరము పొడుగునా అమెరికా ప్రవర్తించినది. ఐక్యరాజ్యసమితి ఆమోద మందుకొనులోపలే, ఉత్తరకొరియాను దురాక్రమణదారుగా ప్రకటించి స్వయముగా యుద్ధము ప్రారంభించి, స్థానబలిమిచే ఐక్యరాజ్యసమితిచేత తన చర్యను సమర్థనీయ మొనర్చుకొని, యుద్ధనిర్వహణమును, బాధ్యతను, ఐక్యరాజ్యసమితిచే స్వీకరింపచేసినది. యథార్థమునకు నిర్వహణము తన చేతిలో నుంచుకొన్నది. 38 వ అక్షాంశము దాటి పోరాదన్న బహుళ ప్రజానీక ప్రతినిధుల సలహాలను స్వప్రతిష్ఠా ప్రాబల్యములకై, త్రోసిపుచ్చినది.

కొరియాలో, జయపు ఉబ్బున సమాధాన ప్రయత్నములకు అంకి రాకుండుటయు, తిరుగు స్థాయి నున్నప్పుడు, సమాధానప్రయత్నములు ప్రతిష్ఠాభంగకరములని మొరాయించుటయు, ఐక్యరాజ్యసమితిలో చైనా సభ్యత్వవిషయమున అమెరికా ప్రవర్తనమునకు, ఔన్నత్యమును తేలేకుండపోయినవి. ఇన్నాళ్లును ఐక్యరాజ్య సమితి కార్యకలాపసర్వస్వమునకు ప్రతిష్టంభనలు కల్పించుచువచ్చిన రష్యా, ప్రపంచ కార్మిక నియంతృత్వప్రచారమునకు అమెరికా చర్యల నాధారముగ, ప్రాచ్యఖండమున ప్రాబల్య మేర్పరుచుకొన గలుగుచున్నది. కాని కార్మిక నియంతృత్వ ప్రాబల్యమే తప్ప, సామ్యవాద ప్రోత్థితమైన శాంతిప్రయత్నములు రష్యాకును ఏమాత్రము పట్టిన పాపమున పోలేదు.

ఈ అసందిగ్ధ విషమపరిస్థితులలో, బాల్యదశలో నున్న భారత రాజ్యాంగ విదేశ విధానము, తప్పటడుగులు వేయక తప్పుటలేదు. కాని ఆ యడుగులన్నిటను పసితనపు నిష్కల్మషతయు, మనోవాక్కర్మశుచిత్వమును గల్గియుండుటచే, నేటి అగ్రరాజ్యముల స్వార్థపరత్వపు పోకడలలో నున్న, సైనిక, ఆర్థిక, చాణక్య, బలసంపత్తి లేకున్నను, వాటికన్న నైతిక ధర్మబలవిశిష్టత అధికముగాగలదు. ప్రపంచరాజ్యము లన్నియు నోటితో చెప్పు లోకకల్యాణ, శాంతి సౌభాగ్యములే, వాటి యథార్థ ఆశయములగుచో, తదాశయసిద్ధికి భారతరాజ్యాంగపు పసియడుగులనే యనుకరింపక తప్పదు.

కాశ్మీర్ వంటి అతి స్వల్ప, స్పష్టసమస్యను, సంక్లిష్టతరబడి, ఎగలాగి, దిగలాగి, సమస్యను, వదలి వేరు పరిష్కారములకు, అగ్రరాజ్యములు ఐక్యరాజ్యసమితిలో తీర్మానించినవన్న, మూలసమస్యలను నిష్పాక్షికముగ విచారించు స్వభావము అగ్రరాజ్యముల ప్రాబల్యమున ఎంత వెనుకపట్టిపోయినదో వ్యక్తమగుచున్నది. కాశ్మీర్ లో పాకిస్థాన్ దురాక్రమణదారని భారతదేశ ఆరోపణ. పరిస్థితులు ఆ ఆరోపణను నిరూపించినవి. పాకిస్థాన్ ఆ విషయమును ఒప్పుకొనినది. ఇట్టి సమయములో ఏ చిన్ని సామాన్య న్యాయస్థానమైనను దురాక్రమణదారు వెంటనే వైదొలగవలెనని తీర్పు నిచ్చుట, సర్వజను తెరింగిన

న్యాయపు పరిపాటి. తప్పనొప్పుకొని రావలసివచ్చుటలో పాకిస్థాన్ సమస్యాస్వరూపమును మార్చి, వివాదమును కాశ్మీర్ ఆధిపత్యవిషయముగా మార్చివైచినది.

ఇద్దరు తల్లులు ఒకేబిడ్డను నాది నాదని తగవులాడుకొన్నప్పుడు, బిడ్డను రెండు ఖండములుగా చేయమని సొలొమన్ ఇచ్చిన తీర్పువలెనున్నది, ఐక్యరాజ్యసమితి చేసిన మధ్యవర్తిపరిష్కారము. ఆ తీర్పునకు తల్లికాని యువతి వెంటనే ఒప్పుకొన్నది. తల్లి మాత్రము బిడ్డడు బ్రతికిన చాలునని ఒప్పుకొనలేకపోయినది. ఐక్యరాజ్యసమితితీర్పును పాకిస్థాన్ వెంటనే అంగీకరించినది. భారతదేశ మొప్పుకొనలేకపోయినది. సొలొమన్ తీర్పులో, వ్యక్తుల స్వభావనిరూపణ మాత్రమునకే పరిమితమైన ఇంగితజ్ఞానమైనా ఉన్నది. అగ్రరాజ్యముల స్వార్థప్రాబల్యములు విజృంభించినపుడు, సమితి ఆ దేశములకు, వివాదపక్షములు, ధర్మనిష్ఠ ఆరోపించుకొని ఆచరించుకొనుట బహు దుష్కరము.

భారతదేశముపట్ల పాకిస్థాన్ చూపు వైఖరి కూడ సమర్థనీయముగ లేదు. నేడు భారతదేశ సరిహద్దులు విస్తారముగ పెరిగిపోవుటవలనను, సరిహద్దు లంతటను, నిప్పురాజినట్లు, అలజడులు, దురాక్రమణ భయములు విస్తరిల్లుటవలనను, భారత దేశ క్షేమమునకు, విస్తృత సైనికరక్షణావసరము మరింత ఇనుమడించినది. ఇన్నాళ్లుగా దేశములో ఆంతరంగికముగా ప్రబలిన కమ్యూనిస్టు దుశ్చర్యలు కొంత తగ్గుముఖముపట్టుట యొక్కటిమాత్రము, ఈ సమయమున దేశరక్షణ దృష్ట్యా ఆంతరంగికముగ కొంతసుగుణమైనది. భారతదేశ ఉత్తర సరిహద్దంతయు, తూర్పునుండి పడమటివరకు, అంగుళ మంగుళము మునుపటికన్న కూడ పటిష్ఠముగా భద్రమొనర్చుకోవలసిన ఆవశ్యకత, టిబెట్‌ను చైనా ఆక్రమించుటతోనూ, అస్సాం సరిహద్దుల కమ్యూనిస్టు, కొండజాతుల, దుండగములు ప్రబలుటతోనూ, ప్రాక్పశ్చిమముల రెంటనూ పాకిస్థాన్ సామరస్యము చూపలేక నిత్యము కాలుదువ్వుటకు సంసిద్ధతనే చూపుచుండుటవలనను, ప్రపంచ విస్తృత యుద్ధము ఏక్షణమునైన సంభవింప నవకాశము గల్గుటచేతను, ఈ ఒక్క సంవత్సరములోనే పదింతలుగా ఇనుమడించినది.

స్వాతంత్ర్యము సిద్ధించిననాటినుండియు, దేశ నాయకులు, ఆర్థిక సాంఘిక స్వాతంత్ర్యములను మనమింకను సంపాదించుకోవలసియే యున్నదని ప్రతి నిత్యము ప్రజకు హెచ్చరిక చేయుచునే ఉన్నారు. సాంఘికస్వాతంత్ర్యము స్వరూపము అనిర్దిష్టము. రాజ్యాంగము వ్యక్తికిచ్చిన స్వాతంత్ర్యములోనే, ఇమిడియుండిన యుండవచ్చును. లేదా, సంఘస్వరూపమును సంస్కృతి, ఆచారములను మార్చుటకు ఏ సాంఘిక తత్వవాదము ఆ సాంఘికతత్వమును రాజ్యాంగాధికారముతో సంఘముపై రుద్దవచ్చును. కాని ఈ ఏడు జరిగిన సాంస్కృతిక సమావేశములోకూడ, అధినేతలు, ఆదర్శములను తప్ప, సంఘస్వరూపమునకు, తాము ఆశించు సంస్కారమునకు, నిర్దిష్ట నూతన స్వరూపమేదియు నొసగజాలరైరి. సంఘ స్వాతంత్ర్యము, మానవజాతిపారంపర్య మున్నంతవరకు, నిత్యవిప్లవముగా సాగుచుపోవలసిన దేకాన దానివిషయ మెక్కువ ప్రస్తరించుకో నవసరములేదు. కాని రాజ్యాంగము, ఆస్తిక్యము, నాస్తిక్యము, అన్న నిర్వచనమును తన విధానములో ఇముడ్చుకో చూచినప్పుడు, ప్రత్యేకవర్గపీడాకరముగా తప్ప, సర్వతో భద్రముగ ఈ సంస్కారము జరుగుటకు అవకాశ మతి స్వల్పము.

ఆర్థికముగ స్వయంసమృద్ధికై భారత రాజ్యాంగ మెన్నివిధముల కృషికి ఆస్కార మున్నదో అన్నివిధముల ప్రయత్నించుచున్నది. కాని వ్యక్తి జీవనప్రమాణములను, వ్యక్తి సౌకర్యములతో కాక రూపాయి అణాల మారకముతో ముడిపెట్టి, పెంచుకొనుటకు ప్రయత్నించుటలో, ప్రభుత్వము ఆర్థిక స్వయంసమృద్ధిని చేకూర్చుకొనుటకు ప్రయత్నించుకొనగలుగుచున్న దేమోగాని, ఆ విధానములో వ్యక్తి యథార్థజీవన ప్రమాణముపై దెబ్బకొట్టుచునే వచ్చుచున్నది. ఆహారవస్త్ర స్వయంసమృద్ధికి, విదేశ రాజ్యాంగములతోటి బేహారములలో రాజ్యాంగ ఆర్థిక స్వయంసమృద్ధి విధానమవలంబింపవలసివచ్చుట,

ఆశయ సాఫల్యమునకు పోషకముగ నుండలేక పోవుచున్నది.

రాబోవు సంవత్సరమున, ఏ ప్రపంచ దేశమున జరుగనంత విస్తృతముగ, భారతదేశమున ప్రజాస్వామ్య విధానముపై స్వేచ్ఛగా యావద్భారత దేశప్రజలుకూ ఎన్నికలలో పాల్గొన నవకాశము గల్గుచున్నది. ఈ ఎన్నికల ఫలితములు, నేటి ప్రపంచ రాజకీయ వాదములలో, విస్తృతప్రజాభిమానమును చూరగొన్న రాజకీయ తత్త్వమును, కొంత గాకున్న కొంతవరకైన వ్యక్తమొనరించగలవు.

వికృతి సంవత్సరమున భారతదేశ మిద్దరు మహాపురుషులను గోల్పోయినది. సర్దార్ పటేలు, రాజకీయముగ, సాంఘికముగ దేశమున కపారమైన సేవ యొనర్చినవాడు. అరవిందునిలో, వేదాంత విజ్ఞాన బోధ, సారస్వత సేవకూడ, వీనికి దోడైనవి.

ఆంధ్రసారస్వతరంగము ఇద్దరు మహామహులను గోల్పోయినది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారలు తమ విమర్శనా ప్రతిభతో, తెలుగుసారస్వతమునకు క్రొత్తతెన్నులు దిద్ది, అపారమైన సేవ యొనర్చినవారు. విశ్వసాహిత్య రంగమున బెర్నార్డుషా, సింక్లర్‌లూయీ, ఆంద్రీ ఝీద్‌ల నిష్క్రమణము, విశ్వసాహిత్యమునకు తీరని లోటు. సాహిత్యమును, సంఘసంస్కరణప్రయోజనమున కుద్దేశించి కావ్యరసత్వమును చెడగొట్టుకొనకుండ, ప్రయోజనమును సాధించిన మహామహులీ ముగ్గురూ.

ఆంధ్రరాష్ట్రము—'పాడిన గీతమే మరల పాడెద, గూడిన భావమే మరిం గూడెద, నేను సేయ వలె గుండియ శోషిలిపోయి వేదనన్ గాడిన...నాదు వాక్కు తెగబారదు నూత్నపథాల వెంబడిన్' అన్న వేదనగానే ఆంధ్రులకు మిగిలిపోయినది. ఎన్నికల సంరంభ మారంభమైనగూడ, ఈ నినాదముతో, ప్రజాహృదయమును చూరగొనగలుగుదుమన్న ఆశ ఆంధ్రనాయకులకే సన్నగించినది. ఖర సంవత్సరమైనను, ఈ వేదనను బాపి, స్వరాష్ట్రసిద్ధిని చేకూర్పగలదేమోయను ఆశానిరీక్షణలతో నూతన సంవత్సరారంభమున మనశ్శాంతి చేకూర్చుకొందముగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# బౌద్ధకళారంభములు -
# భర్హుత్ స్తూపము



శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

భారతీయకళ ప్రధానముగా మతవిషయకమైనది. దేవప్రాసాద నిర్మాణకళ (*Architecture*) యు దానితో దృఢసంబంధముగల శిల్పకళ (*Sculpture*)యు అర్వాచీనకాలమున నేమో కాని పూర్వకాలమున నేనాడును లౌకిక ప్రయోజనముల నిమిత్తముపయోగింపబడలేదు. ఈ రెండును మతములో పుట్టి మతముతో పెరిగి మతప్రయోజనముల నిమిత్తమయినవి. అందువలన మన దేశమున పూర్వము శిల్పులు తమకుగల నిర్మాణ కళాచాతుర్యమును దేవమందిరములు నిర్మించుటలోను, దాని కనుబంధించిన శిల్పమును దేవప్రతిమలను, దేవకథానకములను, మతమునకు సంబంధించిన పవిత్రచిహ్నాదికములను రచియించుటకును వినియోగించుచు వచ్చిరి. ఒకవేళ ఇట్టి వేవియు చెక్కుటకవసరము లేనినాడు శిల్పము అలంకార పరికల్పనము నిమిత్తమే ఉపయుక్తమైనది. కళ ఒక ప్రయోజనమును సాధించుటకే కాని కళ కళకోసమే యన్న భావన మన పూర్వులకు లేదు.

పురాణములు, శిల్పశాస్త్రములు మొదలైనవి అనేక విధములైన దేవప్రాసాదముల నిర్మాణమును గురించి చెప్పును. ఆకార విన్యాసముల ననుసరించి దేవప్రాసాదములు పురాణముల ప్రకారము వైరాజ, పుష్పక, కైలాస, మణిక, త్రివిష్టపములని యైదు విధములు1. మరల నీయొక్కొక్క విధమైన దేవప్రాసాదమున తొమ్మిదేసి రకములు కలవు. ఈ రీతిని పురాణములు అయిదు తొమ్మిదులు నలువదియైదు రకముల దేవప్రాసాదములను జెప్పుచున్నవి. కాని క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దినాటి శాసనములలో దేవప్రాసాదములు ప్రధానముగ అయిదు కాక నాలుగు విధము లనియు, మరల వీనిలో ఒక్కొకదానిలో అసంఖ్యాకములైన భేదములు కలవనియు చెప్పియున్నది. అయిదు విధములయినను నాలుగు విధములయినను దేవప్రాసాదములు మౌర్యయుగమునకు పూర్వపు వేవియు కానవచ్చుటలేదు; దేవప్రాసాదములు మాత్రమే కాదు, ముఖ్యమయిన నిర్మాణము లేవియు గానరాలేదు. మొహెంజోదరో చన్హుదరో హారప్పలలో జరిగిన త్రవ్వపరిశోధనలవలన క్రీస్తుకు రెండు మూడు వేల సంవత్సరములకు పూర్వమునుంచియు ఇటికతో గట్టిన కట్టడము లున్నట్టు తెలియవచ్చినను అప్పటినుంచి మరల క్రీస్తుకు రెండువందల యేబదిమూడు సంవత్సరములకు పూర్వము, అనగా మౌర్యయుగమువరకు ఏ కారణముననో యెట్టి నిర్మాణమును కానరాలేదు. రెండడీని, ఇటికను (పచ్చియిటిక కాదు, కాల్చినది) సున్నమును ఉపయోగించి గృహాదికములు నిర్మించుట క్రీస్తుకు రెండుమూడు వేల సంవత్సరములకు పూర్వమునుంచి తెలియవచ్చినను పైని చెప్పిన పురాతన స్థలములలో దేవమందిరములున్న జాడ లేవియు తెలియరాలేదు.

క్రీస్తుకు పూర్వము రెండువేల సంవత్సరములకును క్రీస్తుకు పూర్వము మూడువందల సంవత్సరములకును మధ్యకాలమునాటి

---

1. వైరాజః పుష్పకశ్చాన్యః కైలాసో మణిక స్తథా.
త్రివిష్టపశ్చ పంచైవ మేరుమూర్ధని సంస్థితాః
చతురస్రస్తు తత్రాఽద్యో ద్వితీయోపి తదాయతః. 12
వృత్తో వృత్తాయతశ్చాన్యోఽష్టాస్రశ్చాపి పంచమః
ఏకైకోనవధాభేదై శ్చత్వారింశచ్చ పంచచ. 13
ప్రసాదః ప్రథమో మేరు ర్ద్వితీయో మందర స్తథా
విమానంచ తథా భద్రః సర్వతోభద్రవేవచ. 14
రుచకో నందకోనంది వర్ధమాన స్తథాఽపరః
శ్రీవత్సశ్చేతి వైరాజాన్వాయేచ సముత్థితాః 15
వలభీగృహరాజశ్చ శాలాగృహంచ మందిరమ్
విశాలశ్చమసో బ్రహ్మ మందిరం భువనంతథా. 16
ప్రభవః శిబికావేశ్మ నవైతే పుష్పకోద్భవాః
వలయోగుందుభిః పద్మో మహాపద్మక ఏవచ. 17
వర్ధనీవాన్య ఉష్ణీషః శంఖశ్చకలశ స్తథా
స్వవృక్షశ్చ తథాఽప్యేతే వృత్తః కైలాససంభవాః. 18

పై శ్లోకము లగ్ని పురాణము (అ. 104)లోనివి. ఇట్లే మణిక, త్రివిష్టపములను గురించియు గలవు. భవిష్య, గరుడాది పురాణములలో కూడ ఈ దేవప్రాసాదములను గురించి చెప్పబడియున్నది. కాని వీటి పేర్లు అక్కడక్కడ భేదించును. కొండవీటి రెడ్డిరాజుల చరిత్రమును విన్నవారికి గృహరాజు మేడ తెలిసియే యుండును. రెడ్డిరాజులు కొండవీటిలో గృహరాజు మేడకట్టినారని ప్రతీతి. కానైతే ఆ నిర్మాణ మిప్పుడు కానరాదు, నాశనమైనది. ఈ గృహరాజు మేడయన్నది దేవప్రాసాదము. ఇది పుష్పకమను తరగతికి చెందిన తొమ్మిదిరకములలో ఒకటి. ఈ గృహరాజు మేడను కొండవీటిలో రెడ్డిరాజు లెక్కడ వీవిధముగా నిర్మాణము చేయించిరో కొండవీటికైఫియతులోను, కొండవీటి దండకవిలెలోను సవిస్తరముగా వర్ణితమైనది.

కట్టడ మిటికతో కట్టిన దొకటియైన కానరాకపోవుట వింతలలో వింత. క్రీస్తుకు మూడువందలయేండ్లకు అనగా మౌర్యయుగమునకు పూర్వము కట్టడములను కలపతోనో నశ్వరములయిన యితర పరికరములతోనో కట్టుచుండుటయే ఆనాటి కట్టడములేవియు గానరాకపోవుటకు కారణమని పురాతత్త్వజ్ఞు లూహించుచున్నారు. ఎట్లో అటువంటి నశ్వరపదార్థములతో కట్టినవాటిలో ఆనవాలుగ నిలిచినది మగధరాజధానియైన పాటలీపుత్ర నగరమునకు చుట్టునుండు దారుమయ ప్రాకారము. ఈ ప్రాకారములోని భాగములు కొన్ని యా నగరమున్న స్థలమున త్రవ్వగా బయలుపడినవి. మొహెంజోదరో హరప్పలనాటి, ఇటికలతో భవనాదికములు నిర్మించు కళ ఎట్లు ఎందుకు పోయినదో, ఎట్లు విస్మృతమయినదో, దారువువంటి నశ్వరపరికరములతో కట్టడముల నెందుకు కట్టవలసి వచ్చినదో భావిపరిశోధన తేల్చవలసిన సమస్యలు. ఇటికతో కట్టడములను గట్టుకళ మరల అశోకచక్రవర్తి కాలమునగాని పునరుజ్జీవనము కాలేదు. అశోకచక్రవర్తి కాలమునుంచి బెండడితోను, ఇటిక మొదలైన పరికరములతోను కట్టిన కట్టడములు అనేకములు కానవచ్చును.

అశోక చక్రవర్తి కాలమునాటికి మగధలో వ్యాపించిన ముఖ్యమతము బౌద్ధము. కళింగ దండయాత్రానంతరము ఆ చక్రవర్తి కళింగ యుద్ధమున కలిగిన ప్రాణనష్టమునకును, యుద్ధకారణముగ ప్రజలకు సంభవించిన యితర కష్టనష్టములకును కడుంగడు వగచి పశ్చాత్తాప సంతప్తుడై బౌద్ధధర్మము నాశ్రయించి మనస్సునకు శాంతిని చేకూర్చుకొనెను. ఆ చక్రవర్తి యుమ్మలికమును మాన్పి యాతనికి శాంతిని స్థిమితమును ప్రసాదించినది బౌద్ధము. ఆనాటినుంచి యా చక్రవర్తి ధర్మవిజయమునకు మించిన విజయము వేరులేదని తన రాజ్యమున ధర్మప్రచారమునకై ధర్మమహామాత్రులను కొంద ఱుద్యోగులను నియమించెను; ఆత్మశాంతి నొసంగిన దగుటచేత బౌద్ధమునెడల అత్యంతాభిమానము కలిగి యదియే ప్రజలకు దుఃఖసంతారకమయినదని దానిని నానాదేశము లందును వ్యాపింపజేయుటకు మతబోధకుల నంపెను. అంతియే కాక బౌద్ధధర్మావలంబకులకును, తదితరులకునుగూడ అవలంబనీయములైన సామాన్యధర్మవిధుల నేరి ప్రజల యవబోధను నిమిత్తము తన రాజ్యమునందలి వేఱువేఱు ప్రాంతములలో శిలల మీద చెక్కించెను. ఇటువంటి అశోక శిలాశాసనములకు ధర్మలిపులని పేరు. అశోకచక్రవర్తి చేసిన ప్రయత్నములవలనను, ప్రచారమువలనను అంతవరకు మగధలో ఒక స్థానిక ధర్మసంప్రదాయముగానుండిన బౌద్ధము ఆ దేశపు సీమావధులు దాటి విస్తరిల్లి విశ్వమతమై రాణ కెక్కినది. ఈ యశోకచక్రవర్తి కాలమునుంచియే కట్టడములలో ఇటిక కానవచ్చుచున్నది. పూర్వ ప్రస్థపతులు ఇటికతోపాటు రాతిని నిర్మాణకళలో ఉపయోగించినదికూడ మౌర్యవంశజుడయిన అశోకచక్రవర్తి కాలములోనే. అంతకుపూర్వము కట్టడములలో రాతి నుపయోగించిన నిదర్శనములు కానరావు. అశోకచక్రవర్తి కభిమానపాత్రమైన మతమగుట చేతను, ఆ కాలమున బహుళ వ్యాప్తి కలదగుటచేతను మన కానాటి నుంచి కానవచ్చు మొదటి నిర్మాణములు బౌద్ధమునకు సంబంధించినవే. బౌద్ధము నవలంబించిన ఇతర ఆసియాఖండదేశములలోని మత సంబంధమైన కళ మధ్యయుగము, అనగా క్రీస్తుశకము పదుమూడు పదునాలుగు శతాబ్దులవరకు భారతీయ కళారీతుల ప్రాతిపదిక మీదనే వికాసము నొందినది.

పూర్వోక్త కారణములవల్ల భారతీయదేవమందిర నిర్మాణకళకు మనకు తెలిసిన ప్రథమోదాహరణము లన్నియు బౌద్ధమునకు సంబంధించినవే. మౌర్యయుగమున అరంభమయిన ఈ నిర్మాణకళ కాలక్రమమున పొందిన పరిణామ వికాసములను తెలిసికొనుటకు నాటినుంచి ప్రతిశతాబ్దిలోను ప్రతియుగములోను కట్టిన కట్టడములు చాలినన్ని కానరావు. ఇందుకు కారణము అసలు కట్టడములు లేక పోవుట కాదు. హిందూదేశమునకు తుకిడీలు తుకిడీలుగా వచ్చిన దేశాంతరాగతుల దుండగములవలనను దౌష్ట్యమువలనను ఎన్నెన్నో నిర్మాణములు భగ్నములైనవి. ఎన్నెన్నో దేవమందిరములు నేలమట్టమయినవి. మతద్వేషములవలన అనేకములు రూపుమాసిపోయినవి. ఈ విధముగా నశించిపోయిన నిర్మాణాత్మక కళారత్నము లనేకములు. ఇందువలన మన దేవమందిర నిర్మాణకళ, శిల్పకళల క్రమవికాసమును తెలుపు అనుస్యూత చారిత్రమును రచియించుట కవకాశము లల్పములు, కష్టము లనల్పములు. విదేశీయుల నాశన ప్రవృత్తి బారి బడనివి, మతావేశ పరవశులైనవారి దుండగములకు గురికానివి ఏ కొద్దిగనో కాలప్రవాహమున కళాద్వీపములవలె నిలిచియున్నవి. వీటి యాధారముననే మన భారతీయకళ ఏయే రీతుల వికసించినది, ఏయే సంప్రదాయములను సమయములను పలయించినది తెలిసికొనగలుగుచున్నాము.

బౌద్ధకళకు బుద్ధుని జీవిత మిచ్చిన ప్రోత్సాహ మనల్పమైనది. బుద్ధుని జీవితము ఒక్క బౌద్ధమతావలంబులనే కాక తదితరులను శిల్పులను సమానముగ నుత్తేజపరిచిన దివ్యచరితము; ఒక యద్భుత కథ. బుద్ధుని జీవితమును దెలుపు గ్రంథములు ప్రధానముగ రెం డున్నవి. అందొకటి నిదానకథ. ఒక విధముగా ఇది జాతక గ్రంథమున కుపోద్ఘాతము వంటిదని చెప్పవచ్చును. ఈ జాతక గ్రంథమునకు గ్రహములకు ఏమియు సంబంధము లేదు. జాతక గ్రంథ మనగా ఈ జన్మమున బుద్ధుడైన గౌతమ సిద్ధార్థుని పూర్వ జన్మముల కథలను వర్ణించు గ్రంథము. ఒక్కొక్క పూర్వజన్మ కథకు ఒక్కొక్క జాతకమని వ్యవహారము. బుద్ధుడు తన కాలమునను అంతకు పూర్వమునను వాడుకలో ఉండిన పిట్టకథలను నీతి కథలను తాను చెప్పదలచిన ధర్మమును తన శిష్యుల హృదయమున కెక్కునట్లు బోధించుట కుదాహరణములుగ తీసికొనెను. ఈ పూర్వ జన్మ కథలను చక్కగ పరిశోధించినవారు ప్రత్యేకము బౌద్ధమునకు సంబంధించినవి చాల తక్కువ యనియు, ఆనాడు వాడుకలోనున్న వాటిని కొన్నిటి నున్నవి ఉన్నయట్లుంచియు, మరికొన్నిటిని తాను చెప్పదలచిన విషయమున కనుకూలముగ మార్చియు చెప్పెననియు చెప్పుదురు. ఈ జాతక కథలుకూడ వేమన పద్యముల వలెనే కాలము గడచినకొలదిని అసంఖ్యము లయినవి. ఈ విధమున ఈ జాతకకథల సంఖ్య క్రీస్తుశక మయిదవ శతాబ్దివఱకు పెరుగుచు పోయినదని తద్జ్ఞులయభిప్రాయము. పునర్జన్మ సిద్ధాంతము

బౌద్ధమునకు ప్రాతిపదిక. ప్రతి జీవియు తాను చేసికొను కర్మఫలము ననుసరించి మనుష్యుడుగా మాత్రమే కాకుండ మృగపక్ష్యాది జీవులుగా కూడ పుట్టునని బౌద్ధుల విశ్వాసము. జాతకగ్రంథము, జాతక వర్ణనయన్నది యిటువంటి పూర్వజన్మ కథల సంపుటి. క్రీస్తుశకము మూడవ శతాబ్దినుంచియు,—అంతకు పూర్వముకూడ నేమో,— బుద్ధుని యిట్టి పూర్వజన్మకథలు ప్రచారములో నుండె ననుట కాధారములు కలవు. హీనయాన బౌద్ధ సంప్రదాయమునకు తరువాత పరిణామమయిన మహాయాన బౌద్ధ సంప్రదాయము దేశమున బాగుగ వ్యాపించినకాలమున జాతకకథలు పెరుగుటయు, వాటి గౌరవమును విలువయు హెచ్చుటయు జరిగినది. ఈ జాతకవర్ణనము బౌద్ధుల త్రిపిటకము లనబడు వినయ, సుత్త (సూత్ర), అభిదమ్మ (అభిధర్మ)ములలోని 'సుత్తపిటక'మున నున్నది. ఈ 'సుత్త పిటక'ములోని పంచ 'నికాయము'లను గ్రంథములలో 'ఖుద్దక నికాయ' మొకటి. 'ఖుద్దక నికాయ'మున ధమ్మపదము, దేవగాథ, 'అపదాన'ము, 'బుద్ధవంశ'ము, 'ఉదాన'ము మొదలయిన గ్రంథములు పదునైదుకలవు. ఈ గ్రంథములలో 'జాతక' మొకటి. నిదానకథ ఈ జాతకమున కుపోద్ఘాత ప్రాయమైనది. పిటకములన్నియు పాలీభాషలో నుండుటవలన జాతక, నిదానకథలు పాలీ భాషలో నున్నవని వేఱుగ చెప్పనక్కఱలేదు. బుద్ధ జీవితమును గురించి తెలుపు రెండవ గ్రంథము 'లలిత విస్తరము'. దీని కర్త పేరు తెలియదు. ఈ గ్రంథము సంస్కృతములో నున్నది. బుద్ధుని నిర్వాణమును గురించిన సమాచార మంతయు 'మహా పరినిబ్బానసుత్త' (మహాపరినిర్వాణ సూత్ర)మున నున్నది. బుద్ధుని నిర్వాణమును బౌద్ధులు మహాపరినిర్వాణమని వ్యవహరింతురు.

సంగ్రహముగ బుద్ధుని జీవిత మిట్లు: శాక్యవంశ క్షత్రియులకు రాజధానియైన కపిలవస్తు నగరము హిమాలయపర్వత పాదనికటమున రోహిణీ నదీతీరమున నున్నది. ఆ రాజ్యమును పాలించుచుండిన శుద్ధోధన మహారాజునకు మాయాదేవి, గౌతమి యను ఇరువురు భార్యలు. అందులో మాయాదేవి (మహామాయ) పురిటికి తన పుట్టినింటికి పోవుచుండగా కపిలవస్తు నగర సమీపమునం దుండిన లుంబినీ వనమున నొప్పులువచ్చి మగబిడ్డను గనెను.

అతనిపేరు సిద్ధార్థుడు. శాక్యవంశజులు గౌతమగోత్రులగుటవలన సిద్ధార్థునికి గౌతము డనియు, గౌతమ సిద్ధార్థుడనియు పేరు. అతడు అచిరకాలముననే సర్వవిద్యలయందును పరిపూర్ణుడై యశోధరయను రాజకుమారిని వివాహము చేసికొనెను. అతడు పుర మేగునపుడు తలవని తలంపుగ ఒకమారు వృద్ధుడును, వేరొకమారు వ్యాధిగ్రస్తుడయి బాధపడుచున్నవాడును, ఇంకొకమారు శవమును, మఱియొకమారు ఒక సన్యాసియు కంటబడిరి. దానితో అతనికి లోకముతీరు బోధపడినది. అతనికి జన్మమంతయు, లోకమంతయు దుఃఖబాధా భూయిష్ఠముగ గానవచ్చినది. జనులను వ్యాధి [illegible]లును దుఃఖమును పీడించుచుండగా తాను సుఖపడి యేమి ప్రయోజనము, తాను తరించి వారినీ సంసారదుఃఖము నుండి [illegible]యుటకు మార్గము నన్వేషింప నాతడు సన్యసించుటకు నిశ్చయించుకొనెను. అతనికి రాహులుడను కుమారు డుదయించిన తరువాత ఒకనాడు తన భార్యను బిడ్డను చూచి భటజన సుపరిరక్షితమైన రాజప్రాసాదమును విడిచిపెట్టి అర్ధరాత్రివేళ ఎవరికిని దెలియకుండ కపిలవస్తు నగరమునుండి వెడలిపోవును. దీనిని బౌద్ధులు మహాభినిష్క్రమణ మందురు. అనోమానదీతీరమున నతడు ఆయుధములను పరిత్యజించి ఆభరణములను రాజవేషములను దీసివేసి భిక్షుకుడై రాజగృహమను నగరమున కరిగి యచట విఖ్యాతులైన బ్రాహ్మణాచార్యులయొద్ద తత్త్వరహస్యముల నుపదేశము నొందెను; కాని యవి తన కాత్మసంతృప్తి కలిగించనందున ఇప్పుడు బుద్ధగయ దేవాలయమున్న ఉరువిల్వవనమునకుబోయి కఠిన తపశ్చర్య నవలంబించెను. ముక్తికాములు చేయు సాధనల నన్నిటిని చేసెను. కాని యతని కోరిక నెరవేరలేదు. తుద కాతని కశ్వద్ధ వృక్షచ్ఛాయను యోగసమాధినుండగా విశ్వరహస్యము బోధపడి దుఃఖసంతరణమార్గము వ్యక్తమై అతడు సంబుద్ధుడయ్యెను. ఈ పరమ రహస్యమును దెలిసికొనుటను సంబోధియందురు. సిద్ధార్థు డానాటినుంచి బుద్ధు డయ్యెను. తాను కనిపెట్టిన యీ రహస్యము, సంసారతిగణమార్గమును మొట్టమొదటిమారు బుద్ధుడు మృగదావమున బోధించెను. మృగదావమున కిపుడు సార్నాథ్ (సారంగనాథము) అని పేరు. బుద్ధుడు మొట్టమొదటిమారు బోధించిన ధర్మబోధను బౌద్ధులు ధర్మచక్రప్రవర్తన మందురు. అనంతరము బుద్ధుడు గ్రామగ్రామములు దేశదేశములు తిరిగి నలువదియైదు సంవత్సరములు తన ధర్మమును బోధించెను. అనేకులు సన్యాసమును స్వీకరించి యాతనికి శిష్యులై బౌద్ధధర్మము నాశ్రయించిరి. తరువాత కొంతకాలమునకు స్త్రీలకుకూడ సన్యాస స్వీకారమున కధికార మీయబడినది. ఈ విధమున బౌద్ధసంఘమున 'భిఖ్ఖు' (భిక్షుక) 'భిఖ్ఖుణీ' (భిక్షుకి) అను రెండు తరగతు లేర్పడినవి. సన్యాస స్వీకారము చేయక బుద్ధప్రోక్తమయిన ధర్మము ననుసరించి జీవితమును గడిపి, బుద్ధుని బౌద్ధధర్మమును, బౌద్ధసంఘమును సేవించు సామాన్యజనుల నుపాసకులని పేరు. కట్టకడపట బుద్ధుడు వార్ధక్యమున నెనుబదవయేట మల్లరాజ్యమునకు రాజధానియైన కుశనగరము (పాలి-కుసినార) ప్రాంతమునందలి సాలవనమున నిర్వాణము నొందెను. దీనికి బౌద్ధపరిభాషను 'మహా పరి నిర్వాణ' మనిపేరు.

బుద్ధుని భౌతికదేహ మగ్నికాహుతియైనపిదప అతని యస్థికల నిమిత్త మిరుగుపొరుగులనున్న వేరువేరు రాజ్యములవారికి వివాదము కలిగి తుద కది మహాసంగ్రామముగ పరిణమించెను. అప్పుడు ద్రోణుడను బ్రాహ్మణుడు వచ్చి అహింస శాంతి బోధించిన యా మహాత్ముని శారీరకధాతువులకోసము పోరాడుట తగవు కాదని వారిని వారించి కలహముడిపి తాను మధ్యవర్తియై వాటి నెనిమిది భాగములుచేసి ఎనమండ్రకు పంచిపెట్టెను. ఎవరివంతుకు వచ్చిన యస్థికలను వారు ఉత్సవముతో మహానందమున గొనిపోయి వాటిని ప్రాముఖ్యమైన స్థలమున ఒక వేదిక నిర్మించి దాని మధ్యభాగమున ధాతువులనుంచిన పేటికను నిక్షేపముచేసి దానిపై నర్ధవర్తులాకారపు మట్టిదిబ్బను ఏర్పాటుచేసి దాని నారాధించుచు వచ్చిరి. చితికి సంబంధించిన సమాధి దిబ్బలగుటవలన ఈ స్తూపములకు చైత్యములని పేరు కలిగినది. తరువాత ఈ మట్టిదిబ్బలు వానకు కరిగిపోకుండ నిలుచుటకై వాటి నిటికతో గప్పువారు. ఇటుకతో

కట్టిన యిట్టి స్తూపములే మనకు గానవచ్చిన మొట్టమొదటి బౌద్ధ నిర్మాణములు. పైనిచెప్పిన రీతిని రాజగృహము, వైశాలి, కపిలవస్తు, అల్లకప్ప, 'వేష్టద్వీపము' ('వెత్థదీప'), రామగ్రామము, పావా, కశనగరములలో ఎనిమిది స్తూపములు వెలసినవి. వీటికి శారీరక స్తూపములని పేరు. తరువాతి గాథల ననుసరించి ఈ యెనిమిదింటిలో ఏడు స్తూపములను మౌర్యవంశజుడైన అశోక చక్రవర్తి తెరిపించి వాటిలోని అస్థికలనుదీసి 84,000 ల శకలములు చేయించి వాటిని దేశమంతటను పంచిపెట్టి వాటిలో ఒక్కొక దానిమీద ఒక్కొక్కటి చొప్పున 84,000 ల స్తూపములని గట్టించెనని తెలియుచున్నది. చారిత్రకముగా ఇం దెంతవరకు సత్యముకలదో చెప్పలేము కాని మనకు మొట్టమొదటివిగ ఇప్పటికి దెలియవచ్చిన కొద్ది స్తూపములును అశోక నిర్మితములే. అశోకుని కాలమున బుద్ధుని అస్థికలను వేదికమీది అండములో పెట్టుటకు మారుగా దాని యగ్రభాగమున చతురస్రమగు మందిరమును నిర్మించి దానిలో ధాతుపేటికనుంచి యా మందిరము చుట్టు చిన్న శిలాప్రాకారమును గట్టువారు. ధాతుపేటికనుంచు నీ మందిరమునకు హార్మికయని పేరు. హార్మికపైని రాజలాంఛనముగ శిలామయఛత్రమును వెలయించుట బౌద్ధుల యాచారము. వేదిక (*Drum*), దానిపైని అండము (*Dome*), దానిపైని హర్మిక (*Harmika*) దానిపైని ఛత్రము (*Umbrella*) ఈ యన్నిటితో గూడిన దానికే నేడు స్తూపమని వ్యవహారము. స్తూపము చుట్టును శిలామయ ప్రాకారమును (*Railing*) నిర్మించువారు. ఈ ప్రాకారము మన యిప్పటి యిటికగోడలవలె పూర్తిగా లోపలిస్థలము వెలుపలికి కానరాకుండ కమ్మి వేసియుండదు. ఈ ప్రాకారము నిలువురాతి స్తంభముల (*Pillars*) తోను, వీటిలోనికి బిగించిన అడ్డురాతి కమ్ముల (*Cross-bars*) తోను నిలువురాతి స్తంభములమీద మదురవలె ఏర్పడునట్లు పరిచిన రాతిబండలతోను గూడినది. ప్రాకృత భాషలో నిలువురాతి స్తంభమునకు 'థభో' యనియు, అడ్డుకమ్మికి 'సూచి' యనియు, మదురు రాతిబండకు 'ఉన్నిస' (ఉష్ణీషము) అనియు పేరు. స్తంభము తలమీద పాగవలెనుండు రాయియగుట చేత దానికి ఉష్ణీషము ('ఉన్నిసం) అని పేరు. అడ్డుకమ్మికి రెండువైపుల సన్నని మొనగా మలిచి దానిని ఇరుపార్శ్వముల నున్న స్తంభములలో చేసిన తొలలలో దూర్చి బిగింపబడున దగుటచేత దానికి సూచి యని పేరు కలిగినది. ఈ విధమయిన శిలాప్రాకారమున రెండేసి రెండేసి స్తంభములకు నడుమ రెండేసి యడ్డు కమ్ములుండును. ఈ శిలాప్రాకారమున నాలుగు దిక్కులను నాలుగు శిలామయ ద్వారము లుండును—ద్వారమున నిరుప్రక్కల నిలువు రాతి స్తంభములు, ఈ స్తంభములను గలుపు అడ్డుకమ్మి కొన్ని ద్వారములకు సమానాంతరమున మూడు అడ్డకమ్ము లుండుటయు గలదు. వీటికి తోరణము (*Arches*) లని పేరు. అశోకచక్రవర్తి కాలమునాటి యిట్టి స్తూపములు పిప్రవ, సార్నాథ్, సాంచీలలో బయలుపడినవి.

స్తూపపు అండము ఇటికతో కట్టిన కట్టడమగుటచేత అది శిల్పరహితమయినది. అశోకచక్రవర్తి కాలమునాటి స్తూపములలో శిల్పి తన కళాచాతుర్యమును జూపుట కవకాశ మిచ్చినవి శిలామయ ప్రాకారములోని స్తంభములు, సూచులు, ఉష్ణీషములు (*Coping stones*) ను.

బౌద్ధకళ ఏవిధమున ఆరంభమయినదో తెలిసికొనుటకు తగిన ఆధారములు లేవు. 'మహాపరినిబ్బాన సుత్త' (మహాపరి నిర్వాణ సూత్ర) ములో నిర్వాణము నొందుటకు కొద్దికాలమునకు పూర్వము బుద్ధుడు తన ప్రియశిష్యుడయిన యానందునికిట్లు చెప్పెనట. "ధర్మావలంబకులు సందర్శించవలసిన స్థలములు ముఖ్యముగా నాలుగు కలవు. అవి యేవన, బుద్ధుడు జన్మించిన ప్రదేశము, బుద్ధుడు సంబోధినొందిన ప్రదేశము, బుద్ధుడు మొట్టమొదటిమారు తన ధర్మమును ప్రవర్తింజేసిన ప్రదేశము, బుద్ధుడు నిర్వాణము నొందు ప్రదేశము" ఈ నాలుగును బౌద్ధులు సందర్శింపవలసిన పవిత్రక్షేత్రములు—యాత్రాస్థలములు. నిజముగా బుద్ధు డట్లని చెప్పెనో లేదో కాని యాతడు నిర్వాణము నొందిన తరువాతినుండి బౌద్ధ ధర్మావలంబకులు ఆదర్శజీవియైన యా మహాపురుషుని జీవితములోని ముఖ్యఘట్టములతో సంబంధముగల యా నాలుగు పవిత్ర క్షేత్రములను ఉత్సాహ ప్రోత్సాహములను బొందుటకై సందర్శించుట ఆచారమయినది. ఆ స్థలములకు జేయునది యొక ధర్మయాత్ర. లుంబినీవనము, బుద్ధగయాక్షేత్రము, మృగదావము కశనగరములు యాత్రాస్థలములు.

బుద్ధుని యాదేశమునను సరించి బౌద్ధు లిట్టి ధర్మయాత్రలు చేయుచుండిరని యూహింపదగియున్నను ఇందుకు నిదర్శనములు మాత్రము మౌర్యవంశజులనాటినుంచి కానవచ్చుచున్నవి. ఇట్టి ధర్మయాత్రను గావించిన మహారాజులలో ప్రప్రథమమునను ఇట్టి యాత్రలను ప్రోత్సహించినవాడును అశోకచక్రవర్తి. ఇతడు తన రాజ్యకాలము పండ్రెండవయేట పైని చెప్పిన నాలుగు బౌద్ధ క్షేత్రములను మాత్రమేకాక బుద్ధునికి సంబంధముగల ఇతరస్థలములనుగూడ సందర్శించి, బౌద్ధయాత్రాస్థలములకుపోవు మార్గములలోను, ముఖ్యనగరముల దగ్గరను శిలాస్తంభముల నెత్తించెను. వీటికి అశోక స్తంభములని పేరు. వీటిలో చాల స్తంభములమీద అశోక చక్రవర్తి ధర్మలిపులను జెక్కించెను. ఆ చక్రవర్తి ప్రతిష్ఠించిన యిట్టి స్తంభములు అధమము ముప్పదిరెండయిన నుండవలెనని విన్సెంట్ స్మిత్తుచరిత్రకారుని యభిప్రాయము. ఇంతవరకు గానవచ్చిన అట్టి స్తంభములు దుండగీండ్ర దౌష్ట్యమువలన చాల పాడయినవి. కొన్నిటికి కాండములు పోయినవి. వేరొక కొన్నిటికి చూళికలు పోయినవి; మరి కొన్నిటికి చూళికలోని కొన్ని కొన్ని భాగములు పోయినవి. ఒక్క లౌరియానందన్‌గఢ్, బఖీరాలలో కానవచ్చిన రెండు స్తంభములు మాత్రమే మాత్రమును చెక్కు చెదరక అవి మొదట ప్రతిష్ఠించినపు డెట్లున్నవో యిప్పుడును అట్లే యున్నవి. ఈ స్తంభములమీది సింహచూళికనే ప్రస్తుతము మన భారతప్రభుత్వమువారు జాతీయ రాజలాంఛనముగా స్వీకరించి యున్నారు. లుంబినీవనమున బుద్ధు డుదయించినచోటను, మృగదావమున బుద్ధుడు మొదటిమారు ధర్మచక్రప్రవర్తనము గావించినచోటను అశోకచక్రవర్తి శిలాస్తంభము నెత్తించెను.

యాత్రికులు ఈ పుణ్యక్షేత్రములను సందర్శించి నప్పుడు అచ్చటనుండి చిహ్నములుగా మతసంబంధములయిన బొమ్మలు మొదలైనవాటిని కొని వెంటగొనిపోవుట ఇప్పటికి మనలోనున్న యాచారము. తిరుపతిని కాని రామేశ్వరమునుగాని సందర్శించిన యాత్రికులు వెంకటేశ్వరస్వామి పటములను రామేశ్వర చిత్రములను గొనివచ్చునట్లే ఆనాడు బౌద్ధ లోకమున కే క్షేత్రమెందుకు ప్రసిద్ధిచెందినదో దానికి సంబంధించిన సంకేతముల చిత్రములను కూడ దీసికొనిపోవువారని యెంచుట అసంగతము కాదు. ఆ కాలమున నీ సంకేత చిత్రములు కఱ్ఱతో కాని మట్టితో కాని చేయుచుండిరని యూహింపవచ్చును; లేదా మట్టిదిమ్మలమీద నేడు వినాయక విగ్రహములను ముద్రించుచున్నట్టు ఆ సంకేత చిత్రములను ముద్రించుచుండవచ్చును. బుద్ధుని నిర్వాణమును దెలుపుటకు స్తూపము సంకేతమయినది; మొట్టమొదటిమారు బుద్ధుడు తన ధర్మమును ప్రవర్తింపజేయుటను బౌద్ధులు ధర్మచక్ర ప్రవర్తనమని వ్యవహరించి యుండుటచేత దానికి చక్రము సంకేతమని యూహింపవచ్చును. ఈ ధర్మమను చక్రము ప్రవర్తితమైనది మృగదావము—లేళ్లకు నివాసమైన యుపవనము. అందువలన నొక సింహాసనముమీద ధర్మచక్రమును దాని దిగువభాగమున పరస్పరసమ్ముఖములయి కాని యితర విధముల కాని నేలమీద నుండి యున్న లేళ్లను కూడిన చిత్రము ఈ విషయమునకు చక్కని సంకేతమయినది. అశ్వత్థ వృక్షము క్రింద నుండగా బుద్ధుడు సంబోధినొందిన కారణమున ఆ వృక్షము బోధివృక్షమని ప్రసిద్ధమై సమ్యక్సంబోధికి చిహ్నమయినది. ఇక బుద్ధుని పుట్టుక కేది సంకేతమన్నది విచారణీయము. లుంబినీవనమున నొక వృక్షచ్ఛాయను ఆ చెట్టుకొమ్మ నొకదానిని పట్టుకొని యుండగా మహామాయ గౌతముని కనుటచేత వృక్షము దీనికి సంకేతమని కొంద అందురు; మఱికొందరి యుద్దేశమున దీనికి పద్మము సంకేతము. బౌద్ధశిల్పమును బరిశీలించినచో ఈ రెండు సంకేతములును గానవచ్చుచున్నను వృక్షము సంబోధికి స్థిరసంకేతమయినందువలన బుద్ధుని జన్మమునకు పద్మము నే సంకేతముగా దీసికొనుట యుక్తమని కొందఱి వాదము. పైని చెప్పిన సంకేతములతో ముద్రితమయిన మృణ్మయఫలకములను గాని, మట్టితో గాని, దారువుతో కాని చేసిన సంకేతములనుగాని బౌద్ధయాత్రికు లాయాస్థలములను సందర్శించినప్పుడు తీసికొని వచ్చుచుండవచ్చును. ఇట్టి సంకేతములలో నే బౌద్ధకళ యారంభమై యుండవలెనని బౌద్ధకళావిమర్శకుల యభిప్రాయము. కుశీనగరమున కరిగినప్పుడు స్తూపమును, బుద్ధగయ కరిగినప్పుడు బోధివృక్షమును, మృగదావమున కరిగినప్పుడు ధర్మచక్రమును, లుంబినీవనమున కరిగినప్పుడు వృక్షమును లేదా పద్మమును బౌద్ధయాత్రికులు తీసికొనివచ్చుచుండిరి. పూర్వోక్తములయిన ఈ నాలుగు స్థలములును బుద్ధజీవితముతో సంబంధించినవే కావున ఈ చిహ్నములు బౌద్ధధర్మ సంకేతములై కాలక్రమమున వాసిగాంచి స్థలవిచక్షణత లేకయే యివి వాడబడుచు వచ్చినవి.

బుద్ధుడు సాధించిన పరమోత్కృష్ట విషయము నిర్వాణము (జన్మరాహిత్యము) కావున దానికి సంకేతమయిన స్తూపమునకు అధిక ప్రాముఖ్యము కలిగినది. 'మహాపరినిబ్బానసుత్త'ములో నే బుద్ధులు, ప్రత్యేకబుద్ధులు, అర్హతులు, చక్రవర్తులు అను నాలుగు వర్గములవారికే స్తూపములు నిర్మించవలసినదని బుద్ధుడు చెప్పినట్లున్నది. నిజముగా ఈ విషయమును బుద్ధుడు చెప్పెనని విశ్వసించుట కవకాశములేదు. ఏలన, బుద్ధుడు మొదట ఒక్కడే; బౌద్ధధర్మము తరువాత మార్పునొంది అందు మహాయాన సంప్రదాయము వెలసినమీదట కాని బుద్ధులు, ప్రత్యేక బుద్ధులు, బోధిసత్వులు అనువారు రాలేదు. అందువలన నా విషయము బుద్ధుడు చెప్పెనా లేదా యన్నది వివాదగ్రస్త విషయమయినను బౌద్ధ



సుదర్శన దేవత—1-వ చిత్రము.

నిర్వాణము లన్నిటిలో స్తూపము ప్రాధాన్యము వహించి యాది నిర్వాణమునకు సంకేతమయ్యెననుటకు సందేహములేదు. స్తూపశిలల మీద ప్రధానముగ చిత్రితములగుచు వచ్చినవి పై నుడివిన ధర్మసంకేతములును, బుద్ధుని పూర్వజన్మములకు సంబంధించిన కథలును



సిరిమా దేవత—2-వ చిత్రము.

(జాతకకథలు) ఇట్టి సంకేతములు బుద్ధుని జీవితమునకు సంబంధించిన విశేషములు, జాతకకథలు చిత్రితమైన స్తూపము లన్నిటిలో భర్హూతుస్తూపము అతిప్రాచీనమైనది. ఈ స్తూపము మౌర్య వంశజులకు తరువాత మగధను పరిపాలించిన శుంగవంశజుల కాలము నాటిది! క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్దిదని తద్జ్ఞుల యభిప్రాయము.

భర్హూత్ అనునది మధ్యహిందూదేశములోని బాఘేల్ ఖండ్, జిల్లాయందలి నగోడ్ సంస్థానములోని ఒక గ్రామము. ఇది అలహాబాదు జబ్బల్పూరు రైలుమార్గమున సత్నా రైలుస్టేషనుకు దక్షిణముగా తొమ్మిదిమైళ్ళ దూరమున ఉచ్ఛహార గ్రామమున కీశాన్యముగా ఆరుమైళ్ల దూరమున నున్నది. పూర్వ మిచట పండ్రెండు మైళ్ళ వరకు విస్తరించిన ఒక మహానగర ముండెనని ఇప్పటి ఉచ్ఛహార గ్రామముకూడ పూర్వ మా నగరములోనిదేయని చెప్పుదురు. ఈ గ్రామముపేరు భార్హూత్ అనునది సరియైన దగునా కాదా యన్నది ఇప్పటికిని మీమాంసలోనేయున్నది. ప్రాచ్యపరిశోధక పండితులలో కొందరు దీనిని బరాహాత్ అని, మరికొందరు భరహూతమని, ఇక కొందరు భరౌత్ అని, వేరొక కొందరు భార్హూత్ అని భర్హూత్ అని అందరు తలయొక విధమున వ్యవహరించిరి. కాని స్థానికులు బర్ హూత్ లేదా భార్ హూత్ అనునదే సరియైన నామమని చెప్పుదురు. ఈ భార్హూత్ గ్రామమున కుత్తరపుకోనను కన్నుముఖర్ కే అఖర్ అనియు, మఖ్రహా అనియు వ్యవహరింపబడు ఒక పురాతనస్థల మున్నది. క్రీస్తుశకము పది పదునొకండు శతాబ్దుల నాటిదని చెప్పదగు ఎఱ్ఱని యిటుకరాతితో పద్మాసనాసీనుడై యున్నట్లు చెక్కిన ఒక పెద్ద బుద్ధవిగ్రహ మచట నుండెను. అది కన్నుముఖర్ అను నొక సాధువు విగ్రహమను భావనతో హిందువులు దానిని పూజించుచుండిరి. ఇచ్చటనే 1873-వ సంవత్సరమున జనరల్ సర్ అలెగ్జాండర్ కన్నింగాముగారు ప్రాచీన బౌద్ధస్తూపము యొక్కయు, ఆ స్తూపముచుట్టునున్న ప్రాకారము యొక్కయు శిథిలావశేషములను గనిపెట్టిరి. ఆయన కనిపెట్టునాటికి ఒక చిన్న బౌద్ధమందిరపు అవశేషములతో అగ్రభాగమున చదునుగనున్న దిబ్బ, మూడు సూచులతోడి స్తూప ప్రాకారపు మూడు స్తంభ భాగములు, వాటిమీద ఉష్ణీషము, ద్వారతోరణమున కొకప్పు డాధారముగా నుండిన ద్వార స్తంభములలో నొకటి—ఇవి పైకి కనబడుచుండెను. ప్రాకారములోని మూడు నిలువు స్తంభములు భూమిలో సగమునకు పైగా పూడిపోయియుండెను. కన్నింగాము గారు అటుతరువాత ఆ స్థలమున సాగించిన త్రవ్వకమునకును, శ్రద్ధతో చేసిన అన్వేషణమునకును ఫలితముగా ఇంకను చాల నిలువు స్తంభములు, సూచులు, ఉష్ణీషములు, ద్వారాగ్ర శిలాశకలములు మొదలైనవి బయలుపడినవి. కన్నింగాముగారి యూహ ననుసరించి అసలు ప్రాకారము 80 నిలువు స్తంభములు, 228 సూచులు, 330 అడుగుల పొడుగుగల యుష్ణీషముతో గూడినది. ఈ మొత్తము ప్రాకారము అన్నిటిలో నూటికి నలువది వంతులు దొరికినవి. దొరికిన వాటిని ఇండియను మ్యూజియమునకు ఉపాయనముగా నీయవలసినదని ఆయన నగోడ్ సంస్థానాధిపతిని కోరి, ఆయన యనుమతిమీద బయలుపడినవాటి నన్నిటిని 1876 లో కలకత్తాలోని ఇండియన్ మ్యూజియమునకు చేర్చెను. ఆ మ్యూజియములో వీటిని ఇటవల భార్హూత్ లో సేకరించిన మరికొన్నిటిని కలిపి ప్రత్యేక మొక విభాగమున పునర్నిర్మించినారు.

మౌర్యయుగమున నిర్మితమైన ఇతర స్తూపములవలెనే భార్హూత్ స్తూపము ఇటికతో కట్టినది. ఈ స్తూపమునకు సంబంధించిన ప్రాకారశిలలన్నియు ఇంచుమించుగా చిత్రితములైనవి,

నేలమీద మోకరించిన ఒక యేనుగు నోటిలోనుంచి వచ్చుచున్నట్లు చూపిన శోభాయమానమైన ఒక తీగె తరంగరేఖాకృతిని క్రిందికి మీదికి పోవుచున్నట్లు ఉష్ణీషము రెండు ప్రక్కలను చిత్రితమైనది. వెలుపలిప్రక్క తీగె ప్రతిసంపుటమునందు పూర్తిగా వికసించిన తామరపూవులు చెక్కియున్నవి; లోపలిప్రక్క జాతక కథలును, పండ్లు, పూవులు, పూలమాలలు, ఆభరణములు, బౌద్ధుల పవిత్రచిహ్నములును ఒకదానిని విడిచి మరియొకటి అన్యోన్యానుగమన పూర్వకముగా ఉజ్జ్వలముగా చిత్రితములైనవి. ఈ చిత్రముల వస్తుసంవిధానములోను రచనలోను ఐక్యము, ఘనత, గతి యున్నవి.



సూచిలోమ యక్షు—3-వ చిత్రము.

గౌతమబుద్ధుని పూర్వజన్మముల గాథలకు సంబంధించిన చిత్రములు ఉష్ణీషము లోపలిప్రక్క మాత్రమేకాక లోపలివైపు ప్రాకారపు నిలువు స్తంభములమీదను సూచులమీదను గూడ చిత్రితమైనవి. భార్హుత్‌లోని యీ కథాచిత్రముల విశేషమేమన వీటిలో కొన్ని కథలకు ఆ కథలు చెక్కిననాటికి వాడుకలోనుండిన బ్రాహ్మీలిపిలో ప్రాకృతభాషలో పేర్లు చెక్కియున్నవి. ఈ పేర్ల ననుసరించి యాయాయి జాతకకథలను సులువుగా గుర్తింపవచ్చును. మన మీసందర్భమున గమనింపవలసిన మఱియొక విశేషము కూడ గలదు. అది యేమన, సర్వసంగ పరిత్యాగము గావించి సన్న్యాసమును స్వీకరించిన భిక్షుకులుమాత్రమే కాక కడవర్ణముల వారిలోని గృహస్థులు మొదలైన ఇతరోపాసకులు కూడ బౌద్ధధర్మము నాశ్రయించవచ్చునని తెలిపి దానిని బౌద్ధులు ప్రచారము చేయుటకు పూనుకొనుటతో ప్రజలలో క్రొత్త యుత్సాహ ముదయించి పరంపరగా దేశములో పరివ్యాప్తమై వచ్చుచుండిన ప్రాకృతాచార, విశ్వాస, పూజావిధానములను లోగొని యది వారనుకోని రీతిని ఆరాధనీయమగు జనరంజక మత సంప్రదాయముగా మారినది. ఉదాహరణముగా వృక్షపూజ. స్తూపపూజ మొదలైన ప్రాకృతజన అర్చావిధానము లన్నియు జనరంజక బౌద్ధారాధన సంప్రదాయపు విశేషలక్షణములలో, యక్షులు యక్షిణులు, నాగులు, నాగినులు, జలదేవతలు వృక్షదేవతలు మొదలైన దేవత లెందరో లౌకిక బౌద్ధమున జేరిపోయిరి. ఇట్టి దేవతాదికముల బొమ్మలకూడ ఈ ప్రాకారపు శిలలమీద చెక్కియున్నవి. భార్హుత్ స్తూపప్రాకార శిలలమీద చెక్కిన ఏనుగులు, కోతులు, ఇతర జంతువులు సరిగా జీవముతోనున్న యథార్థజంతువులవలె నున్నవి. కథావస్తు రచనలో బెరుకు తరుగులు లేని ఒకతూగు ఉన్నది. పురుష చిత్రములకంటె స్త్రీ చిత్రములలోనే కొంత నేర్పరితనము కనిపించును. ఎట్లయినను భర్హుత్ స్తూపనిర్మాణ కాలమునాటికి భారతీయ శిల్పి కింకను చేయి తిరుగలేదు; శిల్పమున అతడు సిద్ధహస్తుడు కాలేదు. చిత్రములలో సౌకుమార్యము స్నిగ్ధత తక్కువవి, కొన్ని బిరుసుగా నుండి చూచుట కవి ఘనముగా నున్నవి.

భార్హుత్ చిత్రములలో గమనింపదగిన విశేష మొకటి కలదు. బుద్ధుడు కానరావలసిన చోటుల ఆ దివ్యపురుష విగ్రహము కానరాదు. శిల్పమున ఆయనను చూపవలసి వచ్చినపుడు శూన్య సింహాసనమునో, పాదుకలనో, బోధివృక్షమునో, 'త్రిరత్న' సంకేతమయిన త్రిశూలమునో, ధర్మచక్రమునో చూపుట ఆనాటి శిల్పి సమయము. భౌతిక పరిమితులకు ద్వంద్వములకు అతీతుడయిన యాదివ్యపురుషుని మానపరిమితులలో ఇమిడ్చి చిత్రించుట దోషదూషితమన్న భావము ప్రబలిన కాలమది, అందువలన బుద్ధచిత్రము శిల్పమున నవతరించుట కింకను కొంతకాలము పట్టినది.

## భార్హుత్ స్తూప శిల్పచిత్రములు

భార్హుత్ స్తూపశిల్పము ఎట్టిదో తెలిసికొనుటకు కొన్ని శిల్పచిత్రముల బొమ్మలిందిన చూపబడినవి. ఈబొమ్మలలో రెండు దేవతావిగ్రహములు (1 - వ చిత్రము : సుదర్శన దేవత, 2 - వ చిత్రము : 'సిరిమా' (శ్రీ) దేవత ఒకయక్షవిగ్రహము. 3 - వ చిత్రము : సూచీలోమయక్షుడు అనాథపిండికుని జేత వనదానము

4 - వ చిత్రము ; మిగిలినవి జాతక కథలు 5 - వ చిత్రము : 'మిగ జాతకమ్'; 6 - వ చిత్రము - 'నవంతియ జాతకమ్'; 7 - వ చిత్రము : 'సుగపనియ జాతకమ్'; 8 - వ చిత్రము : 'తికోటికో చకమో'; 9 - వ చిత్రము : భిసహరనియ జాతకమ్'; 10 - వ చిత్రము : జబూ నదో పవతే!; 11 - వ చిత్రము : 'వసుకో కధానోహాతి నదో పవతే') ఈకథలలోని యంశములు చాల సంగ్రహముగ చెక్కనను వాటికి పేరు లుండుటచేత వాటిని సులువుగా గుర్తింప వీలగుచున్నది. కొన్నిటికి కథలపేరు, కాక కథాచిత్రములోని ప్రధాన పాత్రల ననుసరించి, ప్రధాన విషయముల ననుసరించి నామకరణము చేయబడినది. 8, 10, 11 చిత్రము లిట్టివి. ఇవి సూచించు జాతకకథల విషయములో చిత్రితమైన కథాంశము లతి సంగ్రహముగ నుండుటవలన బౌద్ధకథా పరిశీలకులలో అభిప్రాయభేదమున కవకాశము కలిగినది. ఈచిత్రములు కొన్ని ప్రాకారములోని నిలువు స్తంభములమీద ఆయతమైన వృత్తముల (*Medallions*) లోను, మరికొన్ని ఉష్ణీషము (*Copinag stone*) మీదను చెక్కబడినవి.

## 1-వ చిత్రము : 'యక్షిణిసుదశనా' (యక్షిణిసుదర్శన)

బౌద్ధకథలలో యక్షులు తరచుగా గానవచ్చెదరు. బౌద్ధగ్రంథముల ననుసరించి యుపదేవతలు దేవులని నాగులని యక్షులని గంధర్వులని అసురులని గరుడులని కిన్నరులని మహోరగులని ఎనిమిది రకములు. వీనిలో యక్షులకుబదులుగా మూలవస్థానమును కొన్ని



అనాథపిండకుని జేతవనదానము— 3-వ చిత్రము.



మృగజాతకము (స్తంభవృత్తమున చెక్కినది)— 5-వ చిత్రము.

గ్రంథములలో రాక్షసులు గైకొందురు. వీరిరాజు ఉత్తరదిగధిపతియైన కుబేరుడు. ఈ దిక్పాలకునికి వైశ్రవణుడని అలకేశ్వరుడని నామాంతరములు. మిగిలిన మూడుదిక్కుల పాలకులకును యక్షులనియే పేరు. వీరు కాక అలవక, పూర్ణకాది నామములుగల వేరు వేరు యక్షులుగలరు. భార్హూత్ లో ఈ యక్షులు స్తూపద్వారపాలకులుగ జూపబడిరి. వీరితోపాటు యక్షిణులుకూడ లోపలికి ప్రవేశించుచోట నున్న స్తంభములమీద చిత్రింపబడిరి. ఇట్టియక్షిణులలో సుదర్శనయను యక్షిణియొకతె. వీరు మకరముల మీద నున్నట్లుచూపబడిరి. సుదర్శన నిలబడినది గజముఖమకరము కాని ఋష్యమృగ ముఖముకాని కావచ్చును. ఆ మకర మామెను ఆకాశమార్గమున కెత్తుకుని పోవుచున్నట్లున్నది. సుదర్శన తన కుడిచేతిని పైకెత్తి ఎడమచేతిని మొలనూలిమీదనుంచి ఎడమపాదమును కుడికాలి కడ్డముగా ఆనించి తన తూగును నిలుపుకొనుచున్నది. ఆమెకుడిచేతి మునివ్రేళ్లు ఆమె యరచేతివైపు వంగియున్నవి. ఒక్క బొటనవ్రేలు మాత్రముచాచి యున్నది.

## 2-వ చిత్రము : 'సిరిమా దేవత'

ఈమె యదృష్టదేవత; ఉన్నతశ్రోణి సమున్నతవక్షోజ. ఉన్నతకటియు, సమున్నతవక్షోజమును ఉత్పాదక, ఆహార ప్రదానశక్తులకు సూచకములు. ఈమె తన యెడమ చేతిని ఎడమ ప్రక్కకు వ్రేలాడవేసి, కుడిచేతితో నేదో దత్తూర పుష్పమువంటి పూవును పట్టుకొని ప్రాకారోష్ణీషమువంటి దానిమీద 'నిటాక్కు' నిలబడినట్లు చిత్రితమైనది. లలితవిస్తరములోను 'ఆటానాటీయ సుత్తము' 'మహావస్తు' పాఠములలోను అదృష్టదేవతలు నాలుగు విధములని చెప్పబడినది. సిరిమతి, యశమతి, యశఃప్రాప్త, యశోధర అని వారి పేరులు. మన 'సిరిమా' దేవత 'సిరిమతి' (శ్రీమతి)

యే. దక్షిణదిక్పాలకుడైన విరూఢకునితో సంవాసముగలవారు వీరు. 'సిరిమా' భాగ్యాధిదేవత, సౌందర్యాధిదేవత.

### 3-వ చిత్రము : 'సూచిలోమయక్షో'

సూదులవంటి తలవెండ్రుకలుగల యక్షుడని యర్థము. ఒక గుండ్రనిబంతివంటి కిరీటముతోగూడిన తలపాగధరించి నమస్కారము చేయుచున్నట్లంజలి ఘటించి యొకప్రాకారోక్షేపముపైన నిలబడినట్లు ఇతని ప్రతికృతి చూపబడినది. ధరించిన దుస్తులు ఆభరణములు అమూల్యమైనవి; రాజకుమారోచితములైనవి. పైన చెప్పిన అలవక పూర్ణకాది యక్షులలో సూచీలోము డొకడు.

### 4-వ చిత్రము : అనాథపిండికుని జేతవనదానము

అనాథపిండికుడు భాగ్యవంతుడైన యొకవర్తకుడు. అతడు రాజగృహమున దనమిత్రునియింట నుండగా బుద్ధుడచ్చట నున్నట్లు విని ఆయనను దర్శించి ఆయన బోధామృతమునుగ్రోలి బౌద్ధధర్మావలంబియయ్యెను. అతడు బుద్ధుని తన జన్మస్థలము శ్రావస్తికి రావలసినదియాహ్వానించి ఆయనవచ్చుబాటలో ప్రతిగవ్యూతి దూరమునను విగృహములు నిర్మించెను. అతడు జేతరాజకుమారుని వద్దనుండి శ్రావస్తిలోని యతని ఉపవనము నేలనంతయూ కప్పివేయుట కెన్ని బంగారు నాణెములు కావలెనో అన్ని నాణెములకు దానిని కొని బుద్ధునికి దానముచేసెను. ఈ యుపవనమునకు జేతవనమని పేరు. అనాథ పిండికుడీ వనమధ్యభాగమున బుద్ధుని కొక సుందరభవనమును, దానిచుట్టు 80 మంది భిక్షుకులు వసించుటకు విడిమందిరములను గట్టించి యిచ్చెను. ఇది తరువాత కాలమున జేతవన విహారమని ప్రసిద్ధికెక్కినది. ఈ దానవిషయమును దెలుపునదే ఈ చిత్రము.

ఈ చిత్రములో దిగువభాగమున కాడి పైకెత్తి యున్న బండి, దాని కిరుప్రక్కల నిరువురు మనుష్యులు నున్నారు. ప్రక్క నెద్దు నేలమీద పరుండియున్నవి. బండిలోని బరువు దిగబోయబడినది. బండి కిరుప్రక్కల నున్నవారు అనాథపిండికుడును అతని కోశాధిపతియును. వారు బండిలోనుండి దిగబోసిన బంగారు నాణెములను లెక్కించుచున్నారు. వీరికి పైని కుడివైపున మరి యిరువురు మనుష్యులు కూర్చుండి ఆ తోటనేల నంతయు నాణెములతో కప్పివేయుచున్నారు. ఆ నాణెములు చతురస్రములయిన పురాణములు. చిత్రమున ఎడమప్రక్క నెగువ ఆరుగురు మనుష్యులు కలరు. వీరు జేతరాజకుమారుడును, అతని మిత్రులును కావచ్చును. చిత్రమధ్యమున అనాథపిండికుడు కొమ్ముతోడి జలకమండలము పుచ్చుకొని తాను కొన్న యీ జేతవనమును సహిరణ్యోదక ధారాపూర్వకముగా దానము చేయుటకు సంసిద్ధముగ నున్నాడు. రెండు దేవమందిరములును, నాలుగువృక్షములును అది యుపవనమునకు సూచన. ఈ రెండు దేవమందిరములలో పైనున్నది 'గంధకుటీ' ఎడమవైపున క్రింద నున్నది. 'కోశంబకుటి', గంధకుటికి దిగువను మొదలుదగ్గర చుట్టును కంచెకలది మామిడిచెట్టు. మిగిలినవి మూడును మంచి గందపుచెట్లు. ఈరీతిని ఈ జేతవనదాన కథ విషయము సవిస్తరముగ వర్ణితమైనది. భార్హుత్‌లోని ఉత్తమచిత్రములలో ఇది యొక్కటి.



ఛదంతీయ జాతకము (స్తంభముపై చెక్కినది)
6-వ చిత్రము.

### 5-వ చిత్రము : 'మిగజాతకమ్.'

బుద్ధుడు తన పూర్వజన్మములలో ఒకమారు రురుజాతిమృగముగా పుట్టెను. నదివంపు తిరిగినచోట చక్కగా పూచిన మామిడిచెట్లతో గూడిన సాలవనములో తన మందను విడిచి యతడొంటరిగా నివసించుచుండెను. అట్టితరి ఒకప్పుడు ఋణప్రదాతల బాధకు తాళజాలని యొక వణిక్కుమారుడు ఆత్మహత్య గావించుకొనుటకు నదిలోని కురికి నదీప్రవాహమున మునుగుచు తేలుచు కొట్టుకొనిపోవుచుండెను. అతని యార్తనాదమును విని యామృగరాజము నదియొడ్డున కరిగి యాతని గాంచి ప్రవాహమును చీల్చుకొని యీదుచు అతనియొద్ద కరిగి యాతనిని దన, వీపుమీద నెక్కించుకొని యొడ్డుజేర్చికొన్ని దినములు తనయొద్ద నుంచుకొని వన్యఫలాదు లిచ్చి పోషించి పంపివేసెను. అతడు వెళ్ళిపోవునపుడు తానచ్చట నున్నట్లెవరికిని చెప్పవలదని మృగ మతనిని కోరెను. చెప్పనని యాతడు వాగ్దానము చేసెను. కొన్నాళ్లయినతరువాత ధనాశాప్రేరితుడై యాతడు వారణాసి నేలురాజునకు ఆ స్వర్ణమృగ మున్న స్థలము చెప్పెను. ఆ మృగమును సంహరించు తలంపుతో కాశీరాజు విశేషపరివారమును దీసికొని యావైశ్యకుమారుడు దారి చూపగా ఆ మృగమున్న వనముదగ్గరకు వెళ్లి దానిని చుట్టుముట్టి పెద్దగోద చేయించెను. సవ్వడి విని యామృగ మీవలకు



ముగపకయజాతకము—7-వ చిత్రము.



తికోటికోచక మో—8-వ చిత్రము.

వచ్చిచూచి యిక రాజుదగ్గరకు వెళ్లిననేకాని తనకు రక్ష లేదని యాతనివైపు పరుగిడెను. ఆమృగము తనవైపున పరుగిడివచ్చుట చూచి కాశిరాజు ధనుష్టంకారముచేసి వింట బాణము తొడిగెను. దీనిని చూచి, రాజా వదలకుము, బాణము వదలకుము, నన్నుకొట్టకుముండుమని మధురకంఠముతో నా మృగము పలికెను. రాజా మధురకంఠధ్వని విని విభ్రాంతుడై ధనుర్బాణములను నేల జారవిడిచెను. వీరుభయుల ప్రసంగమును వినుటకు రాజుచుట్టు మూగిన పరివారజనము చేతులలోని యాయుధములుకూడ జారిపోయినవి. రాజా నేనున్న స్థలమును నీకు చెప్పిన దెవరనియామృగము రాజు నడిగెను. ఈతడే యని తన కించుకదూరమున వెనుక నిలబడిన వైశ్యకుమారుని జూపెను. అంతట మృగము మనుష్యులు కృతఘ్నులు; వారు నోటితో చెప్పున దొకటి, చేయున దొకటి యనెను. నే నట్టివాడను కాను. నన్నట్టివారిలో జమకట్టకుము. ఏదియయినను వరము కోరు మిచ్చెదనని రాజు నుడివెను. అట్లయిన నేనును నాతోపాటితర జంతువులును సురక్షితముగ నుండునట్లు వరమిమ్మని యామృగము వేడుకొనెను. రాజు తన వాగ్దానమును నెఱవేర్చుకొనెను.

ఈ చిత్రమునందలి మూడు వృక్షములును అది వనమనుటకు గుర్తు. ఎడమవైపున దిగువను నదిలోనుండి విన వచ్చిన యార్తనాద మునువిని మృగము ఒడ్డునుండి నీటిలోని దురకబోవుచున్నది. తుద కానదిలో పడిన వైశ్యకుమారుని తన వీపుమీద నెక్కించుకొని తీరముచేర్చి కాపాడెను. చిత్రము కుడిప్రక్కను వింట బాణము సంధించి వేయబోవుచున్నవాడు కాశిరాజు. అతని వెనుక నిలబడిన వాడు వైశ్యకుమారుడు. రాజు పరివారము వనమును చుట్టుముట్టి చేయు రణగుణధ్వనికి చెదరి మృగములు కొన్ని పరుగిడుచున్నవి. కొన్ని ధ్వని వినవచ్చువైపు చూచుచున్నవి. మధ్యనున్న మృగరాజు పరుగిడి రాజునొద్దకు వచ్చి రాజుతో సంభాషించుచుండెను. ఆ యుభయుల ప్రసంగము వినుటకు రాజునకు వెనుకవైపున చేరినాడు వైశ్యకుమారుడు. మధురకంఠధ్వనితో మాటాడు నా మృగమును చూచి రాజునకు గౌరవభావము కలిగి యత డా మృగమునకు చేతులు జోడించి నమస్కరించుచున్నాడు.

## 6-వ చిత్రము : 'షడ్దంతియ జాతకమ్'

పూర్వజన్మము లొకదానిలో బోధిసత్వుండుయూగనాయకుడైన మహాగజరాజముగ ఆరు దంతములతో పుట్టి షడ్దంతుండను పే బరగెను. అతని కిరువురు భార్యలు. అం దొకతెకు తనమీదకంటె రెండవయామెమీద షడ్దంతు డెక్కువ ప్రేమచూపి యాచరించుచుండె నన్న కారణమున అతనిమీద క్రోధమును అసూయయు కలుగును. ఆమె కొంతకాలమునకు విధివశయై మరలజన్మమెత్తి కాశీరాజుకు ముద్దులరాణి యగును. పూర్వజన్మవాసనగల యామె కప్పటికిని షడ్దంతునిపై క్రోధము పోలేదు. ఆమె యాతనిపై బగ దీర్చుకొను తలంపుతో వ్యాధిగ్రస్తురా లయిన ట్లభినయించి ఆరు దంతములుగల మహాగజము దంతములు గొనివచ్చి వానితో నామన సేవ చేసినగాని తన రోగము కుదరదని తన భర్త కాశిరాజుతో చెప్పును. పిదప ఆ రాజు నా దేశమున శోణుత్తరు డను వ్యాధుడు రాణి వలననట్టి సామజ మున్న తావు తెలిసికొని కతిపయప్రయాణముల 'షడ్దంతు' డున్నచోటికి వచ్చి యాతనిని బట్టుకొనుట కాప్రాంతమున నే మరుగున వేచియుండును. అరణ్యమున సంచరించుచు 'షడ్దంతు'ను శోణుత్తరు డున్న రొందకు వచ్చియతడిక్కడికి వచ్చిన కారణము నడిగి తెలిసికొని తన దంతములను గోయుటలో తాను కూడ అతనికి తోడ్పడును. దంతములు భగ్నమైనవెనుక షడ్దంతుడు కాలధర్మము నొందును శోణుత్తరు డా దంతములను గొనిపోయి రాణికి సమర్పించును. ఈ గాథ బౌద్ధులకు చాలా ప్రియమైనది

దీని కనేక పాఠములు కలవు. బౌద్ధస్తూపశిల్పమున ఈ గాథ చాల తడవలు చిత్రితమగుచుండును.

ఈ చిత్రమున నాలుగు దిశలకును వ్యాపించిన నాలుగు శాఖలతోను ఊడలతోను ఉన్న మఱ్ఱిచెట్టువలన ఈ చిత్రవృత్తము రెండు భాగము లగుచున్నది. కుడిభాగమున జూపిన యేనుగులు మూడును 'షద్దంత' ప్రతికృతులే. అరణ్యవిహారమున నతడు వేరు వేఱు స్థలములకు వచ్చినట్లు అవి సూచన. కుడిభాగమున ఎగువ తొండ మించుక పైకెత్తి విహరించుచున్నవాడు షద్దంతుడు. వృక్ష మూలమునకు వచ్చిన యితని రెండవ ప్రతికృతిలో ఇతని ఫాలతల మున పద్మాభరణము కలదు. ఇతని మూడవ ప్రతికృతిలో తొండము నకు ఎడమప్రక్క మూడు దంతములు కనిపించుచున్నవి. కుడి వైపునకూడ మరి మూడుండవలెను. అందువలన నతడు షద్దంతుడని స్పష్టము. ఎడమప్రక్క రెండవభాగమున ఎగువ నున్నది ఆయేనుగే, వ్యాధునియొద్ద కరిగినది. ఎడమవైపున దిగువ నిలబడినవాడు శోణు త్తరుడు. అతనిప్రక్క నేలమీద నున్నవి ధనుర్బాణములు. ఆ వ్యాధుడు రంపముతో 'షద్దంతు'ని దంతములు కోయుచున్నాడు. కోయుట కతనికి సుకరముగ నుండునట్లు ఆ యేనుగు ఇంచుక వంగి నది. భార్హుత్‌లోని ఉత్తమచిత్రములలో ఇది యొకటి.

## 7-వ చిత్రము-'ముగపకయ జాతకమ్'

ఈ కథకు 'తేమియ జాతక' మనియు పేరు. పూర్వ మొకప్పుడు బుద్ధుడు కాశిరాజకుటుంబములో 'తేమియ' రాజ కుమారుడుగా నుదయించెను. అతడు తన పూర్వజన్మములలో తాను చేసికొన్న కర్మఫలముగా తా ననుభవించిన రౌరవాది నరక బాధలు జ్ఞాపకము వచ్చి మూగిగాను, బధిరుడుగాను, జడుడుగాను నటించెను. జ్యోతిష్కు లతడు పుట్టినపుడు ఈ రాజకుమారునికి అదృష్టశుభలక్షణము లున్నవని చెప్పిరికాని యీతని మూకత్వ బధిరత్వ జడత్వములను తలచుకొని యాతని తలిదండ్రులు లజ్జాదుఃఖ భరమున క్రుంగిపోయిరి. పదునారేండ్ల యనంతరము ఆ జ్యోతిష్కు లను రాజు మరల పిలిపించి తన కుమారునిగురించి యడుగగా వా రతనికి పాపగ్రహసంబంధమున దుర్లక్షణములు సంక్రమించిన వనియు, నత డింట నుండుట కుటుంబమునకును రాజ్యమునకును అరిష్టమనియు అందువలన నతనిని గొనిపోయి శ్మశానవాటికలో పూడ్చిపెట్టుట మంచిదనియు చెప్పిరి. వారి మాటలు విశ్వసించి ఆ రాజకుమారుని శకటముమీద కూర్చుండబెట్టి నగరము పశ్చిమ ద్వారముగుండ గొనిపోవలసినదని రాజు సూతుని కాజ్ఞాపించును. దైవనియోగమున సూతుడు తబ్బిబ్బయి పడమటిద్వారమున గొని పోవుటకు మారుగా తూర్పుద్వారముగుండ గొనిపోవును. ఇట్లు పోగా ఒక యడవి చివర శ్మశానవాటికవలె కనబడగా అచ్చట బండి నాపి సూతుడు రాజకుమారుని పూడ్చిపెట్టుటకు గొయ్యి త్రవ్వుచుండును. అట్టి సమయమున ఇక నూరకున్న లాభము లేదని యారాకొమరుడు బండి దిగి రథచోదకునికడకు వచ్చును. సూతుడు తన ప్రక్క నిలబడిన తేజస్వియగు నా రాజకుమారుని జూచి యద్భుతాశ్చర్యములు పొంది, యతనిని దనతో నగరమునకు వచ్చి రాజ్య మేలవలసినదని వేడుకొనును. 'తేమియ' రాజకుమారు డీ ప్రపంచసుఖములు క్షణికములనియు నిర్వాణలబ్ధికి ప్రయత్నించ వలెననియు బోధించును. ఇక నాతడు సన్యాసిగా కాలము గడప నిశ్చయించుకొనుటచేత సూతుని ప్రార్థనలు విఫలమగును. శక్రు డింతలో కృతనిశ్చయుడైన యా సన్యాసికి వనమున నొక కుటీ రము నిర్మించి యిచ్చుటకు విశ్వకర్మను బంపును. సూతుడు నగర మునకు మరలివచ్చి జరిగిన వృత్తాంతమును రాజునకును రాణికిని దెలుపును. రాజు రాణితోను ఇతర పరిజనముతోను ఆ సన్యాసి



భిసంమారనియజాతకం
9-వ చిత్రము.

పడుకొకథాదోహతి నడదోఎవతే
10-వ చిత్రము.

జబూనడదోపవతే
11-వ చిత్రము.

యున్న పర్ణకుటీరమునకు వచ్చి సమాధినిష్ఠుడయిన ఆతనిని దర్శించి యనేకవిధముల నగరమునకు మరలి రావలసినదని ప్రార్థించును. కాని శాక్యమునిని తత్త్వబోధ ముందు రాజు ప్రార్థన లెందుకును పనికివచ్చినవి కావు. తుద కతని బోధనల ప్రాబల్యమున కుటుంబ, పౌరసహితముగ రాజే సన్యాసమును స్వీకరించును.

చిత్రవృత్తములో వాయవ్యభాగమున గానవచ్చునది పుర ద్వారము. దానియం దిరువురు మనుష్యులు పరస్పర మ్యముఖు లయియో లేదా బండినైపో చూచుచు నిలబడినారు. ఎడమవైపు దిగువభాగమున నాలుగు గుర్రములను పూన్చిన శకటమున్నది. దీనిలో ఒక మనుష్యుడు పద్మాసనము వేసికొని ఎదిగిన పిల్లవానిని చేతితో గట్టిగా బట్టుకొనెను. ఇతడు 'తేమియ' రాజకుమారుడు. కూర్చున్న యతడు సూతుడు. కుడివైపు భాగమునందలి చిత్రములు వనప్రాంతమున జరిగిన కథను సూచించును. ఈ భాగమున దిగువ విస్మయపడుచు నిలుచున్నవాడు సూతుడు. ఇతని కెడమప్రక్కను వెళ్లిపోవుచున్నది సన్యాసియైన 'తేమియ' రాజకుమారుడు. కుడివైపు ఎగువను రెండు వృక్షములకు మధ్య నతడు పద్మాసనాసీనుడై చిత్రముమధ్య నెగువను తనముందు చేతులు జోడించి నమస్కరించుచు నిలబడిన రాజపురుషునికిని అతని చుట్టు నిలబడినవారికిని ధర్మబోధ చేయుచున్నాడు. ఆ రాజపురుషు డతని తండ్రి.

## 9 వ చిత్రము: 'భిసరమారనియ జాతకమ్.'

ఉష్ణీషశిలమీద చెక్కిన మూడు చిత్రములలో ఇది మొదటిది. మన బొమ్మలో ఇది సంపూర్ణముగా లేదు; చిత్రములోని కుడివైపు సగభాగముమాత్రమే కానవచ్చుచున్నది. అందువలన దీనిని గురించిన వివరము లిచట తెలుపుట మానితిని.

ఇక ఈ రాతిమీదనే నడిమివంపులోను కడవంపులోను రెండు కథలు చిత్రితమయినవి. నడిమివంపులోని కథ పేరు 'వడుకో కథాదోహాతి నడదోపవతే' (10-వ చిత్రము) కడవంపులోని కథ పేరు 'జబూ నడదోపవతే' (11-వ చిత్రము) 'వడుకో కథా దోహాతి నడదోపవతే' యను చిత్రము నారదపర్వతముమీద 'వడుకు'డు వృక్షమునుండి పాలనో ఏదో ద్రవమునో తీయుచున్నట్లు తెలుపు గాథ. 'జబూనడదోపవతే' అను చిత్రమునందలి కథ నారదపర్వతముమీద నున్న జంబూ (నేరెడు) వృక్షములకు సంబంధించినది. ఇట్లే జాతకకథ పేరు తెలుపని మరియొక చిత్రము 8-వది. దీని పేరు 'తికోటికోచకమో' అని తెలుపబడినది; అనగా త్రికూటకొశ్రేయమని యర్థము. 8, 10, 11 చిత్రముల విషయమున కథావిమర్శకులలో అభిప్రాయభేదము లున్నవి. అందువలన వీటిని గురించి వివరించుట మానితిని. అయినను ఎనిమిదవ చిత్రమును గురించి యిట్లు చెప్పుదురు.

8-వ చిత్రమున త్రికోణాకారముగ నున్నది యొక సరస్సు. దీనిని త్రిశీర్షనాగరాజు అనవరతము కాపాడుచుండును. ఈ త్రికోణము మూడు ప్రక్కలును సరస్సు మూడుగట్లను దెలుపును. ఈ తీరముల ఉపరిభాగములు ఆకులతోను పూవులతోను చిత్రవిచిత్రముగ నలంకృతములైనవి. ఈ సరస్సు మధ్య నాగరాజుండి తన తలలు పైకెత్తి తటాకోదకము నెవ్వరును చెడగొట్టకుండ కాపాడుచున్నాడు. దిగువ ఎడమప్రక్క నున్న రెండు సింహములును ఒకటి ముందుకు మరియొకటి వెనుకకు తిరిగి ఒక్కవైపునకే మెలకువతో సావధానముగ పరికించుచున్నవి. చిత్రమున కుడిప్రక్క గజయూథము చిత్రితమయినది. ఇది యే జాతకకథకు జరిపోవునో చక్కగా తెలియరాలేదు. కాని వారణాసిదగ్గర నున్న యొక తటాకమునుగురించి యువాన్‌చాంగ్ చెప్పిన విషయము లీ చిత్రమునకు వర్తించునేమో. అత డా తటాకమునుగూర్చి యిట్లు వ్రాసెను: "ఈ తటాకము చాల లోతయినది. దీని నీరు మధురముగా నుండును; స్వచ్ఛమైనది. అది యెన్నడును తగ్గదు; హెచ్చదు. దుష్టులువచ్చి స్నానముచేసినచో ఇందలి మకరములు వారిని బట్టి వధించును. సత్పురుషులు వాటికి భయపడ నవసరము లేదు; అవి వారి నేమియు చేయవు. తథాగతు డీ తటాకము ప్రక్కనే చతురస్రమైన శిలమీద తన కాషాయవస్త్రముల నుతుకుకొనువాడు. ఆ రాతిమీద నిప్పటికి నా వస్త్రముల గుర్తులున్నవి. సత్పురుషులు, బౌద్ధధర్మావలంబకులు ఇచటికి వచ్చి నైవేద్యములను బెట్టుచుందురు. దుస్స్వభావులు, దుర్మనస్కులు, బౌద్ధధర్మము నవలంబించని ఇతరులు వచ్చి ఈ రాతినిగురించి తేలికగా మాటాడి దూషించుచో ఈ తటాకమున వాసముచేయు నాగరాజు ప్రచండవాయువుల నుత్పాదించి ఝంఝవృష్టి గురియునట్లుచేసి వారిపని పట్టును" ఇదియైనను సరియైన వ్యాఖ్యానముగా గన్పట్టదు. ఆ సింహములు, ఏనుగులమంద యొందుకట నుండుట తటస్థించెనో తెలియదు.

9, 10, 11 చిత్రములకు నడుమ నున్న తీగవంపులలో చిత్రితములైనవి అలంకార పరికల్పనములు—పూవులు మొదలైనవి. భార్హుత్ స్తూపశిల్పమున చిత్రితమైన శిల్పకథాభేదములను దెలుపుటకే 8, 10, 11 చిత్రము లిచట చూపబడినవి.

# 'జమీందారు'



కథానిక

శ్రీ కవికొండల వెంకటరావు

అక్కడ అతగాడు కూర్చొని యున్నాడని ఎవ్వరికీ తెలియదు.

సామానంతా పట్నం చేర్చవలసినదిగా తాఖీదిచ్చి, గుమాస్తాలకు వొప్పజెప్పి తానొక సర్వసామాన్యజనుడిలా, ప్రచ్ఛన్నంగా కాలువ ఆవలిగట్టుకు బల్లకట్టుమీద దాటి, ఒంటిగా ఎండవేళ ఆవలిగట్టున చెట్టునీడను వేరుమీద వీపుజేరవేసేలా విశ్రమించి యున్నాడు. చెట్టు ఎన్నో గాలివానల తుర్రూతలూగి, చెక్కుచెదరని ఎదుగుతో ముదిమితో పేరెన్నికగన్న చింతచెట్టు. ఒకవంక ఏపేటా అది, చిగురునుండి గింజదాకా కన్నెపిల్లల కింపుగొల్పుతూ నవనవోన్మేషంగా వున్నా, వృద్ధులసంస్మృతి కతీతమై, గట్టు కూడా దాన్ని బట్టే పోశారా అన్నంత ఆనవాలురూపం కలిగి వుంది. చెంతనే గోదావరినదిపాయనుండి విడివడే కాలువ. కాలువయొడ్లు, కాలం వానాకాలం కావడంచేత, గడ్డి పట్టి ఆకుపచ్చగా వున్నాయి. కాని ఒక గట్టుమీద ఎర్రని కంకరరోడ్డు వేయబడి రాదారీ కనబడుతూ, బళ్ళూ ప్రజలూ ఏ వేళా సందడిగా వెడుతూవున్న జాడ కనిపిస్తుంది. ఊరు కూడా దానికి చేరి అదిగో అన్నట్టగపిస్తుంది. రెండవ గట్టెక్కితే అన్నీ ఊడ్చిన పొలాలూ, పొలాలమధ్యగున్న మామిడిచెట్లు చెన్నంగికొబ్బరిచెట్లు, కూరపాదులు, కొంగలు, కలుపుతీతస్త్రీల కోకలరంగులు ఎన్నెన్నో కానవచ్చి ఆగట్టుకూ ఈగట్టుకూ ఎంతమాత్రం పోలికే లేదన్నట్టుంటుంది.

పాఠకు లప్పుడే, బల్లకట్టవసరం లేకుండా, నా మాటలవెంబడినే కాలువ దాటి చింతచెట్టున్న గట్టుకు వచ్చినట్టున్నారు. కాని అట కూరుచున్నాతని దృష్టి రాజమార్గముమీదనే వున్నది.

మోటబళ్ళమీద మొరకుమనుష్యుల మూపులమీద నాడా రోడ్డమ్మట అతగాని సామానెంత తరలింపబడింది చెప్పశక్యం కాదు. అతడు నిన్నటివరకు ఆ కొండ్ర కధిపతి. వేలకొద్ది ఎకరాలకు జమీందారు. అతనెంత చెబితే అంత, నిన్నటివరకూ ఆచుట్టుపట్టంతకూ,—నేడొక్క శాసనంతో అతనిజమీ లాగివేయబడి అతని కిరవై లక్షల రూపాయలు నష్టపరిహారంక్రింద యీయబడి "నీయిష్టమువచ్చిన చోటికి నీచరాస్తితో వెళ్ళిపోవచ్చు. మరి ఇందు గల సెంటు భూమి నీదికాదు. ఇక్కడుండడానికి నీకు ఇల్లు లేదు. వల్లకాదు." అని సర్కారువారు ముదలయిడి సాగనంపేరు.

జమీందారుడు ముప్పైయేండ్ల వయస్సువాడు. వయస్సునకు తగిన అనుభవము గలవాడు. ఊహాప్రపంచములో మునిగి తేల్తూ అనుకొనువాడు. "ఇన్నాళ్ళూ ఆవలిగట్టున నివసించి భోగించిన దానికీ ఈనా డొక్క ముహూర్త మీవలిగట్టున విశ్రమించుదానికీ ఎంత తేడా కనిపిస్తూవుంది!" అని విస్తుపోసాగాడు. తానెక్కడ కూరుచున్నది మరచిపోయాడు. అతని నెత్తిమీద నొక్కొక్కప్పుడు నల్లని నీటిమబ్బు, ఒక్కొక్కప్పుడు నిశితమైన వేడియెండ విచ్చలవిడి మారిపోతూవున్నాయి. కనుచూపు మేరలో, చిన్న చిన్న గడ్డిపూలు వికసిస్తూ కొన్ని, ముకుళింపుగంటూ కొన్ని కానవచ్చాయి. ఏదో పక్షికూత దూరంనుంచి ఆకాశమార్గాన తన్ను పలుకరించేది. ఊడ్చినచేలు దుబ్బుకట్టి ఎత్తు ఎదిగి, తమ మీదుగా చల్లనిగాలి నడిచి పోయేలా, వొదుగు వొయ్యారం గల వయ్యాయి. అన్నింటికన్న తాను కూరుచున్న చింతచెట్టు నీడ రెట్టింతలు చల్లగా, మనోహరంగా, శాంతిప్రదంగా, తోచి, క్రమక్రమంగా నీటిమీద పడి వ్యాప్తమౌతూ వుంది.— ఆ నీడ అలా హెచ్చుపెరిగి, ఆవలిగట్టు నెండలో చేరుకుంటుందా అనేదే అతగాని ఆలోచన లఘుపెయ్యప్పుడు! చెట్టునీడ నీటిమీద పొడుగు కావడమే కంటూన్నాడు గాని సూర్యుడు పడమటకు వాలి క్రమక్రమంగా దిగిపోతున్న దృష్టి అతనికి సుతరాం లేదు. నీడలాగునే ప్రాణం, ప్రతిష్ఠ, చైతన్యం, చేష్ట గమనిస్తూ వున్నాడు." "నీడ దేనివల్ల ఏర్పడుతూ వున్నదీ?" అనే అంశంమీద అతనికి ధ్యానమే లేదు.

అయితే ఒకటి వుంది. అలా నీళ్ళమీద నీడనే ఎదర యొడ్డు కంటా చూపుసారించి దృష్టి కేంద్రీకరించడంలో, రాదారీని తరలింపుగనే అతని చరాస్తియొక్క అసంఖ్యాకరూపాల నీటి నీడలు నిలుకడ లేకుండా, ఒకే దిక్కుకు తల్లక్రిందులుగా సాగిపోతూన్నట్టు అతడు కనగలిగాడు. మోటబళ్ల చక్రాల తిరుగుళ్ళయొక్క కంకర రొరపిడి చప్పుళ్ళు, గుర్రాల సకిలింపులు, ఏనుగుల గంటలు ఎన్నెన్నో అతని వీనులకు సోకి వింతగొలుపజొచ్చాయి. వింతలో అదో విధమైన విచారమున్నూ కలుగచేశాయి. కాని ఒక్క ధ్వనీ అక్కడ దాగింది లేదు. ఒక్కరూపమూ తనకెదురు తిరిగి ప్రశ్నించింది కాదు. క్రమక్రమంగా అతని బుద్ధి కుశాగ్రమైనకొద్దీ, అంతరంగికాలోచన కొక క్రొత్తకోణం ఏర్పడింది. చెవులకో నూతనస్వనం వినబడసాగింది. అది అతనికి అపూర్వమైనదిగా తట్టింది.

ఒక మేనా సవారీ మోసే బోయీల మ్రోత అది! అంతరాళమంతా ఆవరిస్తూ, దిశాంతమందు అంతరించి పోయి నట్టొక్కొక్కప్పుడు, మన చెవులనే తాకి గూబల్లో నిలబడి మారుమ్రోగుతూన్నట్టొక్కొక్కప్పుడు ఆ ధ్వని ఆప్రాంతమందు అతిస్వేచ్ఛగా అనుతూ వచ్చింది.

ముందుకొమ్ము ముగ్గురు బోయీలు, వెనుకకొమ్ము ముగ్గురు బోయీలు మోస్తూవున్నారు. వెనకొకడు పరుగిడుతూ వున్నాడు. — — "అఁఓ—ఓ—అఁ— అఆఏ—ఏఏఅ—"— అని ఇలా ఆ ధ్వని హెచ్చుగా తగ్గు స్థాయీలగా వినవస్తూ ఊరినుండి చుట్టుదారిని రోడ్డుమీద కెక్కి జమీందారు కూర్చునివున్న చోటికి సరాసరి ఎదరున్న రేవు గమ్యస్థానంగా చేరుకుంటూ వున్నట్టైంది. పురుషుని హృదయం క్రొంగ్రొత్త స్పందనం గా జొచ్చింది.

ఈరోజున కూడా ఆమె ఈరేవులో స్నానంచేసి పూజాద్రవ్యాలతో తరలివెళ్ళి దేవతాదర్శనం దేవాలయములో గావించడమేనా?— "వద్దు!—నీవు తిన్నగా సామానువెనకాలే వెళ్ళిపోవలసినది. వద్దు! వలదు! మరిదేవుడు లేడు! దేవాలయములో లేదు!" అని ఆజ్ఞాపించానే! నా ఆజ్ఞను ఆమె ఉల్లంఘిస్తూ ఇటు వస్తూవుందా? ఇక్కడ స్నానముచేస్తూ వుందా? లేక తిన్నగా వెళ్ళిపోతూవుందా?" అని అధికార కోపోద్రిక్త నయనాల్తో ఆవినవచ్చు మేనామ్రోతదెసకు తన చూపు లొక్కొక్కప్పుడు పనిచి తన మెడ నొక్కొక్కప్పుడు త్రిప్పి, తన శ్రద్ధనంతను, మేనాలోనుండక తప్పదని యనుకొని తాను తలంచుకొను చిన్న అంగనయొక్క రూపురేఖలయందు, లీనమొనరించుకొనుచు "ఆమె మరి జమీందారిణి కాదు. సామాన్యస్త్రీ" అని తుదకేదో విధమైన కనికర మామెయెడ వహించినవాడై ఆ జమీందారుడు తిరుగ కాలువ నీటివైపు, దాని పొగదలవైపు, గనుగొనువాడు, కాలువ ఎప్పటిచొప్పునే అందగించుచు ప్రవహించుచుండెను.

ఆ మేనాలో వచ్చుచున్నదాన, సాక్షాత్తు, అతగాని సహచారిణియే! అక్రితం రోజువరకును జమీందారిణి. జమీందారిణీ హోదాలో నున్నప్పుడు ఆమె నిరంతరం సాయం సంధ్యారాగ సమయమునకు సవారీపై ఆ రేవునకు వచ్చి, ఎవ్వరు లేకుండ చేసి, తాను స్నానమాచరించి, మడుగుకలువ ధరించి, పూలసజ్జతో దేవాలయమున కరిగి దేవుని సందర్శించి ఇంటికి మరలి, చనుట పరిపాటి.

దేవాలయము ఆమె భర్తయొక్క పూర్వీకులు కట్టించి, ధ్వజస్తంభమెత్తించిన ఏనాటి దేవాలయమైనను, ఈ పుణ్యదంపతుల యొక్క భక్తి తాత్పర్యములమూలమున దైనందినం నూతనంగా శోభిల్లుచు ఊరికి నిండైన కనుబండువై విరాజిల్లునది.

“అయితే జమీందారుడు, అతని జమీ సర్కారువారు తీసికొన్నారు గదా, దేవాలయము కూడా విడిచిపెట్టుతాడా? నాటి నుండి దేవాలయము గతి యేమగును?” —అనునది రావిచెట్టు క్రింది ప్రజలమధ్య సమస్యగ ఆ నిమిష మప్పుడుండెను. “సాయంకాల మెప్పటివలె జమీందారిణి ఆమెయొక్క యెప్పటిహోదాతో దేవాలయమునకు రాగలదా? రాలేదా? ఆమె మేనా నెవ్వరా టంకపరుపగలరు?” అని నాటి ప్రజ పెద్దకోలాహలముగ, కోలాహలమునందే రహస్యముగా, యోజింపదొడంగెను. ఊరి వారెల్లరు సంధ్యా సమయమునకు దేవాలయమును చుట్టియుండిరి. కాని ఆ మూకబుద్ధికి, జమీందారు జమీందారిణి ఏమిచేయదలచినది, ఎటుచన్నది, ఎవ రేమగునది, అంక లేదు.

ఇక్కడ జమీందారుడు, తన్ను బోయీల మోత నలుదెసల నుండి ఆవరించిన ట్టావరించిన కోలాహలని, చిత్రభ్రాంతిని మునుగ జొచ్చెను. అత డెప్పుడూ ఆ వరకు తన ప్రేయసి ఆ రేవులో స్నానము చేయుటగాని, మడిచీర ధరించి దేవాలయమునకు జనుట గాని ప్రత్యక్షముగ జూచినది లేదు. అందరూ విన్నట్టుగానే, తానూ వినుచు, మత విషయమున ఆమె త్రోవ నామెను పోనిచ్చుటే తదజ్ఞతకు కారణము. తాను సంఘ సంస్కారి; మత సంస్కారి. అయితే ప్రజలకొరకు, భార్యకొరకు, హిందూ మతమును చెందవాడిక, దేవాలయమును సాంప్రదాయానుసారంగా నడువ నిచ్చుచు, రథోత్సవాది మహా పర్వసమయములందు తానుగూడ పాల్గొనుచు, వచ్చువాడు. నాడే అతని జీవితమునందు ప్రారంభము, ఆ జనపద ప్రాంతమందు, ఊరు దాటి, బల్లకట్టుమీద రేవు దాటి రెండవ యొడ్డు సేరి, అందుగల చెట్టు వేరు నాని కూరుచుండుట.

అతడు అంతరాళమందు బోయీల మోత మారు మ్రోసిన కొద్దీ, తనకు చేరికగుకొద్దీ, తన్నుదా మరచిపోయినట్లయి, రేవు దాటించు బల్లకట్టువానిని గాని, బల్లకట్టుమీద ఇటు నటు దాటుచున్నట్టి కూలియాండ్రను గాని కనిపెట్టలేదు. వారు మాత్ర మేదో వింతగా ఆ ప్రవాహతీర్పరు నుండుండి చూచుచు, ఆ వచ్చు మేనాను తమ సొంతమైనట్టు కనుగొనుచు రిచ్చపో దొడంగిరి. కాని ఎంతకూ అది ఆగు తెన్నుగాని, తీరుగాని, ఎవ్వరికీ తోపలేదు. ఎవరంతట వారా రా చూపరులు బల్లకట్టు దిగి వారి వారి యిళ్లకు జనిరి.

సాయం సంధ్యారాగము, నటరాజు ప్రళయతాండవమున రేగు ధూళిగా, పైకి పడమటిదెస లేచినదై, వింతగా విరివిగా, అరసింది తడవుగా, ఎర్రని తేజస్సును దిఙ్మండలము నుండి నలుదెసలా తేజరిల్లజేయుచు ఆ జమీందారునియొక్కయు, ఆ మేనాలో కూరుచున్న నారీమణియొక్కయు ఏక చేలాంచలమా అన్నట్టొప్పారెను.

రాదారి బాటగల గట్టుమీద, బల్లకట్టురేవు వంపునే, సవారీ నిలువు చేయబడి, అందునుండి గేస్తురా లీవలకు మేలి ముసుగుతో వచ్చుచు కనురెప్ప లెత్తకే నీటివంక చూచి, ఆవలి గట్టు దృష్టి సారించి, చెట్టునీడ నీళ్లలోపడ్డ జాడనే తన ప్రియుని నీడకూడ ఏకమగుచు కానవచ్చుట ఆనవాలు గొని, “బల్లకట్టన్నా! ఆ తట్టెప్పుడూ ఈ వేళకు మగనాడున్న జాడలేదు. ఎవరా కూర్చున్నది?” అని అడిగెను. బల్లకట్టన్న “వారే! జమీందారుగారే! లేచి వెళ్లమని చెప్పనా? తల్లీ!” అని వేచియుండెను. జమీందారుడు తన మోము పైకెత్తక, రెప్ప లరవాల్చి, నీటివంకకే చూచుచు, ప్రేయసి యెట్లు నీటిలో దిగి నీరాట జెలంగునది, వీక్షింప వాంఛించెను.

నునుసద కొంచె మాలోచించి, బల్లకట్టాతనితో “వద్దులే! కూర్చోనియి! అక్కడనే కూర్చోనియి!” అని అంతఃపురపు తీవిని, ఘోషాను పోషిస్తూ, స్నానమునకై యొక్క మునుక తన నీటినీడనే తాను వేసినదాయెను. బల్లకట్టాతడు, ఆమె తిరుగ నీటినుండి లేచు లోపల, బల్లకట్టు నొకపైపుగా గట్టుకుచేర్చి, తా నొక చెట్టుచాటు కొదిగి దాగెను. బోయీలున్ను తమకు నాను రహదారినివున్న చెట్ల వరుస వెనుక నొక్కొక్క చెట్టు వెనుక కొక్కొక్కనిగ చేరుకొని మరుగుపడి యుండిరి. ఇది నిత్యమూ వారు ప్రతిరోజూ చేయుచున్న పనే. కారణం, జమీందారిణి స్నానమాచరించి తిరుగ గట్టెక్కి, పైకిచని, పాడిబట్టలు కట్టుకొని సవారీలో కూర్చుండి తలుపులు వేసేసుకొను వరకు ఎవ్వరును చూడరాదు. వారు సవారీ మోయు బోయీలే కానిండు, రేవు దాటించు బల్లకట్టాతడే కానిండు! మరిన్ని రాదారిని ఆ నిమేషమప్పుడు నడుచు జనముకూడా అటో అరమైలు ఇటో అరమైలు పాడైపున నడవకుండుట నియామకము. కాఘన సమస్తము నిర్జనంగాను, నిశ్శబ్దవంతంగానూ, ఆ దంపతుల కిరువురకు దాచి యొకరినీటి నీడల నొకరొకరు పెట్టుకొని యున్నట్టుండి పోయిరి; కొంత తడవు చెరొక గట్టునా ఎదురెదురుగా! ఇతరము ఎరుగకుండిరి.

ఈ యేమరుపాటు సమయమప్పుడా రాదారినే ఏనిగా మకవూ నేరని ఒకానొక నిర్భాగ్యురాలు, యువతి, ఆ యనుర సంస్థనే, ఇల్లులేక, వాకిలిలేక, ఏకడనూ రక్షలేక, దిక్కులేక, ఏగుచు, ఊరికే ఉత్తదిగానున్న ఆ సవారీని చూచినదై, అందులోనికి దూరి, ఇటూ అటూ తలుపులు లాగికొనుచు గాజుల చప్పుడు చేసెను.

అప్పటికి జమీందారిణి రెండవమారు తన స్నానమున గ్రుంకుకొనుచు నీటనణగి యుండెను. జమీందారుని ధ్యాన మంతయు జమీందారిణి నీటనుండినిలువునా లేచు సొబగు తిలకను గాంచుటయందే పంచియుండెను. ఆ కారణముగా మరొక స్త్రీ వ్యక్తి సవారీలో ఆసీనయై సవారీ తలుపులిటూ అటూ లాగికొని మూసివేసికొనుట ఎవ్వరును గాంచలేదు. కాని ఎప్పుడైతే సవారీతలుపులు మూసికొన్న ధ్వని అయినదో, తివాచూ చొప్పున బోయీలు తమతమ దాగిన చెట్లచాటునుండి యువతులకు వచ్చినవారై, సవారీని బుజములనెత్తుకొని, ఎత్తుకొనుచునే— “ఆఁ ఓఁ ఏఁ—” మొదలగు ఊతధ్వనులను వినిపించుచు వెడలి పోయిరి. “ఏమూ?” అని జమీందారిణి నీటినుండి పైకి తలెత్తి చూచులో ఆమె కెనుతట్టుశూన్యపథము తప్ప మరొండు లేకపోయె.

ఎదరతట్టు భర్త ఆవలిగట్టునుండి ఆమె దృక్కులలోని కెమ్ముకులాటను గుర్తించుచు ఆందోళనాతత్పరుడై, బల్లకట్టన్నను పిలిచి తన్ను కూడా తన చెలియున్న రాదారిపైపునకు జేర్చుమని కోరెను. రేవు దాటించు నాతడును, తాను దాగివున్న చెట్టుచాటునుండి

ఈవలకు వచ్చి జమీందారుని జమీందారిణి యున్న యెడకు జేర్చి వారిరువుర నొకచో కూర్చెను.

జమీందారిణి గట్టెక్కి, పాడిచీర దాల్చినదై, "ఈ మోస మెట్లు జరిగినది?" అని కళ్ల నీళ్లు బెట్టుకొన జొచ్చెను.

"ఏ మోసము?" అని భర్త అడిగెను.

"ఈ నా సవారీ మాయమగుట!" అని జమీందారిణి బదులాడెను.

"అన్నియూ మాయమైనట్లే అదియునూ మాయమయ్యెను. నీ వింకను సవారీమీద పోయి దేవుని దర్శింప నెంచితివా అది పిచ్చి యూహ. నేను, చూడు, ఎట్లు నడచివచ్చి కొలువగట్టున కూర్చున్నానో?" అనెను.

"మగవాండ్రే పని పడితే ఆపనే చేయగలరు. సమస్తము విడువగలరు; నడువగలరు. ఆడు వారమగు, మాకు దేవుడు, జీవుడు, సిరి, ఇన్ని కావలయును. నేడు మరి దేవుని సందర్శనమే లేదు కాబోలు నా బ్రతుకునకు" అని భార్య నుడివను.

"ఎందుకుండదు?" అని భర్త అడిగెను.

"దేవుని సందర్శనమే నాకుండియున్న సవారీ యింత వింతగా మాయముగా నేరదు" అని భార్య నిరాశ వెలిబుచ్చెను.

"ఇంకా మేనాలమీద మేలిమి మీద నీకు రోకు కలదన్న నాకు వింతగా నున్నది. దేవునిదర్శనము కాలిబాట నే మరి నీవు గావించుటముఖ్యమని తలపోసి, యీ అనుభవము నీ జీవితమందు సద్యఃకల్పితమైంది. రా! నాతో కూడా రా! ఆ సవారీకంటె ముందుగా నొక అడ్డదారిని మనము దేవాలయము చేరగలము." అని జమీందారుడు ముందడుగు వేసెను.

"ఈ నా తెరలోని వేషముతో నేనా?" అని భార్య ప్రశ్నించెను.

"ఆ వేషము నీ వుంచుకొన్నకంటె, తీసివేయుటలోనే నే డందముంది. సామాన్య వేషములో ని న్నెవ్వరును పోల్చ లేరు."

అని ధైర్యము చెప్పి ఆమె ముంగురులతో దోబూచు లాడునట్టి జరీబట్టల మేలిముసుగు తొలగించెను. తొలగించులో ఆ యబలరూపము అపురూపసౌందర్యముతో విరాజిల్లిన దాయెను. ఆమె కళ్లల్లో, దేవుడు, జీవుడు, సిరి, అన్నీ ఒక్కమారు అతనకి మెరపు మెరసినట్లు కనబడెను.

సవారీలో తిరుగ నాడు కూర్చున్న మనిషి, జమీందారిణే యనుకొని బోయీలు చుట్టుదారిని దేవాలయము కడకుతీసుకొని వచ్చునంతలో అడ్డుదారిని జమీందారిణియు, జమీందారుడు దేవాలయద్వారమును జేరుకొనిరి.

అక్కడ గుమిగూడి చోద్యముగ జూచు ప్రజమధ్యనుండి కొందరు ఆకతాయిలు, కర్రలు, గొడ్డళ్లు పుచ్చుకొని "ఈమె యింకను దేవుని జూచుటకు సవారిమీదనే వచ్చినదే!" అని సవారీ తలుపులు తెరచుకొనులో సవారీపై నొక దెబ్బమొత్తి, పైకెత్తి కీడుకంట గీటిరి. కాని, అది సాగకుండ అప్పటికి సరిగా కాలినడకను అందుకొని, దేవళద్వారముముందు మెట్లపై భార్యాసమేతుడై నిలుచుండి, జమీందారుడు పెద్దయెలుంగున "జమీందారిణి కాలినడకనే నాతో నేడు నడచివచ్చి యిచ్చటనే యున్నది. ఆమె సవారీలో లేదు" అని వారికి నచ్చజెప్పి, భయానక కృత్యమేమీ జరుగకుండచేయుచు, వారితోపాటు తానును, తన ధర్మపత్నియు ఆ సవారీలోనుండి ఎవరు దిగుతారో అని పరికింపజొచ్చిరి.

ప్రజలలో ఆవరకును జెలరేగిన కోలాహలముగాని, జమీందారీ దంపతుల కలవడిన హృదయపరివర్తనముగాని ఎరుంగక, కేవలం సవారీ చీకటినుండి, అప్పటికప్పుడు వెలిగి యివలకు చూపబడిన దీపకళికలా, ఒకానొక స్త్రీ వ్యక్తి, అక్కడెవ్వరూ అంత క్రితం ఎరుగని నవ్యమోముతో, విరాజిల్లు గోముతో, వెలికివచ్చి— ఏదో క్రొంగ్రొత్త అన్వేషణ, ఆవేదన, ఆకాంక్ష తన యెడద ముప్పిరిగొను చొప్పు, లోకమునకు చెప్పకచెప్పు కళ్లొప్ప జెప్పెను.

"ఎవరు నీవు?" అని జమీందారుడు ఆ స్త్రీని ప్రశ్నించెను. అప్పుడామె యిట్లు బదులాడెను. ప్రజలున్ను సవారీలోనుండి దిగిన ఆమె సంపన్నురాలా, సామాన్యురాలా, సానియా, సంసారియా, అన్న వివక్షత విడిచి, ఆ క్రొత్తమనిషి ఎవరా అనే మీమాంసతో గుర్తింప తల్లక్రిందులు పడుచు, ఆమె చెప్పు చరిత్ర నాలకింప జొచ్చిరి. ఆమె ధరించిన దుస్తులనుకూడా తోడ్తో వింతగా దిలకింప జొచ్చిరి. ముందు దుస్తులు వర్ణించనా, గాథ వినిపించనా?

ఆమె వొక నీలం మొఖమల్ షరాయి తొడిగింది. మొలనుండి పాదములదాకా, మెడనుండి తొడలదాకా అదేరంగు, అదేనునుపు అదే తేటూ గల చొక్కా తొడిగింది. మరిన్నీ మెడను మెలిపెట్టి బారమీదకు వొదులొదులుగ జారేలా శిరోజాలమీద నడకనడిచేలా ఒకానొక తెల్లని పట్టువోణీ, అదే కండువాగా, మేలిముసుగుగా వేసికొంది. కాళ్లను సరిగచార్ల చెప్పులు తొడుక్కుంది. యావత్తు దిరీసుగుండా పచ్చని పాంచాలదేశపు వొంటి వన్నె, కన్నె వయసూ కొపరుస్తూ, నీలనీల మేఘంనుండి వెండిఅంచు బయల్పరుస్తూ వెలికివచ్చే సూర్యునిదైన నీరెండమాదిరి చల్లదనం దృక్కుల విలువతోపాటు వెదచల్లుతూ దేవాలయపు మెట్లవద్ద చెప్పులువదలి "ముందు దేవుని చూడనియ్యండి! ముందు దేవుని చూడనియ్యండి! నే నీ ప్రకారముగా దేవుని చూడగలనని యొక్కనాడునూ కల్లోనైనా తలపోయలేదు. ముందు దేవుని చూడనియ్యండి! నా చరిత్రమాటకేం?" అంటూ గుడిలోనికి జొరబడింది. ప్రజలున్ను ఆమె అపరావతారం తాల్చిన ఆండాళ్లమ్మో, అలివేలుమంగ తాయారమ్మల్లో, బీబీనాంచారమ్మో, కంచి కామాక్షమ్మో అని భయభ్రాంతులై ప్రక్కప్రక్కల కొదిగి చేష్టలు దక్కి చూచుచుండిరి.

జమీందారుడు, జమీందారిణియు ఇక్కిలీ ఆమెయొక్క కథను వినవేచియున్నట్లు క్రిక్కురు మనకుండ నొత్తిగిలి యుండిరి. ఆమెయు గర్భగుడిలోని దివ్యవిగ్రహమున కెదురుగా నిలుచుండి "దేవా! నే నీ అద్భుతవిధముగ, నొక సవారీలో కూరుచుండి, నీ కడకువచ్చి నీ దర్శనము లభించి, తరించియుండి యుండుదునని ఎన్నడు అనుకోలేదు. శాదారీ బాటనే ఖాళీసవారీ, సవారీలో కూరుచున్నంతనే బోయీల మ్రోత మ్రోతఆగి సవారీ దిగుటలో నీ దేవళద్వారము! అహో ఏమి, నా అదృష్టము! ఇది, నేను కాందిశీకాంగనయి, ఆసేతుహిమాచలం దిక్కులేక తిరుగాడుటలో దొరకిన పెన్నిధిగా తలంచుచున్నాను. దేవా! దేవా!" అని తన కనుపాపలలో క్రొన్నీడలమర, ఆ నీడలనే వాల్గాడించులా జొటజొట మృదుకపోల ముకురాలమీదకు కన్నీళ్లు గార్చ జొచ్చెను. "కాలినడక నెంతదూరము నడచినను నన్ను గనుగొన్న వారెల్లరు కాందిశీకాంగననీ, కొరమాలినదానిననీ, మతము చెడిన దాననని, తమ అభిమతమునకు అణగిమణగి యుండవలసినదాననని, ఈసడించినవారలేగాని యీ విధమున వాసికెత్తి గారవించినవారు లేరు. ఇది నా జీవితమునందు అనుకోని అనుభవము. ఈ నీదర్శనము ఇతరులకసంభవము. దేవాదిదేవా!" అని వినమ్రతతో, వివేకముతో, విశాలహృదయముతో, ఆ ఆడమనిషి సాష్టాంగ పడి లేచి, పరిసరమున తన్ను అరయుచున్నవారి నెరుగకోరెను. జేడిమాక ఏదో సందడి నుండెను. జమీందారుడు ఆమెను పలుకరించుటకు

తగు సాహసము వహింపడాయెను. ఇక అతని భార్య—"నీవు నిజముగా కాందిశీకాంగనవే యగుదువేని మమ్ములనందరను వంచించినావు. అందు ముఖ్యముగా నన్ను మోసగించినావు" అని ధీరస్వరముతో నుడివెను.

"నీ వెవరవు" అని క్రొత్తమత్తకాశిని ప్రశ్నించెను.

"నేనా! నేనా" అని జమీందారిణిగా చెప్పుకొనుటకుగాని, మాజీ జమీందారిణిగా పేర్కొనుటకుగాని మనసొప్పక యాయిల్లాలు "నేనా, నేనా" అని నీళ్లు నమలి, "నామేనా అది! అని మురిసిపోవు నన్ను నామేనానుండి ఒక్కనిమేషంలో వేరుచేసి నేలపై నడిపించినావు. నీదీప్రజ్ఞ! నా నాధు డెంతచెప్పినను వినని నన్ను నీవు నేలపై నడిపించినావు. నీదిప్రజ్ఞ! నాకు మిక్కిలి సంతోషముగా నున్నది. నీనుండి ప్రజలపేక్షించునదిలేదు. కాందిశీకాంగనవు. ఇల్లులేదు నీకు. వాకిలిలేదు నీకు. వసతిలేదు నీకు. వ్యాపారములేదు నీకు. కాందిశీకాంగనవు నీవు! అదృష్టవంతురాలివి!" అని అభినందించెను.

కాందిశీకాంగన పనుదిరిగి మేనాపైపు చూడ నభిలషించెను. అంతలో ఆమె కట్టెదుట దివ్యవిగ్రహముయొక్క బంగారు తొడవులుమీదకు, కిరీటముమీదకు, పెద్దపలుగు వ్యాపించి, నఖశిఖపర్యంతం చతుర్బాహూదర వక్త్ర నేత్రద్వయము లదర వింత హెచ్చరిక గొలుప జొచ్చెను. "ఏమా?" అని కాందిశీకాంగన వెన్నునే తిలకించులో, సవారీని ఛిన్నాభిన్నముగచేసి, ప్రజలు భోగిమంట నంటించునట్లు దేవుడి యెట్టయెదట అంటించి జ్వాలగా జేసినారు.

ఆ జ్వాలామాల ఎవరి మెడలోపడి, యింకనూ విషాదపు విద్దూరము లేమి జరుగునోయని, జమీందారిణియు, జమీందారును, కాందిశీకాంగనను కాచుటలోను, కాందిశీకాంగన వారిని సంరక్షించుటలోను నిమగ్నులై యుండిపోయిరి. కాని, దేవుని కృపవలన ప్రజలు వారి కెవరికిని ఏ హానియు జేయకుండ "ఇక వారును మనలాగున నడువవలసినదే! ఇక వారును మనలాగున నడువవలసినదే!" అని అనుకొనుచు క్రమక్రమముగా పలచబడి, ఎవరిఇళ్లకు వారు వెళ్లిపోయిరి.

జమీందారును, జమీందారిణియు, కాందిశీకాంగనయు చుక్కవలుగులో దేవళమును నిర్గమించి విశాలతర ప్రపంచంలో మంచు తడిబాటనే కాలినడకను జనుచు నిట్లనుకొనిరి. కాందిశీకాంగన:—"సవారియొక్కన నే యింటి ముంగిటనైన దింపగలదు. నా కింత ఆతిథ్యము దొరకునని యనుకొంటిని. కాని యిట్టి వైపరీత్యము జరుగునని తలపోయలేదు." జమీందారిణి:—"సవారీ దేవుని దర్శనార్థము నిర్మింపబడినదిగాని నీవంటి దానికొఱకు గాదు." జమీందారుడు:—"ఎవ రెందు కనుకున్నా, ఆ సవారీ నేడు తగలబెట్టబడవలసినదే! దానిని గురించి మన మింక వాదులాడ బనిలేదు. మనము ముగ్గురము ఇట్లు కలిసి రాదారినే పోవుచో మఱల ప్రాణగొడ్డము లేపి కల్లుగకుండవుగదా! అనునదే యోజించుకొనవలసినది." కాందిశీకాంగన: "అనగా మన ముగ్గురిలోను నేనే అధమాధమురాలిని, దురదృష్టవంతురాలిననీ మీ యూహ!" జమీందారుడు:—"కాదు. నీవు మిక్కిలి అందకత్తెవు. యౌవనవిలాసినివి. ఈమె బంగారునగలు ధరించిన గృహిణి. జారచోరుల కిది అనువైన నిశీధిని." జమీందారిణి:"—ఇవిగో నామీదనున్న వస్తువులనెల్లను దొంగలు బలాత్కారముగ గొనకమున్నే యీ నీట పారవేయుచున్నాను." అని తొల్లింటి కాలువచేరికగా నీటిని దరిసెను. జమీందారుడు:—"నే బోధించితినని పారవేయవలదు. నీ అంతరాత్మకు తోస్తేనే త్యజింపుము. అసలు అవిన్నీ, మేనాయున్నూ మన యితర సామానులతోపాటు తరలింపబడియుండి యుండవలసినది. అప్పుడు మన మిద్దఱం మాత్రమే ఒకరి కొకళ్లం తోడునీడలమై ఈ రాదారిని నడచియుందుము. ఇది రహదారీ! ఇందు దాపరికమును గాని, దాపుడుధనముగాని లేవు. అది తెలిసి నడచుట ఈ పయినుండి మనవిధి." అని హెచ్చరించెను. ఆ యిల్లాలు తన కప్రయత్నముగా కళ్లమ్మట బొటము చెమరింపును చేతుల తుడిచివేసికొనుచు తన నగలనెల్లను నీళ్లలోనికి విడిచిపుచ్చెను. కాందిశీకాంగన అది కనీ కనకుండ "నా యౌవనమింతలో నన్నట్లు విడుచునట్లు లేదు. నా మూలమున మీకు కీడు మూడనేల? మీరు జనుడు." అనెను. జమీందారుడూ, జమీందారిణీ రిక్తహస్తులై కాలినడకను పొడుగు రాదారీనిబడి వడివడి నడచిపోవుచుండ, కాందిశీకాంగన జమీందారిణియొక్క దిసమెడ గనుగొనుచు, ఆ దంపతులయొక్క నిరాడంబర నిర్గమనమున కచ్చెరువు పడుచు, తా నున్నచోట నున్నట్టే కొంత తడవు ఆగిపోయెను. ఆగిపోయి కాలువనీటిలో జమీందారిణి జారవిడిచిన వస్తువులకొఱకు వంగిచూచెను.

కాని, ప్రవాహము మిక్కిలి వడిగా నుండుటచే అందు చుక్కనీడ తన నీడ కలకలుపై ప్రకాశించుట తక్క మఱొవిలువ లోహము ధగధగమనుట కాంచలేకపోయెను. అప్పుడామె వింతగా చింతించినదాయెను. తనకు కనబడిన నూతన ప్రకాశముచేత ఆమె తొల్లింటి మోహము అంతరించెను. అయినప్పటికీ ఆ కాందిశీకాంగన ఈ మోహప్రపంచములో తాను రాదారీని నడచుట క్షేమము గాదని, బల్లకట్టాతని లేపి సూర్యోదయము కాకుండా రేవు దాటి ఆవలితట్టు పెనుచింతక్రింద విశ్రమించి అదే తన కనువైన విడిది, గుడి కాదు, గృహము కాదు—అని గ్రహించెను. చింతచెట్టు నీటినీడ ఒక వైపునకు, చింతచెట్టు ఎండనీడ మరొకవైపునకు! ఏ నీడ నాశ్రయించుటో ఆమెకు తెలియకుండెను.

తక్కడ పుడకల్లా రెండునీడలూ ఉపచరింప, చెట్టును ముల్లుగా గొని ఆమె తన జీవితభారమును తూచుకొనుచున్నట్లు తెల్లవారె, లోకమునకు గనబడజొచ్చెను. పాపము శమించెను; ప్రాయము విజృంభించెను.

నాటికీ, నేటికీ ఆ చింతక్రింద విశ్రాంతి గొన్నవారిలో నీను మిగిలినవారగు క్రితపు సాయంకాలపు మాజీ జమీందార్! నేటి యుదయపు కాందిశీకాంగన! వీరిరువురే!

---

# 1951 లో




## "పూర్ణా రిలీజులు"


...అశ్విని వారి...
**మాయలమారి**


...యువా వారి...
**టింగ్ రంగా**


...అంజలీ వారి...
**చిత్రం, నెం.1.**


...ప్రతిభా వారి...
**చిన్నకోడలు**

...మనోహర్ వారి... **మనోహర**


...వినోదా వారి...
**స్త్రీసాహసము**
**సువర్ణమాల**
**దేవదాసు**
**బాలసన్యాసమ్మకథ**


...భరణీ వారి...
**LOVE**

...మనోహర పరిమళా వారి...
**స్వర్గద్వారము**

ఇంకనూ ఎన్నో తమిళ, హిందీ, చిత్రాలు

నిర్దోషి, స్వప్నసుందరి, బాలరాజు, లైలామజ్ను, రక్తరేఖ, మొ,, ఉత్తమచిత్రములు
సమర్పించి విశాలాంధ్ర ప్రజల ఆదరాభిమానములందుకొన్న ఏకైక సంస్థ

## ది పూర్ణా పిక్చర్స్ లిమిటెడ్

విజయవాడ, సికింద్రాబాద్, గుంటకల్, మద్రాసు, విశాఖపట్టణం

MATA

# మధురవార్త



తియ్యటి పిప్పరమెంట్లు, అతి తియ్యటి పంచదార బిళ్లలు,
శ్రేష్టమైన చాకలేట్లు, సరసమైన ధరలకు అందజేయువారు



# ఎం. ఏ. పి. ఇండస్ట్రీస్

(షియాలి కన్ఫెక్షనరీ యిజారాదార్లు)



**362-364, తిరువత్తియూరు హైరోడ్డు.**

**తండియారుపేట : : మద్రాసు - 21.**

తంతి "Mapindus" టెలిఫోను. 2583.




## బాలురకాపాడు ఔషధములు

# జండు బాలామృతము

క్షీణించి అనారోగ్యవంతులుగ నుండు బిడ్డలకిది అమృతము వంటిది. వారి ఆకలిని వృద్ధిపరచి ఆరోగ్యము నిచ్చును. పిల్లలకు దంతములు మొలచునప్పుడు కలుగు నొప్పులను అనగా భేదులు మొదలగు వ్యాధులను పోగొట్టును. కాళ్లుచేతులు పుష్కించి కడుపు పెద్దదిగాయున్న బిడ్డల కిది దివ్యౌషధము. జీర్ణించిన జలుబు, దగ్గు మొదలగు వాటిని కూడ హరించును. **సీసా 1-కి రూ. 1-4-0.**

ఈ క్రిందివారివద్ద, ఇతర ఏజంట్లవద్దను దొరకును.

రాజమండ్రి—ఈశ్వరదాసు & కో.,
మచిలీ పట్నం—కె. వి. మాణిక్యరావు.
నెల్లూరు—ఆర్యన్ ఫార్మసి, ట్రంకురోడ్డు.
Sattenapalli—సత్తెనపల్లి మెడికల్ స్టోర్సు.
ఏలూరు—సాంబశివ మెడికల్ స్టోర్సు.

పెద్దాపురం—వేలు మెడికల్ స్టోర్సు.
కాకినాడ—లక్ష్మీనారాయణ కంపెనీ.
తణుకు — ఫ్రాస్టు గేటు డ్రగ్గు హౌసు.
బెజవాడ — చంద్రమౌళీశ్వర & కో.
నరసరావుపేట — ఆయుర్వేదిక్ & అల్లోపతిక్ మెడికల్ కన్సరన్

లేదా దిగువవారివద్ద దొరకును.

సోలు ఏజంట్లు;

## దామోదరు & కంపెనీ

113, నైనియప్పనాయకన్ వీధి, : : మద్రాసు 3.

# హిందుస్తాన్ కో-ఆపరేటివ్ ఇన్స్యూరెన్సు సొసైటీ లిమిటెడ్.

(హెడ్డాఫీసు—కలకత్తా)

నమ్మకమునకు, స్నేహపూర్వకమైన లావాదేవీలకు పేరొందిన కంపెనీ. గత 44 సం॥ ల ప్రజా సేవలో సొసైటీ సంపాదించిన గొప్ప ప్రజాదరణకు యీ అంకెలే ప్రబల తార్కాణము.

| | | |
|---|---|---|
| 1950 లో పూర్తిచేసిన వ్యాపారం— | రు. | **13,75,00,000** |
| 1949 లో అమలులో వున్న మొత్తం భీమా | రు. | **69,73,23,218** |

ఆంధ్ర జిల్లాలలో సొసైటీ ఏజెంట్లుగా పనిచేయదలచి సమర్థత గౌరవముగలవారు విజయవాడలోని సొసైటీ బ్రాంచి ఆఫీసుకు వ్రాయగోరెదము.

**హిందుస్తాన్ బిల్డింగ్సు,**
పో. బా. నెం. 12, బకింగ్ హాంపేట పోస్టు,

**ఐ. కె. రావు,** (బ్రాంచి మేనేజరు,)
**విజయవాడ.**

# యక్షగానము-తంజావూరు





శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

౧

యక్షగానము గడు ప్రాచీనమైన దృశ్యప్రబంధ విశేషము. ఇది దక్షిణదేశమున నుత్పత్తిగాంచి పెంపొందినది. తమిళాంధ్ర కర్ణాటక భాషల కిది సామాన్యమైనది. దీనిని దేశమున వీధి భాగవత మనియు భాగవతమనియు జెప్పుదురు. భాగవతులను పేరు యక్షగాన ప్రదర్శకులకు రూఢియైనది. అనాదినుండియు నాంధ్రదేశమున యక్షగానము ప్రబలుచువచ్చినను దాని యుత్పత్త్యభ్యుదయములను గాని లక్షణములనుగాని వివరించు ప్రాచీనగ్రంథము లెవ్వియు లేవు. ఇది కేవల పామరజన వినోదార్థ విరచితమని యెంచి మన పూర్వికులు దాని నాదరింపకపోయిరి; అప్పకవి యొకడు దప్ప తక్కిన లక్షణ గ్రంథకర్త లెవ్వగును స్మరింపకపోయిరి. ఇటీవల యక్షగాన మంతరించుచుండునపుడు దానియందు మనవారి కభిరుచికలిగి దాని పూర్వచరిత్రను విచారింప నారంభించిరి. దాని యుత్పత్త్యభ్యుదయములనుగూర్చిన పరిశోధనలు సాగుచున్నవి. యక్షగానచరిత్రను పరిశీలించిన పరిశోధకులలో కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రులవా రగ్రగణ్యులు. సుగ్రీవ విజయ పీఠికయందు యక్షగానోత్పత్తిక్రమమును వీరు ఇట్లు వివరించి యున్నారు.

"తొలుత ద్రావిడ భాషలలో వెలసిన దృశ్యరచనములు కురవంజు లనబడునవి. ఆంధ్రకర్ణాట ద్రవిడదేశముల యరణ్యములలో నివసించు నాటవికులు, చెంచులు, కుఱవలు, (కోవ, కోయ) అనువారు. అందు కుఱవజాతివారి యంజె=అడుగు (నృత్యవిశేషము) కురవంజె యనబడెను. చిందు, గంతు, గొండ్లి, అంజె, అంగ-ఇత్యాదులు నృత్యవిశేషములు. ఆంధ్రదేశమున బహుకాలమునుండి శివక్షేత్రములగు శ్రీశైలము, ఇంద్రకీలనగము (బెజవాడ కొండ) మొదలగు పర్వతములమీదను, నృసింహక్షేత్రములగు వేదాద్రులు (పెక్కులున్నవి......) మొదలగు పర్వతములమీదను వర్షోత్సవములు (యాత్రలు, జాత్రలు, జాతరలు) జరుగునప్పు డక్కడికి నాగరకప్రజలు చేరుచుండువారు. వారి వినోదమునకై యక్కడి యాటవికులు, రాత్రులందు నృత్యవిశేషములను నెఱపి ధనార్జనము చేయుచుండువారు. అక్కడక్కడి కొరవ జాతులవారు చేయు నృత్యములు కొరవంజు లనబడెను. కొరవంజె యనుపేరు తొలుత వారి నృత్యమునకును, పిదప నృత్యవిశిష్టమైన వారి చిన్ని చిన్ని గేయరచనలకును, నాపై కురవజాతివారికిని, గూడ పేరైనది. కురవజాతివారు తొలుత చేయు నృత్యవిశేషము కాలక్రమమున నాయా పర్వతప్రదేశముల స్థలమాహాత్మ్యకథలతోను, శివవిష్ణు లీలా కథలతోను మిళితములై గేయ విశిష్టనాట్యరూపముల బడసెను... ఇట్లు వెలసిన యా గేయరచనములు తొలుత నత్యల్పముగా గేయభాగములును విశేషము నృత్యముగలవై యుండెను......ఎంతో కాల మిట్లు కొండపట్టులందు సాగుచు బెంపొందిన గేయ నృత్య సందర్భములు నగరములకు గూడ క్రమముగా వ్యాపించినవి. చెంచులు కురవలు...ఆటవిక వస్తువులను నగరములకు గొనివచ్చి అమ్ముచు నప్పుడప్పుడు తమ గేయ నృత్యవిశేషములను నగరములందును, పల్లెలందును బ్రయోగించుటచే నవి నాగరిక దేశములందును వ్యాపించెను.

"ఇట్లు నగరములందు నభిరుచిగొల్పిన యా గేయ విశిష్ట నృత్యదృశ్యములు జక్కులవారు (యక్షులు, కళావంతులు) తర్వాతి నగరములందును బ్రయోగింపజొచ్చిరి. వీరి ప్రయోగములందు దృశ్యమయిన నృత్యాభినయములతో పాటుగా నధికముగా గేయ వచనరూపమైన శ్రవ్యరచనముగూడ జేరెను...రాజసభలలో దేవోత్సవములలో, ఊరిజాత్రలలో, యక్షగంధర్వాది వేషముల ధరించి వేశ్యలు ప్రదర్శించునవి గావునను, నృత్యధర్మములకంటె గేయధర్మ లధికముగా గలవి కావునను నివి యక్షగానము లనబడెను."[1]

ఇట్లు ప్రభాకర శాస్త్రులవారు యక్షగానోత్పత్తి విషయమై యలతి పునాదులపై తమ ప్రతిభాచాతుర్యమువలన నొక మహా సౌధమును నిర్మించినారు; కాని కట్టడముయొక్క భారమును తాళగల శక్తి వానికి లేదు. ప్రభాకరశాస్త్రులవారి వాదమునకు 'కురవంజె' మూలబంధము వంటిది; కాని యది చక్కగా పొదుకొనియుండలేదు. వాస్తవముగ శబ్ద స్వరూపము 'కురవంజి' కాని 'కురవంజె' కాదు—ఇది అరవమాట—'కురవంజి' యనగా కురవజాతికిజెందిన స్త్రీ యని యర్థము. పదునేడవ శతాబ్దమునకు ముందు ఇది యాంధ్రభాషయం దుండె ననుట కాధారము లేదు. దీనికి సరియైన తెనుగుమాట ఎఱుకతె. ద్రావిడదేశమునుండి బయలువెడలిన యాంధ్రవాఙ్మయమూలమున నిది మనభాషలోనికి ప్రవేశించినది. తమవాదమున కొక పొదును గల్పించి, దానిని స్థిరముగ నెలకొల్పుటకొఱకు ప్రభాకర శాస్త్రులవారు 'అంజి' ని 'అంజె'గా మార్చినారు. ఈ మార్పు అంగీకరింపదగినది కాదు. కురవంజినుండి యక్షగాన ముత్పత్తియైనదని తలచుట కర్వాచీన యక్ష

1. సుగ్రీవ విజయ, పీఠిక. పుటలు ౬-7.

గానములయందు ఎఱుకతెలకు గొంత ప్రాధాన్యము గల్గుటయు దక్షిణాలమున కురవంజి లేక యెఱుకల కురవంజియను నొక తరగతి యక్షగానములు విరచింపబడుటయు ముఖ్య కారణములు. తంజావూరు యక్షగానకర్తలు హాస్యముకొరకు నీ కురవంజులను మొట్టమొదట దమ నాటకముల బ్రవేశపెట్టిరి. ఇది ప్రేక్షకులకు మిక్కిలియు వినోదకరముగుటవలన తరువాతి యక్షగాన రచయితలందరును వారి మార్గము ననుసరించిరి. కేవలము కురవంజుల రచనకు నిదియే కారణము. ఆంధ్రవాఙ్మయసూచికయందు ఆంధ్ర సాహిత్యపరిషత్పుస్తక భాండాగారపట్టికలో యక్షగానములను వివరించుచోట కొరవంజిని గూర్చి యిట్లు చెప్పియున్నది:— 'కొరవంజి అను పాత్ర ప్రవేశముగల యక్షగాన రచనకు కొరవంజి అని పేరు.'[2] ఇదియే వాస్తవముగ కురవంజిరీతియని తోచుచున్నది. ఎలనగా, గిరిరాజకృతమైన రాజమోహన కొరవంజి యొక్క ఇతివృత్తము ఇట్లు వివరింపబడియున్నది.

"శ్రీ సుతతుల్యుడై చెలువొందునట్టి
భోసలకుల శాహభూపాలు మీద
నెన్నగా మోహిత చిత్తయై రాజ
కన్యకామణి సరికాంతలు గొలువ
గరిమతో డుత మును గదలివచ్చుటయు
విరహభరంబుచే వెతలు జెందుటయు
ఎఱుకతె వచ్చి తా నెఱుక జెప్పుటయు
సుఱుతుగా శాహేంద్రు గూడియుండుటయు
ననియెడి రాజమోహన కొరవంజి
పరివడి శాహేంద్రుపై నంకితముగ
ఘనతతో గిరిరాజకవి రచియించె
జనులెల్ల మేలని సంతసిల్లగను." [3]

ఇందువలన ఎఱుకతె పాత్రప్రవేశముగల యక్షగానములనే కొరవంజులని పేర్కొనుచుండిరని తెల్లమగుచున్నది. కావున కొరవంజినుండి యక్షగాన ముత్పత్తియాయెనని చెప్పుట సరికాదు.

మఱి యక్షగాన మెట్లుత్పత్తియై యుండునో విచారింతము. ఇది కేవలము ప్రజలను వినోదపెట్టుట కేర్పడినది కాదు. మత ప్రచారమునకును మన పూర్వులు అవలంబించిన మార్గములలో మన పురాణేతిహాసాదులలోని కథలను జనసామాన్యమునకు గన్నుల గట్టినట్లు ప్రత్యక్షముగ బ్రదర్శించి చూపువారు. బౌద్ధమత ప్రచారమునకు అశోకచక్రవర్తి యీ మార్గము ననుసరించినట్లు—

'కాని, యిప్పుడు దేవానాం ప్రియ ప్రియదర్శి ధర్మాచరణమువల్ల, విమానములను చూపించుట, ఏనుగులు, అగ్నిస్కంధములు, ఇతర దివ్య విగ్రహములు, వీనిని ప్రదర్శించుట (ఆ సమయములందు) ధర్మఘోషము భేరీఘోషముమూలమున చేయబడుచున్నది.'

అను నాతని నాగిర్నారువ శిలాశాసనములోని వాక్యములవలన విదితమగుచున్నది[4]. మతప్రచారమునకు మిక్కిలియు ననుకూలమైన సమయములు యాత్రలు. యాత్రలనగా దేవతాయతనములందు నడచెడి వర్షోత్సవాదులు. వీనిని జాత్రలనియు తిరునాళ్లనియు గూడ చెప్పెదరు. ఆ సమయమందచటగూడిన జనులను వినోదపెట్టుచు వారిని ధర్మబోధన జేయుటకై పై జెప్పిన ప్రదర్శనము లేర్పడెనని. ఇవి యాద్యమున కొయ్యబొమ్మలయాటలుగను తోలుబొమ్మలయాటలుగను సాగెడివి. మన కొయ్యబొమ్మలాటకును తోలుబొమ్మలాటకును జన్మస్థానమిదియే. శ్రీశైలమున శివరాత్రి మహోత్సవ సందర్భమున నిట్టి బొమ్మలాటలాడెడువారని పాల్కురికి సోమనాథుడు వచించియున్నాడు.

"భారతాది కథలు చీరమఱుగుల
నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతంబుగ గంధ సూత్రంబు
లేపారంగ బొమ్మల నాడించువారు."[5]

ఇందు మొదటిది తోలుబొమ్మలాట; రెండవది కొయ్యబొమ్మలాట. వీనినుండియే మన యక్షగానము పరిణామముందినది. ఆరంభదశయందది కేవల మూకనాట్యముగ ప్రవర్తిల్లినది. గేయరూపమైన గాథను గాయకులు పాడుచుండ తదనుగుణముగ నర్తకులు అభినయము జేయుచు నర్తించువారు. కేరళ దేశమున నేటికిని ప్రచారమందున్న కథకళి దీనికి తార్కాణము. కథకళి యను సంస్కృతి విశిష్టతను సూచించు చిహ్నమని మలయాళ జనులు మురియుదురు. కావచ్చును; కాని యది పెక్కు నాగరక సంఘములందు నేటికిని ప్రబలియుండు కొన్ని ప్రాచీన సాంఘిక మర్యాదలవలె పురోవృద్ధినందక ప్రథమ దశయందే యట్టే నిలిచిపోయిన పూర్వరూపముగ కళా విశిష్టమనుటకు సందియము లేదు. దక్షిణాపథమందన్యప్రదేశములందు దేశీయసంస్కృతితోపాటుగా వృద్ధి నందెనను, మలయాళదేశమందు మాత్రము చారిత్రకాది కారణములవలన పెంపొందక యుండగనె ముదురుబారినది. అంతియె.

మూకనాట్యములో నర్తకులు చిరకాలము తృప్తినంది యుండలేదు. సూత్రధారుల యిచ్చవచ్చిన నాడు దాగ చర్మకృత్రిమ ప్రతిమలవలె గాయకుల పాట ననుసరించి యభినయము సల్పుచు నటించుట వారికి నచ్చలేదు. పాటను తామే పాడుచు దానికి సరిగ నాడుట మేలని వారికి దోచినది. కావున రెండు కార్యములను వారే నిర్వహింప గడంగిరి. మూకనాట్య మంతట యక్షగానముగ మారినది.

## యక్షగాన మన నేమి?

ఈ మాట శబ్దరత్నాకరమందు లేదు; కిట్టెలు దొర కన్నడాంగ్ల నిఘంటువునందు 'యక్షగాన' అను మాటకు '*A kind of*

2. ఆం. వా. సూ. ఆముద్రిత గ్రంథముల పట్టిక, పుట 8. అకారాదిక.

3. *A Descriptive Catalogue of Telugu Manuscripts in T. M. S. S. M Library, P. 205.*

4. డా. చిలుకూరి నారాయణరావుగారి అనువాదము— చూ. అశోకుని ధర్మశాసనములు. పుట. 7.

5. పండితారాధ్యచరిత్రము. పర్వత ప్రకరణము.

*popular dramatic composition*' అని యర్థము వ్రాసి యున్నాడు.

ఆంధ్రదేశమున నేటికిని గానవచ్చు జక్కులు (యక్షులు) అను జాతివారీ తరగతి నాటకములను బ్రదర్శించి ప్రఖ్యాతికి దెచ్చుటవలన వీని కాపేరు వచ్చిన దని కొందఱు చెప్పుదురు; కాని శ్రీ. శ్రీ. వేటూరు ప్రభాకరశాస్త్రిలవారు చెప్పినట్లు యక్షగాన ప్రదర్శనమే జీవనోపాయముగ జేసికొని తమ్మాలమున జీవయాత్ర గడుపుటవలన కళావంతులలో నొక తెగవారికి జక్కులువా రను నామము వచ్చినది.[6] అంతియ. యక్షగాన మన యక్షులు చేయు గాన మని యర్థము. యక్షు లెవ్వరు? యక్షులు దేవయోనులలో నొక రని నామలింగానుశాసనము దెలుపుచున్నది. వీరి రాజు కుబేరుడు; ఇతనికి వైశ్రవణు డనియు పేరు. అష్టదిక్పాలకులలో నితడొక్కడు. ఉత్తర దిక్కున కధిపతి. యక్షుల వృత్తాంతము మన పురాణేతిహాసములందును బౌద్ధమత గ్రంథములందును విస్తారముగ వర్ణింపబడియున్నది. ఆటపాటలయందు వారి కత్యంత ప్రీతి. కావున యక్షులకు యక్షగానముతో నేదియో సంబంధ ముండి యుండవలయును. దేవయోనులలో బరిగణింపబడినను వారు కేవలము మిథ్యాప్రపంచమునకు జెందినవారు కారు. నాగరాక్షస పిశాచాదులవలె వారును మనుష్యజాతికి జెందినవారై యుందురు. బౌద్ధయుగమున యక్షులు వ్యాప్తినందిరి. బుద్ధుని శిష్యకోటిలో యక్షులు గొందరున్నట్లు బౌద్ధగ్రంథములందు కలదు. వారి గానమే మన యక్షగానమునకు బీజప్రాయమై యుండిన నుండవచ్చును. యక్షగానములు దేశినాటకము లని వాఙ్మయవిమర్శకులు చెప్పుదురు. దేశి యనగా దేశమునకు సంబంధించిన దని యర్థము. భాష కావచ్చును, కవిత్వము గావచ్చును. సంగీతనాట్యాదులం దెద్దియైనను గావచ్చును. యక్షగానము దేశినాటక మనగా నది సంస్కృత ప్రాకృతములకంటె భిన్నమైనదనియు దేశమున గ్రొత్తగ బ్రభవించిన రచనావిశేష మనియు నభిప్రాయము. కాని యక్షగాన మిట్టి కేవల దేశిరచన కాదని యనుకొనుటకు గొంత యవకాశము గలదు. ప్రాచీన యక్షగానము లందు ప్రధానముగ గానవచ్చు ఛందస్సు ద్విపద. ప్రారంభదశయం దది సంపూర్ణముగ ద్విపదరచనయై యుండిన నుండవచ్చును. మనవా రనుకొనునట్లు ద్విపద దేశి ఛందస్సు కాదు, అది ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొన్నది. ద్విపద యన రెండు పాదముల ఋక్కనియు, ప్రాకృత పద్యభేదమనియు సంస్కృత నిఘంటువులలో గలదు. మఱియు మహాకవి కాళిదాసుడు విక్రమోర్వశీయము చతుర్థాఙ్క ప్రారంభమున,

['తతః ప్రవిశతి సహజన్యా చిత్రలేఖా చ']

'చిత్రలేఖా :—(ప్రవేశానన్తరం ద్విపదికయా దిశోఽవలోక్య)'

దీనిగూర్చి వ్యాఖ్యాత ఇట్లు వివరణము వ్రాయుచున్నాడు,

ద్విపదికయా దిశోఽవలోక్యేతి। ద్విపదికాఖ్యగీతి విశేషేణ దిగవలోకనం విధా యాగ్రిమాం గాథాం పఠతీత్యర్థః। దిశోఽవలోక్య ద్విపదికాఖ్యగీత్యా పఠతీత్యర్థేవా। ఇందువలన కాళిదాసుడు 'ద్విపదిక' యను గీతము నీ సందర్భమున వాడుకొనెననుట తెల్లము. ఈ ద్విపదిక లక్షణమును వ్యాఖ్యాత ఇట్లు వివరించి యున్నాడు.

తల్లక్షణం చాహ భగవాన్ భరతమునిః—
"శుద్ధా ఖణ్డా చ మాత్రా చ సంపూర్ణేతి చతుర్విధా
ద్విపదీకరణాఖ్యేన తాలేన పరిగీయతే."
పాదే యః పఞ్చభాగోఽన్తే (?) న జో షష్ఠ ద్వితీయకౌ
చతుర్భిరీదృశైః పాదైః శుద్ధాద్విపదికోచ్యతే.
అర్ధాన్తేఽన్యేస్వరానాహుః ఖణ్డాస్యాచ్ఛుద్ధయార్ధయా
షష్ఠేనైకేన గురుణా మాత్రాద్విపదికామతా.
జ్ఞేయాశుద్ధేవ సంపూర్ణా గురుణాన్తేఽధికేనతు.'[7]

పై జెప్పిన ద్విపదికయే మన ద్విపదయైనది. మఱియు యక్షగానమందలి నృత్యగీతములు భరతుని నాట్య శాస్త్రము ననుసరించునవియకాని భిన్నములుగావు. సంస్కృత నాటకములను గూడ నాటపాటలతోడను, నభినయముతోడను బ్రదర్శించువారని భరతుని నాట్యశాస్త్రమువలన దెలియవచ్చుచున్నదనియు, నట్టి నాటకములకు కాళిదాసుని విక్రమోర్వశిలో చతుర్థాంకము ఖిలముగాక మనయదృష్టవశమున నిలచియుండు ఉదాహరణమనియు డాక్టరు. వి. రాఘవన్ గారు తమ 'యక్షగానము' అను త్రివేణి త్రైమాసికలోని వ్యాసమందు వక్కాణించియున్నారు. ఈ విషయములన్నిటిని సమకూర్చి చూడగా యక్షగానము కేవలము దేశిరచన కాదనియు నది సంస్కృత ప్రాకృతములనుండి మనవారు గ్రహించి పెంపొందించిన దృశ్యప్రబంధ విశేషమనియు దోచుచున్నది.

## 2

## యక్షగాన వాఙ్మయము

యక్షగాన వాఙ్మయము నాటకము రూపందుటకు పూర్వమె ప్రభవించియుండవలయును. అశోకుని శాసనములందు వర్ణింపబడిన 'విమానదర్శనా చ హస్తిదసణా చ అగిఖంధాని చ అఞ్ఞాని చ దివ్యాని రూపాని'ల ప్రదర్శనములకు ఇతి వృత్తమావశ్యకత లేకపోయినపోవచ్చును. ఇచటగూడా, ఇంచుకయైన గథాంశము లేక పైప్రదర్శనముల తెలుగు ప్రేక్షకులకు బోధయగుట దుష్కరము. ఇది మాయాదేవిగర్భమును ప్రవేశించిన బుద్ధుని హస్తిస్వరూపము; ఇవి బాలబుద్ధుని దర్శింప వరుదెంచిన దేవతల విమానములు; ఇవి ఫలాని ఫలాని దేవతల ప్రతిబింబములు ఇత్యాది. కథా సంవిధానము లేక బొమ్మల నాడించుట సుకరము గాదు; అట్టియాటలు సాధ్యమైనను చూపరులకు దుర్గ్రాహ్యములగుటచే నిరర్థకములగును. కేవల ప్రజల వినోదముకొఱకే కాక తన్మూలమున ధర్మోపదేశము సేయుటకొఱ కవి యేర్పడిన వగుటచేత నవి యట్టి కార్యమున కనుకూలములైన సుప్రసిద్ధగాథలపై నాధారపడి యుండెనని యెంచుట సరి; కావున ప్రదర్శకుల కాద్యము నుండియు గవుల తోడు గావలసివచ్చెను; కవుల యాగమనముతో ప్రారంభమైనది యక్షగాన వాఙ్మయము.

6. చూ. సు. వి. పీఠిక. పుటలు ౭-౮.

7: విక్రమోర్వశీ (బొంబాయి తుకారాం జావాజీ ముద్రణ. 1806 శకవర్షం) పుటలు 85-86.

దక్షిణ భారతమున గడు ప్రాచీనకాలమునుండి యక్షగానము వర్ధిల్లుచు వచ్చినది. క్రీ. శ. 8 వ శతాబ్దమందో ఇంచుక తిరువాతనో విరచితమైన 'సిలప్పదికార'మను తమిళ కావ్యమున నాటక నాటక ప్రదర్శనముల ప్రస్తావన కలదు. యక్షగానములను బోలి నృత్తగీత ప్రధానములైన యాటలని ప్రాచీన వ్యాఖ్యాతలయభిప్రాయము. ద్రావిడవాఙ్మయములలో నెల్లదమిళము ప్రాచీనతమమైనను అప్పటి నాటకములయం దొక్కటియైన మిగులక నష్టమై పోవుట వింత. ఆంధ్రదేశమున యక్షగానము కాకతీయ యుగమునందె జనాదరణకు పాత్రమాయెను. శ్రీశైలమందు శివరాత్రిమహోత్సవ సందర్భమున యక్షగాన ప్రదర్శనములు దేవోత్సవాదులలో సామాన్యముగ జరుగుచుండెడి వని పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రవలన దెలియవచ్చుచున్నది.

"ప్రమథపురాతన పటుచరిత్రముల
గ్రమమంద బహు నాటకము లాడువారు
*　　　*　　　*
విధమున బ్రచ్ఛన్న వేష ముల్దాల్చి
అధికోత్సవము దుల కాడు నట్లాను
శిరమున నురమున జెవులగంఠమున
గర్ణమున గూకట గాల్ల జెల్వార
గవదండలును గనుగవ గరణికలు
నవరంబులును గలశంబు దండలును
భసితంపు బూతపై బరగు బచ్చెనలు
నసలారు చిరుగజ్జియలు నందియలును
నవరత్నపంక్తుల జ పోసనములు
గర మొప్ప తొంగళ్లు గల చల్లడములు
బొల్చుదంతావళుల్ పుష్పమాలికలు
దాల్చి యత్యద్భుతోత్సవలీల దనర
జనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి
యనుకూల వివిధ వాద్యస మేళనమున
నార్భటంబిచ్చి యొయ్యన జవనికల
గర్భంబు వెడలి యక్కజము వర్తిల్ల
నాడకముందఱ నభినయంబొలయ
జూడకముందఱ జోద్యంబుదనర
నిక్కుచు ద్రిభంగి నిలచుచునట్లు
చొక్కుచు సభచూచి యొక్కింత నగుచు."8

ఈ ద్విపదలు నాటకములను బేర్కొనుటయే కాక వేష ధారణకు వలసిన పరికరములను, జవనికను నాటకప్రదర్శనము నీక్షింప సమకూడిన ప్రేక్షకుల సభను వర్ణింపుచున్నవి. మఱియు నప్పుడు మతసంబంధమైన నాటకములనే కాక సుప్రసిద్ధమనుష్యుల చరిత్రలనుగూడ నాటకములుగ బ్రదర్శించి చూపువారు. కాకతీయ ప్రతాపరుద్ర మహారాజుయొక్క ఉంపుడుకత్తెకు మాచల్దేవికి గౌరవము గలిగెనని వినుకొండవల్లభరాయకృత క్రీడాభిరామమున జెప్పియున్నది.

"తెన్నగాక కిరాట ! యీ లేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన."9

వల్లభరాయడు క్రీ. శ. 1378-1404 మధ్య విజయనగర సామ్రాజ్యమును పాలించిన ఇమ్మడి హరిహరరాయలకు సమకాలికుడు. అతడు రావిపాటి త్రిపురాంతకుడు రచించిన ప్రేమాభిరామమును గ్రీడాభిరామమను పేర దెనుగుచేసెను. కావున నతడు జెప్పిన మాచల్దేవీనాటకప్రదర్శనము ప్రతాపరుద్రుని కాలమున జరిగె ననుట నిశ్చయము.

క్రీ.శ. 14 వ శతాబ్దము తుదను 15 వ శతాబ్ద పూర్వార్ధమునను వర్ధిల్లిన శ్రీనాథకవి యక్షగాన నాటకములను గొనియాడియున్నాడు. భీమేశ్వరపురాణమునందు వేశ్యయొక్కతె ఈశాని వేషము ధరించి ద్రాక్షారామవీథులందు భిక్షాటన నాటక మాడినట్లు చెప్పియున్నాడు.

'సాని యీశానియై మహోత్సవమునందు
గేల నవ చంద్రకాంతంపు గిన్నెపూని
వీథి భిక్షాటన మొనర్చు వేళ జేయు
మరులు నృత్యంబు జగముల మరులు గొలుపు.'10

ఇచట వర్ణింపబడిన భిక్షాటననాటకము మూకనాటక మేమో యను సందియము గలుగుచున్నది. ఇది మూకనాటకమైనను గాక పోయినను శ్రీనాథుని కాలమున దేశమునందు ప్రజల కెల్లరయెడలను యక్షగానముపై నభిమానము హెచ్చెననియు, యక్షగాన ప్రదర్శకులు మేళములుగ గూడి దేశాటనము జేయుచు నాటకము లాడువారనియు బురుషులు స్త్రీ వేషములను ధరించి నటించువారనియు నతడు భాగోతుల బుచ్చిగాని కొసగిన యోగ్యతాపత్రము వలన దెల్లమగుచున్నది. ఇంతవఱకు యక్షగానప్రదర్శనములను గూర్చియు బ్రదర్శకుల గూర్చిన ప్రస్తావనయే గాని యక్షగాన గ్రంథములమాట మన వాఙ్మయమునం దెచ్చటను గానరాదు. ఇట్లవి స్మరింపబడకపోవుటకు గారణము వాని యభావము గాదు. విద్యావంతులకును గవులకును వానియెడ గలిగిన యౌదాసీన్యముచే నవి రూపుమాసిపోయినవి. క్రీ. శ. 16 వ శతాబ్దారంభంతో మన యక్షగానచరిత్రయం దొక నూతనదశ యుపక్రమించినది. సుప్రసిద్ధులైన కవులు యక్షగానముల రచనకు బూనికొనిరి; రాజులు వారల సత్కరించి ప్రోత్సహింపదొడగిరి. క్రీ. శ. 1506 మొదలు 1509 వఱకును విజయనగర సామ్రాజ్యమును బాలించిన వీరనరసింహరాయలు యక్షగాన రచయితలను బ్రదర్శకులను జాల గౌరవించువాడు. అష్టభాషా కవివర్యుడై పొగడ్తనొంది ద్విపద నారసింహపురాణమును వచన భారతాదిగ్రంథములను రచించిన ప్రోలుగంటి చెన్నకవి సౌభరిచరితను జక్కుల కథగ వ్రాసెను. జక్కులకథ యన యక్షగానమే. వీరనరసింగరాయ లతని కొక యగ్రహార మొసగి సత్కరించెను11. ఇందువలన వీరనరసింగరాయల కాలమునకె జక్కులవారు యక్షగానప్రదర్శనములవలన బ్రఖ్యాతి గడించిరని తెల్లమగుచున్నది. యక్షగాన ప్రదర్శనముల మాట

8. పండి. పర్వ (ఆం. గ్రం. మా. 30) పుటలు 486-7
9. క్రీ. రా (గ్రంటివారి ముద్రణ) పుట 56.
10. భీమే. అ 1 : 105.
11. నార. పురా. 1 : 88.

మున కీర్తిగడించినవా రొక జక్కులవారు మాత్రముగాదు. కూచిపూడి బ్రాహ్మణులును భాగవత మేళమును తయారుచేసి వర్షవర్షమును రాయరాజ్యమున సంచరించు గ్రామములందును పట్టణములందును నాటకముల నాడువారు. వీరినిగూర్చిన యైతిహ్య మొకటి స్థానిక చరిత్రలందు నిక్షిప్తమై యున్నది.

"ఆలాగంటె దినములలో వినుకొండ బెల్లంకొండ సత్తెనపల్లె కూంచిపూండి అనే గ్రామంనుంచి బ్రాహ్మణులు భాగవతుల వేషధారులు కీర్తన నిమిత్తమై యీ స్థళమునకు వచ్చివుండి సంబెట గురవరాజుయొక్క దారుణప్రభుత్వం చూచి యిక్కడనుంచి లేచిపోయి విద్యానగరమునకు పోయి అక్కడ వీరనరసింహరాయలు రాజ్యపరిపాలనం చేస్తూవుండగా భాగవతులు దర్శనంఅయి కేళిక అడుగగా శలవు యిచ్చినారు. కూచిపూడి మేళం వాండ్లు బహు విద్యావంతులని ప్రసిద్ధిగా వినుకడి వున్నందున రాయలవారు స్త్రీలు సహా చూడవలెనని నగర్లవద్ద దివాణములో కీర్తనకు శలవు యిచ్చినారు. అక్కడ కీర్తన వినికిచేసేటప్పుడు సంబెట గురవరాజు వేషం వేసుకొని వొకడు, యిద్దరు బంట్రౌతుల వేషం వేసుకొని, వొకడు స్త్రీవేషం వేసుకొని, సంబెట గురవరాజువలెనే ఆ వేషగాడు కూర్చుండి, రాయల సమక్షమందు ఆ స్త్రీయొక్క స్తనాలకు చిరుతలు పట్టించి సొమ్ము తహశీలుచేసినట్టు వినికిచేసినారు.

'అప్పుడు రాయలవారు చూచి 'అదియేమ'ని అడుగగా ముఖస్తులైనవారు భాగవతులముఖతా ఆ వర్తమానమును తెలిసి 'శిద్ధవటంశీమలో సంబెట గురవరాజు అనే ఆయన ప్రజలవద్దనుంచి ద్రవ్యాకర్షణ చేసేయెడల స్త్రీలను తీసుకపోయి యీ ప్రకారముగానే తహశీలు చేస్తున్నారు; గనుక యేలినవారికి తేటపడేటందుకై యీ ప్రకారం వేషములుకట్టి వినికిచేసినారు' అని విన్నపంశాయగా...1 "

కృష్ణరాయల కాలమునను ఇట్లే భాగవత మేళములు రాయరాజ్యమున సంచరించుచు యక్షగానములను బ్రదర్శించుచుండినవి. కర్నూలుజిల్లా చెఱువు బెళగల్లు గ్రామమున క్రీ. శ. 1514 నాటి యొక శిలాశాసనమునందు 'తాయికొండనాటక'ప్రదర్శనమున పేరు పొందిన చేగయ్యపుత్రుడు నట్టువ నాగయ్యకును 'పాత్రి'గ నటించిన పోతవరగ్రామవాస్తవ్యుడు నట్టువ తిమ్మయ్యకుమార్తెకును నాయూరికరణము తిరుపత్తూరు సోమరసుకుమారుడు బసవరసు కొంత భూమిని దానముజేసినట్లు చెప్పియున్నది.13 తాయికొండ యనునది కర్నూలు మండలములో నొక క్షేత్రమైయుండవలయును. అచటి దేవుని మాహాత్మ్యమును బ్రకటింపబడిన నాటకమునకు 'దాయికొండ నాటక'మని పేరు. ఈ నాటకమాడిన ప్రదర్శకులా ప్రాంతములవారే; కాని వారు కూచిపూడి మేళములో జేరినవారు కారు. వారిది రాయలసీమకు జెందిన మఱియొక మేళమైయుండును.

పదునాఱవ శతాబ్దమున రాయసామ్రాజ్య ప్రజలకు నాటక ప్రదర్శనములం దభిరుచి హెచ్చెనని యప్పటి వాఙ్మయమువలన దెలియవచ్చుచున్నది. సుప్రసిద్ధులైన కవులు యక్షగానరచనకు గడగిరి. కందుకూరు రుద్రకవి సుగ్రీవ విజయమను జక్కిని యక్షగాన ప్రబంధమును రచించి యాయూర నెలకొనియుండు జనార్దన దేవుని కంకిత మిచ్చెను. ఆదేవుని వసంతోత్సవ సమయమునం దా నాటకము బ్రథమమున బ్రదర్శింపబడియుండుటకు సందియము లేదు. మఱియు నా శతాబ్దోత్తరార్ధమున కర్నూలుమండలమందు వెలసిన పింగళి సూరన దన ప్రభావతీ ప్రద్యుమ్నమున గంగావతార మను నాటకము నొకదానిని బేర్కొనియున్నాడు. అది యప్పుడా ప్రాంతమున వాస్తవముగ బ్రయోగమందుండిన నాటకముయొక్క పేరో లేక కవికల్పనయో నిశ్చయించి చెప్పుటకు వీలు లేదు. ఇది వాస్తవ నాటకమైనను మిథ్యయైనను దత్ప్రదర్శనమునుగూర్చి చెప్పిన యంశముల నన్నిటిని సూరన స్వానుభవమునుండి సంగ్రహించెనని తోచుచున్నది. నాటకప్రదర్శకుల మేళ మొకటి యందు పేర్కొనబడినది. అది పెక్కండ్రు మేళగాండ్ర కూటము. వారి సంఖ్య తెలియదు. వారిలో సూత్రధార విదూషక పారిపార్శ్వకులును ఖ్యాలు; వైణిక వైణవికమౌరజకమార్దంగి కతాళధార గాయక వార సీమంతినీ వ్రాతమువారికి దోడు. వీరు దేశసంచారము సెపిలి గ్రామములందును పట్టణములందును విడిసి నాటకముల బ్రదర్శించువారు. యజ్ఞాది సమయములందు నాటకము లాడుటయు గలదు. మేళమునకు ద్భుమనిసి—సూత్రధారుడు కావచ్చును—మాపరుల మున్నగువారిని పొగడి వారినుండివస్త్రాభరణాదులను బడయువాడు. ప్రదర్శకులు వేషము వేయునపుడు ధరించు సొమ్ములు నాలకములు. నాటకప్రదర్శన మిట్లు వర్ణింపబడినది : సూత్రధారుని ప్రవేశము. పూర్వరంగ ప్రస్తావన.

"వ. అప్పుడు.

"శా. గాంధార ప్రముఖస్వర శ్రుతికళా గంభీరవారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతనిక్వాణంబు వంశాదిసం
బంధిస్వాన పరంపరా మహిమయుక్ మద్దెళ్లదిందంధిమిం
ధింధోం ధిక్కిధిమిక్కి శబ్దభరముక్ దీపింప నా ఘూర్ణతన్.

"సరవి జంచత్పుట చాపపుటోద్ఘట్ట
షట్పితాపుత్త్రిక సంజ్ఞలమర
వెలయుచుండెడు సమవిషమతాళ
ప్రవృత్తులు నాల్గు ప్రస్తారకలనవలన
గలుగు నానాతాళములు యథోక్తస్ఫూర్తి
బరగు నేలాది ప్రబంధచయము
దత్తదర్థస్థాన దత్తపటాక్షర
బిరుదాదికొంగ విస్ఫురణదనర
క్షితి జతుర్దశ ముద్రిక గీత భేద
ములు దురాసములంద్రు వర్తిల నవియును
నిఖిలకళలును గల రాక్మిణేయు శిక్ష
వలన దన్నాట్యకర్మప్రవర్తనమున."

"అ వనజాక్షునందనుడు నంతట నాంది దగంబఠించియుం పావహిలంబ్రరోచనయు నా ముఖమును దనరారనొప్ప బ్రస్తావనతో ముఖాదులగు సంధులు సొంగతె బెంపుమీఱ గంగావతరాది నాటకము లాడెన నేకము లద్భుతంబుగన్."

12. గో. రికా. సం 66, పుట 66 తరువాయి.

13. *ARE*.558 *of* 1915.

"ఆ నాటకప్రయోగావసరముల
  భగీరథాద్యాకార ధారణయును
గంగాదినిమ్నగాగతియు శైలాసాది
  నగ కల్పనమును నానావన ప్ర
పంచనంబును పసుపక్షి మృగాదిజం
  తువిశేష రూపవృత్తులును మఱియు
నెచటి కెయ్యది యోగ్య మచట దత్తద్వస్తు
  సృష్టి సన్నిదము వేసియును గృతక
మగుట నిశ్చయింపగ లేక యబ్రపడుచు,
జూచి సామాజికులు దమ సొమ్ములెల్ల
నొసగులుగనైవ నడుపుచు నొప్పమీఱె
రుక్మిణి సుతుండు మాయానిరూఢి మెఱసి."

వ. ఇవ్విధంబున నాత్మీయ దివ్యమాయాప్రపంచసముదంచిత నాట్యవంచితులం గావించి నక్తంచరుల ఘనసంచయంబు నూచముట్టుగా దోచుకొనుచుం జూచు ఖేచరులకు వేడ్క బుట్టించె"14.

ఈ వర్ణన 16 వ శతాబ్దమున నాటక ప్రదర్శనములందు వాడుకయందుండిన రంగస్థల రచనావిధానమును, తదుచిత వస్తు సామగ్రియును ప్రదర్శన ప్రకారమును విదితము సేయుచున్నది. కాని సూత్రధార విదూషక పారిపార్శ్వకాదులును పూర్వరంగ నాంది ప్రస్తావనలును నూరక వర్ణించినది సంస్కృత నాటక ప్రదర్శనముగాని యక్షగానప్రదర్శనము గాదని తెల్పుచున్నవి. కాని ఏలాది ప్రబంధచయమునకు సంస్కృత నాటకములందు తావు లేదు; కావున నాటకప్రదర్శనమును మఱియు నధితరముగ హృదయంగమము గావించుటకొఱకు సూత్రధారుడు యక్షగాన ప్రదర్శన పద్ధతుల గొన్నిటి నవలంబించెనని తోచుచున్నది.

క్రీ. శ. 17 వ శతాబ్దమున రాయసామ్రాజ్యము విచ్ఛిన్నము గాజొచ్చినది; కాని వాఙ్మయము మాత్రము దామరతంపరగ నభివృద్ధి నందినది. ఈ యభివృద్ధికి ప్రధాన కారణము సామంత విజృంభణ. రాయల యధికారము క్షీణించుకొలదియు సామంతుల యధికారము పెచ్చు పెరిగినది. పేరుగల దుర్గములన్నియు సామంత రాజ్యములకు ప్రధానస్థలము లాయెను. సామంత విజృంభణవలన రాజకీయరంగమున దేశమునకు జెప్పరాని కీడు వాటిల్లినది. ఐక్యత చెడినది; బహునాయకత్వమువలన అంతఃకలహములు చెలరేగినవి; తురకల ప్రవేశమున కవకాశము గలిగినది. కాని సారస్వతదృష్టి జూచిన నందుమూలమున జాల మేలు చేకూరెనని చెప్పక తప్పదు. ప్రతిసామంతుడును దానె రాయలని యెంచెను. రాయల యాస్థానమును మేలుబంతిగ గొని, సామంతులెల్లదమ యాస్థానములదిద్ది తీర్చుకొనిరి; రాయల నగరి మర్యాదలను స్వీకరించిరి; దెబ్బదిరెండు నియోగములను గూర్చుకొనిరి, కవి విద్వజ్జనపోషకులైరి. సామంత రాజు లందఱును—ముఖ్యముగ ద్రావిడదేశమును పాలించుచుండిన యాంధ్రనాయక రాజులు—రాయలను బోలి భాషాపోషణ మొనర్చుట దమ ముఖ్యకర్తవ్యమని తలచిరి. మైసూరు దొరలు కర్ణాటకపులయ్యును దక్షిణ రాయసామంతుల మార్గము ననుసరించి తెనుగు భాషకు ప్రాధాన్యతనిచ్చి పెంపొందించిరి. మైసూరు నెంకి నాయకుల యాశ్రయమున వచనకావ్య మభివృద్ధి నందెను. దొడ్డ దేవరాయల సేనాధిపతి కళలె వీరరాజు భారతమును, శైవభక్త చరిత్రను వచనముగ వ్రాసెను. చెంజి నాయకుల కొలువున సేనాపతి యైన తుపాకుల కృష్ణప్పనాయని కుమారుడు అనంతభూపాలుడు పెక్కు పురాణములను వచనప్రబంధములుగ విరచించెను. మధుర ఆంధ్రనాయక రాజ్యమునకు పాలకురాలై కళలను పెంపొందించి ధర్మమహారాజ్ఞియని కీర్తి గడించిన మంగమ్మ ఈ తుపాకులవారింటి యాడబడుచే. గాంధర్వ నాట్యవిద్యలయం దామెకుగల యభిమానము సారస్వతమున లేకపోవుటచే నామె కవులను గౌరవించి ప్రోత్సహింపలేదు; కాని యాంధ్రవాఙ్మయమున నామెకు స్థానము లేకపోలేదు. ఏ కారణమువలననో చిన సంగన్న యను కవితోసమున కామె సఖియైనది. రెండు గ్రంథములకు నాయకురాలైనది. అందు మధుర మంగా పుంశ్చలీవిలాసమను వచనగ్రంథము ముఖ్యమైనది. చంద్రరేఖావిలాసాది బూతుకావ్యముల తరగతికి జెందినది. అది యప్పటి వ్యావహారికభాషయందు విరచింపబడెను. ఆంధ్రమునగల బూతుల వాఙ్మయములో నిది యగ్రస్థాన మలంకరింపదగిన గ్రంథము. కాని చరిత్రకారుని కిది యమూల్యమైన యుపకరణము. అప్పటి రాజకీయార్థిక సాంఘిక పరిస్థితులనుగూర్చి మఱియెందును గానరాని విశేషము లిందు వ్యక్తమైయున్నవి. మంగమ్మ పేర చిన సంగన్న యొక దండకమునుగూడ రచియించెను; యొకటి తాళపత్రప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దున్నను, చీమ తల లంతటి యక్షరములతో వ్రాయబడియుండుటచే దాని బరిశోధించి చూచుటకు శక్యముగాక యున్నది. మంగమ్మ తరువాతి మధుర నాయకులు కొందఱు శృంగార కావ్యములను వ్రాయించి కృతి గొనిరి. ముద్దళగిరి స్వయముగ గ్రంథకర్త. తారాశశాంకమును జెప్పిన శేషము వేంకటపతియు నహల్యాసంక్రందనాది కావ్యములను జైమినిభారత వచనమును విరచించిన సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడును, మధుర యాస్థానమున వెలసినవారే.

వాఙ్మయపోషణయందేమి గ్రంథరచనయందేమి యొక్క దక్షిణాంధ్ర నాయకరాజుల నేకాక ఆంధ్రదేశ విద్వత్ప్రభువులనెల్ల నతిశయించినవారు తంజాపురాంధ్ర నృపాలురు. వీరిలో రఘునాథ విజయరాఘవులు ముఖ్యులు. ఇద్దఱును విద్వాంసులు, కవులు. కవుల నాదరించినవారిచే గావ్య నాటకాదులను వ్రాయించుటయే గాక స్వయముగ నుత్తమ గ్రంథరచన గావించిరి. మఱియొక విశేష మేమన వీరిచే నాదరింపబడి గ్రంథరచన గావించినవారిలో స్త్రీలు పెక్కండ్రు గలరు. మధురవాణియు రామభద్రాంబయు రఘునాథుని యాస్థానము నలంకరించిరి; రంగాజియు కృష్ణాజియు విజయరాఘవుని సభకు భూషణప్రాయులై కీర్తి గడించిరి. వీరి కాలమునందు ద్రావిడదేశమున నాంధ్రవాఙ్మయము బహుళ వాహినులై వెల్లివిరిసినను, వీరి యాదరణకు ముఖ్యముగ పాత్రమైనది యక్షగానము. అట్లని చెప్పుటవలన ఆంధ్ర యక్షగాన రచన మఱి యెచటను సాగలేదని యభిప్రాయము గాదు. చిక్కదేవరాయ విలాసము మైసూరున బయలువడెను; ఇది యొక్క

14. ప్రభా. ప్రద్యు. ఆ 4 : 97-102.

రచించిరో చెప్పుటకు వీలులేదు; కాని చిక్కదేవుని కాలమున నిది వ్రాయబడె ననుటకు సందియము లేదు. దక్షిణాంధ్రమున నెల్లూరు మండలమున గంకంటి పాపరాజు విష్ణుమాయావిలాస నాటకమును జెప్పెను. రాధామాధవ యెల్లనార్యుని విష్ణుమాయా విలాసనాటకములో మోహినికథను ఇతడు యక్షగానముగ జేసెను. రచనావిధానమునుబట్టి చూడగా పాపరాజు విష్ణుమాయా విలాసమునకు రుద్రకవి సుగ్రీవ విజయమునకు జాల సమీప బాంధవ్యము గలదని చెప్పవలసియున్నది. ఇదిగాక యహోబల ప్రాంత మందలి...గుళదూర్తి యగ్రహార వాస్తవ్యుడైన క్రొంజ వేంకటాద్రియను నతడు వాసంతికాపరిణయమను యక్షగానమును రచించెను. శిథిలావస్థయం దుండుటచే దీని యితివృత్తము జక్కగ దెలియవచ్చుటలేదు. ఇది యహోబలక్షేత్రమునకు సంబంధించిన కథయైయుండు నేమొ. క్రీ. శ. 16 వ శతాబ్దపు టుత్తరార్ధమున నహోబలమఠాధిపతియగు శఠగోపజీయరను విద్వద్వతంసుడు వాసంతికా పరిణయమను సంస్కృత నాటకమును రచించెను. ఆ కథనే యహోబలప్రాంతమువాడైన వేంకటాద్రి యక్షగానము గావించెనేమొ. రెంటిని బోల్చి చూచినగాని నిజము తేలదు.

### 17 వ శతాబ్దమున

ఆంధ్రదేశమున రచింపబడిన యక్షగానము లివి రెండేయని యెంచరాదు. అప్పటినుండి యిప్పటివరకును యక్షగాన వాఙ్మయము అవిచ్ఛిన్నముగ జరుగుచునే వచ్చినది. ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుస్తకభాండాగారమునను చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునను నముద్రితములైన యక్షగానములు శతాధిక సంఖ్యాకములు గలవు. ముద్రితములు దాదాపు యెనుబది కలవు. కాని యక్షగానములను గూర్చి యాక్రోశించువారికి వాని పేరుకూడ తెలియదు. వాని చరిత్రను గూర్చిన పరిశోధన మేమియు జరుగలేదని వేఱుగ జెప్పవలసిన యావశ్యకత లేదు. అట్టి పరిశోధనయే లేనప్పుడు వాని స్థితిగూర్చి యేమి చెప్పుటకు సాధ్యపడును ?

## 3

యక్షగాన రచన కర్ణాటాంధ్రములందు జరుగుచుండినను అది వెల్లివిరిసినది ద్రావిడదేశమందలి తంజనగరమందే. రఘునాథ నాయకుని కాలమున రచింపబడిన యక్షగాన మెద్దియు గానరాక పోయినను, దాక్షిణాత్యాంధ్ర ప్రపంచమున నది యప్పుడు ప్రాముఖ్యము నందియుండెనని తలచుట కవకాశము గలదు. రఘునాథుని మంత్రియు విద్యాగురువునైన గోవింద దీక్షితుడు యక్షగానము ఒక గానశైలియని చెప్పినాడు; మఱియు నతనికి బూర్వికుడైన ఆంజనేయుడు యక్షగానరీతిని వివరించెనట. పామరవాఙ్మయమని యాద్యమునుండియు నిరసింపబడుచువచ్చిన యక్షగానము శాస్త్రకర్తల దృష్టి కెక్కినది. కాని విజయరాఘవుడు తలయెత్తునంతవఱకు దాని కౌన్నత్యము గలుగలేదు. ద్విపద కావ్యములను పదములను బహుళముగ రచించితినని యతడు జెప్పుకొన్నను, నితడు జెప్పిన ఏబది కృతులలో బెక్కు యక్షగాననాటకములు. ప్రహ్లాద చరిత్రయం దాతడొసంగిన పట్టికలో రాజగోపాలవిలాస నాటకము, ఉషాపరిణయనాటకము, రఘునాథాభ్యుదయము, మోహినీ విలాసాఖ్య నాటకము, పూతనాహరణనాటకము, మంజరీ నాటకము, సముద్రమథన నాటకము, కృష్ణవిలాసనాటకము, జానకీకల్యాణ నాటకము, పుణ్యకవ్రత నాటకములను పదిమాత్రము నాటకములని పేర్కొనబడి యున్నను, కాళీయమర్దనము, ప్రహ్లాద చరిత్ర, విప్రనారాయణచరిత్ర, రుక్మిణీకల్యాణమను మఱి నాలుగు కృతులుగూడ యక్షగానములే.[15] ఇట్లే ప్రహ్లాదచరిత్ర పట్టికయందు పేర్కొనబడిన మఱికొన్ని గ్రంథములు గూడ యక్షగానములై యుండుననుటకు సంశయములేదు. వాస్తముగ విజయరాఘవుడు యక్షగాన పితామహు డనుట యొప్పును. అతడు యక్షగానములను బహుళముగ రచించుటయె కాక తన యాశ్రితులను సత్కరించి వారిని యక్షగాన రచనకు బురికొల్పెను. విజయరాఘవుని ప్రోత్సాహమువలన యక్షగాన కృతులు జెప్పినవారిలో బురుషోత్తమ దీక్షితుడు, రంగాజమ్మ, కోనేటి దీక్షితుడు, కామరసు వెంకటపతి సోమయాజి, మన్నారుదేవుడు ప్రముఖులు. మఱి యెందరుండిరో చెప్పుటకు వీలులేదు. యక్షగానచరిత్రయందు విజయరాఘవు డందిన యున్నతస్థానము కేవలము అతడు రచించిన నాటకముల సంఖ్యమీదను, నాశ్రయ మిచ్చి నాటకరచనకు బురికొల్పిన కవులమీదను ఆధారపడియుండలేదు. అతడు స్వతంత్రుడు. యక్షగాన రచనయందు పూర్వులమార్గ మతనికి నచ్చలేదు. కావున నందు కొన్ని క్రొత్తమార్పులను జేసి తరువాతి యక్షగాన రచయితల కందఱికి మార్గదర్శకు డాయెను.

విజయరాఘవునితో తంజాపూరి యాంధ్రనాయకరాజ్యము సమసి పోయినది ; మొదట నది మధురనాయకులకు గైవసమాయెను; కాని యటుపిమ్మట స్వల్పకాలమునకే షాజీపుత్రుడు ఏకోజీ వారిని జయించి మహారాష్ట్రప్రభుత్వమును నెలకొల్పెను. ఇట్లాంధ్రులను మహారాష్ట్రులు జయించి రాజ్యమును స్థాపించినను, నాంధ్రులచే వారును పరాజితులైరి. మహారాష్ట్రుల విజయము రాజకీయము ; ఆంధ్రులది సాంస్కృతికము. తంజాపురాంధ్రనాయకుల ప్రభుత్వము ఫలరహితమైపోలేదు ; వారి నాశ్రయించుకొనియుండిన తెనుగుప్రజ యందె స్థిరముగ నిలచిపోయినది ; వారి ముద్రలేక నాగరకతకు చెలామణి లేదు ; వారి జీవితప్రకార మందఱకు మేలుబంతియైనది. విజ్ఞానమునకు వారు పెట్టినదే ఫక్కు - కళాకౌశలమున వారిదే మీఁదిచేయి. ఆంధ్రభాషాపరిచయము రసికతకు ముఖ్య చిహ్నము ; కవిత నొసటి మాణిక్యము. కావుననే మహారాష్ట్రరాజులందఱును దెనుగు నభ్యసించిరి ; సభయందు తెనుగున మాటలా

15. చూ. డిస్క్రిప్టివ్ కేటలాగ్ ఆఫ్ తెలుగు మ్యాన్యుస్క్రిప్ట్స్. నెంబరులు, 500,541,617—మఱియు విజయరాఘవ కృత రఘునాథనాయకాభ్యుదయముయొక్క ఆశ్వాసాంతములలో—,

"కమనీయ రుక్మిణీ కల్యాణముఖ్య
సమధిక నాటక సంవిధాయకుడు."

అనియు గలదు.

డిరి. తెలుగు విద్వాంసులను గవులను గాంధర్వవిద్యా విశారదులను గాయన గాయనీ జనులను జేరదీసి నాయకరాజులవలె నాశ్రయమొసగిరి. మహారాష్ట్రరాజులాంధ్రమున గవనమల్లు నేర్పు గలిగి కావ్యములను నాటకములను రచించిరి. యక్షగానమును వారివలె బెంపొందించినరాజులు పెక్కండ్రు కానరారు. ఆంధ్రకవులను భాషాపోషకులునునై మహారాష్ట్రరాజులు విఖ్యాతి నందిరి. వీరిలో మొదట పెన్న దగినవాడు శహాజి. ఇతడు తంజనగరమున మహారాష్ట్ర ప్రభుత్వమును బ్రతిష్ఠించిన ఏకోజి పుత్రుడు. క్రీ. శ. 1682వ సంవత్సరమునం దనగా విజయరాఘవుని నిర్యాణమైన పదియేండ్లలోపల రాజ్యాభిషిక్తుడాయెను. విజయరాఘవుని భౌతికశరీరము నశించిపోయినను, అతనికీర్తిమూర్తి ఇంకను ప్రజ్వరిల్లుచునే యుండినది. ప్రజ లాతని ధర్మపరిపాలనను విస్మరింపలేదు. ఆంధ్రు లాతని యౌదార్యాది సుగుణసంపదను మరువలేదు. తెనుగువారి సౌహార్దమును బొందక యానాడు చోళమండలమున బ్రభుత్వము చేయుట దుర్ఘటమైయుండెను; కావున శహాజీ విజయరాఘవునికంటె నధికముగ భాషాపోషణాదులను గావించి యతని మరపించి తెనుగువారిని వశంవదులను జేసికొన బ్రయత్నముజేసెను. అతని యాంధ్రభాషాపోషణ కేవల రాజకీయ కారణములయొక్క ఫలితము కాదు. జాతిచే మహారాష్ట్రుడైనను, శహాజీ పుట్టి పెరిగినది పశ్చిమాంధ్రమునందు. అతని పితామహుడైన శహాజీ విజాపురసుల్తాను ప్రసాదమున కోలారు అనంతపురమండలములలో జాగీరులను సంపాదించెను; తండ్రియైన యేకోజి తంజాపురమునకు రాకముం దచ్చటనె ప్రభుత్వము సల్పుచుండెను. కావున నాతనికిమాతృభాషయైనమహారాష్ట్రమువలె దేశభాషయైన తెనుగును సహజముగ నలవడినది. అట్లు గానియెడల నతనికి తెనుగుభాషయం దంతటి యభిమానమును దెనుగుకవిత్వమునం దంతటి నేర్పును గలిగియుండవు.

కారణ మెద్దియైనను నాంధ్ర భాషాపోషణయందును విద్వత్పక్షపాతమునను కవిజనసంరక్షణయందును కావ్యకల్పనాచాతుర్యమునను శాహరాజు విజయరాఘవునికి దుల్యుడని చెప్పక తప్పదు.

ఇతనికి తిమ్మన మొదలైనవారు రచించిన తెనుగు ద్విపద భారతము పైన నభిమానము మెండు; కావున దానికొక ప్రతిని వ్రాయించి తన పుస్తక భాండాగారమున నిక్షిప్తము జేసియుంచుకొనెను.

భోసలాన్వయ సుధాంబోధి చంద్రుండు
భాసుశౌర్యానుభావ సాంద్రుండు
*　*　*
మనుజభావుండు రామామనోజుండు
అనఘ సన్నుతుడు శాహావనీ విభుడు
*　*　*
పంచమ వేదమై పరగు భారతము
సంచితపాపముల్ చెరజేయుగాన
నించాజిగనుకొని నీవు వ్రాయింపు
మంబుజోదరులీల లన్నియు దాన
గనవచ్చునని చెప్ప గడు వేడ్కతోడ.
*　*　*

విభవనిర్జిత దేవవిభు పేర శాహ
విభు పేరసకల ప్రవీణుని పేర
వ్రాయంగ బూనితి......

—(ద్వి. భా. అశ్వమేధ పర్వము చివర)

ఇట్లు కావ్యాభిమానముగలవాడైన కావ్యరచనకు బూనుకొనలేదు. విజయరాఘవుని కవితవలె నితనిది పలుదెఱగుల బరిఢవిల్లలేదు. ఇతని రచనలన్నియు నాటకములె. కిరాతవిజయము, కృష్ణవిలాసము, గంగా పార్వతీ సంవాదము, జలక్రీడలు, త్యాగరాజ వినోదచిత్రప్రబంధనాటకము, ద్రౌపదీ కల్యాణము, పంచరత్న ప్రబంధము, పార్వతీపరిణయము, రతీకల్యాణము, రామపట్టాభిషేకము, రుక్మిణీసత్యభామాసంవాదము, వల్లీ కల్యాణము, విఘ్నేశ్వర కల్యాణము, విష్ణుపల్లకి సేవాప్రబంధము, శంకరపల్లకి సేవాప్రబంధము, శచీపురందరము, శాంతాకల్యాణము, శీతాకల్యాణము, సతీపతిదానవిలాసము, సతీదానశూరము, మున్నగు నాటకము లీతనివని శాహరాజకృతులు గానవచ్చుచున్నవి. ఇవి గాక ఇతని యాశ్రితులు రచించినవి మఱికొన్ని నాటకములు గలవు. గిరిరాజు రాజకన్యాపరిణయమును, రాజమోహన కొఱవంజిని, లీలావతీకల్యాణమును, వాదజయ నాటకమును, శాహేంద్ర విజయమును, సర్వాంగసుందరీవిలాసమును జెప్పెను; బాలకవి పంచకన్యా పరిణయమును, బాలకవి సుబ్బన్న లీలావతీ శాహేంద్రీయమును, శేషాచలపతి శాహరాజ విలాసమును, సరస్వతీ కల్యాణమును, విరచించిరి. మొత్తమునీద శాహరాజు కొలువున ముప్పది యక్షగాన నాటకములు వెలువడినవి. ఈకాలమున రచింపబడిన నాటకము మఱియొకటి కలదు. ఇది తిగుమల కవికృత చిత్రకూట మాహాత్మ్యము. ఇతడు మధురనాయకరాజగు విజయరంగ చొక్కనాథనాయకుని యాస్థానమున నలరెను. ఇందువలన యక్షగాన కర్తలకు తంజావూరు సందకాక మధురయాస్థానమందు నైతిమాశ్రయము గలిగినదని తెలియవచ్చుచున్నది. యక్షగాన కర్తలైన మహారాష్ట్రరాజులలో రెండవవాడు శాహరాజానుజుడగు తుళజరాజు. ఇతడు శివకామసుందరీపరిణయము జెప్పెను. ఇతని యనంతరము రాజ్యాభిషిక్తుడై యల్పకాలము రాజ్యమును బాలించిన జయసింహుడు నెల్లూరు వీరరాఘవ కవిపుత్రుడైన శివరామకవిచే కామకళా నిధియన కామశాస్త్రగ్రంథమును గృతిగొనెను ఇతని తమ్ముడగు నేకోజీ రాజు గూడ తన తండ్రి పెదతండ్రులవలె యక్షగాన కర్తయే. ఇతడు రచించినది విఘ్నేశ్వరకల్యాణము; సిద్ధిబుద్ధులను విఘ్నేశ్వరుడు పెండ్లాడిన కథ యిందు వర్ణింపబడినది. కేవల యక్షగానకృతితో తృప్తినందక ఏకోజీ కావ్యరచనకు బూనుకొని రామాయణ మాఱు కాండలను ద్విపదగ వ్రాసెను. ఏకోజీకవిత్వమందు నేర్పరి. ఇతనిది సరళమైన కవితమ్ము. కట్టావారి రామాయణమునకిది సర్వవిధముల తుల్యమైనది.

గ్రంథకర్త గాకపోయినను ప్రతాపసింహుని ఇచట పేర్కొనుట యుక్తము. ఇతనికి యుంపుడుగత్తెయందు జననమందిన యమరసింహుడు—ఇతనికే రామస్వామి యని నామాంతరము—కవుల కాశ్రయుడై మాతృభూత కవికృత పారిజాతాపహరణ

నాటకమును కృతిగొనెను. ప్రతాపసింహుని కాలమందె గాన బ్రహ్మ త్యాగరాజు వర్ధిల్లెను. ఇతనికి రాజులతోడను సంస్థానములతోడను సంబంధము లేకపోయినను, భగవద్భక్తిపరాయణుడై పెక్కు కీర్తనలను రచియించుటయేగాక ప్రహ్లాదచరిత్ర నౌకాచరిత్రలను యక్షగానములు రెంటికి గర్తయాయెను; కావున నతని నిచట పేర్కొనక తప్పదు.

మహారాష్ట్ర రాజులలో గడపటి యక్షగానకర్త, శివాజీ రాజు. ఇతడు శరభోజి పుత్రుడు; తుళుజరాజ పౌత్రుడు; ప్రతాపసింహుని ప్రపౌత్రుడు. ఇతడు దన పూర్వీకులవలె విద్వాంసుడు; కళాప్రియుడు; ముఖ్యముగ గాంధర్వ విద్యావిశారదుడు; గానాది విద్యలలో జతురులగు మిత్రుల గోష్ఠియందు కాలము గడపువాడు.

'ఆర్తజనులను బ్రోచు నల కల్పకంబు,
కీర్తిగల్గిన యట్టికృష్ణరాయండు
* * *
గాన విద్యలలోన ఘనుడైనవాడు,
సేనాధురంధర శ్రీ గల్గువాడు
వరయోగ శాలియౌ వరహేంద్రఘనుడు,
పరిపూర్ణ విద్యల బ్రబలినవాడు
ఇటువంటి మిత్రులు యిరవంక గొలువ,
పటువుగా విలసిల్లు భాగ్యముప్పొంగ
శ్రీ శివాజీంద్రుడు చెలగు సద్విభుడు,
ఆశాంతభూపుల ననువుగా బ్రోచి'

యని యతనియన్న పూర్ణాపరిణయ యక్షగానమునందు సూత్రధారు డితని బ్రశంసించియున్నాడు. ఇట్లితడు యక్షగానము జెప్పుటయేకాక కవుల నాదరించి వారిచే గృతులు గొనెను. ఇతని బ్రసాదమునకు బాత్రుడైనవారిలో వేంకట కృష్ణాజెట్టి యొక్కడు. తాను 'శ్రీరాజమాన్య రాజరాజరాజశ్రీ శివాజీ మహీపాలుని తెలుగుకవి వెంకటకృష్ణాజెట్టి'నని సగర్వముగ జెప్పుకొనెను. ఇతని శివపారిజాత మను యక్షగానము 'శ్రీ తంజపురీంద్రు శ్రీ శివాజీ మహీపాలుని కులదేవుడైన చంద్రమౌళీశ్వరుని కృపచే వ్రాసిన కవిత్వ' మట.

పై పేర్కొనిన యక్షగానరచయితలుగాక దేశకాలాదులు దెలియరాని మఱికొందఱి నాటకములు సరస్వతీమహలు పుస్తక భాండాగారపట్టిక యందు వర్ణింపబడియున్నవి. అక్కప్రధానుని పేర కృష్ణవిలాసము భీమసేన విజయమను రెండు నాటకములు గలవు. ఈ రెండును వేంకటాచలపతి కంకితములు. తిమ్మగూర్చి కవి యిట్లు చెప్పుకొనియున్నాడు.

'అంకితంబుగ వేంకటాధిపుపాద,
పంకజ యుగమదభ్రరాయమాన
.........................
.........................
మనసిజాకార తిమ్మయ దండనాథ,
తనుసంభవుం డక్క సత్ప్రధానుండు.'

అని కృష్ణవిలాసమునను—
'అంకితంబుగ వేంకటాధీశుపాద,
పంకజయుగమదభ్రమరాయమాన
.........................
.........................
మనసిజాకారతిమ్మయ దండనాథ,
తనయాక్క మంత్రి కృతంబై తనర్చు'

అని భీమసేన విజయమునను గలదు. ఇతడుగాక మఱియొక యక్కనామాత్యుడు సరబాద లింగోజీ కుమారుడు 'బాలకృష్ణలీలా విలాసము'ను వ్రాసెను. ఇదియు గవి 'యిష్టవేలుపు' వేంకటాధీశుని కంకితము కావింపబడినది. తన్నుగూర్చియు దన నాటకముల గూర్చియు నిట్లు వ్రాసికొనియున్నాడు:

'కులుడు భారద్వాజ గోత్రసంయుతుడు,
సరసవైఖరి మెఱయు సత్కీర్తియుతుడు
సరబాద లింగోజి సత్పుత్రు డక్క,
నామాత్య శేఖరుం డతి సంభ్రమమున
కాముని గన్న చక్కని బాలకృష్ణ,
లీలావిలాసలాలితనాటకంబు
భూలోకమున శుభంబులు పొల్చుమీఱ
సలలిత భరతశాస్త్ర ప్రవీణతను
పరగగ కన్నుల పండువు గాగ
.........................
ఆ చతుర్ముఖ నిర్మితావనియందు
నాచంద్రతారార్కమై యొప్పుగాక.'

చెంగల్వరాయని పేర గొల్లకథ యెఱుకలకథయను రెండు నాటకములు గలవు. 'బాలెంతకథ' 'రాధకథ' యను మఱి రెండు గూడ నితని రచనలని పట్టికయందు చెప్పబడినది. కాని యది సంశయ గ్రస్తము.

"శ్రీరాయపుర మేలి చెలగు శ్రీహరికి
నారాధ్య గణనాథునకు వాణికెలమి
నలువొందగా విజయనగర వంశజుడు
రసికత చెంగల్వరాయాహ్వయుండు
అసమానమగు దేవతానుగ్రహమున
కరమర్థితో గొల్లకథ రచియించె."

మఱియు—

"ఇల విజయనగర వంశో
జ్జ్వలుడగు చెంగల్వరాయ జనవరు డెలమిన్
లలితోక్తుల యెఱుకల కథ
దెలియగ జెప్పెను నృసింహదేవుని కరుణన్."

అనియు వివరించినాడు. గొల్లకథయందు పేర్కొనబడిన రాయపుర మెచ్చటిదో తెలియదు. చెన్నపట్టణ శాఖానగరములలో నొక రాయపురము గలదు; మఱియు నీ చెంగల్వరాయలు విజయనగర

వంశజుడ నని చెప్పుకొనియున్నాడు; కావున నితడు చెన్నపట్టణ ప్రాంతమున వర్ధిల్లినవాడైనను గావచ్చును.

శంబరధరుడను కవి కిరాతార్జునీయ నాటకము రచించి శంభున కంకిత మొనర్చెను.

"అంకితంబుగ బొమ్మలాట శాసనుడు
పొంకమహాఘన కావ్యభూషణుడైన
సంబయ్య తమ్ముడు సరసుడౌనట్టి
శంబరధరుడు ప్రశంభుని పేర
నెనయంగ రచియించె నిది లోకహితను."

అని వ్రాసినాడు. బొమ్మలాట యొక గ్రామము పేరు! ఆ యూరి కరణము తమ్ముడీ శంబరధరుడు. కృష్ణదేవరాయలకును నతని పిమ్మట నచ్యుత దేవరాయలకును నాప్తుడైన బొమ్మలాట విరూపాక్షుని మనుమడో పుత్రుడో యగు కాళహస్తీశ కవి గలడు. ఇతడొక వేళ బొమ్మలాట గ్రామవాస్తవ్యుడై యుండవచ్చును; కాని యీ బొమ్మలాట యెచ్చటిదో తెలియదు. రాయలసీమ యందుండు నేమొ.

ఓబయమంత్రి గరుడాచల నాటకమును రచించి నృసింహ స్వామి కంకిత మొనర్చెను. ఇతడు స్వవిషయమును—

"వన్నె కెక్కిన నందవరశాసనుండు
చిన్నమాంబాగర్భసింధు చంద్రుండు
దినకర తేజు... హిరోబ
ఘనుని యోబయమంత్రి కవివరేణ్యుండు."

అని వివరించుకొనుటవలన నితడు కర్నూలు మండలమునా డనియు కృతిపతియైన దేవు డహోబల నరసింహస్వామి యనియు నిశ్చయము సేయవచ్చును.

యక్షగాన కర్తలందఱును పౌరాణిక గాథలనె తమ నాటకములకు ఇతివృత్తములుగ గ్రహింపలేదు. రాజుల చరిత్రలను వారి శృంగారవిలాసములను, ధర్మకార్యాదులను విజయరాఘవ, పురుషోత్తమ దీక్షిత, కోనేటిదీక్షిత, వెంకటపతి సోమయాజి, శేషాచలపతి, గిరిరాజాదులు నాటకములుగ జేసిరి. వీరి విషయ మింతకు ముందె వివరింపబడినది. వీరుగాక వేదాంతప్రచారము కొఱకు నాటకములను రచించినవారు కొందఱు గలరు. వారినిగూడ పేర్కొనుట యుక్తము. వీరిలో ముఖ్యుడు పరమానందయతి లేక పరమానంద తీర్థుడను సన్యాసి. ఇతడు బహు గ్రంథకర్త. ముక్తి కాంతా పరిణయమను నాటకమును విరచించెను.

"పరగసంయమిగేయు పావనధ్యేయు
పరగదత్తాత్రేయు పరమ విధేయు
తలచి కీర్తించి వందన మాచరించి
యలరుచు దగ బరమానందతీర్థ
యతి నాయధేయు డాయత మోదమునను
చతురత ప్రౌఢిచే సజ్జనుల్ పొగడ
కర మొప్పగా ముక్తి కాంతావివాహ
మురుతరపద చాతురిమెఱ జెప్పెదను."

సన్యాసి యగుటచే దన పూర్వాశ్రమవృత్తాంతమును జెప్పుకొనలేదు. ఇతని దేశకాల విద్యమానములను దెలుపుసాధనము లెవ్వియు లేకపోయినను వ్యక్తి నిర్ధారణకు దగిన యూహయొకటి పొడముచున్నది. ఆంధ్రదేశమందింతటను నేటికిని పరమానందయ్య యను యతీశ్వరునియొక్కయు నతని శిష్యులయొక్కయు కీర్తి ప్రజ్వరిల్లుచున్నది. ఆ పరమానందయ్యగారె ముక్తి కాంతాపరిణయ రచయితయగు పరమానంద తీర్థయతి యని తోచుచున్నది. ఇది యసంభావ్యముగాదేని యిట్టి యాత్మవిద్యావేత్తయు బండిత ప్రకాండుడునైన యతిపుంగవునకు లోకమున మూఢుడను నపవాద మేలుకల్గెనో విచారింప వగియున్నది.

చల్లా సూరయార్యుని తరగతికి జెందిన నాటకకర్తయే. ఇతడు వివేకవిజయమను నాటకము చెప్పెను. ఇందు వర్ణింపబడిన కథయు ముక్తికాంతావివాహమే. ఇత డెప్పటివాడో తెలియదు; కాని యితని నివాసస్థానము తంజావూరు మండలమని నిశ్చయముగ జెప్పవచ్చును. మన్నారుగుడిప్రాంతము వాడైనట్లు తోచుచున్నది.

"అనుచు శ్రీరాజ మన్నారైన స్వామి,
ఘనకృపావర్ధిత కవితాతిశయుడు
పొందపాకాహ్వయపురనిత్యవాసి,
వేద వేదాంగాది విద్యావిదుండు
చల్లవంశాంబుధిచంద్రుడు సూరి,
తల్లజాండైన యాతత్వసంవేది
సూరయార్యున కగ్రసుతుడైనవాడు,
సూరిజనస్తుత సురుచిరాత్మకుడు
కవిసూరయాఖ్యుండు ఘనతత్వవిదుడు,
వివరింపగ వివేక విజయనాటకము
..............................
దక్షిణద్వారకా ధాముని పేర,
నాచంద్రతారార్కమై భూమి వెలయ"

అను ద్విపదలితని వంశాదికముల దెల్పుచున్నవి.

ముక్తికాంతావివాహమునే వర్ణించు 'జీవననాటకము' అను మఱియొక వేదాంతపరమైన నాటకముగలదు. కర్త యెవ్వరో యెచ్చటివాడో, యెప్పటివాడో తెలియదు. 'అద్వితీయంబైన బ్రహ్మనాటకంబు ప్రత్యక్షముగా దెలిసేటికొఱకై మోక్షకాంతా కల్యాణంబనియెడి నామధేయంబున వేషభాషాది యుక్తముగ నాటక కథాక్రమం బెటులనిన వినండీను' అని చెప్పియుండుటచే నీ యాధ్యాత్మిక నాటకములను రచించినది కేవలము పఠనముకొఱకే కాదనియు నన్ని నాటకములను బోలి ప్రదర్శనము ఇచటను ముఖోద్దేశమనియు దెల్లమగుచున్నది.

నాటక రచనలనుబోలి ప్రదర్శనములును విరివిగా జరుగుచుండినవి. సరస్వతీ మహాలు పుస్తక భాండాగార గ్రంథములలో నచట నచట నగరి మేళప్రస్తావన గానవచ్చుచున్నది. శివాజీ కృత అన్నపూర్ణా పరిణయ ప్రతి కడపట నిట్లు కలదు. 'జయనామ సంవత్సరం భాద్రపదసుద్ధ నవమి గురువారందినాను రాజశ్రీ మున్షీస్తుల వారి ఉత్తరవు ప్రకారం నగరిలో ఉండె భాగవత మేళం ఘటనీను

దగ్గర యీ అన్నపూర్ణాంబికాపరిణయ పుస్తకం వ్రాయించి అమృతకవి తులసీ రంగయ్యంగారు నగరివారికి వ్రాయించి యిచ్చినది. వ్రాసిన ఆకులు 49." "నాటక పాత్రలు" అను పుస్తకమున ఒక్కొక్క నాటక పాత్రలును తత్పాత్రధారుల నామములును వివరింపబడి యున్నది. ఉదా:

'ప్రబోధ చంద్రోదయ వేషాలు.'

'విఘ్నేశ్వరుడు రాముడు పుట్టత్తూరి వైద్ది. ప్రమథగణాలు గణపతి. గురువయ్య కృష్ణుడు. మణియం శ్రీనివాసుడు గురువుడు. కురుక్కళు రామయ్య. పరిచారకుడు కుప్పయ్య.'

దీనిబట్టి చూడగా తంజావూరి రాజులు తమ నగరిలో నాటకములను ప్రదర్శించుటకు ప్రత్యేక మేళములను గూర్చి తమ కొలువున నుంచుకొనువారనియు నందొక్కొక్క పాత్ర వేషము ధరించుటకు ప్రత్యేక మొక వ్యక్తి నియుక్తుడై యుండెననియు దెలియ వచ్చుచున్నది. ఇట్లే యితర రాజుల కొలువునను ప్రత్యేక భాగవత మేళము లుండియుండవచ్చును. రాజులే కాక గొప్పమంత్రులు మున్నగువారు సైతము ప్రత్యేక భాగవతమేళములను పోషించువారని తెలియ వచ్చుచున్నది. గోల్కొండ తానీషా మంత్రులైన యక్కన మాదనల కొలువున నొక భాగవత మేళ ముండెనని మధురమంగా పుంశ్చలీవిలాసమున జెప్పియున్నది. కూచిపూడి భాగవత మేళమును బోలి యక్కన మాదనల మేళము దేశాటనము జేయుచు నచటనచట నాటక ప్రదర్శనముల గావించెడిదనియు నానెగొంది రాచనగరిలో నాటకము నాడినపుడు మేళగాండ్రలో జూపరియైన స్త్రీ వేషధారి యువకునిగాంచి యా రాజుసోదరివలచి వానితో సాంగత్యము నెఱపెననియు నందొక యైతిహ్యము గలదు. ఇట్టి మేళములు మొన్న మొన్నటివరకును ప్రతి వేసంగియందును సంచారము వెడలుచు నాటకము లాడువారు. ఆంగ్లవిద్య దేశమున ప్రబలినపిమ్మట నీ నాటక ప్రదర్శనము లనాగరకత చిహ్నమను నభిప్రాయము ప్రబలుటచేత విద్యావంతులు వాని నిరసింపగడగిరి. తత్కారణమున విద్య నేర్చినవా రీ నాటకముల నాడుట మానుకొనిరి. అంతట నవి యానాదుల పాలబడి చివరకు లయమై పోయినవి.

# 4

ఇంతవఱకు యక్షగానోత్పత్తియు వాఙ్మయాభివృద్ధియు వివరింపబడినది. భాగవత మేళములును నాటకప్రదర్శనములును సందర్భానుసారముగ దడవబడినవి. ఇక యక్షగాన రచనావిధానమును గూర్చి యొక్కింత చెప్పవలసియున్నది. ఆద్యమున యక్షగాన స్వరూప మెట్టిదో తెలియదు; ప్రాచీన యక్షగానము లన్నియు నామరూపములు లేక నశించిపోయినవి. నేడు మనకు లభించు యక్షగాన గ్రంథములలో నెల్ల ప్రాచీనతమమైనది కందుకూరు రుద్రకవికృత సుగ్రీవవిజయము. రుద్రకవి క్రీ. శ. 16-వ శతాబ్దమున వెలసెను. కృష్ణరాయల యష్టదిగ్గజములలో నొక్కడని చెప్పుదురు; అళియరామరాజ మల్కిభరాములచే సత్కృతుడని తెల్పు నైతిహ్యములును గలవు. రచనావిధానమునుబట్టి చూడనది యారంభరచన గాదని చెప్పవలసియున్నది. పరిపూర్ణత నందకపోయినను సంప్రదాయము చక్కగ నేర్పడినది. యక్షగానరచనగూర్చి కీర్తికాయులు శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిలవా రిట్లు వ్రాసియున్నారు.

'యక్షగానమందలి ప్రధాన గేయరచనములు దేశిరచనలగు రగడలలో గొంత మార్పు జరిపి—త్రిపుట, జంపె, ఏక, అట, అను తాళముల కనుగుణముగా గల్పింపబడినవిగా గానవచ్చును. అప్పకవి రగడ రచనములను తాళముల పేర పర్కొనెను గాని వానికి పేరులు వేఱె తెలుపలేదు. పేర్కొన్న యీ రచనములే కాక యక్షగానములలో నింకను ననేక విధములైన దేశిరచనలు చేరినవి. ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, చందమామ సుద్దులు, వెన్నెలపదములు, విరాళిపదములు, తుమ్మెదపదములు, కోవెలపదములు, చిలుకపదములు, అల్లోనేరేళ్లు, సీస-కందార్థములు, త్రిభంగులు ద్విపదలు, త్రిపదలు, చౌపదులు, షట్పదులు, మంజరులు, జక్కులరేకులు - మొదలగునవి" 16. ప్రభాకరశాస్త్రిలవారు చెప్పినట్లు పై జాబితాలోని రచనము లన్నియు యక్షగానములలో గానవచ్చునేమొ పరిశీలించి చూడవలసియున్నది. ఇందలి వాస్తవావాస్తవము లెట్లున్నను సుగ్రీవవిజయమునందు మాత్రమిం దనేకములు గానరావు. ఇందు ఉత్పలమాల 1, సీసములు 2, తేటగీతులు 4, కందము 1, కానవచ్చుచున్నవి. ఇవిగాక రగడవికారరచనములని యప్పకవి చెప్పు త్రిపుట, జంపె, కురుచజంపె, అట యేకతాళములును, ఏలధవళార్థచంద్రికలును, ద్విపదలును వచనములును గలవు. అన్నిటికంటె బహుళముగ వాడబడినది ద్విపద. వచనములు చిన్నవి. అవి ముఖ్యముగ నాటకపాత్రలప్రవేశాదులను దెలుపుటకును, నాటక కథలోని సంధులను వివరించుటకును వాడబడినవి. తాళములను బేర్కొన్నను రాగముల ప్రస్తావన యెందును గానరాదు. ఈ పద్ధతి ననుసరించి వ్రాయబడిన నాటకములు రెండుమూడు గలవు. కంకంటి పాపరాజు వ్రాసిన విష్ణుమాయావిలాస నాటక మొక్కటి. ఇందు సుగ్రీవవిజయమును బోలి వృత్త కంద సీస గీతద్విపదవచనాదులును త్రిపుట జంపె కురుచజంపె యేకాదియాటతాళములును, ఏలార్థచంద్రికధవళములును వాడబడినను నందు గానరాని పెక్కు గేయరచనాదులు విష్ణుమాయావిలాసనాటకమున బొడగట్టుచున్నవి. ఇందు ముఖ్యమైనవాని నిచట బేర్కొని మచ్చున కొక్కొక్క గేయమును బొందుపఱచుచున్నాడను.

## (1) లఘుశేఖరము

కుంచెవి నరకొంచు నవ్వుకొంచు కౌరిగాంచు శేక్క
ముంచుకొనగపారుదిండి మునివరుండు బొఱుదేర.

వనజనయను మాయ మాత్రమునకు మీర లేల మరులు
కొనకయుండ మేము నేర్తు మనుచు ప్రమథవరులు గొలువ.

శివ విరక్తి విష్ణుమాయ జేరి చూతమనుచు నజుడు
దివిజమునులు బ్రహ్మయతులు దిక్పతులును గలిసి కొలువ.

16. సుగ్రీవ. పీఠిక. పుటలు 9-10.

### (2) ముద్దె

జాలుకొప్పు జూచియొకడు జంకెనలకు భ్రమసి యొకడు
ఓరచూపు జూచియొకడు దారతీరు జూచి యొకడు
మొలకనగవు వలచి యొకడు ముద్దుమోము జూచియొకడు
తళుకు చెక్కు లరసియొకడు కులుకుసొబ్బ లెంచి యొకడు
మారు బారి కోర్వలేక మారుమాట లుడిగి దనుజు
లూరకుండి రమరవరుల కొసగె నమృత మెల్ల నతివ
ఆ వెలంది వైఖరులకు నసురవరులు వలచు టెంత
భావజారి నీవు గన్న భ్రమసిపోదు వింతయేల ?

### (3) రచ్చరేకులు (రచ్చతాళము ?)

మించు మోహము నించు మది దనుకించు లేమదలంచు నలుగురి
గాంచు తరిగాదంచు తమి మరలించు దలయిటు వంచుచున్. 1

పేరు వినుతమి జీరు సన్నపు జాలు పయ్యెద మీలు గుబ్బల
తీరుగను పలుమారు తన కొనగోరు మోపగ గోరుచున్. 2

రంగుమీఱు మెఱుంగు మేని తెరంగు నడల బెడంగు బొగడ దొ
డంగ గోగిర (?) తరంగు వెతల గఱంగ తాల్మి దొఱంగుచున్. 3

### (4) త్రిబస్తకము (స్తబకము?)

వింటివీ [మా ?] యలాంటివీ బాలగంటి నీ వేళనో లాలా
వెన్నెలతోడ పొన్నల నీడ సన్నలగూడెదో లాలా
వేడుకకైన వేడుకచాన గూడక మాననో లాలా.

ఇవి గాక అష్టకము, చూర్ణిక, మంగళము, లయగ్రాహి, వసంత తిలక, శోభన మున్నగు రచనము లిందు గలవు. మఱియు కుఱుచ జంపె, జంపె, త్రిపుట మొదలైన రగడవికారములు సుగ్రీవవిజయమువలె నిందు రాగనిర్ణీతములు గాక యున్నను, పదములు దఱుచు రాగములతో జోడింపబడియున్నవి. కొన్నియెడల గేయములు నామతాళరహితములై రాగసహితములై యున్నవి. ఇందు వచ్చునవి ఆహిరిఘంటారవము, నాదనామక్రియ, నీలాంబరి, పంతువరాళి, మధ్యమావతి, రేగుప్తి మున్నగు రాగములు. ఈయంశముల నన్నిటిని సమాలోచనజేసి చూడ సుగ్రీవ విజయముకంటె దీని రచనయందు నవీనత గాన వచ్చుచున్నదని తెల్లము కాగలదు. అక్కనామాత్య కృత కృష్ణవిలాస భీమసేన విజయములందును, వెంకటాద్రి విరచిత వాసంతికా పరిణయమందును, త్రిపుట, జంపె, లఘుశేఖరము మున్నగునవి గానవచ్చుచుండుటచే నవియు విష్ణుమాయావిలాసము వంటి నాటకము లైయుండునని తోచుచున్నది.

ఈ నవీనత యెట్లు కల్గినది ? కాలక్రమమున స్వతస్సిద్ధమై కల్గియుండవచ్చును. ఇందసంభవ మేమియు లేదు ; అన్యసంసర్గము వల్ల చేకురియుండవచ్చును. చారిత్రకదృష్టితో బరిశీలించిచూడ నీనవీనత్వము దాక్షిణాత్యాంధ్రుల పొత్తు వలన గల్గినట్లు వ్యక్తము కాగలదు. మొట్టమొదట యక్షగానరచనా పద్ధతి మార్పునందసాగినది తంజాపురమందు ; ఈమార్పునకు గారణభూతుడు తంజావూరి విజయరాఘవనాయకుడు. విజయరాఘవుని పట్టాభిషేకముతో యక్షగాన చరిత్రయం దొక నూతన దశ ప్రారంభ మాయెనని పూర్వప్రకరణమున వక్కాణించి యున్నాను. అతడు కవిమాత్రుడు గాడు. సంస్కృతాంధ్రముల జక్కగ నెఱింగిన విద్వాంసుడు ముఖ్య సంస్కృతనాటక లక్షణముల జక్కగ నవగాహనుజేసికొన్నవాడు. స్వతంత్రాభిమాని. కావున యక్షగానరచనకు బూనుకొన్నప్పుడు పూర్వరచనా విధానమతనికి నచ్చలేదు ; అందు కొన్ని మార్పులు గావించుట యుక్తమని తోచినది. ఈమార్పులు జేయుట యందతనికి సంస్కృతనాటకములు మార్గదర్శకములైనవి. ఇతని నాటకములన్నియు.

> భోజకన్యా ముఖాంభోజరాజమరాళ సత్యాఘన స్తన స్తబకభృంగ
> జాంబవతీ విలోచన చకోర శశాంక మిత్రవిందా తటి న్మేఘరూప
> భద్రావశావశ భద్రదంతావళ వరసుదంతా మనోవనమృగేంద్ర
> లక్షణారూప కలాపినీపర్జన్య భానుసుతాలతా పారిజాత
> షోడశస్త్రీసహస్ర చక్షుః ప్రసార హారసార మసార మోహనశరీర
> విజయరాఘవ భూపాల భజనలోల కేలుమోడ్చెద రాజగోపాల నీకు.

అను సీసపద్యముతో ప్రారంభమగును. ఇందు విశేషమైన మార్పేమియు లేదు. సుగ్రీవ విజయమును ఇట్టి దేవతా స్తోత్రముతో ప్రారంభమైనది. కాని యందుకవి నామము లేదు. ఇందు కలదు. మఱియు సుగ్రీవవిజయమున గవీశ్వరుడే కృతిపతిని గొనియాడి షష్ఠ్యంతములు జెప్పి తాను రచియించు యక్షగానమునకు గథాక్రమము వివరింపగడగినాడు. ఇది ప్రబంధ పద్ధతి, యక్షగాన పద్ధతి గాదు. విజయరాఘవుని కిది నచ్చలేదు. కావున నతడు దేవతాస్తోత్రమునకు దరువాత కైవారమును జొప్పించినాడు: "రాజగోపాల చరణారవింద భజనానందసాంద్ర, రఘునాథ నాయక రత్నాకరావతీర్ణ సంపూర్ణ పూర్ణిమచంద్ర, పాండ్య తుండీరాది వైరి గజకంఠీరవకిశోర, కళావత్యంబికాకుమార, చంద్రోపేంద్ర సురేంద్రనందన కందర్పకోటి సౌందర్యధుర్య, జీర్ణకర్ణాటక సామ్రాజ్య సింహాసనస్థాపనాచార్య, సమరసముగ్రాచరిత సమస్తనిస్తుల తులాపురుషాది మహాదానాపదానప్రవర్తిత కీర్తిధారేయ, సంగరరంగగాంగేయ, ప్రతిదిన బహుసహస్ర బ్రాహ్మణాభీష్ట మృష్టాన్న దాన దీక్షాధురీణ, మానినీనూతన పంచబాణ, విశ్వవిశ్వంభరాభరణ విచక్షణ దక్షిణభుజాదండ, శాశ్వతైశ్వర్య ధౌరంధర్య మేరుకోదండ, దక్షిణ సింహాసన పట్టభద్ర, కలియుగ రామభద్ర, చతుర్విధ కవితానిర్వాహక సార్వభౌమ బిరుదాంగదవిరాజమాన చరణాంభోజ, కవిసమాజభోజ, జనక చరణ రాజీవసేవావిధాయక, విజయరాఘవనాయక, పరాకు ! స్వామివారు హవణించిన విప్రనారాయణచరిత్రంబను విచిత్ర నాటకంబు నటనపటిమ గనుపించ వినుపించేము. విననవధరించవయ్యా ! పరాకు ! స్వామీ, పరాకు."

ఇట్టి కైవారమునే విజయరాఘవుని యాస్థానమున వెలసిన రంగాజీ, పురుషోత్తమ దీక్షిత, కోనేటి దీక్షితులును, మధుర చొక్కనాథనాయుని యాశ్రితుడైన తిరుమల కవియు, శహాజీయాస్థానము నందుండిన నాటకకర్తలు గొందఱును, స్వీకరించినారు. కాని కామరుసు వంకటాద్రి పాత్రోక్త పద్ధతులను రెంటిని సమ్మేళనము




# వెన్ను విరిచే చాకిరీ మానండి.

కొత్తపద్ధతులు తెలుసుకొండి
కిట్టింపు చూడండి
నాణ్యం గమనించండి

ఇంటి వాడుకకి పూర్తిగా గోద్రెజ్ వాషింగు సబ్బునూక వాడండి. బట్టలు, గచ్చునేలలు, మోరీలు, గాజు, పింగాణీ వస్తువులు, అన్నింటినీ ఇట్టే శుభ్ర పరుస్తుంది.

ఇది సర్వోపయోగంగా వన్నెదీర్చిన బట్టలసబ్బు, కొత్తరకపు నిగ్గుదేరిన సదుపాయమైన నూకల రూపంలో వాడడం వలన కొద్ది పనికే హెచ్చు ఫలం రాబడుతుంది.




**గోద్రెజ్** సోప్స్, లి.

అమ్మకపు డిపో—బొంబాయి: జాకబ్‌సర్కిలు పోస్టు.
మద్రాసు: 164, బ్రాడ్వే. హైద్రాబాదు: 1239, ఆబిడ్ రోడ్డు.

జేసినాడు. మన్నారుదేవుడు పాతమార్గమునే అనుసరించినాడు. మఱియు విజయరాఘవుడు గొన్ని నాటకముల చివరను భరత వాక్యము జేర్చెను. పూర్వోదాహరణముకడపట, భరత వాక్య మిట్లు గలదు.

"ఇవ్విధంబున పూతనాభంజనంబు జేసిన సనాతనదేవతా చక్రవర్తి, రాజగోపాలమూర్తి, అచ్యుత విజయరాఘవేంద్రున కాచంద్రతారార్కంబుగా విశ్వవిశ్వంభరాధిపత్య నిత్యాయురారోగ్య భాగ్యంబులు పాలించి. రక్షింతుగాత."

విజయరాఘవుని మార్గమునే బహుళముగ తంజావూరి నాటక కర్తలను సరించి తమ నాటకములను భరతవాక్యముతో ముగింపగడగిరి. భరతవాక్యరచన సంస్కృత నాటక సంప్రదాయము. కైవారముగూడ నట్టిదే. కైవారము సంస్కృత నాటకములలోని నాంది ప్రస్తావనలకు దుల్యము. విజయరాఘవుని తరువాతి మహారాష్ట్రరాజులీ రహస్యమును గుర్తించి కైవారమును విసర్జించి దాని స్థానమున నాంది ప్రస్తావనల నవలంబించిరి. శాహరాజును నతని యాశ్రితులైన నాటకకర్తలు కొందఱును సూత్రధారుని బ్రవేశపెట్టిరి. శాహరాజవిరచిత పార్వతీపరిణయ ప్రారంభమున.

'సూత్రధారి ॥వ॥ అపురా ఈవిధంబున మరిన్నె విధాన వంటేను.

'సకలవిద్యా విలాసములచే రంజిల్లు
శాహభూపాలుని సన్నుతించి
అతని సభాసీమ నమరు ధీరుల చతు
ర్వేద వేదాంతాది విదుల బొగడి
అందు నానందించు నవపద్య సాహిత్య వ
రుల మహాకవీశ్వరుల వేడి
సంగీత భరతశాస్త్ర కళాధురీణుల
నేర్పుల మదినెంచి యోర్పరించి
ఆ మహారాజు పరమేశ్వరాంకితముగ
నరగజేసిన పార్వతీ పరిణయాఖ్య
మనెడు నాటకమారాజు ననుమతమున
వేషభాషాదియుతముగా విస్తరింతు.

'వ. అన్నందు గనక, అపురా యీ విధంబున అభీష్టదేవతా వందనంబు గావించి సభానాయకాదులను అభ్యర్థించి శ్రీ శాహ మహారాజప్రణీతంబైన పార్వతీకల్యాణం బనియెడు నాటకంబు కథాసంవిధానంబుగా వినుపించెదము విన నవధరించరయ్యా'

అని పై యక్షగాన ప్రదర్శకమును సంస్కృతనాటకములవలె భాసదుల కెఱుకపఱచినాడు. కొన్ని నాటకముల కడపటగూడ సూత్రధారుడు నాటకప్రదర్శన సమాప్తిని దెలియజేయుట కలదు. శాహరాజు విఘ్నేశ్వరకల్యాణ నాటకాంతమున 'సూత్రధారుని వచనము' సంస్కృతమునం దిట్లున్నది.

"శ్రీమద్భోసలకులం శాహమహారాజవిరచితం విఘ్నేశ్వర కల్యాణనాటకం,

సకల విద్వజ్జనప్రీతయే శ్రీ శాహేశ సాంబశివార్పణమస్తు."

శాహరాజానంతరము యక్షగాన రచనకు బూనుకొన్న కవు లంతటితో దృప్తిజెందియుండలేదు. తుళజరాజు సూత్రధారునితో గూడ పారిపార్శ్వకుని రంగస్థలమునకు దెచ్చెను. శివకామసుందరీ పరిణయారంభమున నాంది ప్రస్తావనలు సంస్కృతసంప్రదాయము ననుసరించి రచింపబడినవి.

"నాంద్యంతే సూత్రధారః
'సూ॥ వసంతఋతు వర్ణన.'
విలసిత కిసలయసముసుమ
ఫల పరిమళశోభితములు భావజచాపా
జ్వలనుణ శుకపికముఖరవ
మలయానిలభాసురములు మధువాసరముల్.

వ. ఓరీ, పారిపార్శ్వక, యిటువంటి మధుమాసమందు భోసల కుల కలశాంబోధి పూర్ణచంద్రు మాలోజీరాజపురందరనందన సాహసాంకశాహమహారాజ తనూజభామామనోజైక మహారాజ కుమార శాహమహారాజ శరభభూపాలానుజుండగు, తుళజవసుంధరా పురందరుండు ఆదివరాహస్వామికి మహోత్సవంబు గావింపగోరి సకలదేశములయందుండి రసికవిద్వజ్జనులు వచ్చినారోయి.

సురుచిర పుణ్యశీలు లనసూయులు సర్వకళావిదుల్ దయా
పరులు కృతజ్ఞు లుత్తములు పావను లీ సభవారు మెచ్చ భా
సురతుళజక్షితీశకృత. దమన శివకామసుందరీ
పరిణయరూపనాటకము బాగుగ నాడుద మీ సభాస్థలిన్."

సూత్రధార పారిపార్శ్వకుల సంభాషణ శివాజీ మహారాజ కృత అన్నపూర్ణాపరిణయ నాటకము మఱింత విశదముగ వర్ణింప బడియున్నది,

"సూ. వ. ఇటువంటి పట్టణంబునందు సకల విద్యాప్రవీణు లయిన సభ్యులు గూడియున్నారు గనుక యీ సభ కుచితంబైన అన్నపూర్ణాపరిణయంబను, నూతన నాటకంబు నటియింపజేసి ఆత్మను కృతార్థత జెందవలెనని యిచ్ఛయిస్తున్నాను."

పా. ఎవరయ్యా యీ దివ్యప్రబంధ నిర్మాత ?
సూ—క. వివిధాలంకృతి గలిగినదు
భువిజనులను ప్రేమబ్రోచు పుణ్యాత్ముడై
అవిరళదాన ఘనుండై
కవినుతుడు శివాజిరాజు ఘన సద్గుణుడై.

పా—సకలకళాప్రవీణుండైన శ్రీ శివాజీ రాజేంద్రుడా యీ గ్రంథ నిర్మాత. అయితే మన మనోరథంబు లన్నియు సఫల మగును. అతని గుణాతిశయములను వినవలెనని యిచ్ఛయిస్తున్నాను.

సూ—చెప్పెద విను."

అన్నపూర్ణాపరిణయమున మఱియొక విశేషము గానవచ్చు చున్నది. అన్ని యక్షగానముల వలెను నిది యేకాంకమైన నాటకము గాదు. ఇందు రెండాశ్వాసములు గలవు.

"ఇతి శ్రీమద్భోసలకుల కలశాంబునిధి పూర్ణశశాంకభూమండలాఖండల శ్రీ శివాజీ మహారాజ ఛత్రపతీ నృపవరవిరచిత అన్నపూర్ణాపరిణయంబను ఆంధ్రనాటకమునందు ద్వితీయాశ్వాసము."

అని తెనుగు సంప్రదాయానుసారము గద్య విరచింపబడినను నీయాశ్వాసముల నంకము లనియె చెప్పెడివారు.

ఉ. "౭. అన్నపూర్ణాపరిణయము. తంజపురమున నుండు కొంకణేశ్వర అన్నపూర్ణల పూర్వోదంతము. వారి పరిణయము అనునవి యీ నాటకమున జెప్పబడును. 1-2 అంకములు." అని పుస్తక భాండాగారికుల వివరణ. అంకవిభజనమును ప్రథమమున ప్రవేశపెట్టిన వాడు శివాజీరాజుగాడు. అతనికి ముందుతరమువాడైన మాతృభూతన తన పారిజాతాపహరణము నైదంకములుగ విభజించి యున్నాడు.

"ఇది...శ్రీమత్సుగంధికుంతలేశ్వర కటాక్షవీక్షణ సుధాసారసంజనిత చతుర్విధకవితా నిర్వాహక శాండిల్యగోత్రపవిత్ర కవిరంగ యార్యపుత్ర విద్వజ్జన విధేయ మాతృభూత కవినామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకమందు...సర్వంబును పంచమాంకము."

అని స్పష్టముగ జెప్పినాడు. దీని కనుగుణముగనె పుస్తక భాండాగారికులు 'పారిజాతాపహరణ నాటకము 1-5 అంకములు' అని వివరణము వ్రాసియున్నారు. విజయరాఘవనాయకుడు చూపిన దారి తంజాపురాంధ్ర యక్షగానకర్తల నింతదూర మీడ్చినది; కాని యాంధ్రదేశములోని యక్షగాన కర్తలు వారి ననుసరించినట్లు లేదు. వారు విజయరాఘవుని కైవారముతోడనే తృప్తిజెందినట్లున్నది. ఆంధ్రదేశమందలి యక్షగానముల నేకములు 'కటిక' లేక 'చోపుదారి' వాని ప్రవేశముతోడనే ప్రారంభమగును. యక్షగానప్రదర్శనములను గాంచినవారికి 'కటికవాడు వచ్చెనూ,' 'చోపుదారివాడు వచ్చెనూ,' 'నాపేరు డబ్బుడుబ్బు చందమామా నా పెండ్లాంపేరు ముద్దులగుమ్మ చందమామా' అను ప్రారంభగీతములు స్మరణకు రాకపోవు. 'కటికవా' డన్నను 'చోపుదారి' యన్నను కంచుకి. ఈకంచుకి యే కైవారముసేయువాడు. ఆంధ్రదేశ యక్షగాన రచయితలు తంజావూరివారి మార్గము ననుసరింపక పోవుట కొకముఖ్య కారణము గాన్పించుచున్నది. విజయరాఘవుడు తంజావూరు నింకను పాలించుచుండగనే రాయసామ్రాజ్య మస్తంగతమైపోయినది. తరువాత యల్పకాలముననె తంజావూరాంధ్ర నాయకరాజ్యము నాశముందినది. అంతకుముందె జింజినాయకరాజ్యము తురకలకు హస్తగతమైనది. మధురనాయక రాజ్యము మఱికొంతకాలము వెలసినను మధురవారికి రాజకీయములందుగల యభిరుచి సారస్వతమునందు లేదు. కావున విజయరాఘవుని యస్తమయముతో నాంధ్రులకు, ముఖ్యముగ కవిగాయకాది కళారాధకులకు, ద్రావిడదేశముతో సంబంధము తెగిపోయినది. రాకపోకలు సంపూర్ణముగ నాగిపోయినవి. కావున ఆంధ్రదేశ నాటకకర్తలకు యక్షగానరచనయందు మహారాష్ట్రప్రభుపుల యాజమాన్యముక్రింద సంఘటిల్లిన మార్పులు తెలియకపోయెను.

కైవారభరతవాక్యముల స్వీకార మొక్కటి మాత్రమేగాదు యక్షగానమున విజయరాఘవనాయకుడు తెచ్చిపెట్టిన మార్పు, త్రిపుటాది రగడరచనలను బహుళముగ విసర్జించెను; దరువులను ప్రవేశపెట్టెను. ఇది కడు ముఖ్యమైనది. తరువాతి యక్షగాన రచనలలో నీ దరు వెంతటి ప్రధానస్థానము నాక్రమించెనో కనుగొంటిమేని యీ మార్పుయొక్క యాధిక్యము విశదము కాగలదు. విజయరాఘవు డొనర్చిన మార్పులలో ముఖ్యతమమైనది సంభాషణ. సంభాషణ యనగా నాటకపాత్ర లొండొరులతో మాటలాడుకొనుట. పాటకు బదులు పాట, గీతమునకు బదులు గీతమును పాడుటయు సంభాషణ కావచ్చును; కాని సాధారణముగ సంభాషణ యన వాడుకగ జనులాడునట్లు వచనమున పాత్రలు పరస్పరము మాట్లాడుకొను మాటలను సంభాషణయన యొప్పును. సంభాషణలు సుగ్రీవవిజయమునందుగాని దాని పద్ధతి ననుసరించి రచింపబడిన విష్ణుమాయావిలాస నాటకమునగాని కానరావు. ముందు వచన వివరణ లేక పాత్రలు గీతముల బాడరు. ఒక యుదాహరణము.

"అని పలికి తన యెదుర నున్న సుగ్రీవునిం జూచి తార యేమనుచున్నది.

"భానువంశజుడు నీపాలింటి
దైవమై జానకీశ్వరు జంపె వర్ధిల్లు మికను
ఏపాటి పౌరుషము కాన్పెనిందుల నీకు
బాపమని మదిలోన బరికింపవైతి
నీ కోరినట్లయ్యె నీ తపం బీడేరె గైకొని
యేలు మీ కపిరాజ్యమెల్లన్."

"అని సుగ్రీవునిం దూఱి రామచంద్రుని గనుంగొని యేమనుచున్నది."

"అలిచెఱగొనిపోయినట్టి దశాస్యు డుండగ
నిర్నిమిత్తము వాలి నేటికి జంపితివి రఘువంశతిలకా."

* * * *

"అని పలుకు సమయంబున వాలి మూర్ఛం దెలిసెనప్పుడు తన సమీపంబున శోకబాష్పకలితనేత్రుండయి తల వంచుకొని యున్న సుగ్రీవునిం జూచి యేమనుచున్నాడు.

"వగచేల సుగ్రీవ వైరమెల్లను దీరె
జగమెఱుంగగ రామచంద్రునిచే నిపుడు."

ఇది ప్రాచీన యక్షగానపద్ధతి. పాత్రల కొండొరులతో విశరణ పీఠిక లేని సంభాషణయే లేదు. నాటకప్రదర్శనము జూచు ప్రేక్షకులకు అడుగడుగునకు నాటకకర్తగాని ప్రదర్శకులలో నొకడుగాని కథను వివరించవలసియుండెను. విజయరాఘవున కిది నచ్చలేదు. ఈ ద్రావిడ ప్రాణాయామమును విసర్జించి పాత్రల నొండొరులతో ముఖాముఖి సంభాషింపజేసినాడు. విప్రనారాయణ చరిత్రలో నక్క చెల్లెండ్ర సంభాషణం జూడుడు.

### పదం - మధ్యమావతి - ఆటతాళం.

చెల్లె: పందెము జెల్లెగదే, ఓయక్క, పందెము జెల్లెగదే,

అక్క: వీని కందుమాటల కరగించినపుడె నీపందెము జెల్లెనే బంగారుచెల్లె,

చెల్లె: వలపించరాదంటివే, ఓయక్క, వలపించరాదంటివే

అక్క: (అ) వలరాజువైనను వలపించ నేర్తువ, చెలియ కలికి అంగరంగపు కావా నీవు.

చెల్లి: నీ చిత్తము వచ్చునా, ఓయక్క, నీచిత్తము వచ్చునా.

అక్క: నీ చెల్వుజూచిన నిలువున కరగరె ఓచెల్ల, భూసుర ఖేచరులైనా.

పాటలయందే కాదు, సాధారణమున జనులాడు రీతి వచనము నను సమకూర్చినా డిట్టి సంభాషణను. చూడుడు.

దేవదేవి: ఓ పరమయోగీంద్రా, నాయక్క తను జూడ బిలువ నంపినది. ఊరిదాక పోయి వచ్చేనయ్యా.

విప్ర: ఓవాలుగంటి నీజంట బాసి యొంటి నుండ నేర్తునా ? నీవెంట వచ్చేనే.

దేవదేవి: అయితే విచ్చేయవయ్యా.

ఈ సంభాషణను సంస్కృత నాటకసంప్రదాయము ననుసరించి పాత్రోచితభాషయందు నడపించినాడు. రఘునాథాభ్యుదయములో సంప్రతికరణముల సంభాషణమును వినుడు.

'కస్తూరిమాట: ఏనయ్య రంగయ్య ధర్మాసన మొదలాద లెక్కన ముఖదల్లి హేళిదెల్ల శాణు వెలి. అవరవరుహిడిదలంచపరిధానవ హేళ బేడాయందు నినగె అవరవరు ప్రియ హేళిద్దు, నానరియనే.

అట్టవణరంగయ్య: నీ నేను బల్లెయయ్య అంథాద్దు ఉంటాదరె రూపిసు. యేనుబగు ళు తిద్దియ.

చిదంబరనాథ మొదలారి: సముఖత్తిలె నీంగళ్ అవచ్చి పడ్రీర్, ఎల్లాం కర్తాగళ్ చిత్త. అరియుం. సుమ్మ యిరుంగో.'

విజయరాఘవుని సహధర్మచారిణినని చెప్పుకొన్న రంగాజమ్మ భర్త ననుగమించుట సహజమే. కాని యామె భర్తను గ్రిందుపఱచినది. అతనివలె కేవల పాత్రోచిత సంభాషణతో దృప్తినందక దానితో హాస్యరసమును మేళవించినది. వాకిటి గొల్లలసంభాషణ నాలకింపుడు. ఇది దీర్ఘమైనది. సంగ్రహముగ నుదాహరించినను దాని రీతి తెలియగలదు.

గొల్లల చేరువకాడైన మల్లుగాడు: 'అదొండ్రా వాకిట' సంద్దడి, మిణమిణా యొండ్ది, మరమరా యొండ్డి, మిరమిరా యొండ్డి, సెయి సెయరా వోరి, వొగె వొరె చిన్న మల్లుగ, వొరెవొరె పాప, వొరె వొరె చినసూక వొరెవొరె పెదబొమ్మ, వొగెవొగె చినబొమ్మ. యీడ కూశికొంజే వాండు తవుగొ అంట్టావుంట్టే సువ్వా! వొరెవొరె కూడుదినివస్తి వంట్టరా, కూరా కేమిరా ?

మఱొక గొల్లమాట: వొరె కూరాకె అల్ల బాంపనవాండు సొర కాయ గానుగ బిండిన్ని యిచ్చరా.

మొదటిగొల్ల అడిగేది: వొరెయే బాంపనవాండ్రా.

మఱొక గొల్లమాట: వొరె ఆ బక్క లావాటివాండు, పొట్టి పొడుగాటివాండు, వొక కన్ను వూనం వొక కన్ను తెలియదు. చెవిటివాండు, కాలు కుంట్టుతా వచ్చునే నిమ్మపండువలె నల్లని బాంపండు వాండు.

సంభాషణమువలన యక్షగానమున జకిము తొలగి చైతన్యము గలిగినది; వాస్తవికత యేర్పడినది. నాట్యకీయ ప్రధానమైన యక్షగానము నాటకముగ పరిణామ మందినది సంగీత నాట్యశాస్త్ర వేత్తలకే కాక జనసామాన్యమునకు గూడ గ్రాహ్యము కావలన నెల్లవారి యాదరాభిమానములకు పాత్రమైనది. ఇది విజయరాఘవుని సంస్కారములకు ఫలితముగ యక్షగానమునకు గలిగిన మేలు. ఇతని సంస్కారము లనేకములు తంజావూరునను నాంధ్రదేశమునను నాటకరచనకు బూనుకొనిన యర్వాచీన నాటకకర్తలచే పాటింపబడినవి.

యక్షగాన రచనావిధానము విజయరాఘవుని మార్పులతో సంపూర్ణత నంది యట్లే సుస్థిరమై నిలిచిపోలేదు. అన్యసంపర్కము వలన క్రొత్తరీతులు జనానురాగమును బొందినవి. క్రొత్తసంచనములు బయలువెడలినవి; కాని యీ మార్పుల నన్నిటిని బరిశీలించి సమగ్రమైనయక్షగాన చరిత్రను రచించుటకు సరియైన కాల మింక నాసన్నముగా లేదు. ప్రాచీన యక్షగానము లన్నియు నుద్రణభాగ్యమందక పుస్తకభాండాగారములందు క్రిమిదష్టములై క్రమక్రమముగ నశించుచున్నవి. ముద్రితములైనవి గూడ నముద్రితప్రాయములై యాశ తర్థానమై పోయినవి. సినిమాయుగమున నాటకములకే యవసానదం వచ్చినదట. యక్షగానముమాట వేఱుగ చెప్పవలయునా. కళాభిమానుల యత్నమువలన యక్షగానములన్నియును ముద్రితములై సరిశోధకులయందుబాటుకు వచ్చినగాని వాని సంపూర్ణ చరిత్ర వ్రాయుటకు సాధ్యము గాదు.



# ఉత్తమ భవన నిర్మాణ దర్శిని




శిల్పులకు, నిర్మాతలకు, కంట్రాక్టర్లకు, ఆధునిక భవన నిర్మాణపు డిజైన్లను తెలుసుకొన గోరువారందరికీ ముఖ్యమైనది



గ్రౌండ్ ప్లానులతోను, పర్‌స్పెక్టివ్ డ్రాయింగులతోను కూడిన చిత్రాలతో (వీటిలో అనేకం సంపూర్తిగా రంగు చిత్రాలు) కూలంకషంగా విశదపరిచే ఈ "80 డిజైన్లు" భారతదేశపు విఖ్యాత శిల్పు లనేకుల సంయుక్త కృషిఫలం. కార్మిక నివాసాలనుంచి, పబ్లిక్ లైబ్రరీలు, స్కూళ్లవరకు పలువిధ భవనాలు ఇందు చిత్రింపబడినవి. ఇవి భారతదేశ పరిస్థితులను, వస్తుసామగ్రిని దృష్టి నుంచుకొని ప్లాను చేయబడినవి. విషయ వివరణంలో కట్టడాల యొక్క ప్రయోజన, అలంకరణ అంశాలను రెంటినీ, సాకల్యంగా సాధికారంగా చర్చించబడింది. అత్యంతాకర్షణీయమైన 112 పుటలు కలిగిన ఈ "80 డిజైన్లు" ఆధునిక ప్లానింగును తెలిసికొనగోరే పౌరునికీ, భవన నిర్మాణం వృత్తిగా కలవారికీ కూడా ఒకే విధంగా అమూల్యమైనది. దీని వెల రు. 5/-లు మాత్రమే! వి.పి. ప్రతి కోసం నేడే కూపను పంపించండి!

## 112 పుటలు రు. 5 లు మాత్రమే

పోస్టేజికి అ. -/8/- అదనం.

## కొద్ది ప్రతులే ఉన్నవి .... ఈ కూపనును ఇప్పుడే పంపండి!

## ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్.



అసోసియేటెడ్ సిమెంట్ కంపెనీస్ లిమిటెడ్.

కి సేల్సు మానేజర్లు

**కూపను**

డి కాంక్రీట్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా,

9, మౌంట్ రోడ్డు, మద్రాసు.

దయచేసి "80 డిజైన్ల" ప్రతి ఒకటి నాకు వెంటనే పంపండి. నేను నేడు రు. 5/8 లకు మనియార్డరు పంపినాను.

పేరు..................................................

అడ్రసు..................................................

A. P.



# మీ ప్రభుత్వమువారిచే తయారుచేయబడిన వస్తువులనే వాడండి

ఉత్తమమైన వీటి నాణ్యత నిరంతర
పరిశోధనా ఫలితము. వీటి ఆదాయము
జాతీయ పరిశ్రమాభివృద్ధికి తోడ్పడును.

## కేరళ సబ్బులు

స్నానమునకు, క్షౌరమునకు బట్టలుతుకుటకు

పరిశుద్ధమైన తైలమునుండి తయారైనవి.

**కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్,**
కాలికట్.

## షార్కు లివర్ ఆయిల్

యం. జి. బి. (కాడ్ లివర్ ఆయిల్ ను పోలినది), మరియు సారవంతమైన విటమినులు సమకూర్చే "ఎడామిన్"

**గవర్నమెంట్ ఆయిల్ ఫ్యాక్టరీ.**
కాలికట్.

## కొల్లేగాల్ సిల్కులు

నెమలిమార్కు ముడిసిల్కు, సిల్కుగుడ్డలు.

**గవర్నమెంట్ సిల్కు ఫిలేచర్,**
కొల్లేగాల్, కోయంబత్తూరు జిల్లా.

## ఆంధ్ర పేపర్లు

(వ్రాతకు, ముద్రణకు ప్యాకింగుకు కాగితములు

**ఆంధ్ర పేపర్ మిల్సు,**
రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా.

## గూడూరు సెరమిక్సు

పింగాణీ పాత్రసామగ్రి, శానిటరీ సామగ్రి

**గవర్నమెంట్ సెరమిక్ ఫ్యాక్టరీ,**
గూడూరు, నెల్లూరు జిల్లా.

పారిశ్రామిక - వాణిజ్యశాఖ







| ఆంధ్ర చిత్రమండలాలు: | మైసూరు స్టేట్: | నైజాము స్టేట్: |
| --- | --- | --- |
| మెసర్సు నవయుగ ఫిలిమ్సు | మెసర్సు ప్రకాశ్ పిక్చర్సు | మెసర్సు కర్బతాలా ఫిలిమ్సు లిమిటెడ్ |
| విజయవాడ | బెంగుళూరు సిటీ | బెంగుళూరు |

వివరములకు: ప్రకాశ్ ప్రొడక్షన్సు, శాంతోం, మద్రాసు.

**కథానిక:**



# తనని గురించిన నిజం

" బుచ్చిబాబు "



'నేనెందుకు మంచివాణ్ణిగా వుండాలి?' అని భార్యను కసురుకున్నాడు, రామ్మూర్తి. ఆ ప్రశ్నతో శాంతమ్మ ప్రశాంత జీవితంలో తుపాను చెలరేగిందనొచ్చు.

ఇంతకీ తాను చేసిన అపరాధం ఏమిటి? బెల్లం కలిపిన కాఫీ యిచ్చింది. భర్త కాఫీ తాగిం తర్వాత 'ఇది నాలుగో మాసం' అన్నది. అంతే...

ఈ మాత్రానికి భర్త చేసిన వింత వ్యాఖ్యానం వితర్కించు కోటం కోసం, పెద్దబ్బాయి 'రఘు' తో వంటింట్లో కెళ్లింది. శాంత. ముగ్గురు పిల్లల తల్లి; మొగపిల్లలే. పెద్దాడిముందు అల్లా విసుక్కోడంలో అర్థమేమిటి? వాడి కింకా తొమ్మిదో ఏడే. ఏనా ఏ మనుకుంటాడు? ఏమిటి మంచితనం? చేసుకున్న పెళ్లానికీ, కన్న పిల్లలకీ యింత కూడెట్టడమేనా? ముందుంది ముసళ్ల పండగ. ఈసారి ఆడపిల్లైతే సరేసు. అబ్బాయిల 'సతుకు' లున్నాయి. బెల్లంకూడాలేని కాఫీ, మహారాజులా తాగలా? సంసారంలో ఎన్నెన్నో చిక్కులు, యిబ్బందులూ వుంటాయి. దగ్గర దగ్గరగా ఇరవైయేళ్లనుంచి చేస్తున్న కాపరంలో ఎన్నో అవాంతరాలు సంభవించాయి. వాటన్నింటినీ సర్దుకుపోలా? ఎప్పుడేనా యిల్లా విసుక్కున్నారా? ఏనా, ఎందుకు మంచివాణ్ణిగా వుండడమేమిటి, నా తలకాయ...! హాల్లో అద్దంలో తన మొహం చూచుకుంది శాంత. ఏదో భావం స్ఫురించినట్లు—చిరునవ్వుతో పెదవి వొంపు తిరిగింది. ఆ నవ్వు మాయమవకుండానే భర్త దగ్గర కెళ్లి, "ఓవేళ మూడో మాసమేనేమోలెండి" అంది.

రామ్మూర్తి మాట దిగమింగేసుకొని, ముందు గదిలో కెళ్లి. పేపరు చదువడానికి యత్నం మొదలెట్టాడు. ఇందాక దిగమింగిన మాటని పైకనుకొని విన్నాడు. "ఇంకెంతకాలం మంచిగా వుండటం?" మూడో మాసమైతే యింకా ఏడు నెలలా? బల్ల మీద అద్దంలో మొహం చూచుకున్నాడు. కళ్ళకింద గీట్లు స్ఫుటంగా అవుతున్నాయి. తల్లో నెరుస్తున్న వెంట్రుకల సంఖ్య పెద్దదవుతోంది. రెండుమూడు రోజులదాకా క్షురకర్మ చేసుకోకుండా వుండడానికి వీల్లేదు. లెక్కకి పదహారు తెల్ల వెంట్రుకలు గడ్డం కింద; మళ్లా జాగ్రత్తగా లెక్కపెట్టాడు. పదిహేనే. రెండో వాడు "సేతు" బల్లకింద సిరాబుడ్డితో ఆడుకుంటున్నాడు. ఇదుగో యీ పిల్లలే కారణం. సంతానం కలిగినప్పుడెల్లా, ఏదేసి నెరిసిన వెంట్రుకలు. సిరాబుడ్డి లాక్కొని, 'సేతు' వీపుమీద వొక్క చరుపు చరిచి తోసేసి, తలుపు గడియపెట్టి, రామ్మూర్తి తన నిజ స్వరూపంతో పెనగులాట సాగించాడు.

రెండుమూడు నెలలనుంచి, మహత్తరమైన మానసిక శక్తులతో భర్త పెనుగులాడుతున్న సంగతి, పాపం, శాంత తెలుసుకో లేదు. మనిషికీ మనిషికీ మధ్యలోనే కాదు గోడ లుండటం. ప్రతి మనిషిలోనూ వొక పల్చటి తెర వుంటుంది. ఆ తెర వూడిపోకుండా సంఘం కాపలా కాస్తుంటుంది. కాని రాత్రి ఎప్పుడో— మండువేసంగి రాత్రి మైమరచి నిద్రపోతుండేనో, వాన చినుకులు పడి భూమి పొంగినప్పుడో—ఎప్పుడో ఎందుకో తెర విడిపోతుంది. నిజస్వరూపం భయంకరంగా, కనబడుతుంది. విసుక్కుంటుంది; తిడుతుంది; కొడుతుందికూడా. అతని మనస్సులో తెర యిప్పుడు తొలగింది.

రామ్మూర్తికి నలభయ్యో సంవత్సరం వొస్తోంది. సంసారానికి అతన్ని కట్టిపడేసిన సంకెళ్లు తెగాయి. సంఘానికి అర్థమయ్యే గౌరవమైన భావాలు,—'మర్యాదభాష' మాట్లాడా లంటే అతను కష్టపడాలి. అతని ఆంతర్యంలో కలిగిన చాంచల్యం, ప్రజాస్వామ్య రాజ్యాంగంపై వ్యక్తిత్వం చేసిన తిరుగుబాటు. అనాదినుండీ, కళలు, సంస్కృతులూ దేనికోసం ప్రార్థిస్తున్నాయో, అది అతనిలో అవతరించింది. మతానికీ, సాంప్రదాయానికీ, కట్టుబాట్లకీ, నియమాలకీ లొంగని వ్యక్తిత్వ ప్రకర్ష, అస లదేమిటో తెలుసుకుంటే అది సంభవమే కాదు.

ఈ మార్పుకి కారణం కొంతవరకూ శారీరకమే. గతించిపోతున్న యవ్వనానికి శరీరంయిచ్చే వీడ్కోలు తాలూకు కోలాహలం; ఆరిపొయ్యేముందు ప్రజ్వరిల్లిన మంటలాంటిది ఆ అనుభవం. జీవితం పాదాలకిందనుండి జారిపోతున్నట్లు ఏదోభయం. ఇల్లు, వుద్యోగం, పిల్లలు, తిండి, నిద్ర—యింతేనా? ఇంకే మీ జరగదు? తన వునికిని సంఘం గుర్తించినట్లు నిర్ధారణలేదు. పిల్లల ద్వారా, భార్య పరిపూర్ణత చెందొచ్చు; నిర్ధారణ చేసుకోవచ్చు. తన కది చాలదు. పిల్లలు తనజీవితంలో ఆహ్లాదకరమైన మార్పు తీసుకురాలేదు. పైగా ముగ్గురూ వాళ్లమ్మపోలికే— శాంత అనాకారి కాదు. ఏనా ఆడ పిల్లలుండి వాళ్లకి ఆ పోలిక వస్తే, అందంగా వుండి వుందురేమో... ప్రస్తుతంలో పిల్లలు అతనిలో తెచ్చిన మార్పు, అతన్ని పెద్దవాడికింద చెయ్యడం; ఇంక ఆరునెల్లల్లో అతను వృద్ధుడన్నమాటే! శాంత సౌందర్యాన్ని, అతని యవ్వనాన్ని ధ్వంసంచేసేందుకు యీ పిల్లలు.

రామ్మూర్తి చిన్నతనంలో ఎన్నో మధురమైన కలలు కన్నాడు. పాశ్చాత్య సంపర్కంవల్ల అతనిలో విప్లవపూరితమైన ఆదర్శాలు వుద్భవించాయి. పెండ్లి, ప్రేమ, సంతానం, వీటిని గురించిన ఆధునిక తత్వం అతనికిబాగా పట్టు పడింది. అ దంతా ఏమైంది? అందరికీ

మళ్లీనే వివాహం చేసుకున్నాడు. ప్రేమించి చేసుకున్న పెండ్లి కాదు. శాంత ప్రేమనుగురించి ఎప్పుడైనా మాట్లాడిందా? శాంత ప్రేమించడం అన్నభావమే హాస్యాస్పదంగా తోస్తుంది. పెరిగిపోతున్న జనాభాసమస్య మరిచిపోయి అందరిలాగే పిల్లల్ని కన్నాడు. కళాతృష్ణ, కార్యసాఫల్యత, అన్వేషణ, సంస్కారారాధన— అన్నీ మంటగలిసినై. జీవితంలో ఔన్నత్యం, నూతనత్వం, ప్రతిభ-ఏవీ లేవు. ప్రజాస్వామ్య ప్రభుత్వంలో పౌరుడల్లే అతనొక సామాన్యమానవుడై కనీసపు హక్కులకోసం పెనుగులాట మాని, గాంధీగారాదేశించిన బాధ్యతల్ని నిర్వహించుకునే గతి పట్టింది. ప్రజాస్వామ్యం పేలవంగా తయారవగల్దు.

రామ్మూర్తి హృదయంలో కలిగిన యీ పరివర్తనని, జాత్య జీవితప్రకర్ష అనొచ్చు. కొందరికిది అరవయ్యోయేట సంభవించొచ్చు. మరికొందరికి, సలభయ్యోయేట జరగొచ్చు. అవుతే, యీపరివర్తన అందరికీ కలుగుతుందా అంటే చెప్పలేం. బహిర్గతంగా ఋజువుకాక పోవచ్చు అందరిలోనూ. పెండ్లిచేసుకున్న వారందరూ ప్రేమని పొందగలిగారా? తనమట్టుకు తను—స్త్రీకోసం వివాహాన్ని అగీకరించాడని వొప్పుకోకతప్పదు. కోర్కెలని సాధించలేని వారందరూ, విషాదజీవులయి, కళాకన్యముసుగు తొలగించి, కన్నీటిని స్పృశించి అమరజీవులుగానో, అనామకులుగానో, కాలవాహినిలో కలిసిపోతున్నారు. వీరివి నశించిపైన జీవితాలు; కొందరికి అట్లా నశింపు కావడమే జీవిత పరమావధి. రామ్మూర్తి చెడ్డవాడై నశించడానికి సమకట్టాడు.

తనమీద విసుక్కున్న నెలరోజులకే ఈ మార్పుకి నిదర్శనాలు, శాంతకిదొరకడం మొదలెట్టాయి. ఆ రోజున రామ్మూర్తిగారు ఇంట్లోలేడు. కాంప్ వెళ్ళాడు. పోస్టుబంట్రోతు కవరు తెచ్చాడు. అది రామ్మూర్తిగారికే. బల్లమీదపెట్టింది. సాయంత్రానికి, మూడో కుర్రాడు 'గోపి' యథాప్రకారం విధ్వంసక యజ్ఞం సాగించాడు. వాడిదృష్టికి గోచరంకాని వొస్తువులుకొద్ది. ఈ కవరు వాడి సిద్ధహస్తాల్లోపడి నశింపుకాబోయే అవస్థలో శాంత దాన్నిలాక్కుంది. లోపల వుత్తరం తెలుగులోవుంది. అడ్రెసు, తేదీ లేవు. శాంతకి నాగరికతాత్వం తెలియదు. ఉత్తరంచదవడం తప్పనుకోదు. భర్త ఆ చర్యని ఆమోదిస్తాడుకూడా. వారి అన్యోన్యానికి అదొక చిహ్నం.

"ప్రియమైన మూర్తి—ఎంతో సాహసంచేసి యీ వుత్తరం వ్రాస్తున్నాను. నీకు భార్యా, పిల్లలు వుండడంవల్ల నే నింతవరకూ తెగించలేకపొయ్యాను. జీవితం గతించిపోతూ ఎప్పుడో అప్పుడు తెగించి దౌర్జన్యం చెయ్యాలికదా...ఇంతవరకూ అణిగివుండగలగడమే మనం సంఘంకోసం చెయ్యగలిగిన త్యాగం. నువ్వు నన్ను ప్రేమిస్తున్న విషయం ఏనాడో తెలుసు. కాని నా విషయం నీ కంతగా తెలియదనుకుంటాను. భారత స్త్రీ ఆశ్వేషించదు. తలుపు సందున చూస్తూ నిరంతరం వేచివుంటుంది. తలుపుతోసి నువ్వు లోపలికొచ్చావు. నేను గడప దాటక తప్పిందికాదు. ఎప్పుడో నన్ను ఏకాంతంలోకి తీసుకెడతావని ఆశిస్తున్నా. ఇవాబుకోసం నేను వేచియుంటను. నాకు వుత్తరా లెందుకు.? కావల్సిందేమిటో నీకే తెలుసు—నీ ప్రియ భారతి."

ఈ "ప్రియభారతి" ఎవరా అని శాంతమ్మ క్షణం ఆలోచించింది. ఈ ఇరవై సంవత్సరాల్లోనూ భారతి అన్న వ్యక్తిగాని పేరుగాని, వారి జీవితంలోకి రాలేదు. ఆశ్చర్యంతో వొక్కసారి ఆమె కళ్లు తళుక్కుమని మెరిశాయి.

రామ్మూర్తి కాంప్‌నుంచి యింటికి రాగానే, చించిన కవర్ను గురించి అడిగాడు.

"అబ్బాయి చింపబోతుంటే తీశాను" అన్నది శాంత.

"చదివావా ?"

"ఆఁ"—అని, శాంత యింట్లో కెళ్లిపోయింది. తర్వాత ఆ వుత్తరం విషయం ఎవరూ ప్రస్తావించుకోలేదు.

మరో రెండు వారాలు గడిచింతర్వాత, మంచంకింద వూడుస్తుంటే పని పిల్లకి మరో వుత్తరం దొరికింది. తీసుకెళ్లి శాంతమ్మగారి కిచ్చింది.

"నువ్వు ఎప్పుడూ నాకు సుకుమారుడువిగానే కనిపిస్తావు. వయసులో నువ్వు పెద్దయినా, హృదయంలో పసిపాపవు— లాలించ బుద్ధేస్తుంది. వయసు ముదిరిన కొద్దీ మనసు లేతదవుతుందనుకొంటాను. వార్ధక్యంలోపండి, పండులా రాలిపోతుంది. అప్పటికి నా జడలో పువ్వు వాడిపోతుంది. పండు, పువ్వు రాలి, మోడు మిగుల్తుంది. ఆ మోడు నీ భార్య, కొమ్మలు నీ సంతానం. నీ ప్రియ భారతి."

శాంత ఆ వుత్తరం మడిచి, భర్త కిచ్చేశింది. "ఏదో కాగితం మీదే ననుకుంటా" అన్నది.

"అవునవును" అని రామూర్తి ఆతృతతో తీసుకున్నాడు. ఎవరూ, ఏమీ మాట్లాడలేదు.

నెల గడిచింతర్వాత "రఘు" న్యూసు పుస్తకాలు సర్దుకుంటుంటే మరో వుత్తరం దొరికింది. చదవబోయ్యాడు; భయపడి మానేసి, తీసుకెళ్లి అమ్మ కిచ్చాడు "రఘు."

"ఏమిటే అమ్మా వుత్తరం ?"

"ఏవో వారి ఆఫీసు కాగితాల్లే..."

"అల్లా లేదే."

"నీ మొహం"

"కాదే—ఎవరో వొకావిడ రాసినట్లుందే..."

"స్వరాజ్య మొచ్చింది కాదుట్రా ఆడవాళ్లుకూడా వ్యవహారాలు స్వంతంగా చూసుకుంటారమ్మా..."

"నాన్నని అడగనా ?"

"ఎందుకూ ఆయనే అడుగుతార్లే." "రఘు" న్యూసులు కెళ్లాడు. శాంత ఆ వుత్తరం చదివింది.

"మీ భార్య చాలా అమాయకురాలనీ, మంచిదనీ వింటాను. నన్ను హర్షిస్తుందనుకుంటాను. నిజంగా అట్లా జరిగితే మన కింకేం కావాలి—మన కలలన్నీ యదార్థాలవుతాయి. ఎంతటి దుర్భర జీవితాలైనా, మీకోసం హర్షించగలను. ప్రేమ చూపలేని

చేర్పు, సాధించలేని కార్యం ఏముంది? రాత్రి కలలో కారిన కన్నీటితో దిండు తడిసింది. జడలో పుష్పం సిగ్గుతో ముడుచుకొని మొగ్గయింది. మీరు కోస్తేనే వికసించడం...నీ ప్రియ భారతి..."

భద్రంగా యీ వుత్తరాన్ని మడిచి భర్త బల్లమీద పెట్టి, ఎగిరిపోకుండా పేపరు వెయిట్ వుంచింది శాంత.

రెండో నెల పూర్తయేసరికి, నాలుగో వుత్తరంకూడా వంటింటి గుమ్మం ముందే దొరికింది. అప్పుడు రామ్మూర్తి యింట్లోనే వున్నాడు. యిల్లంతా దేనికోసమో వెదుకుతున్నట్లు గాలిస్తున్నాడుకూడా "ఇక్కడ కొన్ని కాగితాలుండాలి— ఎవరేనా చూశారా?" అన్నాడు.

"ఏం కాగితాలు నాన్నా...?" అన్నాడు రెండోవాడు "సేతు"

"ఇదేనా?" అంటూ శాంత, గుమ్మంముందు పడివున్న వుత్తరం తీసి మడిచి భర్తకిచ్చింది.

"ఆ—యిదే, యిదే," అని దాన్ని తీసుకుని రామ్మూర్తి వెళ్లిపోయ్యాడు.

ఆ రాత్రంతా రామ్మూర్తికి నిద్ర పట్టలేదు. డాబామీద వెన్నెలగావుంది. లేచివెళ్లాడు. రాత్రి పన్నెండు దాటింది. ఈనాటికి తనభార్య పరాయిస్త్రీగా కనబడసాగింది.

ఆమెతో గడిపిన యిరవైయేళ్లలోనూ స్త్రీ మనస్సు తెలుసుకోడం కష్టమన్న లోకోక్తి వొట్టిదని ఆయన ఋజువుచేసుకున్నాడు. ఏక్షణాన, ఏసందర్భంలో తనభార్య ఏం మాట్లాడుతుందో, ఏమనుకుంటుందో ఏం చేస్తుందోకూడా తనువూహించి, నిర్ణయించగలడు. నిజంగా అల్లాగే జరుగుతుంది. అంతబాగా వొకరిమనస్సు వొకరు తెలుసుకోకలగడం అన్యోన్యానికి ముప్పేకావొచ్చు. అది వేరే విషయం. స్త్రీ హృదయంలో రహస్య మందిరాలు లేవని తెలుసుకున్నాడు.

కాని యీ రాత్రి తనకి తనభార్యని గురించి ఏమీ తెలీదని వొప్పుకోవల్సి వొచ్చినందుకు విచారిస్తున్నాడు. రహస్యమందిరంలో తను దుమ్ము, బూజు దులిపాడు— కాని ఏ వొస్తువుకీ మెరుగు పెట్టలేదు.

స్త్రీకి అసూయ మెండంటారు. తన భార్య ఏమీ అసూయ కనబర్చదేం? పోనీ అసూయక్కర్లేదు. కుతూహలం కనబర్చి "ఎవరండీ యీ ప్రియభారతి అనే మహాయిల్లాలు?" అనేనా అడిగొచ్చుగా? నాలుగు వుత్తరాలూ శాంతలో ఏమార్పూ తీసుకురాలేదు. మాట, వైఖరి, చేష్ట-అన్నింటిలోనూ ఎప్పటిలాగే వుంది. శాంతలో ఆధునికతత్వానికి సంబంధించిన సంస్కారంలేదు. ఉన్నతాదర్శాలు, వుజ్జ్వలభావాలు కనబడవు. "ఇదిమూడో మాసం"— అన్నది ఆమె చెయ్యగల కోమల కవితాగానం. ఆమె పూర్వకాలపు స్త్రీ. యుగయుగాల పవిత్రతతో వాడిపోయిన భరతమాత!

పోనీ, తనేభార్యతో "ప్రియభారతి" విషయం ప్రస్తావిస్తే? "కానీవు అలాగు ప్రకటిస్తా" అని తనే భార్యని కోరవచ్చా...

ఓవేళ భారతి అభిప్రాయాలు, ఆశయాలు, తనకేమీ పట్టలేదేమో? ఒకస్త్రీకి అవతల స్త్రీ ఏమనుకుంటున్నదీ అక్కర్లేదేమో...? ఆమె క్కావల్సింది తన భర్త ఏమనుకుంటున్నాడు. — అన్న వొక్కటేనేమో...?

ప్రియభారతి వ్రాసినట్లుగా తనే ఎడమచేత్తో ఆ వుత్తరాలు నాలుగూ వ్రాశాడు. ఇప్పుడు వాటికి సమాధానంగా తనే కుడిచేత్తో వ్రాసి, తన భార్యకంటబడేటట్లు చేస్తే...? "ప్రియభారతి"ని కవితాకన్యగా సృష్టించుకున్నాడు. రామ్మూర్తి ఆమెచేత మాట్లాడించాడు. ప్రేమించబడ్డాడు. ఇహ ఆమెతో విహరించాలి. ఆమె ఎట్లావుంటుంది?

నేటి ప్రపంచంలో ఆదర్శమైన సౌందర్యాన్ని విడమర్చిచూస్తే, సుప్రసిద్ధతారలు, పుస్తకాలలో నాయికలు, పత్రికలలో ఎడ్వర్‌టైజ్‌మెంటు చిత్రాలు, ప్రత్యక్షమవుతాయి. అనేకమైన అందాలనిగుణిస్తే, పరిపూర్ణ సౌందర్యంసిద్ధించదు. ప్రత్యేకత, అందంలోని ప్రత్యేకత. కోలమొహం, తీర్చినసన్నటి పొడుగాటికళ్లు, పల్చటి ముక్కు, అమాయకంగా ముద్దుకోసం ముడుచుకున్ననోరు, ప్రాణం తెచ్చుకున్నగడ్డి పోచలా సుకుమారమైన శరీరం - ఆకలి దప్పులు లేని అయోమయపు ఆశ, దారుణాలెరగని దైవత్వం, హద్దులులేని అనుభవం, ఆమె "ప్రియభారతి".

తను కొంపతీసి నిజంగా కవినేమోనన్న అనుమానం కలిగింది రామ్మూర్తికి. ఎందుకు కాకూడదూ? కవిత్వం నేర్చుకుంటే వొస్తుందా? అదొక ప్రవాహం. సుడిగాలి. జలపాతం. పేలిద్రవించిన అగ్నిపర్వతం. నలుగురు ముందూ బహిరంగంగా చెబితే అర్థంకానిరహస్యం; వ్యవహారికంగా బైటబడనిసత్యం-కవిత్వం.

ప్రియభారతి సృష్టిలోలేదు. నీలో సౌందర్యం అంతటినీ ఆమెకి ఆపాదించవొచ్చు; నీ అబద్ధపు బ్రతుకు నంతటినీ ఆమెలో యదార్థంచేసుకోవచ్చు. నీరహస్యభావాలని ఆమె చుట్టూ విహరింపచెయ్యవచ్చు. పేలవంగా నిర్జీవంగా వున్న తన జీవితంలో, అలజడి, చాంచల్యం, కోరుతున్నాడు రామ్మూర్తి. వార్తాపత్రిక, తను ఆడని పోటీ ఆటలు మాడ్డం, సినిమాలు, పగటికలలు, ఇవి మిగిలాయి, ప్రజాస్వామ్యంలో సామాన్య మానవుడికి. ఇవితృప్తినివ్వలేవు. ప్రియభారతి అతని పగటికలల చీకటికాంత. ఆమెను అన్వేషించి తెలుసుకోడంలో తనని తానే తెలుసుకుంటున్నాడు. అదే కళాజీవితపు పరమావధి. సామాన్య మానవు లందరూ తలో చీకటి కన్యనీ ఆరాధిస్తున్నారు. ఒకరికొకరర్థంకారు. "నన్ను చూడండి" అని బిగ్గరగా అరుస్తూ వింతదుస్తులు ధరించి వికృతసౌందర్యాన్ని ప్రదర్శిస్తున్నారు. యీ చీకటికన్యకాములు— ఆధునిక కళాకారులు. నేటికళలో సౌందర్యశూన్యతకీ అర్థవిహీనతకీ అగమ్యగోచర దృక్పథానికి యిదే కారణం కాబోలు. ఎవరి కళాసృష్టి ద్వారా వారు తమ నిజస్వరూపాన్ని తెలుసుకోవడం, వీరి ఆధ్యాత్మిక జీవిత సౌధానికి ప్రథమసోపానం.

ప్రియభారతికి రామ్మూర్తి వ్రాసిన ఉత్తరంలో తన్ని గురించి నిజం చెప్పేసుకున్నాడు. ఇదీ ఉత్తరం...

"ఇన్నాళ్లకు తెగించి నువ్వు చేసిన సాహసానికి కృతజ్ఞుణ్ణి. నువ్వు సాహసం చెయ్యగలవన్న ధీమాతోనే నన్ను నీకు దాసుణ్ణిగా

చేసింది. భార్య, పిల్లల్ని గురించి ఆలోచింపకపోలేదు. మానసికంగా ప్రతి వ్యక్తీ స్వేచ్ఛాజీవి; అరాజకుడు. సంసారం సంకెళ్లు భౌతికంగా నన్ను సంఘానికి కట్టిపడేశాయి. ఈనాటికి నువ్వు వాటిని తెంపావు. నేను నిన్ను ప్రేమించలేను. ప్రేమించడ మరిచిపోయాను. నువ్వు నేర్పాలి. నీ ప్రేమతో నాహృదయం వికసించి పెరిగింది. ఆనాడు ప్రేమతో నువ్వు చూసినప్పుడు నక్షత్రమండలం కూలిపడినట్లు అనిపించింది. ఆ చూపులో మూగపిలుపు, ఆశ, లాలన, ఓదార్పు—మానవత్వం కన్ను తెరిచినట్లుగా—అన్నీ వున్నాయి.

ఇందులో భార్యకి ద్రోహంచేస్తున్నాననుకోను. అనేకమంది పిల్లలు కలిగి, నడివయస్సులో వున్న కుటుంబీకుడు, ఏ కారుకిందో పడి అకాలమరణానికి గురై, భార్యా పిల్లల్ని నిరాధారుల్ని చేసినప్పుడు, ఆ వ్యక్తిని ద్రోహంచేశాడు అంటున్నామా? ప్రేమరథంకింద పడి హతుడైనా అంతేనంటాను. ఈ అవాంతరాలికి యీ ఎవ్వరూ బాధ్యులుకారు. జననం, ప్రేమ, మరణం— ఇవి జరుగుతాయి; అంతే.

ఇన్నాళ్ళు ఏకపత్నీవ్రతుడుగా వుండడం చాలా శ్రమ. ఉన్నాను; అదీ త్యాగమే. పురుషులు, స్త్రీలు, ఏవొక్కరితోనో వుండగలిగే అలవాటు అలవర్చుకున్నా, స్వభావసిద్ధంగా వారు బహు వాంఛా ప్రేరితులు. ఒకరితో వునికి, అనేకులతో విహారం ఇది మానవుడి సహజప్రవర్తన. రేపు మనం అంతే. ఈ యథార్థాన్ని ఎదుర్కొని, యీనాడు ప్రేమజ్వాలలో నశింపుకావడం కంటే, వేరే పరిపూర్ణత లేదు.

నేను నిజంగామంచివాణ్ణే. కాని మంచివాడి మంచితనాన్ని ఎవరూ గమనించరు. ఈవయస్సులో, యీవిధంగా వొక మహత్తరమైన వాంఛకి లొంగిపోయినందుకు సిగ్గుపడటం లేదు. ఈనాటికేనా నన్ను లొంగదీసే శక్తు లున్నందుకూ, వాటిని ఆహ్వానించగల చైతన్యం నాలో యింకా అడుగంటనందుకూ గర్వపడుతున్నాను. దక్షిణపుగాలి పిలిస్తే మేఘం మెల్లమెల్లగా కొంచం కొంచం కదిలిపోదు; అసలు మొత్తంగా కదిలిపోతుంది. యెందుకు? ఏమూలనో వొక్క వర్షపుచుక్క అంటిపెట్టుకుంది. దాన్ని వదల్చుకు నేందుకు. నువ్వు నాపాలిటి దక్షిణపుగాలీ...నాలోవున్న బరువునీ, మొద్దుతనాన్నీ నువ్వు తొలగిస్తేగాని నేను రాణించను. నేనొక పని పావనైతే, నాజన్మనక్షత్రం నువ్వు..."

ఈ వుత్తరం ఎల్లా ముగించాలో రామ్మూర్తికి తెలియలేదు. ఇది వుత్తరంకాదు. ప్రేమతత్వాన్ని గురించిన వొక గ్రంథంగా తయారవుతోంది. ఉత్తరాలతో తృప్తిచెందే యవ్వనావేశం రామ్మూర్తిలో లేదు. మనస్సులో యథార్థాలు, అసత్యాలూ, ఊహాలు, నమ్మకాలు, తాత్కాలికావేశాలు, శాశ్వతానురాగాలు, మెరుపుల్లా తరుముకుంటూ, మాటల్లో బంధించబడడానికి వ్యవధి లేకుండా మాయమౌతుంటాయి — ఆకులు, ఫలాలు, రాలిపోయిన మోడులాగుంది అతని మనస్సు. పిట్టలు వేసిన రెట్టలమీదనే కొత్త చిగుళ్ళు!

'ఇది నిజం'—'ఇది నేను'—అని పాపం పురుషుడు మేఘాన్ని పట్టుగుని చూపిస్తాడు. అక్కడేమీ వుండదు—అని స్త్రీకి తెలుసు. ఆమె చేతుల్లో పడింది వర్షపుచుక్క. అతనికది తెలీదు. అత నింకా మేఘంకేసే చూపుతుంటాడు. ఆమె నవ్వక చేసేదేముంది? ఈ నవ్వే స్త్రీలో నిగూఢతత్వానికి ప్రతిధ్వని.

మొర్నాడు శాంత యీ వుత్తరం చదువుకొని నవ్వింది— భర్త రహస్యంగా వ్రాస్తుంటే తను పక్కనే కూర్చుని చూసిన దానికి మల్లే...?

"ఇక్కడో వుత్తరం వుండాలి—చూశావా?" అన్నాడు రామ్మూర్తి.

"ఎక్కడ?"

"ఇక్కడ" అని డ్రాయర్ కేసి చూపించాడు. "ఇదేనా?" అని వుత్తరం తీసుకొచ్చింది శాంత.

"ఎక్కడ దొరికింది?"

"దొరకడాని కేముంది" ముందువా కడుగుదామని వెడితే అక్కడ పడివుంది."

"చూశావా లోపల?"

తల పంకించి శాంత వంటింట్లో కెళ్ళింది. అక్కడ ఆవిడ నవ్వినట్లు రామ్మూర్తి కనుమానం కలిగింది.

వారం గడిచాక, శాంత పినతల్లి పురుటికి తీసుకెళ్లడానికి వచ్చింది. శాంత, పిల్లలు ప్రయాణమయ్యారు. రామ్మూర్తి స్టేషన్‌కెళ్లాడు, సాగనంపడానికి. రైలు కదలడానికి మరో పదినిమిషాలుంది. రామ్మూర్తి అనేకసార్లు ఏదో అడుగుదామని గొంతు సవరించుకొని చేతులు నలుపుకొన్నాడు. ఆఖరికి శాంతే మాట్లాడింది.

"చాకలిపద్దు, దాసుగాణ్ణి చూడమనండి. ఇంకా రెండు తువాళ్లు వొక చీర అట్టే పెట్టుకున్నాడు. అరున్నర, పైన అణా కూడా యివ్వకండేం? ధోవతులన్నీ చించి తీసుకొచ్చాడు."

"సర్లేద్దూ, సోది" అని రామ్మూర్తి నవ్వుతూ విసుక్కున్నాడు. రైలు కదిలింది.

"వైటకెళ్ళే టప్పుడు దొడ్డిగుమ్మం గడియవేసి మరీ వెళుతుండండేం"—అంటోంది శాంత. భర్త కేసి భక్తిపూర్వకంగా చూస్తూ, కారుణ్యంతో నవ్వుతూ. ఆ నవ్వులో అమాయకత్వమో, అల్లరి తనమో, ఏది ప్రబలంగా వుందో రామ్మూర్తి నిర్ణయించలేక పోయ్యాడు.

ఆ రాత్రంతా రామ్మూర్తికి నిద్రలేదు. చిన్నతనం, సిగ్గు, వోమాదిరి బిడియం, అతన్ని ఆవరించాయి. ఉత్తరాలన్నీ మళ్ళా సావధానంగా చదువుకున్నాడు. ప్రియభారతి వ్రాసినట్లు తను రాసిన వుత్తరాల్లో స్త్రీదస్తూరి అనుకరించినా, శైలిలో దొరికి పోయ్యాన, అనుకున్నాడు. స్త్రీల భావాలు, శైలి అల్లా వుంటయ్యా? సంస్కారం గల స్త్రీ అల్లా ఎందుకు వ్రాయకూడదూ? ఈ విషయాలని స్త్రీలు అరోయింద్రియం ద్వారా పసికట్టేస్తారు. మొత్తానికి ఆ వుత్తరాలన్నీ భర్త వ్రాసినవేనని శాంత పసికట్టేసింది. అదీ అతని తలవొంపుకి కారణం.

శాంత తెలుసుకున్నా, తెలియనట్టుగా నటించి, వాదానికి దిగి కొత్త అసూయ ప్రకటింపవొచ్చుగా. సంసారం జీవితాన్ని మధురం చెయ్యడానికి ప్రేమద్వేషాలకి సమానశక్తి వుంది. అందుకనే భార్యాభర్తల కొట్లాటలు, పుస్తకాల్లో నాయికలా విరుచుకుపడాలి. నాటకం ఆడాలి. ప్రియభారతి వుత్తరాలగాధ భర్తతో తగాదాకికూడా తగనంతటి అల్పమైనదానికింద జమకట్టేసింది శాంత. అదీ అతని సిగ్గుకి కారణం.

ఏ స్త్రీ తన భర్తను ప్రేమించిందంటే, శాంత నమ్మలేకుండా వుందన్నమాటేగా...! ఎంతవరకూ తన భర్త స్త్రీల ప్రేమకి పాత్రుడో, అర్హుడో, ఆమ తేల్చుకున్నట్టేగా! దాన్ని బట్టి

తనని గురించి ఆమెకి ప్రేమైక జీవితవిషయంలో ఎట్లాంటి అభిప్రాయం వుందో వూహిస్తే కలిగే ఫలితం, బిడియం.

రామ్మూర్తిలో పురుషత్వంవిప్లవం చేసింది. స్త్రీజాతి అతనికి చేసిన సవాల్ కి తట్టుకోలేకపొయ్యాడు.

ఏ స్త్రీ కూడా అతన్ని ప్రేమించదూ? ఋజువు చెయ్యడానికి సంకల్పించాడు. తనని గురించిన నిజాన్ని తనే ఋజువుచేసుకోవడం మానవుడి కడసారి ఆశయం. సత్యాన్వేషణ సాహసంతో కూడిన పని; అందులో మజా వుంది. ఈ సాహసం వ్యక్తిత్వ ప్రకర్ష. అది సంఘంలో స్థిరత్వాన్నీ, వెనుకమాపునీ, మందగమనాన్నీ తృణీకరించి కలవరపెడుతుంది. ఆ వుద్రేకాన్ని అరికట్టడమే ప్రభుత్వాలు చేస్తున్నపని. ప్రజాస్వామ్య ప్రభుత్వాల కిది పెద్ద సమస్య.

మతము, నీతి, ఆర్థిక స్వాతంత్ర్యము, ప్రాణంపైతీపి, ఇవన్నీ పరస్పరానికి, అన్యోన్యానికీ, ప్రపంచ సహకారానికీ పురిగొల్పుతాయి. కాని ప్రాచీనులు – ఆదిమనివాసులు మన పూర్వు లిచ్చిన ద్వేషపూరితమైన వుద్రేకాలు. "నిరంతర పోరాట: జీవుల ప్రకృతి శాసనం" అన్నభావం – "అందరూ వొకర్ని వొకరు ప్రేమించుకుంటే ద్వేషించేటందు కెవ్వరూ వుండ"రన్న చైతన్యం— యివన్నీ వ్యతిరేకంగా ప్రబోధిస్తాయి. మానవ సౌభ్రాతృత్వం కొనసాగాలంటే యీ ప్రాచీన తత్వాలనీ, ద్వేషాలనీ, వుద్రేకాలనీ ప్రకటితమయ్యే అవకాశాలు కల్పించి, అరికట్టే మార్గాలనీ ప్రభుత్వాలాలోచించాలి. నేడు రాజకీయవేత్తలకీ, ఫిలింతారలకీ, విఖ్యాత ఆటగాండ్రకీ, యిట్లాంటి "మజా" అనుభవాలు లభిస్తున్నాయి. రామ్మూర్తి యీ అనుభవాన్ని పొంది, తనని గురించిన నిజాన్ని ఋజువు చేసుకోడానికి సమకట్టి వూరంట తిరగడం సాగించాడు. ఉత్తరాలు, వూహించుగున్న అనుభవం చాలవు. రక్తమాంసాలతో సజీవమైన వ్యక్తిపై తన ఆంతరంగికాన్ని పరిశోధించుకోవాలి.

ఎవరిని ప్రేమించడం? తనని ప్రేమించేటందుకు ఏ భర్తవున్న స్త్రీకూడా సిద్ధంగా వుండదు. ఓ వేళ ఉన్నా, భర్తతో తగవులాట, సంఘంలో తలవొంపు తప్పదు. అంచేత సంసారం పితలాటంలేని, కన్యకోసం గాలించసాగాడు. బాంక్ వీధి చివర్లో ఎవరిదో మేడ. మేడమీద గది. గదిముందు బాల్కనీ వుంది. ఆ బాల్కనీలో కుర్చీమీద కూర్చుని, వీధిలో వచ్చేపొయ్యేవాళ్లని చూస్తూ కూర్చుంది, ఆమె ఎవరో. అంత మరీ చిన్నది కాదు ఇరవైరెండ్లుంటాచ్చు. పాతిక లోపే. తను ఆ వీధమ్మట నడచిన నాలుగురోజులూ అల్లానే కూర్చుండి అతనికేసి చూసింది కూడా. వెడల్పాటి గుండ్రని మొహం – అతనికి కోలమొహం యిష్టం, కాని ఏం చెయ్యడం?—పెద్ద కళ్లు, మబ్బువిడిచిన ఆకాశంలా నిర్మలమైన శరీర ఛాయ—జడలో రంగురంగుల పూలు. ఆకుపచ్చరంగు చీర. వయ్యారమైన చీరమడతలు. అతను ప్రేమించతగ్గదే అన్నివిధాలా.

పాశ్చాత్యదేశాలలో నడివయస్సులో వున్న పెద్దమనుష్యులు, కనిమనిషితో లేచిపోటం మామూలే. అది పొటువ్యవహారం; అంగులో సంస్కారం, అందం, వ్యక్తిగౌరవం, లేవు. అయినా, రామ్మూర్తికి కావల్సింది మానసిక చైతన్యంగాని భౌతిక తృప్తి కాదు.

ఆమెకి వివాహమైందో లేదో తెలుసుకోడం ఎట్లా? పోస్టుబంట్రోతు నడిగితే? వాళ్లకి బట్టలుతికే చాకలాణ్ణి అడిగితే? స్కూలు పిల్లలు యిండ్లకి చేరుకుంటున్నారు. ఇద్దరు కుర్రాళ్లు, వో ఆడపిల్ల, ఆ మేడలోకే వెళ్లారు. వాళ్లని బుజ్జగించి మెల్లిగా ఆరా తియ్యాలి.

నాలుగురోజు లైంతర్వాత, అవకాశం చిక్కింది. ఆ కుర్రాళ్లకి చాకలేట్లు, పిప్పర్ మెంట్లు పెట్టి, మెల్లిగా వాళ్లతో కబుర్లు సాగించి, వాళ్లతో స్కూలువరకూ నడచివెళ్ళి, ఆరా తీశాడు. పెండ్లి కాలేదు. అమ్మయ్య అనుకున్నాడు. ఇంకా ఎందుకు కాలేదో, ఆమె వాళ్ల కేమవుతుందో యివన్నీ కూడా అడిగాడు కాని వాళ్లు సరైన సమాధానం యివ్వలేదు. రోజూ ఆ వీధంట వెడుతుండేవాడు. ఆ అమ్మాయి అల్లా తనకేసి వీధి మళ్లేవరకూ చూస్తూనే వున్నట్లుండేది.

రామ్మూర్తి మనస్సు వుండబట్టలేకపొయ్యాడు. ఆమెతో మాట్లాడి అడిగెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. తీరా వ్యవహారం బెసిగిపోయి, నలుగుర్లోనూ పడిపోతే, ఏం చెప్పడం? నేనో నవల వ్రాస్తున్నాను. అందులో వొకపాత్ర ప్రవర్తన ఎంతవరకూ జీవితాన్ని అనుసరించివుందో నిర్ధారణ చేసుకోడానికి అల్లాచేశాను – అనొచ్చు. అట్లాగంటే నమ్ముతారా? నలభైయేళ్ల పెద్దమనిషి, గౌరవమైన కుటుంబీకుడు, పౌరుడు, మరో వుద్దేశంతో చేస్తాడనుకుంటే, మన సంఘం నేడు ఎంతటి దుర్దశలో వుందో విశదమవుతుంది. అట్లాంటి సంఘానికి, తనకి విలువ కట్టి, తీర్పు చెప్పే అధికారం లేదు; వుండకూడదు.

ఆమెతో ఏమనాలో ముందుగా వో కాగితంమీద వ్రాసుకున్నాడు. రకరకాలుగా వ్రాసిచూశాడు. అతనికి ఆఖరికి నచ్చిందియిల్లా వుంది.

"ను వ్వెవరవో నాకు తెలీదు. ఐనా నాకు సన్నిహితురాలవే. మనకి వెనకటి జన్మలో బాంధవ్యం ఏర్పడివుంటుంది. నేను నిన్ను కోరుతున్నాను. నీకు భర్త పిల్లలూ వున్నా కోరివుందును. నాకు వున్నారు. తెగించి సాహసిస్తేగాని ప్రేమకి విలువ లేదు. నువ్వంగీకరిస్తే, మనది మహోన్నతజీవిత మవుతుంది. నిరాకరిస్తే భగ్నజీవినై, పిచ్చివాడినై చెడిపోతాను. పాపాలు, ఘోరాలు చేస్తాను; మరో ప్రపంచసంగ్రామానికి నేను కారకుణ్ణి అవొచ్చు.

ప్రేమ దాస్యం కోరడంలేదు. సంసారంనుండి విమోచన కోరుతున్నాను. నీ స్పర్శకి పంజరం కడ్డీలు వూడి, అందులోంచి పిట్టలాగ నా ఆత్మ ఆధ్యాత్మికసీమలో ఎగిరిపోతుంది. ఆత్మ విముక్తి గీతాసారం.

ప్రేమలేని ఆత్మకి విలువలేదు. ఆత్మలేని ప్రేమ పెంట్లి. రెంటినీ యివ్వాలి నువ్వు.

తర్వాత నిన్ను త్యజిస్తానని భయమా? మంచి చెడ్డలు, ముందు వెనుకలు, జమా ఖర్చులతో నిమిత్తంలేనిది, మహోజ్వల

ప్రేమ. అందులో నశింపవుతాను. ఒక్క సమిధ నువ్వూ సమర్పించాలి.

నా కేం కావాలో నిన్ను కలుసుకున్నంతవరకూ తెలిసింది కాదు. తెలుసుకునేటందుకు నలభై సంవత్సరాలు పట్టింది."

ఇవీ అతను అనదల్చుకున్న ముక్కలు. కంఠస్థం చేసుకున్నాడు. సందర్భానుసారంగా అవతలవ్యక్తి చెప్పే వాక్యాలను వూహించి, వాటి కనువైన సమాధానాలనుకూడా అనుకున్నాడు.

తననిగురించిన నిజం ఆ వాక్యాలలో ఎక్కడో వుందనిపించింది రామ్మూర్తికి. ఎందులోనో తెలియడంలేదు. తేల్చుకోక తప్పదు.

మాట్లాడేటందుకు తగినంత ధైర్యం పురస్కరించుకునేప్పటికి, మరో పదిరోజులు గడిచాయి. ఆ రోజున విద్యాధికారి స్కూలుతణిఖీ వుంది—పొద్దోయింతర్వాతగాని, పిల్లలు యిళ్లకి రారు.

సాయంత్రం ఆరు దాటింది. సూర్యుడు పడమటి ఆకాశంలో గాయంపడినట్లు కుంటుకుంటూ దిగిపోతున్నాడు. రక్తంలా సంధ్య చిమ్మింది. కరిగి కదిలిన మేఘాలవెనక మొదటి నక్షత్రం తళుక్కుమనగానే రామ్మూర్తి తలుపులు తోసి లోనికి ప్రవేశించాడు. తను వొంటిగా వుండటం—చీకటీ—యీ రెండూ కొత్త వుత్సాహాన్నీ తెగింపునీ యిచ్చాయి అతనికి. హాల్లో నూలగా మేడమీదికి మెట్లున్నాయి. గబగబ ఎక్కి బాల్కనీలోకి చేరుకున్నాడు. ఆ అమ్మాయి కుర్చీలో కూర్చునివుంది. లేవలేదు. అతను నిలబడాల్సివొచ్చింది. వెనకాలగదిలో కుర్చీ తెచ్చుకుని కూర్చుంటే? వ్యవధి లేదు. మళ్లా ఎవళ్లేనా రావొచ్చు. కంఠస్థం చేసుకున్న వాక్యాలు చదవడం, మొదలెట్టాడు—ఆమెకళ్లల్లోకి తీవ్రంగా చూస్తూ. ఉద్రేకపు తీవ్రతలో కొన్ని వాక్యాలు వొదిలేశాడు.

"నీకు భర్త పిల్లలూవున్నా కోరివుందును, నాకు వున్నారు"

"సంసారంనుండి విముక్తి కోరుతున్నాను"

"తర్వాత నిన్ను త్యజిస్తానని భయమా?"

"తెలుసుకునేందుకు నలభై సంవత్సరాలు పట్టింది..."అవీ రామ్మూర్తి వొదిలేసిన వాక్యాలు. గడియారంకేసి చూసుకున్నాడు. సరిగ్గా మూడు నిమిషాలు పట్టింది.

సమాధానంకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు. ఆమె ఏమీ మాట్లాడలేదు. చీరకొంగుని వేళ్లకి చుట్టుకుంటూ. వింతగా నవ్వుతూ కూర్చుంది. రెండుమార్లు లేవబోయి కూర్చుంది.

"చెప్పవూ"

ఆమె మాట్లాడలేదు.

"తొందర్లేదు. ఆలోచించుకుని చెప్పు. రేపిపాటికి వొస్తాను."

ఆమె జడ సర్దుకుంది. తల్లో పూలు కిందపడ్డాయి. అతను తీసి ఆమె చేతి కిచ్చాడు.

"మళ్లా రేపొస్తాను. వెళ్లిరానా?"

ఏమీ సమాధానం లేదు.

రామ్మూర్తి మెట్లు తొందరగా దిగి హాల్లోకి చేరుకున్నాడు. వెనక ఎవరో కదిలినట్లనిపించింది. మెట్లపైకి చూశాడు.

హాల్లో తలుపువెనకాల నిలబడివుంది, ఆమె ఎవరో—పెద్దామె—సన్నటి దీపంవెలుగులో బాగా కనబళ్లేదు.

"నే నంతా విన్నానండి బాబూ. మా అక్కయ్యకూతురే. మీ కెవరేనా తమ్ముళ్లుగాని, మొగపిల్లలు వుండి పెండ్లి చేసుకుంటే మా కొక్కసల్పిందేముంది. ఏం చెయ్యం, దాని కర్మ పెండ్లి కావడంలేదు. మూగపిల్ల. మీ ఎరికిలో ఎవరేనా వుంటే చూద్దురు బాబు."

రామ్మూర్తి ఎట్లాగో శ్వాస తీసుకుని వీధులోకి వూడిపడ్డాడు. ఉద్యోగంకోసం మొదటి యింటర్వ్యూకి వెళ్ళిననాటి మల్లే, కాళ్లు చేతులు తిమ్మిరెక్కి, వొళ్లంతా చెమట్లుపోశాయి. విశ్వమంతా తన మట్టూ కూలిపడితే అట్లానుంటుంది కాబోలు.

లాటీదెబ్బలకీ, కత్తిపోట్లకీ, తుపాకి గుండ్లకీ బలికావడానికి శరీరం సిద్ధపడుతుంది. అహం వొక్కమాటతో ఘూర్ణిల్లుతుంది. ముసలామె చేసిన తీర్పు—జన్మాంతరశిక్ష. మూగ పిల్లకికూడా తను తగడు. తన ఎరికిలో ఎవరేనా వుంటే చూడాలిటా! అంత కంటే ఉరికంబం మేలు.

స్వార్థం గాయపడినప్పుడు బుద్ధిచలిస్తుంది. ఊహ బీభత్సంగా తయారవుతుంది. ఉద్యోగానికి రాజీనామా యివ్వాలనిపించింది. ప్రపంచమంతా వొక కాలు మీద గెంతుకుంటూ చుట్టిరావాలనిపించింది. సన్యాసం పుచ్చుగోవాలనిపించింది. ఎవనినో హత్య చేయ్యాలనిపించింది. దీనికంతకీ భాగ్యరాలు, కాంత. తనచేత కూలివాడిమాదిరి వెట్టిచాకిరీ చేయించుకుని, శక్తుల్ని ధ్వంసంచేసి వార్ధక్యం వప్పగించి, తను పిల్లలతో హాయిగా పురిటిమంచంలో కులుకుతోంది. స్త్రీకి బాధ్యతలే లేవు. పిల్లల్ని కనడం ఆమె హక్కు. వాళ్లకి అన్నంపెట్టడం, మొగాడి బాధ్యత. తను పట్టుచీర సింగారించుకుని పేరంటానికెళ్లడం ఆమె హక్కు. సంతానాన్ని తోకలు ఎత్తుకుపోకుండా కాపలా వెయ్యడం వీడి బాధ్యత. హక్కులు బాధ్యతలు...ఈ బాధ్యతలు, హక్కులు అనే మాటలు పదేళ్లవరకూ ఏ పత్రికా వాడకూడదని ఐక్యరాజ్యసమితి శాసిస్తే బావుండును. ఇంటికి చేరుకున్నాడు రామ్మూర్తి. గుమ్మంలో పోస్టు బంట్రోతు సైకిల్ దిగి టెలిగ్రాం అన్నాడు. ప్రసవించి, కాంత మరణించిందన్న వార్త రాకూడదూ...!

కాంత పినతండ్రి పంపిన టెలిగ్రాం అది. నెప్పులు ప్రారంభమయ్యాయనీ, ఆ సమయంలో తను దగ్గర వుండడం అవసరం గనుక తక్షణం బైలుదేరి రమ్మనీ—వుంది.

రామ్మూర్తి మెట్లమీద వాలిపోయాడు. కాంతలేని సంసారం వూహించలేక పోయాడు. తనకి నాడు జరిగిన పరాభవాన్నుండి తేల్చగల శక్తి మరింకెవరికుంది! ఆమె దగ్గర తను దాచలేడు. చెప్పకపోయినా, ఆమె ఎల్లాగో తెలుసుకుంటుంది. తనకి విషాదంగా తోచినవాటిని నవ్వి పారేస్తుంది. తన కప్రస్తుతమని తోచిన చాకలిపద్దు విషయం ఎంతో పట్టింపుచేస్తుంది. చిత్రమైన మనిషి. వారి అన్యోన్యానికి కారణం ప్రేమా? కాదు. అదే

మిటో అతనికి తెలీదు. ప్రేమనుగురించి ఆమె ఎప్పుడూ ముచ్చటించలేదు. ఉత్తరాల్లో వ్రాయలేదు. ఆమెతో మాట్లాడేందుకు ఏవీ కనుపించవు, ఆమె వుంటుంది. లేకపోతే తన జీవితంలో ఏదీ చోరలేని ఖాళీ ఏర్పడుతుంది. ఆమె మరణం అనూహ్యం. భాషా భావాలు లేకుండా, వాతావరణంపై వొత్తిడి కలిగించి పరివర్తన తీసుకురాగల కవయిత్రి శాంత—

ప్రయాణమయ్యాడు. రైల్లో ఎన్నో ఆలోచనలు. తన వివాహం. కొత్తలో శాంత సిగ్గు; చీరకొంగులో నవ్విన దృశ్యం. వికృతంగా ఆవులించడం—ఆమె వికృతంలో, అల్పత్వంలో, సౌందర్యం వుంది.

'తన్నో?'

తననిగురించిన నిజం, మూగపిల్లముందు కంఠస్థంచేసి చెప్పిన వుపన్యాసంలో, వొదిలేసిన వాక్యాల్లో వుంది. అప్రయత్నంగా వాటిని విడిచిపెట్టినట్లా? లేక కావాలని వొదిలేసినట్లా?

తెల్లవారింది.

కొంతదూరం బండిమీద ప్రయాణం చెయ్యాలి.

ఇంటికి చేరుకునేటప్పటికి, సాయంత్రం ఏడు గంటలు కావస్తోంది. శాంత పినతండ్రి కలుసుకున్నాడు గుమ్మంలో.

"అమ్మాయి వొద్దంది. నేనే యిచ్చా టెలిగ్రాం. ఎందుకేనా మంచిదని. నిన్ననే ప్రసవించింది. తల్లి పిల్ల క్షేమంగానే వున్నారు. ఏమీ ఎక్కువ కష్టపడలేదు. పైవాళ్ల ఆదుర్దా..."

"ఆడపిల్లా" అన్నాడు రామ్మూర్తి.

చూసొచ్చునన్నారు. తొందరగా గదిలో కెళ్లాడు. అంతా నిశ్శబ్దం. వెన్నెట్లో వొస్తువు లన్నీ తెల్లటి పొర కప్పుకున్నట్లయింది. ఇంటి కప్పుమీదనుంచి జారిన వెన్నెలవెలుగు శాంత నుదిటిమీద గీతలా పడుతూంది. ఆనాడు సౌందర్యం తన యాత్ర ముగించుకుని పవ్వళిస్తోంది.

శాంత నీరసంగా నవ్వింది. పాపకేసి చూపించింది.

దీపం పెద్దది చేసి చూశాడు. అతను నమ్మలేకపోయాడు. భ్రమా? నిజమా? నవ్వుకి శాంత మూతి వొంకరయింది. నిశ్చలంగా అతని కళ్లల్లోకి చూసింది. పరిమళం బరువుకీ, రంగు వొత్తిడికీ, తట్టుకోలేక వూడిపోయిన అడవిపువ్వుల్లో కొత్తదనం. పర్వత శిఖరాన్నుంచి జారివిడిపోయిన మంచు ముద్దలోని నిర్మలత్వం. నిశీధిలో సృష్టి వేసుకొన్న మంటలోనడిజ్వాల, అర్ధరాత్రి జీవులకన్న స్వప్నంలోని మూగ బాధ—అన్నీ వున్నాయి, ఆ చూపులో.

రామ్మూర్తి జీవితంలో సత్యాన్ని ఎదుర్కొన్నవానివలె హాణికిపొయ్యాడు. చెప్పేటందుకు ఏముంది? వెనక్కి తిరిగాడు.

"మాట" అంది శాంత మెల్లగా.

నిలబడ్డాడు. దగ్గరగా రమ్మని సంజ్ఞచేసింది.

"మావాళ్లకి తొందర. నాతో చెప్పకుండా టెలిగ్రాం యిచ్చారు." అంది.

"దానికేం మంచిపనే చేశారు. నాకూ చూడాలనుంది" అన్నాడు రామ్మూర్తి.

"ఇదుగో" అని— ఏదో అనబోయింది.

"ఏం?"

"ఏమీ లేదులెండి." శాంత పక్కగా తిరిగి పడుకుని దుప్పటీ రొమ్ముపైకి లాక్కుంది.

రామ్మూర్తి వీధులోకి వొచ్చేసి అరుగుమీద కూర్చుని చంద్రుడికేసి చూస్తూ పదినిమిషాలు గడిపాడు. రెండోవాడు "సేతు" వొచ్చి—

"ఇదుగో నాన్నా ఏదో కాగితంట, అమ్మ నీ కివ్వమంది" అని కాగితం యిచ్చాడు.

రామ్మూర్తి లోపలిగదిలో కొచ్చి దీపంవెలుగులో అవుత్తరం చదువుకున్నాడు.

"మన స్వప్నం ఫలించింది. ఆడపిల్లకి 'రామప్రియ' అని పేరు పెట్టుగుంటా. ఇంక మీరు మంచివారుగా వుండనక్కర్లేదు. మీ ప్రియభారతి."

రామ్మూర్తి అప్రయత్నంగా నవ్వేశాడు. గదిలో కెళ్లి పాపకేసి చూశాడు. సందేహం లేదు. అంతా తన వూహలో చిత్రించుకున్న ప్రియభారతి పోలికే...ఆ కోలమొహం, సన్నటి తీర్చిన కళ్లు, మధురంగా ముడుచుకున్న పెదవులు—అంతా ఆమే.

అసంభవం. తను స్వప్నంలో బంధించుకొన్న కవితాసతి ఛాయల్ని తనభార్య నవమాసాలూ మోసి, పెంచి, కన్నదా?

భ్రమ.

అవుతే భ్రమ నిజం. తైటకి రాగానే అతనికో అనుమానం తట్టింది. బెదరిపొయ్యాడు. గబగబ గదివైపు నడిచాడు. తలుపు తొయ్యబొయ్యాడు. పాపఏడ్పు వినబడింది. "అమ్మయ్య" అనుకున్నాడు.



# ఉగాదివేళ



శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

జాణతనమ్ముల గాణాచి యశమున వెలుఁగు పెన్నానదీప్రేమఁ గ్రోలి
సకలకళానీక సౌందర్యధామమహా కృష్ణానదీమహోత్కృష్ట తరయు
నారికేళవనీ విహారసౌఖ్యముఁ గూర్చు గోదావరీసీమ గునిసియాడ
రాయల ప్రథితికి రమ్యాంకమై యొప్పు తుంగభద్రానదీ దుగ్ధమాన
చూతకిసలయ భుక్త్యుపేతజీవి కోకిలస్వామి వైతాళికుఁడుగఁ బాడ
వచ్చినాఁడు వసంతరాడ్వత్సలుండు మేదురానందలీల నుగాదివేళ!

దాతలై నేతలై మనజాతిగన్న భూతయశమును దలపోసి చేతములను
నూతనోత్సాహమున బరిపూత, ఆంధ్రమాత శారతు లెత్తుఁడో భ్రాతలార!

ఈ యుగాదివేళ నెంతగా సంతోష మెడఁదఁ దాల్తుమన్న నేదో బెడఁద
కదలుచుండు రాష్ట్రకాంక్షయె కాఙ్గోలు-అదియు నెండమావులగునె యెపుడు?

ఎంతపండిన నేమి యీదేశమున తిండి దండిగా లభియించుచుండ లేదు,
ఎన్ని బట్టల మిల్లు లున్నను, సరసమా ధర కేడ వస్త్రము దొరుకబోదు,
ఎందఱో ధనవంతు లుండు రీదేశాన బీదల దారిద్ర్యబాధ పోదు,
ఎందరు నాయకు లెంత యత్నించిన ఐకమత్యమ్ము లభ్యమ్ము కాదు,
అన్నియు సమస్యలై ఆంధ్రు లలముటించు-అంధకారమ్ముగా భవిష్యత్తు దోచు
ఎన్నఁడు లభించుమనకు నభ్యున్నతము, సర్వసంపన్న మాంధ్రరాష్ట్రమ్ముసుఖము!

ఆంధ్రమాతృ పదాబ్జపూజార్చనముల తన్మయులమైన మమ్ము నాదరముతోడ
పలుకరించి సౌభాగ్యసంపదలుఁ బొడల వరముల నొసంగుమా! ఖరవత్సరమ్మ!

ఖర! ఖరకరునిపోలె తీక్ష్ణత వహించి గాసిపెట్టక శాంతిసౌఖ్యముల నొసఁగి
శీతకరుఁడట్లు చాంద్రీవిశిష్టమధురప్రకృతిఁ దులకింపఁజేయుమా! వికృతి తొలఁగ.

కరుణాపూరితవై తెలుంగుప్రజకున్ గల్మిన్ ప్రసాదించి
దుర్భరసంబాధిత పారతంత్ర్యమును బారంద్రోలి దీవించుమా!
ఖరసంవత్సరమా! ప్రమోదయుతులై కైమోడ్పు లర్పింతు రీ
వతు లుద్రేకపరీతభావుకులునై సత్రింత్రు కీర్తిద్యుతిన్!

---

# తెనుగు వచన రచన

# (క్రీ. శ. 600 - 1750)



శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెనుగుభాషయందలి వచన రచనా పరిణామమును గూర్చి తెలిసికొనుటకు ముందుగా వచనమనుమాటయొక్క యర్థము తెలియవలసియున్నది — వచనయుగమవి, వచనవాఙ్మయమని వచనరచనలని, యీనాడు మనము వ్యవహరించువానికి, నిన్న మొన్నటివరకును గద్య రచనలని గద్య వాఙ్మయమని, పర్యాయ పదములు వాడబడుచువచ్చినవి. 1 నేటి సాహిత్యప్రపంచమున గద్యపదముకన్న వచనమే బహుముఖములుగా వ్యాప్తిలోనున్నది. ఇట్లున్నను కేవల వాఙ్మయచరిత్రములో నీ రచనలనుగూర్చి చెప్పునప్పుడు, మనము గద్య పద్య కావ్యములనే వ్యవహరింతుము గాని, వచన పద్య కావ్యములని వ్యవహరించుటలేదు. కాబట్టి సాహిత్యదృష్టిని పరిశీలించిన, నేటి వచనమునకే గద్యయను నామము మొదటనుండియున్నట్లును, నదియొక నిర్దిష్టార్థమున వాడుకలో నున్నట్లును మనకు తెలియుచున్నది.

గద్య, వచన, పదములు రెండును పర్యాయములైనను, నవి పూర్వమున నేటివలె కేవలము భావప్రకటనకై కూర్చిన వాక్యసముదాయము అను నర్థము గలవికావు. ఈ పదములు తాళలయానుగుణ్యముగ చదువదగిన పద పద్యపాదరచనలకే చెల్లుచుండెను.2 ఈ గద్యరచనలు మాత్రాచ్ఛందస్సు ననుసరించి నడచుచు, పాటగా పాడుటకు వీలు కలుగుటచేత, ఛందశ్శాస్త్రముననే గాక, సంగీత శాస్త్రమున3 గూడ దీనికి లక్షణము చెప్పబడినది. దీని ననుసరించి గద్యముగాని వచనముగాని, పూర్వకాలమున సంస్కృతపద సమాస భూయిష్ఠమై, మాత్రాగణప్రధానమైన దేశీయచ్ఛందస్సులలో సమ్మిళితములై రచింపబడుచుండెడివి. ఇది రెండు విధములు.

(1) పాదనియమము గల రచనలు—రగడ ఉత్సాహ మున్నగు మాత్రాచ్ఛందస్సులు.

(2) పాదనియమములు లేనివి గద్యలు.

మాత్రాచ్ఛందస్సులనుండియే అక్షరచ్ఛందస్సు లేర్పడి వృత్తరచన వ్యాప్తిలోనికి వచ్చినది. వాఙ్మయమున తొలుత నేకైకముగ పాదనియమముగల వృత్తరచనలే విలసిల్లగా, కాలక్రమమున, వానితోగూడ, పాద నియమము లేని గద్యలుకూడ చేర్పబడుచువచ్చినవి—ఇట్లు రెండును మిశ్రమము చెందిన రచనకే 'చంపూ కావ్యము' అను పేరు వచ్చినది. 'గద్యపద్య మయం కావ్యమ్, చంపూ రిత్యభిధీయతే' అని ఆచార్య దండి నిర్వచనము.

సంస్కృతాలంకారికులలో వామనుడు గద్యరచన మూడు విధములుగా నిట్లు చెప్పినాడు. "గద్యం వృత్త గంధి చూర్ణ ముత్కలిప్రాయం చ. పద్యభాగవత్ వృత్తగంధి—అనావిద్ధ లలితపదం చూర్ణం, విపరీత ముత్కలికా ప్రాయం చ."

1. వృత్తగంధి = పద్యభాగములతో ప్రారంభమై, వృత్తములని తోపింపజేయు గద్యరచన

2. చూర్ణము=దీర్ఘ సమాస భూయిష్ఠముగాని గద్యరచన ఇదియే తెనుగున చూర్ణిక.

3. ఉత్కలిక = దీర్ఘ సమాసములతో నుద్ధతమైయుండురచన.

తెనుగున చంపూపద్ధతిని నన్నయ రచించిన మహాభారత భాగమున పై గద్య లక్షణములలో మొదటిదియగు 'వృత్తగంధిని' చక్కగా పాటించియున్నాడు.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనాతి యాగంబున గళ్యవ... ఇది సీసపద్యపాదము.

1 గద్య తిక్కన కందుకూరి వీరేశలింగము పంతులుగారు తే 24-11-1911 దిని చెన్నపురిలో గ్రామ్యాదేశ నిరసనసభ కధ్యక్షత వహించి, వచనకావ్యములను గూర్చి యీ క్రిందివిధముగ చెప్పియున్నారు.

"రమారమి నలువది సంవత్సరములక్రిందట తెలుఁగులో గద్యకావ్యములు లేకుండెను. అప్పుడు చిన్నయసూరి తన వ్యాకరణమురచించి, యందుకు లక్ష్యముగా నీతిచంద్రిక వచనముగ వ్రాసెను. దీని శైలి మిక్కిలి కఠినము మొట్టమొదట నేనును చిన్నయసూరిగారి త్రోవనే త్రొక్కి కొన్ని గద్యకావ్యములు రచియించితిని."

మఱియు, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము—అచ్చాంధ్ర నిర్గద్య నిరోష్ఠ్య సారంగధర చరిత్ర—ఆంధ్ర గద్య వాఙ్మయ చరిత్ర—తెనుగు వచనకావ్యాభివృద్ధి — అనునవియే. పై రెండు పదములు పర్యాయములుగా నున్నట్లు విశదీకరింపగలవు.

2 చూడుడు—ఉదాహరణ వాఙ్మయము - 57-61 పుటలు- కలికోత్కలికల లక్షణములు.

3 ఛందోహీనం న కదంబక గద్యమిత్యుచ్యతే-తత్ షడ్విధమ్- ఉత్కలికా - చూర్ణమ్ - లలితమ్ - వృత్తగంధి - ఖండమ్ - చిత్రమ్ - సంగీత రత్నాకరము.

అక్కథకుడు శౌనకాది మహామును
లకు జెప్పెనాది యుగంబునంగ...

26 పుట.

వ. ఇట్లు పెక్కుమృగంబుల నెగిచి చంపెడు వేడుక...

84 పుట.

ఇది గీతపద్యపాదము. గీ. ఇట్లు పెక్కుమృగంబుల - నెగిచి చంపె.

వ. ఇట్టి మహోత్పాతంబులు పుట్టిన సురపతి...ఇది కంద పద్యపాదము.

"ఇట్టి మహోత్పాతంబులు
పుట్టినసురపతి........."

'నన్నయ కవితలోని యీవిశేషములన్నియు వేఱొకచోట సంపూర్ణముగ నీయబడినవి. *

సంస్కృతాలంకారికులు చెప్పిన గద్యభేదములలో పద్య భాగవత్ వృత్తగంధి యనునదియే గద్య. యనగా నిప్పటివలె కేవల వచనరూపము కాదని వ్యక్తమగుచున్నది. ఇక నన్నయకాల మునకు వెనువెంటనే, విలసిల్లిన, ద్విపద, శతక, ఉదాహరణాది దేశిరచనలలో గద్యమునకు గాని వచనమునకుగాని స్థానమే లేదుగదా! అట్టియెడ వచనమునకు గద్యమునకు గల నేటి నవీనా ర్థమును పురస్కరించుకొని, ప్రాచీనకాలమున వచనవాఙ్మయము వెలయలేదని శంకించుటయు సమంజసము. పైలక్షణముల ననుసరించి ప్రజా కవియని నేడు పేరొందిన శైవకవి పాల్కురికి సోమ నాథుడు. "అరూఢగద్య పద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠరచన" అని చెప్పినప్పు డందలి గద్యలు, పూర్వ ముదా హరించిన వానికి లక్ష్యములుగా నున్న రచనలుగాని వేఱొండు కావని గ్రహించుట యుక్తము.

తెనుగుసాహిత్యమున దేశిరచనలు విస్తరించినను, చంపూ పద్ధతి నుండు ప్రబంధవాఙ్మయమే ప్రకృష్టస్థాన మాక్రమించుటచేత, తరువాతి ప్రబంధకవులు, వచనములను సంస్కృతసమాసభూయిష్ఠ ములుగా నొనరించి ప్రాచీనగద్యలక్షణము నొకదానినిమాత్రమే పాటించిరి. కాని యిందొక్క విశేషము గలదు. నేటి కావ్యము లందన్నిచోట్లను "వచనము"అనుటకు వ. అని ముద్రించినను, ఆశ్వాసాంతములందు మాత్రము, 'గద్యము' అనియే ముద్రింతురు. వచనగద్యములు రెండును పర్యాయపదములే కదా! ఆశ్వాసాంత మున మాత్ర మిట్లెందుకు ముద్రించు సంప్రదాయమేర్పడినది యని సందేహము కలుగకమానదు. దాని సంప్రదాయ మిది. తెనుగు లాక్షణికు లీ గద్యలను, నైదువిధములుగ విభజించిరి.†

1 గద్య. 2 బిరుదుగద్య. 3 చూర్ణిక. 4 వచనము 5 విన్న పము చంపువులలో, నాశ్వాసాంతమున, కవులు తమ బిరుదు లను చెప్పుకొనుట సంప్రదాయము. ప్రాచీన కన్నడ కవులనుండి తెలుగుకవు లీ సంప్రదాయము గ్రహించిరి. తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పెద్దన మొదలగు మహాకవులందఱు నీ సంప్రదాయము పాటించినవారే. అయిన నివి సంబోధనాంతములుగా నుండవు. కవి ప్రథమ పురుషలో తన వృత్తాంతము చెప్పుకొనుటచేత, నాత్మ స్తుతిదోషము సంభవింపదు గావున, సంబోధనాంతములుగానీ గద్య లుండనేరవు. ఆశ్వాసాంతగద్యలు యమకానుప్రాసములు గలిగియుండుననుట యెల్ల రెఱిగినదే.

ఈ బిరుదు గద్యసంప్రదాయము తొలుత రాజుల ప్రశస్తిని నాస్థానములలో స్తుతిపాఠకులు నాయా రాజులను సంబోధించుచు స్తుతించెడు రచనల మూలమున నేర్పడినది. ఈ రచనలే ప్రశస్తి కావ్యములను పేర క్రీ. శ. 8 వ శతాబ్దినుండి దక్షిణదేశమున శాసనములలో కన్పట్టుచున్నవి. శకరాజగు రుద్రదమనుని సాహిత్యవిద్యాప్రశస్తి యిట్లు వర్ణితమైనది. "స్ఫుటలఘు మధుర చిత్రకాంత శబ్దసమయోదారాలంకృత గద్యపద్య కావ్యవిధాన ప్రవీణ." దీనినిబట్టి యీ గద్యసంప్రదాయము ప్రాచీనమనియే తెలియదగును.

ఇట్టి చిన్నిచిన్న ప్రశస్తి గ్రంథములు లేక కావ్యములే‡ దక్షిణ దేశ భాషలలో మహాకావ్యరచనానిర్మాణమునకు మార్గదర్శకము లైనవి. సమాసభూయిష్ఠముగల యిట్టి ప్రశస్తి గ్రంథములలో బిరుదావళులు కూర్పబడుటచేత నవియే క్రమక్రమముగా బిరుదు గద్యలను పేర వెలసినవి. ప్రశస్తిగ్రంథములలో ప్రథమపురుషలో నున్న విశేషణములు బిరుదుగద్యలలో సంబోధనలతో నుండును. అందుచేతనే ముందు బిరుదుగద్యలు సంబోధనతో నుండునని తెలుపబడినది.

గద్యయను సంస్కృతపదమునకు తద్భవరూపము గద్దియ. దీని రూపాంతరము గద్దె. పై బిరుదుగద్యల నేస్థలమునం దా బిరుద ములు గలవారు కూర్చుండగా సంబోధించుచు చదువుదురో ఆ స్థల

*నన్నయ యుగమునాటి తెనుగు వాఙ్మయము. 1950 సంవత్స రాది సంచిక. 2 తెనుగు కవులచరిత్ర - 'నన్నయ యుగము' అను ప్రకరణములో చూడనగును.

† పొత్తపు వేంకటరమణ కవి లక్షణ శిరోమణి

1. గద్య - అనుకరణశబ్ద యుక్తంబు
2. బిరుదుగద్య - సంబోధనాంతకపద బంధురంబు
3. చూర్ణిక-ద్వివచన బహువచన, సమాసాదికల్పనంబు
4. వచనము. బహుప్రకార రచనా నిచయప్రాచుర్యము గలది.
5. విన్నపంబు సమాసములులేక, సంగ్రహవాక్యములతో ఋజుమార్గ రచన గలది.

‡ 'ఈ ప్రశస్తికావ్యము లెట్లు కావ్యశైలికి, రచనకు దారి చూపినవి. నా 'తెనుగుకవులచరిత్ర ప్రథమ ప్రకరణమున చూడ నగును. ఈ సందర్భమున భాషోద్ధారకులు బ్రౌనుదొరవారు గద్య మునుగూర్చి వ్రాసిన యర్థము లుదాహరణీయములు.

గద్యలేక గద్యము. *Prose of Melodious Measured kind used in poems. It is Contractedly written* గ.

గద్దియము, గద్దియములు=*for* గద్యము. *titles proclaimed by a* భట్రాజు *or herald.*

గద్దె *titles, particulary those proclaimed by heralds as the princes's style.*

మునకు 'గద్దె' అని పేరు వచ్చినది. సాధారణముగ నాస్థానమున సింహాసనాసీనుడైన రాజునుగూర్చి యీ గద్యలు చదువుదురు గాన సింహాసనమునకు గద్దె యని పేరు రూఢియైనది. బిరుశబ్దము వీరశబ్దమునకు మహారాష్ట్రీ ప్రాకృతరూపము కావున 'బిరుదుగద్దె' బిరుదుగద్దెలు అను రూపము లేర్పడినవెనుక నీ గద్దెశబ్దము రూఢియై యుండును. కాబట్టియే, గద్యఅనుపదము ప్రకృతిలో వచనమునకు, వికృతిలో సింహాసనమునకు పేరైనది. తెనుగులో గద్దె సింహాసనమున కర్థమగుట విస్మృతమగుటచే కాబోలు లిటీవలివారు సింగపుగద్దె యనియు సింగపుబీట యనియు 'దద్ధ్వపదసమాసము లను గల్పించియున్నారు.

ఇట్లే 'వచనము'నకుగూడ తొలి నున్న సంప్రదాయార్థము ననుసరించి, తిక్కన, వచనము లేకయ వర్ణన రచియింపగ వచ్చునని చెప్పియున్నాడు. వర్ణనలు తఱచుగ దీర్ఘసమాసభూయిష్ఠములై ఉత్కలికాప్రాయములుగ నుండుటచేత, నా గద్యభేదమునే తిక్కన వచనముగా చెప్పియున్నాడు. భారతమున 'మహాకవిత్వ దీక్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ కృతుల్' అని గద్యను వాడియున్నాడు.

క్రీ. శ. 1224 లో పద్యమయమగు నోపిలిసిద్ధిశాసనమున నడుమ వచన భాగమునకు 'గద్దె' అని కలదు.

గద్యములైన, వచనములైన మాత్రాచ్ఛందస్సంఘటితములగుటచే కాబోలు, కొందఱు కవులు పద్యకావ్య రచనలను, వచన కావ్యరచనలను వచనకావ్యములుగా పేర్కొన్నారు. హరిభట్టు వరాహపురాణములో 'నవరసాలంకార బంధురంబుగా నొక్క ప్రబంధం బాంధ్రభాషాభవ్యంబగు నగనకానంబుగా రచియింప బూనిన సమయంబున, నారసింహ   ఉత్తర భాగ మప్పుడంధ్రభాషను వచనకావ్యం బొనర్చె.' అని చెప్పియున్నాడు. లోకేరావు సోమన యను కవి యిట్లే శివరాత్రిమాహాత్మ్యమును పద్య ప్రబంధమును వచనకావ్యమని చెప్పినాడు.

తెనుగుభాషలో పదమూడవ శతాబ్దినుండి పాటలుగా పాడదగిన వచనములు వెలయుటచేతను, నవి పై గద్యభేదములలో నొకటి యగుటచేతను, నవి ప్రబంధములయందు వెలయక నేకైకముగ నొక గ్రంథరూపముగ లభ్యమగుటచేతను, తొలి వచనగ్రంథము లవియే యని నిర్ధరింపవచ్చును.

ఏ వాఙ్మయమునందైన తొలుత గేయపదపద్యరచన లేగాని, గద్యరూపములగు వచనకృతులు వర్ధిల్లనేరవు. అతి విస్తృతమగు సంస్కృత వాఙ్మయమున వ్రేళ్లపై లెక్కపెట్టదగినన్ని కాదంబరి, దశకుమారచరిత్ర మొదలగునవి కలవు. శ్లోకరచనకన్న యనుప్రాసాద్యలంకార సహితమగు గద్యరచన కష్టతరమగుటచే గాబోలు "గద్యం కవీనాం నికషం వదంతి" యను నానుడి యందే యున్నది. దాక్షిణాత్యభాషలలో ద్రవిడభాషలలో నేకైకముగ గ్రంథమంతయు వచనరూపముగ నున్నవి లేవు. కన్నడభాషయందు పదునొకండవ శతాబ్ది వెనుకనే యిట్టి వచనరచనలు వెలసినవి. పూర్వము, వేదములవలె కంఠస్థము చేయు పద్ధతి యుండుటచేతను నిప్పటివలె, ముద్రణాది సౌకర్యములు లేనందువలనను, విషయము ధారణచేయుటకు వీలుగ నుండునట్లు పద్యరచనలోనే తెనుగువాఙ్మయము ప్రారంభమైనది.

మఱియు తెనుగుభాష స్వరప్రధానమునకు సంగీతమును వర్ణ ప్రధానమగు సాహిత్యము సమ్మేళనముచేసి, అవ్యక్తమధురమగు గానమును సువ్యక్తమొనరించునదిగాన కేవల వచనము లుద్భవిల్లుట కవకాశమే లేదు. అయినను పైని వివరించిన గద్యవచన సాహిత్య సంప్రదాయముల ననుసరించి, తెనుగువాఙ్మయమున నెట్టి రచనలు గలవో ముందు తెలుపుచున్నాడను.

## నన్నయ పూర్వయుగము

నన్నయకు ముందుగల వచనస్వరూపమును దెలిసికొనుటకు శాసనములే యాధారములు. పూర్వము తెనుగుదేశములనే లినశాతవాహనులు ఇక్ష్వాకులు, పల్లవులు, సాలంకాయనులు మొదలగు వారి శాసనములు పాకృతభాషలో నున్నవి. మనుష్యుల పేర్లు, ఊళ్ల పేర్లు, మొదలగునవి మాత్రమే తెనుగున గలవు. చాళుక్యుల కాలమున తెనుగు రాజభాషయైనవెనుక తెనుగుశాసనములు బయలువెడలినవి. ఇంచుమించుగ నా కాలముననే రేనాటిచోళుల శాసనములు తెనుగున కన్పట్టుచున్నవి. ఇప్పటికి లభించిన శాసనములలో మొదటి తెనుగు శాసనమును1 నా కాలపు వచనస్వరూపమును దెల్పుటకె క్రింద యిచ్చుచున్నాను.

స్వస్తిశ్రీ సోఅమహారాజుల్లొళన ఇన్పుఱోళి అణపోతులు రేవణకాలు వుద్దణకాలు ఇచ్చిన పన్నస పెన్నాఱి ఇశఊనికిన్ తేని ఱిచ్చిన పఞ్చమహాపాతకసఙ్కున్.

క్రీ. శ. 850 నాటికి పద్యమయశాసనములు లభించుచున్నందున యా కాలమునాటి వచనశాసనములోని2 భాగము వచన మెట్లున్నది తెలిసికొనుట కుదాహరించుచున్నాను.

[వి]జయాదిత్య పాదపద[ద్మ] భ్రమరాయమాన శ్రీమత్కడియరాజు గుణగణాభరణు ణ్డు [ద]న కొని యీశ్వరునకుం గార్తికేయుండునుబోలె చాపవిద్యకళావిశారదుండు పన్దొరంగులు అయ్యమ ప్రెగ్గడ లుంగరనమ్మన పండరంగును ఈ ధర్మనిర్వాహనోద్యోగమ్మునకు బృహస్పతిసమానులైన ప్రెగ్గడ కా (డెయ) గారి కొడుకు బెజెయరాజు సమ[ర్థుణ్]నని అత్మాన్మతంబునం బన్పిన......

మొదటిదానిలో, 'ఱ' అను వింత ధ్వనిగల యక్షరము, బిందువునకు బదులు వర్గపంచమాక్షరములులిఖింపబడుట. సమాపక క్రియ లేకపోవుట వాక్యరచనయందలి వైలక్షణ్యము తరువాతి శాసనమున వర్గపంచమాక్షరముతో బిందువులుకూడ యేర్పడుట సమాపకక్రియలతో నన్వయసౌలభ్యము గలిగియుండుట మొదలగువానినిబట్టి వచనరచన మెట్లు మారినది తెలిసికొనవచ్చును. గ్రంథవిస్తరభీతిచే నాయాకాలములలో బుట్టిన శాసనము

1. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు-నన్నయకు పూర్వము ఆంధ్రభాష, వృషసంవత్సరాది సంచిక, 8-16 పుటలు.

2. చాళుక్య భీమమహారాజు ధర్మవరము శాసనము, భారతి 1928.

లందలి భావము, విశేషములను నిందీయజాలకపోయితిని. దిక్ప్రదర్శనముగా నన్నయకుముందు వచనరచన మాత్రము చూపితిని.1

## నన్నయ వచన రచన

ప్రాచీన మహాకవుల చంపూగ్రంథములలోని వచనరచనలలో నన్నయ వచనరచన పద్యరచనవలె, ప్రసన్నమై, యక్షర రమ్యత గలిగి, యచ్చున, పది పండ్రెండు పంక్తుల కెక్కువగాక హృదయంగమముగ నుండును. నన్నయ పద్యములయందువలె కొన్ని నియమములు గద్యమునకుగూడ పాటించియున్నాడు. వచనము వ్రాయుటకు.

1. పద్యములం గూర్పవలనుపడని వంశక్రమాది వృత్తాంతములు చెప్పుట.

2. విరివిగా చెప్పవలసిన కథలను సంగ్రహించుట.

3. ఏకధారగా నుండి విసువు జనింపజేసెడు పద్యపఠనము నుండి పాఠకుని మరల్చుట.

4. అచ్చటచ్చట, రత్నములవలె లోకోక్తులు పొదిగించుట.

5. ఏకసమాస సముచ్చయాత్మక వాక్యరచన వీడుట.

6. వచన ప్రారంభము పద్యపాదమువలె నడిపించి, వృత్తగంధిగా భాసింపజేయుట.

ఇందు చివరదానికీవలకే యుదాహరణ చూపితిని. నేటి, ఆంగ్లేయభాషావచనపద్ధతి ననుసరించి, వాక్యవిరామాది చిహ్నము లుంచిన పద్యవిద్యకు గాదు గద్యవిద్యకు నాద్యుడు నన్నయ్య యేయని మనము గ్రహింపగలుగుదుము.

## నన్నెచోడుని వచనరచన

నన్నయలో సగము పద్యము సగము గద్యమున్న నన్నెచోడుని కవితలో అయిదింట నొకపాలు గద్యము గలదు. అది సంస్కృతపద జటిలమై, అలంకారరసహితమై యుండును. యజ్ఞసంభారవర్ణన, వివాహమంటపవర్ణన మున్నగువానిచోట్ల సంస్కృతపదబంధురంబై యున్నది. యతిసామ్యమును పాటించుటయే గాక, ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము మొదలగువానిని వాడినాడు. మొత్తముమీద కుమారసంభవ వచనరచన, పద్యరచనయంత భావబంధురము కాదు.

తిక్కన, ఎఱ్ఱన, వచనరచనలు పురాణశైలి నవలంబించినవి. కాని, ఎఱ్ఱన ప్రత్యేకముగ నృసింహపురాణమున వర్ణన సంప్రదాయము ననుసరించి స్తంభోద్భవవచనమును రచియించెను. నాచనసోమన నిమ్నోన్నతముగు వచన శైలి నవలంబించెను. శ్రీనాథ మహాకవి గద్యరచనాసంప్రదాయము తెలిసినవాడగుటచే, సహజముగ ప్రసన్న సంస్కృతపదరచన చేసినను, భీమఖండమున ప్రత్యేకముగ చూర్ణికను రచియించెను.

## కృష్ణమాచార్యుడు

వచనవాఙ్మయ ప్రథమాచార్యుడు † క్రీ. శ. 1300 ప్రాంతము

ఈతడు ద్వితీయప్రతాపరుద్రుని కాలమున నోరంగలున విలసిల్లినట్లు 'ఏకశిలానగరవృత్తాంతము' ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము చెప్పుచున్నవి. ఈతనిని తాళ్లపాక అన్నమాచార్యులు (1408-1503) పేర్కొనుటచేతను, వచనములు, విన్నపములు వ్రాసి, సంకీర్తనలు వ్రాయుటకు తొలుత దారి చూపినవాడగుటచేతను నీతని ప్రథమాచార్యుడని తెలిపితిని.

## సింహగిరి నరహరి వచనములు

ప్రసిద్ధవైష్ణవ క్షేత్రమగు శ్రీసింహాచలక్షేత్రమున నీతడు నివసించిన కారణమున నా దేవునిపై నీవచనములు రచియించెను. ఇది "సింహగిరి నరసింహ దయానిధీ" యను మకుటముతో నుండును. ఇవి యముద్రితములు—

దేవా! జయ జగూపరంధామ! పరమ పురుష! పరమాత్మ ప్రకాశ! అమృత! అచలాచల! అవ్యక్త! అగణితదయాంభోధి-అనాథపతియైన స్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధీ!

ఏడు రామాయణంబులు, పదునెనమిది పురాణంబులు, ద్వాదశస్కంధంబులు. భగవద్గీతలు, సహస్రనామంబులు చదివితేమి వినితేమి, వ్రాసితేమి, ఈ సంకీర్తనకు వేయవపాలింటికి సరిరావు. కడమసంకీర్తన లనేకసారులువిన్నారు. ఇందుకు తప్పరాదు...... మీ దాసులకు కులగోత్రం బెన్నసేమిటికి? మాయాతి రామానుజముని పరంధాత అనాథపతియైన సింహగిరి నరహరి నమో నమో దయానిధీ!

---

1. పూర్వపు వ్రాతలయందీక్రింది లక్షణములు గన్పట్టును.

1. పూర్ణానుస్వారములు వాడుట. (కొంతొరు-అండది)

2. పూర్ణానుస్వారములకు ముందక్షరములు ద్విత్వము వ్రాయుట. గ్రహంబ్బునంగ్గా, కుంత్తి, కంక్కపత్త్రంబ్బు॥ మొదలైనవి.

3. వాండ్డు, వాండు, వాడు - మూడు రూపములును కన్పట్టును. ఈరూపములు.

4. బ్రహ్మ, సింహ, జిహ్మ-బంహ్మ - సింహ్వ - జింహ్వ-జిహ్వ-గా వ్రాతలలో నుండును.

5. దుఃఖ-దుఖ్ఖ-చేయ-సేయ-శేయ, శాయ.

6. సంబోధనలు దీర్ఘాంతములుగా నుండెవు. పరంతప! కాళేంద్ర!

7. ఏత్వము సాధారణముగా వ్రాయరు.

8. ఋ-రు-భేదము పాటింపబడెదు. శత్రు-శత్రు-పౌత్రుండు పౌత్రుండు-రుద్రుని రుద్రుని.

9. ప్రాగ్జోతిష-ప్రాగ్జ్యోతిషకు-విభత్సుండు-వివత్సుండు.

10. వలపలగిలక వ్రాయుటయే సర్వత్ర కానబడును. (పార్శ్వక్) వత్తక్షరలు.

† భారతి. పార్థివ భాద్రపదమున నావ్యాసము పై శీర్షికతో ప్రకటితమైనది.

## శఠగోప విన్నపములు

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! నీకు పునః పునః ప్రదక్షిణ నమస్కారంబులు. శరణాగత వజ్రపంజరా! నా దురితంబులు ఖండించి మీ దాసానుదాసులకు దాసుండనై వర్తించే బుద్ధి పుట్టించి, నాదుర్గుణంబులు చూడక మీ పతితపావన బిరుదు ప్రతిష్ఠించి, పతితుండనైన నన్ను రక్షింపవే ఆశ్రితజనమందార అఖిలలోకాధార! నమో నమో లక్ష్మీవల్లభా!

## తాళ్ళపాక పెదతిరుమలయ్య

### వేంకటేశ్వరవచనములు - (1468-1553)

ఇవి, తిరుపతి దేవస్థానమున సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులగు తాళ్లపాక అన్నమాచార్యులవారి పుత్రులు పెద తిరుమలయ్యగారు రచించినవి. శ్రీ వేంకటేశ్వరా! అను మకుటముతో ప్రశస్త రచనగల నీతని వచనలలో 166 నేడు లభించుచున్నవి—ఇవి 30 రాగములతో పాడవచ్చును. ఇందు మంచి భావములు ప్రపంచితములై యున్నవి.

"ఇది లోకదృష్టాంతంబు—నీ చరిత్రలు గణుతింప నలవిగావు. మఱియు నితరమార్గము లెండమావుల నీళ్లవంటివి. మిణుగుఱు పురువుల ప్రకాశమువంటివి. కాకిచేగడల సామ్యమువంటివి. కప్పచిప్పల వెండివంటివి. ఇట్టిభ్రమలం బొరలక నీ శ్రీ పాదంబులే గతియని యున్నవారలు ధన్యులు శ్రీ వేంకటేశ్వరా!"

## శంకరకవి క్రీ. శ. 1590?

### భవానీ మనోహర వచనములు

శైవ వాఙ్మయమున నివి చాల వ్యాప్తిలోనున్న వచనములు. ఇవి నేటికిని కొందఱు పారాయణ చేయుచున్నారు1—వీనికి పూర్వము పురాతన శంకరవచనములని పేరుండెను—శివపంచస్తవికి వ్యాఖ్య రచించిన దేచనామాత్యుని పుత్రుడు శంకరకవి, మహిమ్నము మొదలగు శివస్తవములనుండి భావములను గ్రహించి యిందు పొందుపఱచినాడు. ఇవి చక్కని శైలిగలవి—నను రక్షింపవే భవానీమనోహరా, యను మకుటము గలవి. ఇవి చాల పెద్ద వచనములు—మిక్కిలి వ్యాప్తిలో నుండుటచే నుదహరింపలేదు.

## గణపవరపు వేంకటకవి క్రీ. శ. 1570

### యతిరాజశేఖర వచనములు :

ఇవి మహాలాక్షణికుడని ప్రసిద్ధికెక్కిన గణపవరపు వేంకటకవి రచితములు—నమో నమో యతిరాజశేఖరా! అను మకుటము గలవి.

## కాశికాధీశ్వర వచనములు

ఇవియును శైవవాఙ్మయమునకు సంబంధించినవే. వీనికి శివయోగ వచనములను నామాంతరము గలదు.

శ్రీ గురుదేవా! అవ్యయంబైన పరబ్రహ్మంబిట్టి దని లోకంబు నెఱుఁగుట దుర్లభం బది సద్గురుప్రసాదలబ్ధంబైన రాజయోగీంద్రుండైన గురుప్రభువుం గలిగినయది యతిసులభంబుగా సాధకుండైన యోగీశ్వరునకు సిద్ధించు నారాజయోగంబును, సాంఖ్యంబును, తారకంబును నమనస్కంబునన మూడువిధంబులై యుండు...వినోదార్థంబు పాంచభౌతిక దేహంబును బోలె జగంబున విహరించు పరమశివయోగీంద్రు చరలింగపాదారవిందభజనంబు నా యందు పరంబుగా జేసి రక్షింపవే! శ్రీ కాశికాధీశ్వరా.

పై కృష్ణమాచార్యుని శఠగోపవిన్నపములవలె నధునాతన కాలమున దామోదర హృషీకేశదాసుని ముప్పదినాల్గు విన్నపములు గలవు.

## దత్తాత్రేయయోగి-వేదాంతవ్యవహారసారసంగ్రహము క్రీ. శ. 1550 ప్రాంతము

మాహురిక్షేత్రమున మహాప్రసిద్ధుడై, దాసగోపాలస్వామి మొదలగు శిష్యులకు జ్ఞానమార్గోపదేశికుడగు దత్తాత్రేయ యోగి దీనిని రచియించెను. ఈతడే, పరమానందతీర్థులు. మల్లయోగి మున్నగు తన శిష్యపరంపరమూలమున యద్వైతసిద్ధాంతమును తెనుగున ప్రచారము గావించిన మహనీయుడు. వ్యాసకృతమగు బ్రహ్మసూత్రములకు శంకరకృతమగు శారీరక మీమాంసాభాష్యము ననుసరించి సంగ్రహరూపమున వాడుక తెలుగులో రచియింపబడిన ప్రకరణ గ్రంథ మిది.

"వేదాంతమనగాను శారీరక సూత్రభాష్యము. ఆ శారీరక సూత్రభాష్యార్థము సంగ్రహించిన గ్రంథా లన్నిని వేదాంతప్రకరణాలనంబడును. ఆ శారీరక సూత్రభాష్యానకు యేఅనుబంధ చతుష్టయముకలదో అదే వేదాంత సారసంగ్రహ మనేటి గ్రంథానకు ఆలోచించేటిదే అనుబంధచతుష్టయం బనంబడును. అనుబంధ చతుష్టయం బనంగాను అధికారి విషయసంబంధ ప్రయోజనాలును అధికారి అనగాను సాధన చతుష్టయసంపన్ను డనంబడును. సాధన చతుష్టయం బనగాను నిత్యానిత్య వస్తువివేకము. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి ముముక్షుత్వము ఈనాల్గు సాధన చతుష్టయం బనంబడును."

## ఎల్లకర నృసింహకవి

### భారతసావిత్రి క్రీ. శ. 1550

ఈతడు కృష్ణయార్యుని పుత్రుడు - క్రీ. శ. 1511-1568 వఱకు నున్న ప్రసిద్ధవైష్ణవాచార్యుడు. తిరుమల లక్ష్మణమునికి శిష్యుడు. ఈతడు మార్కండేయపురాణమును ద్విపదగా రచించినాడు. ఆ గ్రంథావతారికలో—

"అనఘాత్మ ఎల్లకరాన్వయాంభోధి
పరిపూర్ణ చంద్రశోభనగుణసాంద్ర
నరసింహకవివర్య నగసమధైర్య
లలిమీఱ తిరుమల లక్ష్మణాచార్య
చెలగు పాదాంభోజసేవాధురీణ

1. భవానీ మనోహర వచనములకే శంకరవచనములని నామాంతరము. ఇవి వేఱువేఱు గ్రంథములు కావు.

ప్రచురవాక్యములచే భరతసావిత్రి
రచియించితిని కవిరాజు లౌనవగ

భారతసావిత్రి ప్రశస్తమైన వచన రచన గలది. దీనిని స్త్రీలు కూడ పారాయణము చేయుచుందురు. విదురునింటికి కృష్ణుడు వచ్చి విందారగించుట యిందలి కథ.

"కురుక్షేత్రంబు యజ్ఞవేదియు జనార్దనుండు యూపంబును దుర్యోధనుండు పశువును కర్ణుండు హవిస్సు పాంచాలి యరణియు భీమసేనుం డగ్నియు నర్జునుండు హోతయు భీష్మద్రోణు లాజ్యంబును రణంబు యాగంబు గావించి ధర్మరాజు యజమానుండును గాండీవంబు స్రుక్ స్రువంబులును సమస్తరాజసంఘంబులు గొని యాడ హోమంబు చేయించె నిది భరతసార సంగ్రహంబున భారత సావిత్రియనం బరగు!

*Descriptive Catalogue of Telugu Manuscripts. Vol 6. Vachanakavyas.. D. 1440.*

## సభాపతి వచనము. 1550.

సభాపతులే కాదు చదువుకొనిన సమస్తజనులు గ్రహించి జ్ఞాపకము పెట్టుకొనదగిన గ్రంథము. సమయస్ఫూర్తి కిందలి విషయములు గుఱుతుపెట్టుకొనియుండుటవలన నెంతో మేలగును. ఇం దిరువది ప్రాసలు, ఏబది యతులు చెప్పబడినవి. సభాపతి (రాజు) ఎట్టివాడుగా నుండవలెను అను వర్ణనతో ప్రారంభమగుచున్నది గాన 'సభాపతివచనము' అని దీనికి పేరువచ్చినది. వచనమనుటకు సార్థకముగ మంచి గ్రాంథిక రచనలో నున్నది. రాయవాచకమున నీగ్రంథములోని వాక్యము లుదాహృతములగుటచేత, నిది క్రీ. శ 1550 ప్రాంతమునకు ముందే రచితమై యుండవలెను. 'మహితసభాభిరామాముఖకావ్యంబు ధరనిల్పెమీ తాతశరణమంత్రి' అని శేషధర్మములలో క్రీ. శ. 1550 ప్రాంతమున తామరపల్లి తిమ్మయ్య మంత్రి చెప్పినాడు. ఈ సభాభిరామకృతియే సభాపతి వచనము - అట్లయినను నీ రచనము క్రీ. శ. 1550 ప్రాంతములది కావలెను.

## దాసగోస్వామి లేక దాసగోసాయి. క్రీ. శ. 1560 ప్రాంతము

పరమానంద బోధ ప్రకరణము.

మాహురిక్షేత్రమున దత్తాత్రేయ మఠమున కధీశ్వరుడై పింగళి సూరన, తరి గొప్పుల మల్లన, మల్లారెడ్డి మొదలగు తెలుగుకవులచే ప్రశంసితుడగు దత్తాత్రేయ యోగి మహారాష్ట్రభాషలో నీ గ్రంథమును దాసగోసాయి అనుశిష్యునకు నుపదేశించెను. అతడీ గ్రంథమును మహారాష్ట్రభాషలో మొదట వెలువరించి, ఆ వెనుక తెనుగుభాషలో రచించిగోపాలభట్టను తన శిష్యున కుపదేశించెను. అతడు సర్వదేవుడను మఱియొకశిష్యున కుపదేశించెను. ఇది వచనరూపమగు వేదాంత గ్రంథము: మచ్చునకు:

"ఆత్మపూర్ణ సమాధినిష్ఠుడైనవానికి జాతీయ విజాతీయ భేదంలేదు. వర్ణాశ్రమాచార ధర్మాలు చేయబనిలేదు. సర్వధర్మాలు విడిచి బ్రహ్మమై, దేశకాలవస్తువులు లేక, అపరిచ్ఛిన్నుడై, జ్ఞానపూర్ణుడై పరబ్రహ్మమువలెనే వుండి వాఙ్మనోతీతమై, నామరూపరహితమై, అఖండ పరిపూర్ణస్వరూపమై యుండును. ఇది సకల వేదాంతసిద్ధాంతం, యోగసాంఖ్య సిద్ధాంతం. బృహదారణ్య సకలోపనిషత్సారం.

'ఇతి దాసగోసాయీ విరచితాయాం పరమానంద బోధ ప్రకరణం నామ ప్రథమ ప్రకరణం.' అని గద్య కలదు.

(సంఖ్య 2125)

## సిద్ధరామకవి - క్రీ. శ. 1560

ప్రభుదేవరవాక్యము లేక పిండచక్రనిర్ణయము.

"చిత్కళాధామ శ్రీ గురుసిద్ధరామ" అని ప్రాచీనశైవ సమయాచార్యునిగూర్చి శతకము రచించిన సిద్ధరామకవి, యీ శైవ వేదాంతివచన గ్రంథకర్త. ఇందు ప్రభుదేవర యనగా వీరశైవ మత ప్రతిపాదకులలో నొకడగు నల్లమప్రభువు. ఇతని చరిత్రమే ప్రభులింగలీల యను పేర, తెనుగున ద్విపద పద్య కృతులలో వెలసినది. ఈ గ్రంథమున, ప్రభుదేవరతత్త్వోపదేశమంతయు తెనుగు వచనముగా వ్యాఖ్యానింపబడినది. పంచీకరణము పిండోత్పత్తిక్రమము, అను భాగము లన్నియు నిందులోనివే. ఇం దిరువదియేడు భాగములు కలవు. శైలి వ్యావహారికము.

"ముఖ్యవాయువులు చేతుల యెముకలు రెండు, కుదురు యెముకలు రెండు కూడిన దిక్కునుండి దేహతత్త్వాలనెల్లా పకడకు తెచ్చును. అంతర్యామి వాయువులు, ఆత్మపురుషునికి వాహనమైయుండి ప్రాణాలు తెప్పించును. ప్రపంచవాయువు దేహానకండగా నుండును. వజ్రజడదేహాన్ని అంచుగా నుండును. అంచు చీలలు చెడితే దేహం చెడును. ఇది పిండచక్ర నిర్ణయం." ఈతడు కేదార దేశికుని శిష్యుడు. పిడుపర్తి బసవనను పేర్కొన్నాడు. చూడుడు శైవకవుల చరిత్ర. పుట 300-301. (సం. 2129)

## కాశీ చెన్నబసవేశ్వరుడు క్రీ. శ. 1600

వి వే క సిం ధు వు

శంకరకృతమగు బ్రహ్మసూత్ర భాష్యము ననుసరించి మహారాష్ట్రభాషలో ముకుందయోగి రచించిన, వివేకసింధువను వేదాంతగ్రంథమున కిది తెలుగుసేత. ఈ ముకుందయోగి మహారాష్ట్ర వాఙ్మయమున నాదిరచయిత1-ఈతడు, వివేకసింధువే కాక పరమామృతము, మూలస్తంభము అను మరి రెండు గ్రంథములు రచియించినాడు. ఈతడు పండ్రెండవ శతాబ్ది కడపటనుండెను. కాశీ చెన్నబసవేశ్వరుడు రచించిన యీ తెనుగువచన గ్రంథమే తన రచనమునకు మూలమైనట్లు వివేకసింధువును పద్యకావ్యముగా రచియించిన వేగినాటి కొండయ్య యిట్లు చెప్పియున్నాడు.

"వినుతింపం భవరోగవైద్యమగు నీ వేదాంతశాస్త్రంబు పావనమైయుండెఁ [illegible]

1. *A note on Mukundaraja the oldest marathi author Bombay Branch of Royal Asiatic Society vol 9 Article VIII Pages 167-170.*

జ్ఞానలం బ్రోచిన పుణ్యమూర్తి విమలస్వాంతుండు విజ్ఞాన శాసనుఁడైనట్టి ముకుందమూనికి నమస్కారంబు గావించెదన్. 1-12

ప్రస్తుత గ్రంథరచనము ప్రశస్తమైనది. పూర్వార్థ మేడధ్యాయములు. ఉత్తరార్థము మూడధ్యాయములు కలవు. ప్రారంభము:-

శ్రీమత్పరమేశ్వర భక్తిమార్గానందానుభవ సద్గుణరత్నరత్నాకరంబును, బహువిధరహస్య దురవగాహ మహిమతత్త్వ మహనీయంబును పరమమనీషావిశేషాసాధారణ బోధవిధాన బ్రహ్మజ్ఞాన సాధిత కరతలామలకాయమానంబును, చర్వితచర్వణ దుర్వహ నిర్వాణ వధూమణీకరగ్రహణానుకూలంబును, శంకరాచార్య ముఖకమల వినిర్గత మకరందరసప్రవాహంబును, నైన వేద భాష్యప్రకరణంబును సకలకర్మత్యాగియు పరమానందానురాగియు, కైవల్య నిరతభోగియునైన ముకుందయోగి మహారాష్ట్రి భాషావిశేషంబున వివేకసింధువును రచియించె. నది సకలోపకారంబుగా, సమస్తశిష్యగణరక్షకుండును, జంగమశివలింగ విగ్రహుండును, కారుణ్యసముద్రుండునైన యోగదశాంతసద్గురు కర పద్మ శిరస్సంయోగ భావనాసార్థ కృతార్థతనుండునైన కాశీ చెన్నబసవేశ్వరుండను నేను, ఆంధ్రభాషాస్తోకంబుగా టీక రచియింపం బూనితి, సద్వివేక సింధువనుజ్ఞాన శాస్త్రంబునకు, గురుశిష్య సంవాద టీకావిధానం బెట్టిదనిన; ముకుందరాజయోగీశ్వరుని స్తోత్రం.

## పరమానందయతి. క్రీ. శ. 1600

దత్తాత్రేయగురునియొక్క శిష్యపరంపరలో నీత డగ్రగణ్యుడు. వచన వేదాంతవిషయక గ్రంథములనే కాక శతకములను గూడ రచియించియున్నాడు. వచనరచనలలో పేర్కొనదగినది మొదటిది.1

### వేదాంత వార్తికము

గురుశిష్య సంవాదరూపకమైన యీ వేదాంతవచన గ్రంథము విద్యారణ్యయతి ప్రణీతంబయిన సంస్కృత వేదాంత వార్తికమునకు తెనుగుసేత. చక్కనివ్యవహార శైలినున్నది. చివర పద్యములో—

"పరమానంద యతీంద్రుఁడ
స్థిర దత్తాత్రేయగురుని శిష్యుఁడ, యోగ
స్ఫురణానుభవుఁడ నీ కృతి
సరసన్ రచియించినాడ సర్వజ్ఞుడనై"

ఇదియే "అశ్రుతార్థోపన్యాసము" అను పేర తెనుగునుండి తమిళభాషలోనికి చిద్ఘనానందయతి శిష్యుఁడు సదాశివ యోగిచేత, మణిప్రవాళశైలిని (తమిళ సంస్కృతములు) అనువదింపబడినది. రెండవగ్రంథము బ్రహ్మవిద్యాసుధార్ణవము.

## గోపినాథకవి క్రీ. శ. 1670
## వచనవిచిత్ర రామాయణము

— ఇది యుత్కల (ఓఢ్ర) భాషలో సిద్ధేంద్రయోగి రచియించిన గ్రంథమునకు సాంధ్రానువాదము. ఈ తెనుగు వచన రచన ననుసరించి నల్గురైదుగురు కవులు పద్యకావ్యములుగా రచియించిరి. ఉత్తరప్రాంతమగు కళింగదేశమున దీని వ్యాప్తి చాలగా గలదు. ఈతడు సృష్టికరణ కులజుడు. క్రీ శ. 16677-1698 సంవత్సరములలో జయపుర సంస్థానమును పాలించిన విశ్వంభరదేవు వలన నీతడు సమ్మానింపబడెను. కావున నిత డా కాలమువాడు. ఇందలి గద్య :

ఇది శ్రీ సీతారామ వరప్రసాదలబ్ధ కవిత్వచాతుర్య ధురంధర నిరంతర విద్వజ్జనసాంగత్యబంధుర భారద్వాజగోత్ర పవిత్ర, శారాయణ మంత్రి పుత్ర వితరణ విజితరాధేయ, గోపినాథ నామధేయ ప్రణీతంబైన కేవల వచనవిచిత్ర రామాయణము.

"ఏవం విధకథావిశేషంబైన వాల్మీకి రామాయణానుమతంబైన యోఢ్రరామాయణంబును చూచి,తత్కథావిశేషంబుల సారం బంగీకరించి, సంక్షిప్తంబులుగా నెనెన సంస్కృతపదంబులు సంఘటించి, తెనుంగు వచనప్రకారంబున రచించితి"అని కలదు. ఇందు వాల్మీకి రామాయణమున లేని చిత్రకథలు కలిగి బహుమనోహరముగ నుండును. ప్రశస్తరచన గలది.

## పుష్పగిరితిమ్మన - క్రీ శ. 1700. భాగవతసారము

సమీరకుమారవిజయమను ప్రౌఢ ప్రబంధమును రచియించి, కంకంటి పాపరాజు, తేకుమళ్ల రంగశాయి మొదలగు ప్రసిద్ధ కవులచే స్తుతింపబడిన పుష్పగిరి తిమ్మన భాగవతసారమను వచన గ్రంథము రచియించెను. దీని విశేష మేమనగా నీభాగవతసారము తమిళ భాషలోనికి ననువదింపబడినది. తమిళ రచయిత చిన్నయ్యన్ యిట్లు చెప్పినాడు.

"ఇంద పని రెండు స్కందంగళుం విష్ణుప్రియ తెలుంగిలె పుష్పగిరి తిమ్మప్పయన్ సెయిదిన దైవారై యవ్వార్ శాడాన్లార్ చిన్నయన్ తమిళ వచనత్తినాల్ సెయిదినార్"

"సూతుండు శౌనకాది మహామునుల జూచి వింటిరా! మునులారా! ఇటువలె నుత్తరపుత్రుం డడిగితే ప్రత్యుత్తరంబుగా శుకయోగి మహానుభావుండు పలికెను. ఓ రాజేంద్రా! నీ వడిగిన ప్రశ్నము మంచిది. ఇది పెద్దలు మెత్తురు. వినదగినవి వేయివేలుం గలవు. వాటిలో నీవడిగినవి ముఖ్యము. సంసారమగ్నులీతత్త్వము తెలియగూడదు ; పసుశిసుభార్యాదులమీది మోహముచేత కాలము క్రమించి కడపట చత్తురు2."

## బ్రహ్మాండవచనము - మాచనామాత్యుఁడు
## క్రీ. శ. 1750 ప్రాంతము.

బ్రహ్మాండ నిర్మాణక్రమము, నాలుగు వేదములు,పదునెనిమిది పురాణములనుండి గ్రహించి, రచితమైన ప్రశస్తవచనగ్రంథము

1 లిఖితగ్రంథసూచనలు. అశ్రుతార్థోపన్యాసము (వేదాంత వార్తిక, తమిళ అనువాదము) శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ జర్నల్ పుటలు 186-187 (శ్రీ డి. టి. తాతాచార్య శిరోమణి.)

2. తెలుగులిఖితగ్రంథముల వివరణపట్టికలు. వాల్యుం 6. వచనకావ్యములు *D 1437*

ఈ మాచన భారద్వాజగోత్రుడు. భైరవామాత్యుని పుత్రుడు. గ్రంథ చివరగద్యలో "శ్రీ నారాయణ, శ్రీమహాదేవచరణ ధ్యానానంద" అని చెప్పుకొనుటచేతను, నిట్లే సుప్రసిద్ధ వేదాంత గ్రంథమగు సీతారామాంజనేయ సంవాదమున గద్యలో, "శ్రీమన్నారాయణ మహాదేవ గురు కరుణాకటాక్ష" యని యా గ్రంథకర్త పరశురామ పంతుల లింగమూర్తి కవి చెప్పుటచేతను, మాచనకూడ, యాతని సమకాలికుడని తెలియుచున్నది. ఇది చక్కని గ్రాంథిక శైలిలో నున్నది.

"శ్రీమన్మహాదేవుండు కైలాసశైలోపరి భాగంబునందు సుఖాసీనుండై కూర్చున్న సమయంబున, సకల జగన్మాతయగు పార్వతీదేవి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, లేచి నిలిచి కరకమలంబులు మొగిచి దేవా! సకల జగదుత్పత్తి స్థితిలయ ప్రకారంబులకుం గారణకర్మలయిన మూర్తిత్రయం బెట్లు కలిగె బ్రహ్మాండ నిర్మాణం బెట్టిది...."

ముగింపు.

"ఈ యాఖ్యానం బెవ్వరయేని తాత్పర్యంబునం బఠించిన వారికి సకల దురితక్షయంబును, శాశ్వతసంపదయు, శతాశ్వమే[illegible] ఫలంబులు గలుగు. ఈప్సితార్థంబులు సమకూరుననిన నా[illegible]రమేశ్వరి యానందంబునుబొంది సకలలోకములు దయతో రక్షించుచుండె."

## దక్షిణాంధ్ర వాఙ్మయము-వచనరచన

సలక్షణమగు గ్రాంథిక వచనరచన సమీచీనముగా ప్రారంభమైనది, దక్షిణదేశమున మధుర నాయకుల కాలమునుండి యని చెప్పనొప్పును. ఈ దేశమున తంజావూరు, మధుర, ప్రాంతములను తెలుగు నాయకు లేలినను నచ్చటి వ్యవహారభాష తమిళము కాని తెనుగు కాదు. కాబట్టి యా నాయకులతో నచ్చటనే నెలకొనిన తెలుగు రాజకీయోద్యోగులకును, కవులకు, పండితులకు, తక్కినవారికి, మాతృభాష తెనుగైనను నిత్యవ్యవహారమున తమిళభాష తప్పనిసరియైనది. అయిన పాలకులు తెలుగువారగుటచేతను, భాషాపోషకులగుటచేతను, తెలుగుభాష యక్షగాన నాటకప్రబంధవచనరూపముల పెంపొందినది. వచనరచనయందు మాత్రము ప్రత్యేక లక్షణ మొకటి ప్రభవింపజేసినది. ఇతరాంధ్రదేశమునందువలె,నిచ్చట తెనుగున వ్యావహారికముగను, గ్రాంథికముగను వచనరచన రెండువిధములుగా వర్ధిల్లుటకు వీలు కలుగలేదు. ప్రజాసామాన్య వ్యవహారభాష తెనుగు కాకపోవుటచే, శుద్ధమగు గ్రాంథికరచనములోనే వాఙ్మయము వర్ధిల్లినది.

## ధేనుమాహాత్మ్యము

ఈ వాఙ్మయశాఖలో మొదట వెలువడినది లింగనముఖి శ్రీ కామేశ్వరకవి ధేనుమాహాత్మ్యము లేక ఆవుల మాహాత్మ్యము అనునది. ఈతడు రుక్మిణీపరిణయము, సత్యభామాసాంత్వనము[1] అను రెండు ప్రబంధములను రచించెను. వానిలో 'సత్యభామాసాంత్వనము, శృంగారప్రబంధములలో నొక రసవత్ప్రబంధముగా నెన్నిక గన్నది. క్రీ. శ. 1674 సంవత్సరమున తంజావూరిని జయించి పాలించిన ముద్దళగిరియొద్ద నీత డాస్థానకవిగా నుండెను. ఇందలి శైలి చక్కనిది.

"ఆవుపా లమృతంబని అమరవిభుండు పలుకరించెగనుక, ఆవు నిచ్చిన అమృత మిచ్చిన ఫలము చేకూరును. మేవుతోగూడ మేలైన దూడ ఆవును వృషభమ్మును నెవ్వం[illegible]సంగు నతండు స్వర్గంబునందు సుఖంబుజెందు. ప్రాణంబులు, ధేనువులు, సమంబులని మునులు పలుకరింతురు. కాబట్టి గోదానంబుచేయు జనులకు ప్రాణదానఫలంబు కలుగును........కావున నావుల మహిమ నెన్న నలవిగాదు"

## విజయరంగ చొక్కనాథుడు క్రీ. శ. 1704-1731

శ్రీకృష్ణదేవరాయల కాలమున ప్రబంధములు వర్ధిల్లినట్లు విజయరంగ చొక్కనాథుని కాలమున వచనములు వెలసినవి. ఈతడు స్వయముగ, వచనగ్రంథములు రచియించుటయేగాక, వచనరచయితల నాదరించిన విద్వత్ప్రభువు - ఈతని గ్రంథములు రెండు లభ్యములైనవి. రెండును నముద్రితములు—

### శ్రీరంగమాహాత్మ్యము:

ఇది శ్రీరంగ క్షేత్రమాహాత్మ్యమును దెలుపు పది యధ్యాయముల గ్రంథము - శ్రీరంగనాథుని కంకితము. ఇందలి వచనశైలి తెలియుటకు కొన్నిపంక్తు లుదాహరించెదను.

"శ్రీరంగ విమానరాజంబు తొలుదొలుత బ్రహ్మలోకంబున నుండు. తదనంతరంబు నీవు తపంబుచేసిన చతుర్ముఖుండు నీ కీయం గలండు. అయోధ్యానగరంబున నీవు నీవలన జనించిన రాజులును పెక్కండ్రు పూజింపగలరు. అంతట సురాంతకుండగు రామ నామధేయంబున భవదీయవంశజాతుండైన దశరథుని గర్భంబునం దవతరించి, లోకవిద్రావణుండైన రావణుని సంహరించి వానికి సహోదరుండును బ్రియంకరుండును నగు విభీషణునకు లంకారాజ్యంబును నీకు గుల ధనంబగు శ్రీరంగవిమానంబు నీయ గలండు."

### మాఘమాహాత్మ్యము:

ఇది పదిహేనధ్యాయముల గ్రంథము. ఈ గ్రంథము మొదట,

"శ్రీమచ్చంద్రసరోవర తామరసపరాగ చారు తరపటవాసా
కామాదివిరహిత జగదభిరామామృతగుణ విలాస రంగనివాసా !

అను కంద పద్యము గలదు. దీనివలన నీతనికి కవితారచనయు తెలియును. మాఘమాహాత్మ్యమును దెలుపున దీ కృతి - మచ్చునకు. "మృగశృంగమహాముని మాఘస్నానఫలంబు ధారవోయుటచే ధర్మగుప్తుడు గజరూపవిముక్తుడై చెప్పినమాటలు : బ్రహ్మతేజోనిధీ! నాయీనుగుజన్మంబు తొలంగె. నిషధపురంబున విశ్వగుప్తుండను వైశ్యుండు స్వధర్మంబు తప్పకయుండు. నే నతని కుమారుండ. వేదంబులు చదివి యాగాది కర్మంబులు సేయుచు జాతికిం దగిన జీవనంబున మెలంగుచు, ధర్మంబుగా వడ్డి కిచ్చు

1. ఈ గ్రంథము బందరులోని శృంగారగ్రంథమండలి యందు నాడే సంస్కరింపబడి విపుల పీఠికతో వెలువడినది.




కూతురు : అమ్మా ! ఈ సంవత్సరాదికి నాకేం బహూకరిస్తావే ?

తల్లి : మీ నాన్నగారు నీకోసం భారత్ పంకా ఒకటి కొనుక్కొచ్చారు.

కూతురు : చాలా 'thanks', బహు సంతోషమైంది. పంకాలు దొరుకుతవిగాని భారత్ పంకాలు దొరకటం లేదు. ఇంక నరస తొందరచెయ్యక చల్లగానే ఉంటుంది.

మా హృదయపూర్వకాభినందనలు:

THE INDIA ELECTRIC WORKS LTD.,
"CHATNATH BUILDINGS"
MOUNT ROAD :: MADRAS 2.

టయు, నావుల బాలించుటయు, పైరులు పెట్టించుటయు మొదలైన వైశ్యకర్మంబులు సేయుదు."

## సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు

ఈతడు విజయరంగ చొక్కనాథుని ముఖ్య సామాజికులలో నొకడైయుండెను గాన నాతని సమకాలికుడు - ఈతడు జైమినీ-భారతము, సారంగధరచరిత్రము అను రెండు వచనకావ్యములు రచియించెను. ఈ రెండు గద్యకృతులే గాక, అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనము అను రెండు శృంగార ప్రబంధములు రచించెను. అందులో మొదటి దేవలికే చాల వ్యాప్తిలోనున్నది- వచన రచనలలో మొదటిది,

### జైమినీ భారతము

ఇది పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమినీభారత పద్యకృతికి వచనానువాదము - అయిదాశ్వాసముల కృతి - ఇది విజయరంగ చొక్కనాథునికి కృతి - ప్రతి యాశ్వాసాద్యంతంబులయందు ప్రబంధములవలె, పద్యములు గలవు. ఇందు పినవీరన్న పదములు జాతీయములు, సమాసములు, వాక్యములు, సామెతలు - నల్లె వాడినను, సంస్కృతమున జైమిని భారతాశ్వమేధ పర్వమును చూచినట్లు గ్రంథాంత గద్యలు తెలుపుచున్నవి. కాని శృంగార వర్ణనలయందు, యుద్ధవర్ణనలయందు రెండింటిని మీఱి యథేచ్ఛముగా వర్ణనలం గావించెను. ఇందలి శైలి చిన్నయసూరి ప్రౌఢ శైలి కేమాత్రమును తీసిపోదు. ప్రాచీనరీతి ననుసరించిన నిప్పటి వానితో బరిశీలించిన నీ క్రింది భేదంబులు కన్పట్టును.

1. పాత్రలకు సర్వనామము లుపయోగింపక నామములే వాడుట.

యమకానుప్రాసాద్యలంకారముల కొఱకు వర్ణన కల్పించుట.

8. గ్రంథమున నఱసున్నలే వాడుట.

ఈ గ్రంథము ముద్రితమై ప్రచారమున నుండుటచే వాక్యము లుదాహరింపలేదు.

### సారంగధర చరిత్ర

జనరంజకమగు సారంగధరచరిత్ర మూడాశ్వాసముల వచనముగా రచితమైనది. ఇది శ్రీరంగేశున కంకితము. ఆశ్వాసాద్యంతంబుల పద్యములు కలవు. శైలి రసవంతమైనది.

"అప్పుడు ప్రోడలగు చేడియ లాచేడియం జూచి యిక్కుమారుని చక్కదనంబును, నీ చక్కరబొమ్మ యక్కరయుం జూచిన నేటి కిచ్చోటికేమోపాటు వచ్చునని తోచుచున్నది. ఇత్తరి యిబ్బిత్తరి కింత తత్తరం బేటికి? నాటిగానిచోట మోహంబు పాటించుట పాటిగాదు. ఈ వనితనుమనము మానుపలేము. దైవగతి విపరీతంబయ్యెనని తోచుచున్నది."

## కుందుర్తి వేంకటాచలకవి

ఇతడును విజయరంగ చొక్కనాయకుని యాస్థాని. మిత్రవిందాపరిణయమను నీతని పద్యకృతి చాలకాలము క్రిందట ముద్రితమైనది. కార్తికమాహాత్మ్యము అను వేఱొక పద్యకృతి యింకను వచ్చుకాలేదు. మిత్రవిందాపరిణయములో విజయరంగ చొక్కనాథుడు తన్నుగూర్చి చెప్పునపుడు—

"రచియించినావేమి వచనకావ్యములు. రామాయణ భారత కృతులు" అని ప్రశంసించుటచే నీతడు భారతరామాయణములు వచన కావ్యములుగా రచియించుట నిశ్చయము. కాని యవి నేడు కానరాలేదు.

## శ్యామరాయ కవి

ఈతడు రామాయణవచనమును రచియించెను. విజయరంగ చొక్కనాథుని కాలమున, మధురలో నున్న తుమ్మలపాటి సుబ్బరాయశెట్టి యను వైశ్యునకు కృతి నిచ్చియున్నాడు. ఈతడు ములికినాటిబ్రాహ్మణుడు - అశ్వలాయనసూత్రుడు, వసిష్ఠగోత్రుడు. కృష్ణయామాత్య పుత్రుడు. షడ్దర్శనీసారంగతుడు. అసహాయకవి బిరుదాంకితుడు. ఇందు బాల అయోధ్య, అరణ్య కాండములు లభ్యములగుచున్నవి. అరణ్యాకాండమున సర్గల ననుసరించి వ్రాసినాడు. అవతారికా పద్యములు ప్రతిసర్గాదిని విషయ సూచిక కలదు. ప్రశస్తమైన రచనగలది.

"ఓపురుషపుంగవా! నీ వుత్సాహసంపన్నుండవగుట నన్నుం గరుణింపుము. నీ వంటివల్లభుం డుండియు నేన నాథ తెఱంగున నున్నదాన భూతకారుణ్యంబు పరమధర్మంబని పూర్వంబున నీ వలననే వినియుందును. నీవు మహావీరుండవనియుఁ మహాబలసమన్వితుండవనియు మహోత్సాహుండవనియు నెవ్వరికిం గాని కార్యంబు నీకు శక్యంబనియు నెఱుంగుదు" రఘుపుంగవా! ఈ రాక్షసులయందొక్క యస్త్రంబేమిటికి ప్రయోగింపవు. అంత శౌర్యసమగ్రుండవు మహాబాహుండవు నన్ను మఱవనాడయ్యెనేని శితశరంబుల నీరాక్షసుల నేమిటికి సంహరింపవు."

## శ్రీపతి రామభద్రకవి

ఈ తడును విజయరంగ చొక్కనాథుని కాలమువాడే హాలాస్యమాహాత్మ్యము అను వచనకావ్యమురచియించినాడు. ఇది సంజరాజకృతికంటె వేరైనది. దానికన్న ముందు వెలసినది. ఈతడు ఆశ్వలాయనసూత్రుడు. కాశ్యపగోత్రుడు. గిరియమ సూరయలీతని తలిదండ్రులు. మీనాక్షీ సుందరేశ్వరలబ్ధకవితా మాధురీ సంపన్నుడు. సంస్కృతపదజటిలమై, ఉభయభాషల యందు యమకముతోఁగూడిన ప్రశస్తరచన—

## దేవకి వేంకటసుబ్బకవి రామాయణవచనము

ఇతడు మధురనాయకుల కాలములోని వచనరచయిత. ఈతని రామాయణ రచనలలో, ఆరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండలు మాత్రమే లభ్యమైనవి. ఈతడు భారద్వాజగోత్రుడు అళగరయ్య పుత్రుడు-మధురానగరనివాసి. ఇది సంస్కృత రామాయణమునకు సరియగు తెనుగని, యందు వరుసగా నీయబడిన, యాధ్యాయసూచనవలన దెలియుచున్నది. శైలికి కొన్ని పంక్తులు:

"మహాత్మా! నీ కతంబున మదీయంబగు శాపంబు నిర్ముక్తంబయ్యె. నే నింద్రలోకంబునకు బోయెద. ఇంకొక్కవార్త నెఱిం

గించెద వినుము. నిన్ని సరోవరమునకుం బొమ్మనియనిపిన తపసి వృత్తాంతము నీకు దెలిపెద. వాడొక్క రాక్షసుండు ఛలంబున రాక్షసనాయకుండగు రావణుని నియోగంబున బలియుండై నిన్ను జంపుటకు బూనివచ్చె." ఇది యముద్రితము.

## వేదాంత సార సంగ్రహము

వెలగపూడి కృష్ణయామాత్యుడు రచించిన యీ వచనకృతి నేడు కానరాకున్నది. ఈతడు భానుమద్విజయ మను ప్రశస్త ప్రబంధమును రచించి, విజయరంగ చొక్కనాథుని కాలములో నున్నవాడు.

## గజారణ్యక్షేత్ర మాహాత్మ్యము
## పాండవాశ్వమేధ వృత్తాంతము

ఈ రెండును, విజయరంగ చొక్కనాథుని కాలములో బుట్టినవి. కాని కర్తృత్వము తెలియరాలేదు. మంచి వచనరచన గలవి.

## ఉత్తరగోపురకథ పట్టుగొడుగుల వచనము:
## క్రీ. శ. 1700 ప్రాంతము

ఇందలి కథ రామాయణమునందలి యుద్ధకాండ భాగము. రావణుడు లంకయుత్తరగోపుర మధిరోహించి, వానరసేనతో సువేలాచలమునకు వచ్చిన శ్రీరాముని సైన్యమును చూచి, అనుతాపము చెందు ఘట్టమిందు వర్ణితము - దీనికే "గొడుగుల వచనము" అను నామాంతరము గలదు. ప్రాచ్యలిఖితపుస్తకశాల గ్రంథవివరణములోనీ, "గొడుగుల వచనమునకు నర్థమేమో" అని వ్రాయబడి యున్నది. దీనియర్థమును సంప్రదాయము నిది.

పావులూరి మల్లన గణితములో సూత్రవ్యవహారములో—
"ఉత్తరగోపురం బొగి రావణుం డెక్కి
    పట్టిన గొడుగులు భాను గప్పె
అవి సహింపక రాము డమ్మొక్కటరిబోసి
    గొడుగులన్నియు ద్రుంచె గుత్తికలకు
అందు మూడవపాలు అబ్ధిపై గప్పెను
    నాల్గవపాలోవోయి నగముగప్పె
నగచరావళి గప్పె నాఱవభాగంబు
    అష్టభాగము గప్పె నసురవీడు
నవమభాగము గప్పెనంతః పురంబు
మూలమును చెడిరెండును మోలబడిరొ
తెగిన గొడుగులెన్ని తెలియంగ జెప్పుడా
గణితమెఱిగిరేని క్రమముగాను."

"ఋతుగణములు వలనిడుకొని
గతులను గుణియింపనవియ గలిగిన ఫలముల్
అతికీర్తిని బొలస్త్యుని
సుతు గొడుగులు తెగిన సంఖ్య నూటిగ వచ్చున్."

పూర్వము ప్రజాసామాన్యమున మల్లనగణితమే నాటకమేనుండుటచేతను రామాయణకథయందీభాగమును మల్లన యుదాహరణగా నిచ్చి యుండుటచేతను, ఉత్తరగోపురకథపట్టునకు "గొడుగుల వచనము" అని పేరువచ్చినది. ఇది మంచిరచన గలది. అముద్రితము. కుందుర్తి వేంకటాచలకవి రచిత వచన రామాయణభాగములోనిది కాదగును - శైలికి:

"రావణు డితని గోపించి యిట్లనియె. మున్ను శుకసారణులు రామగుణపరాక్రమంబులు చెప్పిన తెలియవైతి. అతడే ధర్మి, అతడే ఆదిమూర్తి, అతడే సత్యసంధుడని నేను నిక్కము తెలిసితి. అతడే సర్వలోకరక్షకుడు - అతడే సర్వజీవదయా పరమూర్తి.

## కళువె వీరరాజు క్రీ. శ. 1730

మధురనాయకుల వెనుక మైసూరిలోని సామంతరాజులు సైన్యాధిపతులునగు, కళువవంశీయులు వచనరచన పెంపొందించిరి. వీరిలో వీరరాజు క్రీ. శ. 1704-1731 వరకు మైసూరును పాలించిన ప్రసిద్ధరాజకవి. చిక్కదేవరాయలకాలమున విలసిల్లెను. భాషాపోషకుడు. ఈతడు మహాభారతము వచనకావ్యముగా రచియించెను. అందులో, ఆదిపర్వము, సభాపర్వము, భీష్మపర్వము మాత్రమే చిక్కుచున్నవి. సభాభీష్మపర్వములు ముద్రితములైనవి. ఈ రచన క్రీ. శ. 1730 సంవత్సరమున నైనట్లుగ గ్రంథాంతపద్యము తెల్పుచున్నది.

## కళువె నంజరాజు క్రీ. శ. 1760 ప్రాంతము

వీరరాజు కుమారుడు నంజరాజు సంస్కృతాంధ్రకర్ణాట భాషాకవితావిశారదుడు. కవిపండితపోషకుడు-సంస్కృతమున, నంజరాజ యశోభూషణ మను నలంకారశాస్త్ర మీతని పేర వెలసినది. తెనుగుభాషలో నీతని వచనరచనలు రెండు కానవచ్చుచున్నవి.

## హాలాస్య మాహాత్మ్యము

దక్షిణ మధురాక్షేత్రమాహాత్మ్యమును దెలుపు డెబ్బది యాధ్యాయముల గ్రంథము-ఇందు సుందరేశ్వరుని లీలలు 64 ను వర్ణితములైన మంచిరచన- అముద్రితము. ఈవఱకే కవుల చరిత్ర[1] మూలమున పరిచితమైనదే ఇందలి వచనరీతి:—

"రూపలావణ్యభాగ్యమువల్లనో యనుపైన గోత్రంబు గలవాడనియో విద్యం జూచియో, సుందరేశ్వరుండను బుద్ధిచేతనో, లేక భ్రాంతిచేతనో నేడు నేను బిడ్డ నిచ్చుట యనుచుం బలికి యా బ్రహ్మచారిం గులగోత్రంబు లడుగ నతండు తన గోత్రంబును, సూత్రంబును, నక్షత్రంబును నూర్ధ్వపుండ్రంబును క్రమంబుగా విస్మితుండై యొఱింగించుటయు నబ్బాంధవులు కులగోత్రవ్యత్యాసంబులు లేకుండుటకు సమ్మతించిరి."

## కాశీమహిమార్థ దర్పణము

ఇది స్కాందపురాణమున కాశీఖండమునకు వచనగూపమగు నాంధ్రీకరణము - ఇది కర్ణాటభాషలో తొలుత రచితమై

---

1 వీరేశలింగము పంతులుగారి కవుల చరిత్ర 2 వ భాగము పుట. 92,93

యీ వెనుక తెనుగులోని కనవచింపబడినది. సంస్కృతగాలను ననుసరించినదే గాని శ్రీనాథుని కాశీఖండరచనతో సంబంధము లేదు.

"ఒకానొక కాశీపట్టణము భూమియందున్నదైనాగానీ, అక్కడ వాసం చేసుకొని ఉండేవారికి పునర్భవాదులు లేవు గనుక తాను భూమిగదా, అయినాగానీ స్వర్గమందుండేవారికి పునరావృత్తి గలదు; తన యందుండేవారికి పునరావృత్తి లేదుగనుక తాను స్వర్గమునకంటె క్రిందుగా ఉండేటిదయినా మీదనైననుగాని తాను కోటకొత్తళములచేత కట్టబడినదైనా భవబంధములను విడిపించును."

## తుపాకుల అనంత భూపాలుడు

చంద్రగిరి కృష్ణరాజు పుత్రుడైన అనంతభూపాలుడు ప్రసిద్ధ వచనరచయిత. ఈతని కృతులు 1. విష్ణుపురాణము 2. భగవద్గీతలు 3. రామాయణ వచనము (సుందరకాండముమాత్రము.) 4. భారత వచనము సభాపర్వ, భీష్మపర్వములు-ఈ కడపటి గ్రంథమున నితడు, కళువె వీరరాజునకు సహాయుడైన ట్లా గ్రంథమునందలి గద్యలలో నగుపడుచున్నది. అనంతభూపాలుడు తన గద్యలో "నిఖిలపురాణేతిహాస కథానుసంధాన సమేధమానచాతుర్య వచన రచన వైచక్షుణ్యా" అని చెప్పుకొనినాడు. ఇది యతిశయోక్తి కాదనుట కాతని వచనరచనానైపుణ్యమే తెలుపును. ఆయా గ్రంథములనుండి మచ్చున కుదాహరించెదను.

## విష్ణుపురాణము

"కలియుగంబున వర్ణాశ్రమధర్మంబు లర్థకామప్రధానంబులై యాచరింపంబడుంగాని ఋగ్యజుస్సామ వేదమార్గంబున బ్రవర్తిల్లవు. న్యాయప్రాప్తంబులగు వివాహంబులును, ధర్మమర్యాదాకలితంబులగు గురుశిష్యభావంబులును, దాంపత్యధర్మంబులు, నగ్నిసంతర్పణంబులును దేవపూజా విధానంబులును గలియుగంబునం గలుగనేరవు." ఇది ముద్రితమైనది.

## భగవద్గీత

ఈ భగవద్గీత ప్రశస్తమైన రచన గలది. పాఠశాలలో నిత్య పఠనీయ గ్రంథముగా నుండదగినది. ముద్రితమయ్యును ప్రచారమున లేకపోవుట, వచనరచనయందు మనకు గల వైలక్షుణ్యము వ్యక్తమగుచున్నది. "నేను సర్వభూతములకు సమానుండను నాకు ప్రియుండును ద్వేషియును లేడు. అయినను నన్నెవరు భజింపుదురో వారలు సంతతంబును నాయందు ధ్యానము గలిగియుందురు. నేను వారల ననుగ్రహింపుదు. అత్యంత దురాచారుండైనను నాయందు భక్తిసేయు నతండు, పాపవిముక్తుండై, శీఘ్రంబున ధర్మపరుండై శాశ్వతంబైన మోక్షంబు నందు."

## రామాయణము : సుందరకాండము

ఇది యైదాశ్వాసముల గ్రంథము-అముద్రితము

"ఓ పురుషపుంగవా! నీ పురాణ సంపన్నుడ నగుచు నన్ను గటాక్షింపుము. సీతంటి పట్టపు దుంపితలు సేనణాథ తెలుంగున నున్నదాన - భూకారుణ్యంబు పరమధర్మంబని పూర్వంబున నీవలననే వినియుందును. నీవు మహావీరుండవనియు, మహోత్సాహుండవనియు, మహాబలసమన్వితుండవనియు నెవ్వరికింగాని కార్యంబు నీకు శక్యంబనియు నెఱుంగుదు."

## తెనుగు వచనము - క్రైస్తవ మతగ్రంథములు

తెనుగువచనమునుగూర్చి తెలిసికొనదలచినపుడు క్రైస్తవ వాఙ్మయమును గూర్చి తెలియుట యావశ్యకము - తెనుగుభాషలో మొట్టమొదట ముద్రణభాగ్యము నందిన పుస్తకము క్రైస్తవ మత గ్రంథమే. ఆ మతాచార్యులు మతవ్యాపనముకొఱకు, ప్రజా సామాన్యమున కందుబాటులో నుండుటకు నా క్రైస్తవ మతధర్మములను వాడుకభాషలో రచించి శీఘ్రవ్యాప్తికై వానిని యచ్చువేయింప నారంభించిరి. వారి యభిప్రాయము ననుసరించి, గ్రంథ ముద్రణము వారి మతవ్యాప్తికే యుపయోగపడినను కాలక్రమమున నా ముద్రణసాధనము, తెనుగున సారస్వతాభ్యుదయమునకు మహత్తర సాధనముగా పరిణామము నొందినది. ఆ రచనమంతయు వచనమే యైనను, అది యీనాటికి వాఙ్మయ వ్యవస్థ నందక, నొక కృత్రిమమగు రచనయై, 'బైబిలు తెలుగుగా నుపాదేయము' కాకపోయినది. దీనికి కారణము లివి. ఈ క్రైస్తవ గ్రంథముల వచన రచనలలో కాలక్రమము ననుసరించి మొదట,

(1) కేవలము వాడుకభాష వచ్చెను. (2) పిమ్మట సులభగ్రాంథికముగ గ్రంథములు వెలువడినవి. (3) వాడుకభాషను కృత్రిమము చేసిన వచనరచన మూడవదశ.

క్రీ. శ. 1720—1802 - వ్యవహారిక భాషారచనము. క్రీ. శ. 1802—1860 - సులభగ్రాంథిక రచనము. క్రీ. శ. 1860 - నవీన కృత్రిమ రచనము అని దీనిని విభజింపవచ్చును.

## క్రీ. శ. 1720. క్రైస్తవపురాణ కథాసంక్షేపము

జేసునాథుడు పాస్కపండుగ పొడుపునా యెన్మిది దివసాల పరియంత్తం జెరుసలేమున వుండి చాలా అద్భుతాలను చేసినందువల్ల అనేకులు అతనిపట్టేరి. అయినాగాని అతడు వార్ల చెపలబుద్ధి నిమిత్తం వార్లను నమ్మరు. ఇదిగో వకరు తెలపకనే అనంత జ్ఞానోదయులైనవారు మానవులయొక్క అంతర్భావ యింగితములను చెన్న యెరిగివుందురు. కనక తమ్ము విశ్వాసించిన కొందరి మనస్సు అస్థిరమున్నూ కొందరి విషమమర్మ మిచ్చర్యమున్ను జూచి అతడు వుత్సవం దీరే దిన్ని వార్లను బాసి బైణమై తర్లినారు.

సెం. 1412.

"పరలోక భూలోకం శ్రిష్టికర్తలైనవారు నిర్మించిన విధం యిజ్రేల్ అనే టషువంటివారుల వేదమందు రాశివున్నది సంక్షేపమూ మొదటి ఖాండం శ్రిష్టింపు - ప్రథమ విశేషము."

ఇది కొంత క్లుప్తీకరించబడ్డది. అంత ఉదాత్తమైన శైలిలో లేకపోయినను, స్పష్టమైన, తేట తెనుగుభాషలో నున్నది. ఆర్. సి. మిషన్‌వారు ఈ అనువాదమును 1720 ప్రాంతముల ప్రచురించిరి.

## క్రీ. శ. 1746-1747

తెలుగుభాషయందు ముద్రణకళ పాశ్చాత్యులవలన క్రైస్తవ మతవ్యాపనమునకు పెంపొందింపబడినది. ఈ మతగ్రంథములను తెలుగున మొదట బెంజమినుషూల్జి (*Benjamin schultze*) అను నతడు రచియించెను. ఈ గ్రంథ ముద్రణము క్రీ. శ. 1746 నుండి ప్రారంభమగుటచేతను, నంతకుమున్న తెలుగున ముద్రణ లేక పోవుటచేత నిదియే మొదలని చెప్పవచ్చును.

షూల్జి రచించినవి.

(1) సత్యమైన వేదంలో వుండె జ్ఞానవుపదేశాలయొక్క సంక్షేపం. (*Catechisms*) 1746

(2) మోక్షానికి కొంచ్చుపొయ్యే దోవ (*Way*) 1746

(3) బుద్ధికలిగిన నూరు జ్ఞానవచనాలయొక్క చిన్నపుస్తకం (*Rules*). 1747

(4) ఒక గురువు అయిదు బ్రాహ్మలయొక్క... పెద్దస్వామి మీద ప్రసంగించిన తర్కమితె (*Colloquuem*) 1747

(1) దేవునియొక్క సమస్తమైన వాక్యము సువిశేషము... మన్ష్యులను రక్షించ్చేకర్తల అయిన యేసుక్రీస్తుయొక్క శుభసమాచారము.

మార్కు, మత్తయి, లూకా, సువార్తలు గ్రీకుభాషనుంచి జిక్రాక్, ఆనందరాయర్ గార్ల సహాయముతో, ఎ. డి. గ్రాంజెస్ గారు అనువాదించినది. శ్రీరామపురములో 1812.

(2) యీ గ్రంథము యేసుక్రిస్తుయొక్క నూతన నిర్ణయమై యున్నది.

ఏసుప్రభువు, రక్షకుని, నూతన నిబంధన, గ్రీకుభాష నుండి, ఆనందరాయగారి సహాయముతో ఎడ్వర్డు ప్రిచ్చేట్ గారిచే తెలుగులోకి అనువదింపబడినది 2 వాల్యూములు-1818.

పై రెండు క్రైస్తవ గ్రంథములను తెనుగు వచనముగ రచియించిన ఆనందరాయరు మంగళగిరి ఆనందకవి. ఈతడీ వచన గ్రంథమునేగాక, వేదాంత రసాయనమను పద్యకావ్యమును రచియించినాడు. ఇది యేసుక్రీస్తు చరిత్రను తెలుపు నాల్గాశ్వాసముల ప్రశస్తకృతి. టీకాతాత్పర్యములతో 1882 లో ముద్రితమైనది. బ్రౌనుదొరవా రీ గ్రంథమునుగూర్చి 1840 లో *The Madras journal of literature ana seience* అను పత్రికలో వ్రాసియున్నారు. విజయనందన విలాసము అనునది యీతని మఱియొక పద్యకృతి. ఈతడే స్థానికచరిత్రలకు మూలపురుషుడగు కర్నలు మెకంజీదొరవారివల్ల నియమితుడై, అమరావతీస్తూపమును మొదట పరిశోధించిన శాసనములకు ప్రతులు వ్రాసినవాడు. ఈతని దినచర్యనే *'Dairy of Ananda Rao'* అని యందురు. ఈతని దినచర్యలో, అమరావతిప్రాంతమున దొరకిన రత్నములను, మెకంజీదొరవారి ప్రతినిధియగు కావలి లక్ష్మయ్య గారికి పంపినట్లు కలదు. (*Tycor Vol III Page 505*)

## క్రీ. శ. 1818

ఈశ్వరుని అన్నిమాటలు విశేషముగా మనుష్యుని ఉద్ధారము కొరకు ఆచరించెటందుకొరకున్న దెని ప్రకాశము చేనున్నాడో ఇదె ధర్మ పుస్తకము—దాని అంత్యభాగము. అర్థము మాకు ప్రభుడు ఉద్ధరించేవాడునైన యిసుక్రీష్టుని మంగళసమాచారము.

గ్రీకభాషవల్లనుంచి తర్జుమాయను

శ్రీరామపురములో పడెచ్చు ఆయను. 960 పుటలు.

## తెలింగ 1818

"యిశుక్రీష్టునియొక్క పుట్టనము యీలాగు నాయెను. అతనియొక్క తల్లి మారియాయుసపునికొరకు వాక్యదత్త యిందో కుంచున్న వారియొక్క కలుసుకోవడముకంట్టె ముందుగా ధమ్మాత్మునిచేత కడుపుతో ఉన్నషువంట్టి దాయెను। దానియొక్క పెనిమిటి యుసపుడు యాథార్థికుడైన వాడవుకుంచున్న ప్రకాశంగాను కళంకం కలదాన్నిగాను చేయించేటందుకొరకు ఇచ్చ ఇంచక దాన్ని గుప్తరూపము చెత విడిచిపెట్టెటందుకొరకు తలిచెను। మరియేమంటె వాడు ఈ ప్రకారంగా చింతచెస్తూ ఉండగా చూడు ఈశ్వరుని దూత స్వప్నమందు వానికొఅకు దర్శనమును ఇచ్చెను।

వాక్య విరామ చిహ్నములు "।" యిట్టి గీతతో చూపబడినవి.

## క్రీ. శ. 1840. జ్ఞానబోధము

ఈ క్రైస్తవ మతగ్రంథము తమిళమునుండి భాషాంతరీకరణము. ఇది బైబిలునకు తెలుగు కాదని క్రైస్తవమతము నీతిని గుఱించి చెప్పెడి వచనరచనయని భాషోద్ధారకులు బ్రౌను దొరవారు తే 8-8-1840 దిని వ్రాసియున్నారు: శైలి యిట్లున్నది:—

"పాపము యొక్క మర్లు విడుదలిస్తే ముందర ముందర తన్ను తాను తాను తెలియవలెను - తన్ను తాను తెలిస్తే తన్ను కలిగించిన సర్వేశ్వరుని తెలియవచ్చును - వారిని తెలిసి, వారినుండి ఆత్మునకు కావలసిన మోక్షభాగ్యం పొందవచ్చును...మనుష్యుడు తన ఆత్మయొక్క జ్ఞాన జననమును దివ్యలక్షణ మహిమయున్నా తెలిస్తే చెడిపొయ్యే భూలోకం వర్జించి నాశనములేని మోక్షరాజ్యంలో సర్వేశ్వరునితో వర్ధిల్లియుండ మనస్సునుంచక యుండునా ?"

(సంఖ్య 2098)

## కుంపిణీకాలము - 19 వ శతాబ్ది

ఈ శతాబ్దిలో వెలువడిన వచన వాఙ్మయమును నైదు తెగలుగా విభాగింపవచ్చును.

1. కథావాఙ్మయము 2. యాత్రాచరిత్రలు 3. పత్రికలు 4. శాస్త్రీయచారిత్రక గ్రంథములు 5. గ్రాంథిక వచనరచనలు.

ఈ కాలమునకు కొంచెము ముందుగానే యాంగ్లేయులిక్కడ స్థిరపడుటయు, యాంగ్ల విద్య ప్రవేశపెట్టుటయు, కళాశాలలు ముద్రాక్షరశాల లేర్పాటు చేయుటయు జరిగినది. తెనుగు

భాషకూడ రాజకీయోద్యోగులకు నాంగ్లేయులు నేర్వవలసివచ్చుట చేత, వారికొఱకు వచనగ్రంథము లావశ్యకము లయ్యెను. అవి సులభగ్రాహ్యముగ నుండుట తప్పనిసరి యైనది. అవి యాకర్షణీయముగ నుండునను తలంపున,కథారూపముగ మొదట రచన వెలిసినది.

## కథా వాఙ్మయము

ఈ వాఙ్మయమున తొలుత పేర్కొనదగినవి.

1. విక్రమార్కుని కథలు 1819.
2. పంచతంత్ర కథలు 1834.

ఇవి రెండును, ఫోర్టు సెంటుజార్జికళాశాలలో నాంధ్ర ప్రధానోపాధ్యాయుడగు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారిచే (1770–1837) రచితమైనది. తెనుగువారిచే రచితమై, ముద్రితమైన గ్రంథములలో మొదటిది విక్రమార్కుని కథలు-ఇది, 1819, 1828, 1850, 1858 లోగా, నాలుగుసారులు ముద్రితమైనది. పంచతంత్రము, 1834, 1848, 1864, 1869 లో నాలుగుసారులు ముద్రితమైనవి. ఈ ముద్రణములనుబట్టియే, వీని కాలమునగల వ్యాప్తిని తెలుసుకొనవచ్చును. చిన్నయసూరి రాజధాని కళాశాలలో పండితుడుగా నున్నప్పుడు మొదటి కొన్నియేండ్లు పై గ్రంథములనే పాఠములుగా చెప్పినాడు. తాను ప్రధాన పండితుడై పలుకుబడి సంపాదించినవెనుక, తన నీతిచంద్రికను పఠనీయ గ్రంథముగా చేసికొన్నాడు. పై రెండు గ్రంథములేగాక, బాల వ్యాకరణమునకు నిరువదిమూడేండ్లకుముందు, నొక తెలుగు వ్యాకరణము రచించెను. ఈ శతాబ్ది వచనరచన కితడు ప్రారంభకుడు.[1]

## పాటూరి రామస్వామిశాస్త్రి: 1843
## శుకసప్తతి కథలు

ఈతడు, ఫోర్టుసెంటుజార్జి కళాశాలలో మారిసుదొరగారి వద్ద తెనుగు మునిషీగా నుండెను. ఈతడు శుకసప్తతి వచన కావ్యముగా రచించెను. ప్రస్తుతము బజారు ప్రతులలో నీతని పేరు మఱుగుపడినది. కాని తే 19–9–1848 దిని బ్రౌనుదొర వారికి వ్రాసిన లేఖనుబట్టి యీతడే శుకసప్తతి కర్తయని తెలియుచున్నది.

## పాటూరి నరసింహశాస్త్రి-హరిశ్చంద్ర కథ 1840

ఈతడు పై రామస్వామిశాస్త్రి సోదరుడు-హరిశ్చంద్ర కథను వచనముగ రచించెను.

## పాటూరి రంగాశాస్త్రులు
### 1841–విజయవిలాస వచనము.

ఈతడును పై రామస్వామిశాస్త్రుల సోదరుడే. ఈతడు విజయవిలాసమును, చేమకూర వేంకటకవి రచననుసరించి వచనముగ రచించెను.

పై వారిద్దరునుకూడ కాలేజీలో తెనుగు మునిషీలుగా నుండిరి. ఈ విషయములు పూర్వోక్తమగు బ్రౌనుదొరగారికి వ్రాయబడిన లేఖలనుండి తెలియుచున్నవి.

## ధూర్జటి లక్ష్మీపతి క్రీ. శ. 1842. – హంసవింశతి

అయ్యలరాజు నారాయణకవి విరచితమైన హంసవింశతి పద్యకావ్యమున కిది వచనరచన. ఈ గ్రంథము క్రీ. శ. 1842 లో వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాలలో ముద్రితమై ఆ పత్రికయందే ప్రకటన చేయబడినది. ఇది పద్యరచనకన్న సులభగ్రాహ్యముగా నుండుటచేత, క్రీ. శ. 1865 లో తిరిగి ముద్రితమైనది. ఇందలి శైలి యెట్లుండెనో తెలుపుటకై క్రిందిభాగ ముదాహరించుచున్నాడను.

“హేమావతిని మోహంబు చిత్తంబు తలపఱుప, కస్తూరితిలక వాసనలు ముఖవాసనలకు లంచంబీయగా, నవరత్న ఖచిత తాటంక ద్యుతులు కపోలంబుల జిగికి నుపాయనంబు లొసంగగా, మాని కంబు దంపెలహోయలు శరీరకాంతికి, కట్నమిడగా, విడిసిన మన్మథగజంబువలె బెడగైన నడల నిల్లు వెడలి బినుచో హంస యాహంసగమనం గాంచి యిట్లనియె.”

## కీరబహత్తరి – తోతీనామా లేక
## చిలుక కథలు 1842

ఇది శుకసప్తతి వచనము—వెనుక దానికంటె భిన్నరచన గలది. ఇందు పారసీకపు పేళ్లు తఱచుగా గలవు. కథావిధానము ఉపోద్ఘాతరచన బాగుగ నున్నది – వ్యావహారికరచన – ఇందు 52 కథ లున్నవి.

## దిలారామ కథ 1848

దిలారాం అను పేరుగల ఢిల్లీపాదుషా కూతురు, అమరావతీ పట్టణపు రాజుకొడుకును పెండ్లాడుట. ప్రధాన కథాశరీరముగా నున్న యీ విచిత్ర కథాకోశమున, రాజకుమారుల మంత్రి కుమారుల దేశాటనము, మంత్రికుమారుడు తన యత్యద్భుత ప్రజ్ఞా ప్రయోగవిశేషముచే, పలుతడవలు రాజకుమారుని రక్షించుట అతని నేర్పుచేతనే తుదిని సర్వక్షేమములు కలుగుట యిందు చమత్కారజనకముగా గానవగును—ఇది యముద్రితము.

## బత్తీసుపుత్రి కథలు 1847

ఇది సింహాసన ద్వాత్రింశిక యను సంస్కృత గ్రంథమునకు తెనుగువచనము. బత్తీసుపుత్రికథ లనగా ముప్పదిరెండు బొమ్మల కథలు. ఇది క్రీ. శ. 1847 లో వాద్రేవు వెంకయ్య యను కవిచే రచితమైనది. శైలి సరళ వ్యావహారికము.

## బేతాళపంచవింశతి కథలు 1848

ఇవి కథాసరిత్సాగరమునుండి గ్రహింపబడి వాడుకభాషలో వ్రాయబడి, మిక్కిలి వ్యాప్తిలో నున్న కథారచనము.

## కాంభోజరాజు కథలు 1849

ఇవి రెండు తెఱగులుగా నున్నవి. ఒకదానియందు అనంతామాత్యకృతమైన భోజరాజీయమునందలి పద్యములు గలవు.

---

1 నేడు మనము (కంపెనీ) అనివాడునాంగ్లభాషాపదము ‘కుంపిణీ, లేక కుంఫిణీ’ అనియే వాడవలయు నని యది సరియైనదని కీర్తిశేషులు బ్రౌనుదొరవారు తమ నిఘంటువున వ్రాసియున్నారు.

కావున నది పద్యప్రబంధరచనకు తరువాత జరిగినది. రెండవ దానిలో పద్యములు లేవు, రచనయు భిన్నముగ నున్నదిగావున నదియే మొదటిదని చెప్పవచ్చును.

## తాతాచార్యుల కథలు : 1855

ఈ వినోదకథలను, భాషోద్ధారకులు బ్రౌను దొరవారు 1855 లో మూలమును, వారి యాంగ్లేయభాషాంతరముతో ప్రకటించిరి. ఈ కథలను సంపాదించిన విధమునుగూర్చి బ్రౌనుదొర వారే వారి యాంగ్లేయోపోద్ఘాతములో నిట్లు వ్రాసియున్నారు. ఇందు గిరిన్మయూరే అను కథ గద్యచింతామణిలో నుదాహృతమైనది. (చూ॥ పుట 84.)

*"The anecdotes Collected in this volume were–chiefly related to me by a Telugu Brahmin named Tatachari in the year 1842. He was a tall stout man of about 50 years of age. A humorist thoroughly versed in Sanskrit learning, eloquent, most modest and humble and died in my employ. He was a poet and a logician skilled in Medicine and Astronomy I read some of the Telugu poetry with him and in the course of amusing conversations, he related to me the tales here preserved. 18-1-1855.*

## పరమానంద గురువుల కథలు 1861

## బెషీ యను క్రైస్తవ మతబోధకుడు

ఈ కథలు తెలుగుదేశమున వ్యాప్తిలో నున్నవి. ఇవి 1861 లో ముద్రితమైనవి సరళ వ్యవహారశైలిలో రచితము.

## అరేబియన్ నైట్సు కథలు. 1862. పెర్సివలుదొర

ఇదియును పెర్సివలు అను నాంగ్లేయుడు రచించినదే. 1862 లో ముద్రితమైనది. ఇదియును వ్యవహారశైలిని రచితము.

## చారుదర్వేషు కథలు 1881

దీనినే నలుగురు ఫకీరుల కథలనియందురు. క్రీ. శ. 1881 లో ఎర్రమిల్లి మల్లికార్జునుడుగారు, (వీరు విశాఖపట్టణమండలమున రివిన్యూ శిరస్తాదారుగా నుండెడివారు) తేట తెలుగుమాటలతో వ్రాసిరి.

## తడకమళ్ల వేంకటకృష్ణారావు 1830–1890

క్రీ. శ. 1860–90 ప్రాంతములలో ప్రసిద్ధులగు రచయితలలో తడకమళ్ల వేంకట కృష్ణరావుగా రొకరు. వీరు చెన్నపురమున తిరువళ్లిక్కేణి యందు నివసించుచు గ్రంథరచనము గావించిరి. వీరు బహుముఖ విజ్ఞానసంపన్నులు. బహుభాషావేదులు. భూఖగోళ గణితశాస్త్రమునందు ప్రత్యేక ప్రావీణ్యము సంపాదించినారు. వీరాంధ్రీకరించిన లీలావతీ గణితశాస్త్ర మనునది చాల ప్రసిద్ధి కెక్కినది. ఇందు వీరివచన రచనలు మాత్రమే వర్ణితము.

## కామరూపకథ

"అట్టి కుమారోదయంబువలన జన్మరాజ్యాదులగు, సప్తాంగంబులును, నప్పుడ యుదయించుకరణి, నతి కుతూహలియగు నద్దేవి. నా రాజన్యమాన్యుం డట్టి సుపుత్రుకా దయచే నొసంగిన సర్వశక్తియుక్తుండెసు, జగధీశ్వరు ననేక విధంబులం బొగడుచు నిట్టి యభ్యుదయంబునకు ప్రధాన కారణభూతుండెసు సంకల్ప సిద్ధుం బలువిధంబుల నెన్నుచుం దదనురూపకోశ విశ్రాణన మంగళవాద్య శ్రవణపుణ్యాహఘోషణాది క్రియావిశేషంబుల నా పురుటిదినంబు లన్నియుం గడపుచుండె.

అంత... కామదేవుం డనందగియుంటను కామరూపుండను నన్వర్థమంగళనామం బిడియె."

## తెలుగువెలుగు ముగుదకత :

ఇది యొక చిత్రమైన కథ. ఇది క్రీ. శ. 1879 లో ముద్రితమైనది. దీనినిగూర్చి "రెండు అపూర్వ వచనరచనలు" అను నా వ్యాసమును చూడుడు.

భారతి జూన్ 1950–548–550 పుటలు.

## ఏనుగుల వీరాస్వామయ్యగారి

## కాశీయాత్రా చరిత్ర 1830

వీరాస్వామయ్యగారు చెన్నపురికి పేరుతెచ్చిన తెనుగువారిలో నొకరు. వీరు క్రీ. శ. 1780 ప్రాంతమున జన్మించి 2-10-1836 లో దివంగతులైరి. క్రీ. శ. 1830 సంవత్సరములో వీరు కాశీయాత్ర చేసినప్పుడు వారు వ్రాసిన దినచర్యరూపమగు యాత్రాచరిత్రమును వారి మిత్రులు కోమలేశ్వరపు శ్రీనివాస పిళ్లగారచ్చువేయించిరి. ఇది నవీనముగ ముద్రితమైనది. దీని శైలి సరళమైన వ్యవహారశైలిగా నున్నది. వ్యాప్తిలో నున్నందున నుదాహరణము చూపలేదు.

## క్రీ. శ. 1846. కోలా శేషాచలకవి నీలగిరియాత్ర[1]

కోలాశేషాచల కవియను చెన్నపట్టణనివాసి సైనికశాఖాధ్యక్షుడగు థామస్ సింప్సన్ దొరవారి కచేరీలో గుమాస్తాగా నుండెడివాడు. క్రీ. శ. 1846 మేనెల తే 12 ది మొదలు— 13-1-1847 వఱకు నుదకమండలమున కార్యస్థాన మున్నప్పుడు జరిగిన వృత్తాంతము నీలగిరియాత్ర యను వచనకావ్యముగా రచియించినాడు. ఇందలి శైలి రసవంతమైనది. ఈ గ్రంథము 1847 లోనే రచితమగుటచేత చిన్నయసూరి నీతిచంద్రిక (1856) కన్న ముందు వెలసినది – మచ్చున కిందలి పంక్తుల నిచ్చుచున్నాడను.

"నా విడిదలయగు నిలుసొచ్చిన యనంతరంబ నెచ్చటం గూర్చుండిన నెచ్చట గ్రుమ్మరిన నెద్ది యంటిన నా సర్వం బతిశీతలంబయి గోచరించె. అంతి కొంత తడవునకే చలి మొలకెత్తెను. మార్గశ్రమంబు నవ్విడిదల ప్రవేశించు సమకాలంబుననె, శీతంబు గోచరింపదయ్యెనని తోచెను. మఱునాడు నాకును, నా బోవటకై

1 ఈ శేషాచల కవిని గూర్చి, గ్రంథమునుగూర్చి, తే 25-10-1948ది "త్రిలింగ"లో ప్రకటితమైన నా వ్యాసమును చూడనగును. అందులో నీ కవిని గూర్చి, గ్రంథమునుగూర్చి, విపులముగ గలదు.

వచ్చిన శ్రీనివాస మొదలారికిని స్వదేశంబుననుండి కొంపోయిన చలితోపవు లోపల్లం దొడిగికొనవలసివచ్చె. అగ్ని యొక్కటి దక్క నన్నిపదార్థంబు లతిశీతలంబులై యున్నయవి."

## పత్రికా వాఙ్మయము - వర్తమాన తరం:

## 1842 - 1843

ప్రాచీ నాంధ్రవార్తాపత్రికలలో నిది పేరెన్నిక గన్నది. ఇందలి శైలిని తెలియుటకు - నా పత్రికయందుండి యొక యుత్తరమును నిందు ప్రకటించుచున్నాను.

మహారాజశ్రీ వర్తమాన తరంగిణి ఎడిటరుగారి సముఖమునకు. ఈ యడుగున వ్రాసుకొన్న పద్యంబు తమ పత్రికలో ప్రచురముచేసి పండితులగువారివలన నా పద్యంబు కర్థంబు తెప్పించి తిరుగా తమ పత్రికలో ప్రచురము చేసి నా అభీష్టంబీడేర్తురని తమ ఘనమును బహుధా ప్రార్థించెదను. అగత్యముగా నీ పద్యం బీసారి ప్రచురము చేయవలెనని కోరెదను.

పద్యము

ఉ. కోడిగి మింతె గాని తనకుఁ వయసెక్కడిదమ్మ నేత్రముల్
వాడు గదమ్మ పంటపగబట్టిన దాని సుధారసంబు ము
ద్దాడు గదమ్మ యీ చెలియ కక్కట వల్పులటమ్మ యీడికల్
వేసుకలాయె మట్లు తిరువేంగళనాథ యనంత శౌరికిఁ.

యీ పద్యములో తప్పిదంబులున్న దిద్దించి నవి అభిప్రాయము పోనీయకుండా అర్థము తమ పత్రికలో ప్రచురము చేతురని కోరెదను.

| | |
|---|---|
| ౧౮౪౨ సం. అక్టోబరు నెల ౨౨ వ తేది | తమ వినయవిధేయుడగు చి. సూ. |

## తత్త్వబోధిని (1864-1869)

## (మాసపత్రిక) 1868 వ్రిపియలు

"సుజనరంజని యను తెనుగు పత్రికనుగుఱించి మున్నొకతూరి యీ పత్రికయందు వ్రాసియుంటిమిగదా! అది కడచిన 67 సంవత్సరముతోడ నిలుపబడియున్నది. తత్ప్రవర్తకులు మొట్టమొదట దాని నారంభించినపుడు కొంతకాలములోనే తమ పత్రిక తెనుగుదేశమెల్ల వ్యాపించి వన్నెకెక్కుననియు, జందాదారులును పోషకులును బెక్కండ్రు గలుగుదురనియు దన్మూలమున నింకను విశేషమైన గ్రంథములను బ్రచురింపనగుననియు దలచి యీ యెన్నికతో రెండుమూడు సంవత్సరములు, దాని జరుపుటయందు ద్రవ్యమును కాలమును వెచ్చించి దేహశ్రమము బుచ్చుకొనుచువచ్చిరి.........దినవర్తమాని యొక్కటితప్ప నాంధ్రమందు వేఱొక పత్రికయు లేదు. శ్రీ యక్షిణి, హితవాది యను పత్రికలు రెండుండెనుగాని యిటీవలనవియు నస్తమించినట్లు కానంబడియెడి. ఈ మూడు పత్రికలు సుజనరంజనికి సమానములుగా నేరవు. దీని విశేషప్రయోజనము నా పత్రికం జూచువారికెల్ల తెల్లంబుగనుక నిట దానింబట్టి వక్కాణించుట యనావశ్యకంబు గాదు. ఇది యీలాగు నిలిచిపోవుట త్రిలింగదేశస్థుల దౌర్భాగ్యము గాక వేఱు గాదు. ఇటువంటి పత్రికను మఱల నే పుణ్యాత్ముఁలేని దలయెత్తనిచ్చి లోకులు హర్షమొంద నుద్ధరించినవారి కీర్తి యాచంద్రతారార్కంబై వెలయును."

పై యుద్ధృతాంశములంబట్టి మొదట పత్రికలు వ్యావహారిక భాషాసంప్రదాయము ననుసరించినను నా వెనుక గ్రాంథికభాషా పరిపాటి ననుసరించినట్లు తెలియగలదు.

## లేఖలు :

## 15-6-21. తెలుగు జాబుల పుస్తకం

స్వస్తిశ్రీమన్మహా రాజరాజశ్రీ ఛార్లీసుపిలిపు బ్రౌంధొరగారి సముఖానకు.

తమ పండితుడు ములుపాక బుచ్చయ్యశాస్త్రి వినయపూర్వకముగా అనేక సలాములుచేసి వ్రాసుకున్న విజ్ఞాపనపత్రిక యేమంటే తమ శెలవుప్రకారము కృష్ణారెడ్డి పంపించిన వసుచరిత్ర ప్రతిపదార్థప్రకాశిక తమరు అంగీకరించినది లేనిదీ తెలియలేదు. ఇక్కడనైతే బహుమంది పెద్దలు బహుదేశములవారు వ్రాసుకొనిపోతూనూ వున్నారు. తమపేరిటి కృతి గనక తనంతనే విస్తరిల్లుతూ వున్నది. నేను తమకు సుకృతంగా పాఠశాలపెట్టి అనేకమందికి ఆంధ్రగీర్వాణ వ్యాకరణ కావ్యనాటకాలంకారాది గ్రంథములు అభ్యసింపచేస్తూ యున్నాను. ఇంతి పర్యంతరము తమరు యిప్పిస్తూవచ్చిన ద్రవ్య ముపయోగించి కాలయాపన చేస్తూవుంటిని. ఇప్పుడా ద్రవ్యము సరిపోనందున అశనాచ్ఛాదనాలకు నానా శ్రమ పడుతూ వున్నాను. లోగడ సముఖాన మనవిచేసుకున్నప్రకారము యీ ఘటము వున్నంతకు అన్నముయిచ్చి కాపాడితే తమకు బహు పుణ్యము వస్తూవున్నది - తమరు వుపేక్షచేసిన పక్షమందు యీ వార్ధకములో బహు కష్టపడేను. కాంగా నాయందు కటాక్షించి నాకు అన్నానకుగాకృష్ణారెడ్డికి వ్రాయించి దయచేయకర్తలు. పత్రికముఖాంతరం విశేషము యేమి వ్రాయవలసినది. యీ పత్రికనే నన్నుగా కటాక్షించి అన్నమిచ్చి కాపాడవలెనని కోరుతూ వున్నాను. ఈ చిన్న గురువరాజు మనవిచేయగా నా వర్తమానమంతా చిత్తానకు వచ్చెని. యింతే విజ్ఞాపన పత్రిక. వైశాఖ కృష్ణ ౧ లు. బుచ్చయ శాస్త్రి స్వహస్తము వ్రాసుకున్న విజ్ఞాపనపత్రిక కడపనుంచి పంపించడమైనది. * * *

(1832 - ఆగస్టు 26 -)

మహారాజరాజశ్రీ బ్రౌణ్‌దొరవారికి—

మహాకాశమందు బుద్ధినిన్ని - ఘటాకాశమందు మనస్సునున్ను-మనోకాశమందు చంద్రునిన్ని-చిదాకాశమందు సూర్యునిన్ని-వెలిగించుచూ పరాకాశమనే పరమపదమందు చిదానంద స్వరూపుడయి సర్వసాక్షియై, సత్యమనే నీడలో సదా వెలుగుచున్న సర్వేశ్వరుని దివ్యపాదారవింద సన్నిధికి, ఓం, నమోనారాయణాయ, హే, భగవాన్.

ఏలినవారి సృష్టిలోఁ జేరిన అనంతజీవకోటిలోను మోటుపల్లి వెంకటరామానుజదాసుడు ఒక విన్నపంబు చేయందలంచి ప్రార్థింపుచున్నాడు. సావధానచిత్తులైనవధరింపవలయును.

ఉత్తరఖండం లేటు ప్రావిన్షయల్ కోర్టు లేటు జడ్జిగారైన "న్యాకినెల్ పెబ్బు" దొరవారు యీ ఖండం పరిపాలనచేసే కాల మందు ధర్మసభలోను సుఖాసీనులై కొలువుండి ప్రసంగవశాత్ సభికులతో తమ అనంతరం హిందూరాజ్యమందు తమవలెనే ధర్మ స్వరూపులై, సత్యవ్రతులై, శాంత శమదమాది సద్గుణములు గల వారలై సీ. పీ. బ్రౌనుదొరవారు సమస్తసాదుబీదలను సంరక్షణ చేయబోతున్నారని యానతిచ్చి యున్నమాట సత్యము.

ఆ వాక్యమును నేను నెరనమ్మి, యిరువైయొక సంవత్సరము యేకాంత ప్రదేశంబున సమాధి జరిపినమీదట నాకు సంభవించిన యాపత్తులలో ముఖ్యమైన సహోదరుడు సుతుడు వీరు వుభయులు కాలంచేసినమీదట నేను సతీసమేతముగా శ్రీరంగయాత్ర నిమిత్తమై బయలుదేరి యీ రాజధాని ప్రవేశించినమాట సత్యము.

పూర్వపు పెద్దల సత్యవాక్యమును పరిశోధించుటకై యీ బ్రవున్ దొరవారిని ఆశ్రయించి వారి అనుగ్రహ అభయహస్తము లను వహసి వారి యాజ్ఞలు శిరసా వహించి యీవరకు కాచి యున్నమాట సత్యము.

15-6-21.

## చారిత్రక శాస్త్రీయ గ్రంథములు

### ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర - క్రీ. 1330 ప్రాంతము

చారిత్రక గ్రంథములలో నెల్ల తొలివచనరచనము ఏకామ్ర నాథుని ప్రతాపచరిత్ర. ఈతడే యేకోరాముడను ప్రసిద్ధశైవా చార్యుడు. మల్లంపల్లివారికి మూలపురుషుడు. అన్యవాద కోలా హలమను గ్రంథమును రచియించిన దీతడే. కాకతీయచరిత్ర కత్యంత సహాయకారియగు నీ గ్రంథమునుగూర్చి ప్రస్తావించుట యనవసరము. ఇందు, సముచ్చయములతో వాక్యవిన్యాసము గావింపబడినది. కాని సర్వప్ప సిద్ధేశ్వర చరిత్రమును నీ ఏకామ్ర నాథు ననుమతిచే వ్రాసినానని చెప్పియున్నాడు.

### రాయవాచకము క్రీ. శ. 1550 ప్రాంతము

ఇది విశ్వనాథ నాయకుని స్థానాపతిచే రచితమైనది. విజయ నగర వృత్తాంతమును, కృష్ణరాయల గూర్చిన విశేషములను తెలు పునది. కుమారధూర్జటి కృష్ణరాయ విజయమున కిదియే మూలము. ఇందలిది వ్యావహారిక రచన.

తంజావూరి యాంధ్రరాజుల చరిత్ర
సింహళద్వీపకైఫీయతు
మధురామంగ పుంశ్చలీవిలాసము.

ఇవి మూడును, తంజావూరి మధురనాయకుల వృత్తాంతమును దెలుపు వచనరచనలు. చివరగ్రంథ మసభ్యమైనను చరిత్రాంశ ములను దెల్పును.

### కాంచీపుర మాహాత్మ్యము 1802.

కుంఫిణీ కాలములో చారిత్రకరచనకు పునాదివైచిన కల్నల్ మెకంజీ దొరవారికి గురుస్థానీయుడగు కావలి వేంకటబొర్రయ్య గారు - కాంచీపుర మాహాత్మ్యమును వచనరూపముగ రచియించి యున్నారు. క్రీ. శ. 1803 నుండి 1812 - 13 వఱకు కైఫీయతు లనేకములు రచితములైనను వానికి వాఙ్మయమున స్థానము లేదు.

శాస్త్రీయగ్రంథములు మొదట పద్యరూపమున నున్నను నవి వచనరూపముగ వ్రాయుటకు కుంఫిణీ కాలమున వచనప్రాధాన్య మే మూలము - అట్టివానిలో కొన్నింటి నిందు తెలిపెదను.

### పాకశాస్త్రము క్రీ. శ. 1836.

ఇది వచనముగ సరస్వతీబాయి అను నామె రచించెను. దీనిని యీ కాలమునందే, కర్నలు మెకంజీదొరవారి పండితుడైన కావలి వేంకటరామస్వామి యాంగ్లేయభాషలోనికి భాషాంతరీక రించెను. దీని ప్రతి బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయములో గలదు.

### సిద్ధాంత శిరోమణి - అల్లాడి రామచంద్రశాస్త్రి

"అయ్యా యిది యంతయున్ను సరేకాని యీ సాహెబు బహు ప్రవీణుడని మీరు స్తుతిజేసినందుననే యతనికి సంస్కృత భాషయున్ను దెలుసునని తోచెను. ఇట్లుండగా నేలమరల రాష్ట్ర భాషతో నేకదేశీయ గ్రంథమును జేయించెను. ఇందువలన నిమ్మడి శ్రమ జేయవలసెను. సంస్కృతభాషతో జేసియుంటే యన్ని దేశములయందున్ను వుపయోగించునే యనుచున్నారా చెప్పు చున్నాము.

"అంధూదనువలె సంస్కృత
గ్రంధార్ణము సంగ్రహింప కష్టము గంగా
సింధువలె యాంధ్రవచన ప్ర
బంధము సులభంబు జగతి బాలునకైనన్."

"భూకంపమునకు కారణము శేషుడుగాడు. ఇంక నేమి యన్నను - భూమధ్యమునందు నానా పదార్థము లున్నవి. అవి కలసియున్నవి. మన శరీరమునందు వాయురక్తముల సంచారము నకై నాడీమార్గము లేచొప్పున నున్నవో ఆ చొప్పున పృథివియం దున్ను, వాయుజలములు నడిచేటందుకై మార్గము లున్నవి. నీళ్ల గుణ మీలాగున నున్నది గదా - ఉష్ణత్వముచేత పలచనైయుబ్బి యెక్కువౌచున్నది. ఆయుష్ణత్వమువలన నుదకములు అవిరి వైటికి వెళ్లజూచుచున్నవి. వాటికి త్రోవలేకపోయెనా అవి తమ శక్తిచేత పృథివిని పగలగొట్టి వెలువెళ్ళగా భూకంప మౌచున్నది. ఇటుగనుకనే యొకచోట భూకంప మౌచున్నది ఒకచోట కాదు, శేషుడే కారణమైతే నంతటను నొకసారే కావలెను. శేషుని తల కదిలించుట కారణము కాదు. నీళ్ల పగలగొట్టుటే కారణ మనెడిది సత్యము. నీళ్ల యావిరిబలముచేతనే నావలు బండ్లు నడచుచున్నవి." పేజి 22.

1 - 52 భూగోళ. 1 - 53 ఖగోళవిషయము

*Siddhanta Siromani Prakasa*
*Puranic, Siddantic*
*and*
*Copernicam Systems of the World*
*Compared*
*By*
*Ramachandra Subbajy Bapu*
*of Sehore near Bhopal in Malwa*
*Madras*
1850

*dedicated to L. Wilkinson, Dist Collector Ch. Anantapuram.*

"ఇతి శ్రీమద్రామచంద్ర సుందరపదారవింద ద్వంద్వస్యంద న్మరందసాంద్ర బిందుసందోహతంద్రా స్వాదన తుందిలేందిందిరాయమాన మానసాల్లాడివంశోత్తంసాత్రేయగోత్రాపస్తంబ సూత్ర జ్యోతిర్నయవిత్సుబ్బాజిసూరేః సూనునా చంద్రపుర మందిరేణ రామచంద్రేణ కృతసిద్ధాంత శిరోమణిప్రకాశం సంపూర్ణతామిమత్" శ్రీరామచంద్రార్పణమస్తు.

## సంస్కృత శ్లోకములు

గ్రంథమంతయు వచనములో నున్నది.

భారతి సైజున-100 పుటలు గలవు. ఇవికాక 6 పుటలలో—

శ్రీరామచంద్ర పదపంకజ షట్పదస్య
సుబ్బాజి సూరి తనయస్య సతాంమతస్య
అల్లాడివంశజనుషఃఖలు రామచంద్ర
నామ్నః కృతిర్నిఖిల ఖేటవిదాం ముదోస్తు
రామచంద్రేణ రచితమ్ భూగోళ మఖితో
భ్రమణ భ్రమభంగి భంగలగుడః (సమాప్తః)
పద్యములు కూడ నున్నవి.

చివర 6 పుటలు సంస్కృత గ్రంథము. కాశీలో రత్నేశ్వర పండితునికిని రామచంద్రశాస్త్రికిని జరిగిన భూభ్రమణమును గూర్చి జరిగిన వాదము.

పుస్తకము మంచిస్థితిలోనే యున్నది. బైండు కట్టియున్నది. దీనితో *Campbell grammar Syntax* భాగము కలదు.

*Madras Printed by P. Batchelor at Malhure Mission Press, Pophams Broadway 1837.*

## హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము :
## క్రీ. శ. 1858

ప్రఖ్యాత పండితుడగు పరవస్తు చిన్నయసూరి కర్నూలు నరహరి గోపాలకృష్ణమ సెట్టిగారి పర్యవేక్షణక్రింద నీ రాజకీయ శాస్త్ర గ్రంథమును, నాంగ్లేయ భాషనుండి యనువదించెను. ఇది నీతిచంద్రికవంటి కఠినశైలిగాక సులభశైలిలో వ్యవహారానుకూలమై యున్నది.

## కామందకము 1869.

ప్రసిద్ధ రాజనీతి శాస్త్రమగు నీ గ్రంథమున, పద్యరూపముగ పేరు తెలియని కవి రచించిన ప్రాచీన పద్యకృతి యొకటియు, జక్కరాజు వేంకటకవి క్రీ. శ. 1584 లో రచించిన పద్యకృతి వేఱొకటియు గలవు. దీనిని వచనరూపముగ క్రీ.శ. 1860లో తఃకమళ్ల వేంకట కృష్ణారావుగారు రచించిరి. ఇం దిరువది యధ్యాయములు—304 పుటలు గలవు.

## సింగరాజు దత్తాత్రేయులు- వేంకటసుబ్బయ్య 1840.

వీ రిరువురును కలిసి రామాయణ వచనమును రచించిరి. ప్రస్తుత మీ గ్రంథమున దత్తాత్రేయులు రచించిన అరణ్యకాండ, కిష్కింధాకాండ, వేంకటసుబ్బయ్య రచియించిన యుద్ధకాండ లభ్యమగుచున్నది. ఇది గ్రాంథికరచన.

## పైడిపాటి పాపయ్య 1840
## రంగనాథ రామాయణ వచనము

గోనబుద్ధారెడ్డి రచిత ద్విపద రామాయణమునకు వచనకావ్యముగా, సాంద్రీసు దొరవారి యనుజ్ఞచొప్పున పైడిపాటి కొండలయ కుమారుడు పాపయ్య వ్రాసినది. శైలి సులభమై వ్యావహారికరీతి నున్నది.

## పాటూరి నరసింహశాస్త్రి-1840

ఈతడు రంగనాథ రామాయణము ఉత్తరకాండము వచనముగా రచించెను.

## వైయాకరణము- రామానుజాచార్యులు
## ఆదిపర్వము-వచనము-1847

ఈ గ్రంథము శ్రీ పరవస్తు చిన్నయసూరిచే పరిమాడబడి, క్రీ. శ. 1847 లో నన్నయభట్టారక రచితాదిపర్వముతో కూడ ముద్రితమైనది. ముఖపత్రమున చిన్నయసూరి పేరుండుటచేత, దీనిని సూరిరచనలలో నిటీవలివా రొకటిగా చేర్చిరి. కాని గ్రంథము చూచినవారికి రచయితనుగూర్చి సందేహమే కలుగదు.

ఓ యయాతి మహారాజా! నీవు సకలధర్మార్థముల నెఱింగినవాడవు. గనుక మాకు పుణ్యలోకము లేమయినా గలవా చెప్పవయ్యా! అని యడుగగా మీకు పుణ్యలోకములు గలవని చెప్పిన యయాతి మాటలు విని వారు ముగ్గురున్ను సంతోషించి మేము నీ కూతురి బిడ్డలైన మనుమలమని తమ్ము నెఱింగించి పుణ్యలోకముల నిచ్చిరి. ఆ యయాతి ఆ సత్పురుషుల సాంగత్యమువలన తానున్ను తన మనుమలున్ను పూర్వలోకమునకు పోయిరి.

## ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యులు
## శివరహస్య ఖండము 1851

స్కాంద పురాణాంతర్గత శివరహస్య ఖండమునకు, తత్త్వ ప్రకాశిని యని ప్రశస్త వచనమును, ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యులు రచియించెను. దీనినిగూర్చి - "రెండు అపూర్వ వచన రచనలు" - (భారతి జూన్ 1950, సంచికలో) అను నా వ్యాసము చూడదగును.

## నీతిచంద్రిక - 1850. పరవస్తు చిన్నయసూరి

పంచతంత్ర హితోపదేశకథలను సమ్మేళనముచేసి మిత్రలాభము, మిత్రభేదము, పూర్వార్థంగాను, సంధివిగ్రహతంత్రములు ఉత్తరార్థముగాను విభాగించి చిన్నయసూరి పూర్వార్ధము మాత్రమే రచియించెను. దానిని సూరియే స్వయముగా వాణీదర్పణ ముద్రాక్షరశాల యను నొకదానిని స్థాపించి, యందు 1856 లో అచ్చువేయించెను. అప్పటికే సూరి రాజధానీ కళాశాలా పండితుడగుట వలన, నా గ్రంథము విద్యాశాఖలో నచిరకాలములో వ్యాప్తిలోనికి వచ్చెను. నేటికిని దీనిని మించిన వచనరచన లేదని ప్రాజ్ఞుల యభిప్రాయమై పఠనీయగ్రంథముగా రాణించుచున్నది. రమారమి ముప్పదిముద్రణములు వడసిన యీ రచననుగూర్చి ప్రస్తావించుట యనావశ్యకము.

## విగ్రహతంత్రము 1866

చిన్నయసూరి విడిచిపెట్టిన విగ్రహతంత్రమును శ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు 1866 లో రచించి, 1872 లో ముద్రించిరి. ఆవెనుక వీరేశలింగముపంతులుగారు 1878-1874 లో సంధి విగ్రహతంత్రములను రెండింటిని పూర్తి జేసిరి.

## మహాశ్వేత కథ 1866

కాదంబరిలోని మహాశ్వేతవృత్తాంతమును మొదట నూతన రీతిని కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు రచించిరి. భాషలో నిదియే మొదటి నవల.

## శ్రీ మార్కండేయ పురాణసార సంగ్రహము[1]

### తిమ్మరాజు లక్ష్మణరాయకవి. 1876

(వరూథినీ ప్రవరుల సంభాషణ)

ఓ నారీతిలకమా! నే నరుణాస్పదంబను పట్టణంబునుండి, ఓషధిరసమహిమచే నిచటి కేతెంచి తిరుగునెడ నా రసంబు హిమంబుచే నీరసంబైపోయె గాన మఱల గృహంబున కరుగుట కశక్తుడనైతి. నీ వెవ్వతవు? యిచటి కెందుండి వచ్చితివి? నీ భర్త యెవరు? అని యడుగ వరూథిని యిట్లనియె. ఓ మహాత్మా! నేను మేనకయనుదాని సుతను, వరూథినియని యందురు. నే నీ మనోహరంబగు పర్వతంబున వసించెద. నీ సుందరాకారంబును గాంచినమాత్రంబున నా మోహంబు హెచ్చె. కావున నా మనోరథం బొనగూర్చు మన నాప్రవరుం డా వరూథినిని జూచి, "బ్రాహ్మణులకు పరవాసంబు జేయందగదు. దేశాటనము చేయవలయునను కోరిక నను జెరచె. కాలము తప్పక నిత్యనైమిత్తిక క్రియలను సలుపవలెను. వాటిం ద్యజించిన బ్రాహ్మణ్యము నశించుగాన సూర్యు డస్తమించుటకు మున్నె నా గృహంబు జేరునుపాయంబు గరపు"మన నారీమణి దలపులకేని నీక్షించి అయ్యయ్యో..."

## శ్రీ కూర్మపురాణము

### తిమ్మరాజు లక్ష్మణరాయకవి 1877

(దేవదారు వనవర్ణన)

"పూర్వం బా విపినమున భృగ్వాది తాపసులు ప్రవృత్తి నివృత్తంబగు గృహస్థధర్మాచరణం బ్రవర్తిల్లుచుండిరి. వారల నాశ్రయా మోహితులం జేయ గౌరీసంయు వలంచి శౌరింగూడియవ్వనమున కరుగుచో దవ్వులం దా నేకోనవింశతివత్సర వయస్కుండును స్వర్ణసమాన తనుకాంతియు, లంబితబాహుయుగ్మంబును నిర్మల శతపత్ర నేత్రములునుగల మోహనాకారసరసుండై దిగంబరుండై పుండరీకాక్షుం డెల్ల బ్రహ్మాండముల మోహింపజేయు యంగజ యానయై చెంగటరాగ మందగమనమున మునిపల్లియకు జనిన మనసిజ సన్నిభుండును, దినకరకోటిప్రభాసమానుండునగు పశుపతిం గాంచి పతుల న్మరచి సంసారముం దూరి కుమాగులం గేరి మార సంగరముం గోరి గుంపులు జేరియందలి నారీమణులు పురారి వెంటం జన గడతేరిరి."

## మత్స్యపురాణసారసంగ్రహము-1877

ఇది మత్స్యపురాణమునకు సంగ్రహరూపమైన వచనము. పైని తెలిపిన తిమ్మరాజు లక్ష్మణరాయకవిచేతను, పువ్వాడ వేంకటరావుపంతులుగారిచేతను రచితమైనది. పై రచనలవలెనే చక్కని శైలి గలది.

క్రీ. శ. 1880 నుండి యీనాటివఱకు వచ్చుచున్న వచన వాఙ్మయమునుగూర్చి వేఱొకచో ప్రత్యేకముగ వివరించెదను.

---

1. ఈ మార్కండేయ పురాణ సంగ్రహమే గాక, నీ వెనుక చెప్పబడిన కూర్మపురాణ, మత్స్యపురాణ సంగ్రహములును మూలములతో కూడ, క్రీ. శ. 1876, 1877 సంవత్సరములలో ప్రకటితము లైనవి. వీనిని ప్రకటించినవారు శ్రీ పువ్వాడ వేంకటరావు గారు. వర్తమానతరంగిణి యనుముద్రాక్షరశాలను నెలకొల్పి యందు పురాణవాఙ్మయమే కాక, యితరాంధ్ర గ్రంథముల నచ్చు కూర్పించి, సంస్తవనీయమగు భాషాసేవ గావించిరి.

# కలలోని యదార్థం



శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

ఎవరో నిద్రలేపినట్టుగా జోగారావు పక్కమీద లేచికూర్చున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. జాగర్తగా ఆలకిస్తే లీల ఊపిరి పిల్చటం వినిపిస్తున్నది.

కిందహాలులో ఉన్న గడియారం మూడు కొట్టింది.

జోగారావు తాను కన్న కలను తలుచుకుంటూ మళ్లీ పక్కమీద వాలాడు. మళ్లీ నిద్రపట్టే లక్షణాలేవీ కనిపించలేదు.

అతను కన్న కలలో విశేషమేమీ లేదు. పదేళ్ల కిందటి జీవిత వాతావరణం ఎందుకో మళ్లీ కలలోకి వచ్చింది. ఆ కటిక దరిద్రపు దినాలూ, ఆ పూరికొంపా, హామక్‌లాంటి నులకమంచమూ, మసిబారి, పైన ఒక పెళ్లవిరిగి, కాగితంతో అంటించిన చిమ్నీగల హరికేన్ లాంతరూ కనిపించాయి. అప్పటికింకా తను లీలను ఎరగడు—ఆమె పేరు లీలకూడా కాదు. అయినా ఈ కలలో ఆమె కూడా ఉన్నది. కలలో అతను ఆ పూరికొంపనూ, నుక్కిమంచానీ, హరికెనులాంతర్నూ, లీలనూ ఎంత ప్రేమగా చూశాడు! ఈ అర్థంలేని కల కంటున్నంతసేపు అతని మనస్సు ఎంత నిర్మలంగా ఉంది!

దారిద్ర్యంలో ఆనందం ఉన్నదనే సిద్ధాంతాన్ని జోగారావు బుద్ధిపూర్వకంగా ఏనాడూ ఆమోదించలేదు. కాని ఇప్పుడాలోచించుకుంటే తాను ఆత్మవంచన చేసుకున్నాడేమో నని అనుమానం కలగసాగింది. డబ్బులో ఆనందం ఉందా? సుఖాల్లో ఆనందం ఉందా? చిత్తశుద్ధిగా జోగారావు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకోలేక పోయాడు.

ఒకప్పుడు జోగారావు మధ్యతరగతి దరిద్రుడు. మధ్యతరగతి దారిద్ర్యానికీ, తక్కువతరగతి దారిద్ర్యానికీ తేడా ఏమిటంటే, రెంటిలోనూ ఆహారసమస్య ఒకటే అయినా, మధ్యతరగతి దరిద్రుడు తన ఆకలి చంపుకోవటానికి అడుక్కుతినటమో, కూలిచేసుకోవడమో, దోచడమో చేయలేడు. మధ్యతరగతి వాళ్లకు దోపిడి చేతకాదనికాదు, ఇష్టంలేదనీ కాదు. అయితే తక్కువ తరగతి వాళ్లలాగా వీళ్లు పరగడుపునా, చట్టవిరుద్ధంగానూ దోచలేరు. తమ అవసరాలు గడవగా, విలాసాలు తీరగా చేతిలో మిగలటం మొదలుపెడితేగాని చట్టం చాటుదోపిడీకి దిగలేరు.

తన దారిద్ర్యంలో జోగారావు, కథలూ, వ్యాసాలూ రాసేవాడు. అతని సాహిత్యవిమర్శలు తెలివిగా ఉంటేవని చదివిన కొద్దిమందిలో కొద్దిమంది అనుకునేవాళ్లు. రచయితగానూ, విమర్శకుడుగానూ జోగారావు ఆకాలంలోనే సాహితీపరులలో కొంత ఖ్యాతిగడించాడు. ఆ రోజుల్లో ఏ కథకన్నా అయిదు రూపాయలు మని ఆర్డరువస్తే ఎంత ఆనందంగా ఉంటేది! ఆ రోజుల్లో డబ్బు గారడీలుచేసి చూపేది జోగారావు చేతుల్లో. రోజుకు పావలాతో పొట్టనించటంఎట్లా? జోగారావు ఆ "ఫీట్" చాలా నెలలు చేశాడు. తనే వంటచేసుకునేవాడు. అన్నంలో ఉల్లిపాయముక్కలూ, ఉప్పూ, కారమేసుకుని, ఇంతనూనె కలిపి మూడువాయలుతిని నీళ్లలాటిమజ్జిగలో నిమ్మకాయా, ఉప్పు కలిపి తాగితే కొన్ని పరిస్థితుల్లో అత్యంతానందం కలుగుతుంది. ఎంతతక్కువతో అవసరాలు గడుపుకోవచ్చునో అన్వేషించటంలో ఆనందం ఉంది. ఈ ఆనందాన్ని జోగారావు ఎరుగును—కాని గుర్తించలేదు.

జోగారావూ, లీలా పట్నంవచ్చిన తరవాతకూడా చాలా రోజులు అన్నంతినలేదు. ఉదయమూ, సాయంకాలమూ హోటలుకు వెళ్లి డబ్బుకు ఎంత ఎక్కువ తినవచ్చునో అంత తినేవారు. నాలుగేసి ఇడ్లీ, సాంబారూ, అరకప్పు కాఫీ తాగితే జానెడు కడుపూ నిండేది. సాయంకాలం కారీయరులో అయిదణాల భోజనం తెచ్చుకుంటె ఇద్దరికీ సరిపోయేది.

రాజ్యాలేలేవాళ్లు రాజకీయ సమస్య ఎదుర్కొనటానికి ఎంత తీవ్రంగా ఆలోచించి, ఎటువంటి యుక్తులు సాగిస్తారో, ఒక్కొక్క రూపాయిసంపాదించటానికి, అది సాధ్యమైనంత నింపాదిగా చెయ్యిదాటి పోవటానికీ, జోగారావు అంత శ్రమా పడేవాడు. ఈశ్రమ ఫలించినంతవరకు ఆనందం కలుగుతూనే ఉంటేది.

అప్పట్లో జోగారావు ఈ ఆనందాన్ని గుర్తించక పోవటానికి కారణమేమంటే అతను వేరే కలలు-పగటి కలలు కనటంలో నిమగ్నుడయిపోయినాడు. అప్పుడతను కన్న కలలు రెండే రెండు—ఒకటి లీలను సినిమాతార చెయ్యటం! రెండోది సాధ్యమైనంత నాగరికంగా బ్రతకటం.

తిండికి సరిగాలేని రోజుల్లోకూడా జోగారావు, "నిజమైన దారిద్ర్యం డబ్బు లేకపోవటం కాదు; ఉన్న డబ్బుతో సుఖంగా బతకలేకపోవటం", అని అవకాశం దొరికినప్పుడల్లా అనేవాడు. అతని లెక్కప్రకారం పల్లెటూళ్లలో నివసించటమే ఒక పెద్ద దరిద్రం. మంచి రోడ్లూ, సొంత కారూ, ఆధునిక పద్ధతులమీద కట్టిన ఇల్లూ, ఎలెక్ట్రిసిటీ, ఫ్లష్ సౌకర్యాలూ, పాశ్చాత్య పంపిణీమీద బాత్ రూములూ, కొళాయిలూ, సింక్‌లూ, పడక గదులూ, డ్రాయింగురూములూ, ఫర్నిచరూ, తివాసీలూ, క్రోటనులూ, కర్టెనులూ—ఇవి లేకపోవటం నిజమైన దరిద్రం.

లీల సినిమాతార కావాలన్న కల నిజమైనప్పటికీ తన ఈ రెండో కోరిక ఇంత బాగా నెరవేరుతుందని జోగారావు ఎన్నడూ ఊహించలేదు. రెండూ నిజమయాయి. కాని జోగారావు అర్థ

రాత్రి మూడు గంటలవేళ తనకు ఆనందం ఎందుకు లేకుండా ఉన్నదా, అని ఆత్మపరీక్ష చేసుకుంటున్నాడు.

## 2

ప్రస్తుతం జోగారావును వేధిస్తున్నది బాధ అనదగినంత పెద్దదికాదు, లివర్ సరిగా పనిచెయ్యకపోవటం మనదగినంత చిన్నదీ కాదు. బెర్నార్డ్‌షా నాటకం "మాన్ అండ్ సూపర్‌మాన్"లో, నరకంలో డాన్‌య్యాన్ "బోర్డమ్" అనుభవిస్తున్నట్టుగా ఉన్నది అతని స్థితి. అదొక విధమైన చిరాకుతో కూడిన అసంతృప్తి. ఈ అసంతృప్తికి లీలే కారణమని అనుకోదలిస్తే జోగారావుకు మార్గాలు చాలా ఉన్నాయి. కాని అతను ఆ మార్గాలు అన్వేషించి ఆత్మవంచనకు గురికాదలచలేదు. అతనికీ లీలకూ గల సంబంధం గడచిన మూడు నాలుగేళ్ల కాలంలో చాలా మారిపోయింది నిజమే గాని అందుకు లీలను తప్పుపట్టటం నిరర్థకం. పైపెచ్చు అతను ఎనిమిదేళ్ల నుంచీ ఆమెకు అనేక రకాలుగా రుణపడిఉన్నాడు.

లీల అతని జీవితంలోకి అడుగుపెడుతూనే అతన్ని చాలా పెద్ద దుస్థితినుంచి రక్షించింది. జోగారావు తన దరిద్రాన్ని, పెళ్లితో మరింత దుర్భరం చెయ్యక చాలా మంచిపనే చేశాడు గాని, ఈ పాడు సంఘంలో ఏ సమస్యను పరిష్కరించాలన్నా మరో కొత్తసమస్య ఏర్పడుతుంది. చిక్కేమిటంటే జోగారావుకు బ్రహ్మచర్యం సాధ్యంకాలేదు. కొందరు బ్రహ్మచర్యం సులువుగా నెరపగలరు. కాని జోగారావు ఈ తరగతికి చెందినవాడు కాడు. అతను తన పరిసరాలలోగల ఆడవాళ్లను—ఇతరుల భార్యలను ఆధారంచేసుకుని తన బ్రహ్మచర్యభారం తేలిక చేసుకోసాగాడు. ఇందువల్ల అమాయికలైన స్త్రీలని అపాయానికి గురిచేస్తున్నానే అన్న బాధ అతన్ని కొల్చుకుతిన్నది. వాళ్ళ మనశ్శాంతికి భంగం కలిగిస్తున్నానన్న ఆవేదనకూడా అతనికి కలగకపోలేదు. ప్రేమ కేవల దేహధర్మమే అయితే ఒక రిద్దరు స్త్రీలు అతనికోసం మానసికంగా బాధపడడం జరక్కపోను. ఈ నరకంలోనుంచి ఏ నాటికైనా, ఎవరైనావచ్చి తనను ఉద్ధరిస్తారని అతను పెట్టుకున్న ఆశను లీల సఫలం చేసింది. ఆమెతో స్నేహం కలిసినతరవాత అతను ఇతరుల భార్యలజోలికి పోలేదు.

లీల ఎవరిభార్యా కాదు. ఆమె కళావంతుల పిల్ల. ఆమెకు తల్లి గాక, తండ్రికూడా ఉన్నాడు. కాని ఆ దుర్మార్గుడామెపట్ల తండ్రిలాగా ప్రవర్తించలేదు. పన్నెండేళ్లు నిండకముందే వాడు లీలను బజారులో పెట్టాడు. ఆమెలో మానసిక వాంఛలు మొగ్గతొడగకపూర్వమే హేయమైన ఇంద్రియానుభూతికలగటంచేత లీల మగవాళ్లపై ద్వేషంమాత్రమే ఎరుగును, మగవాళ్ల స్నేహం ఎరగదు. ఆమె కొలోటును జోగారావు తీర్చాడు. అతనిమూలంగా లీలలో ఆడతనం పరిపూర్ణత్వంపొందింది. ఆమె అతని ప్రభావాన్ని పూర్తిగా స్వీకరించడమేకాక, ప్రపంచంలోఉన్న ఒక్క గొప్పవాడూ తనవాడైనట్టు భావించి గర్వించింది. అతనితో నరకానికి పోవటానికైనా సిద్ధపడి తన తండ్రిని ధిక్కరించి, ఇల్లు విడిచి అతనితో పట్నం వచ్చేసింది. పట్నంలో ఇద్దరూ కలిసి చాలా ఇబ్బందులు పడ్డారు. కాని జోగారావుమీద విశ్వాసంతో ఆమె ఏ కష్టాన్నీ ఖాతరు చెయ్యలేదు. ఏ సమస్యనుగురించీ తను స్వయంగా ఆలోచించలేదు. అతనియందు ఆమెకు గల విశ్వాసం అన్ని పరీక్షలకూ నిలబడ్డది.

అయితే లీల ఎన్నడూ జోగారావు చేతి కీలుబొమ్మగా ఉండ లేదు. అతనికి ప్రతిబింబం అసలే కాలేదు. ఆమెను తన ప్రతిబింబంగా చెయ్యాలని జోగారావు ఎన్నడూ ప్రయత్నించలేదు. ప్రయత్నించాలని అతనికి తట్టనుకూడాలేదు. జోగారావుకు అన్నిటి కన్నా భావనా స్వాతంత్ర్యంమీద విశ్వాసం హెచ్చు. ఇంకొకరి భావనాస్వాతంత్ర్యాన్ని అరికట్టటంకన్న మనిషి చేయగల సాంఘికపాతకం మరొకటి లేదని అతని విశ్వాసం. తన స్వాతంత్ర్యాన్ని అరికట్టటానికి ప్రయత్నించిన వారి నందర్నీ అతను నలివెయ్యటంచేతే జీవితంలో దాదాపు ఒంటరిగాడైనాడు. అతనికి మిగిలిన కొద్దిస్నేహితులు కూడా సాంఘికంగా తనవర్గానికి చెందినవారు కారు; తాను తన వర్గ ధర్మాన్ని ఆచరిస్తున్నాడా లేదా అని విమర్శించని వాళ్లుమాత్రమే...

లీలకు సినిమాల్లో నటించే అవకాశం దొరికిందంటే అందుకు పూర్తిగా జోగారావు కృషే కారణం. అతను ఆమెయందు పరిపూర్ణమైన విశ్వాసం కనబరిచాడు. ఆమెను ఏదోవిధంగా సినిమా తార చెయ్యాలన్న ఆవేదనమాత్రమే అతనిలో ఉన్నట్టయితే అతను జయించి ఉండకపోను. కాని ఆమె ఏనాటి కన్నా గొప్ప సినిమా నటి అయి తీరుతుందని అతనికిగల పరిపూర్ణ విశ్వాసం క్రమంగా ఇతర్లకు కూడా సంక్రమించింది. ఎందుచేతనంటే జోగారావు అందరు ప్రొడ్యూసర్ల చుట్టూ లీలను వేసుకు తిరిగినప్పటికీ, ఎవరి దగ్గిరా ప్రాధేయపడ లేదు. ఆమెయందు వారు విశ్వాసం కనబరచనందుకు వారిని నిందించనూలేదు. ఆమెను తీసుకోకపోవటంవల్ల ప్రొడ్యూసర్లే నష్టపడతారన్న నమ్మకం అతనిలో బలంగా ఉన్నప్పుడు ఒక రిద్దరు ప్రొడ్యూసర్లన్నా ఆ నమ్మకానికి గురికాక తప్పదు. అదే జరిగింది. లీలకు వరసగా ఒకదాని తరవాత ఒకటిగా రెండు చిన్న చిన్న వేషాలు లభించాయి.

జోగారావు లీలను సినిమాలలో ప్రవేశపెట్టటమే కాదు. ఆమెకు నటించే శక్తి కూడా కలిగించాడు. నిజానికి ఆమె నటించటానికి పుట్టిన మనిషే. దానికి సందేహంలేదు. ఎందుచేతనంటే నిత్యజీవితంలో కూడా ఆమె భావ ప్రకటన ఎంతో నిండుగానూ, ఆకర్షవంతంగానూ ఉండేది. అయితే విజయవంతంగా నటించటానికి ఈ సహజశక్తి చాలదు. దానికి తోడుగా ఒకవిధమైన మనస్తత్వంకూడా ఉండాలి. ఆ మనస్తత్వం నిర్బంధాలమధ్య అలవడదు. దానికి మానసిక స్వాతంత్ర్యం అంతులేకుండా కావాలి. కళాకారుడు ముందుగా జీవితపు సంకెళ్లనుంచి తాను విముక్తి పొంది, తరవాత ప్రపంచాన్ని తన సంకెళ్లలో బిగించే శక్తి సంపాదించాలి. కళకు సరిఅయిన వాతావరణంలేని సాంఘిక వ్యవస్థలో కళాకారులు సంఘానికి బలికావటమో, అధమం సంఘధర్మానికి విలక్షణంగా జీవించటమో జరుగుతుంది. సాంఘిక వ్యవస్థ కళారాధనకు అనుకూలించే పరిణామాన్ని పొందిననాడే సామాజికులకూ కళారాధకులకూ మధ్య ఏర్పడుతూఉండే వైషమ్యం

అంతరించటం జరుగుతుంది. అంతదాకా సంఘం కళాకారులను హీనంగా చూడటమో, నెత్తి నెక్కించుకుని పూజించటమో, లేక ఒకేసారి రెండూ చేయటమో జరుగుతుంది గాని, కళాకారులను తమవాళ్లుగా, తమ సోదరులుగా భావించటంమాత్రం జరగదు.

జోగారావు లీలకు ఈస్వాతంత్ర్యం ఇచ్చాడు. సంఘం మానవులమీద ఏర్పరిచే ఏ నిర్బంధాన్నీ కూడా లీల గుడ్డిగా, తప్పనిసరిగా ఆమోదించనవసరం లేకుండా చేశాడు. అసలే విహంగం లాంటి లీలను అతను స్వేచ్ఛావిహంగంగా మార్చాడు.

లీల నటించిన చిన్న పాత్రలే ప్రొడ్యూసర్లను ఆకర్షించాయి. ఆపాత్రలను చూసి లీలకూడా సంతోషించింది. ఆమెకన్న విమర్శనాదృష్టి ఎన్నో రెట్లు అధికంగా గల జోగారావు ఆమె నటనతో తృప్తిపడలేదు. అందులోగల లోపం చాలా వరకు ఆయాపాత్రలు రచించిన వాళ్లదనీ, ఆమెను డైరెక్టుచేసిన వారిదనీ అతను తెలుసుకున్నాడు. నటులను విమర్శనాదృష్టితో గాక తమ పూర్వానుభవంతోనూ, వ్యాపారదృష్టితోనూ చూసే ప్రొడ్యూసర్లు ఆమెలో లాభాలు చూశారు. సరిఅయిన మేకప్ మాన్ ఉండి, మంచి ఫోటోగ్రాఫర్ చేతిలో పడితే లీల చాలా పైకివస్తుందనీ, లక్షలాది సినీ మాప్రేక్షకులు ఆమెకోసం వెర్రెత్తి తమపై కనక వర్షం కురిపించవచ్చుననీ ప్రొడ్యూసర్లు గుర్తించారు.

అయితే ప్రొడ్యూసర్లు వేటగాళ్ల వంటివాళ్లు. వాళ్లుతొందరపడి తుపాకీ పేల్చి పిట్టపారిపోవటానికి ఒప్పరు. లీల చౌకగా వస్తుంది. కాని తాము ఏమాత్రం ఆత్రం ప్రదర్శించినా ఆమెరేటు పెరగవచ్చు. అందుకని వారు వెయ్యికళ్లతో కనిపెడుతూ వలచేతబట్టి పొంచున్నారు. ఇంతలో ఎవరో ప్రొడ్యూసరు తూలాడు. అతడికి, పాపం, గత్యంతరం లేకపోయింది. అతని "తార" అతన్ని పిండటానికి నిర్ణయించి పేచీలు పెట్టసాగింది. తీరా సంతకం పెట్టవచ్చేసమయానికి తాను అదివరకుకోరి ఒప్పించిన తొంభైతొమ్మిది హిరణ్యాక్షవరాలకు తోడుగా నూరోది కోరింది. అప్పటికే మూడు కంట్రాక్టులుచించి నాలుగోది రాసిన ఆ ప్రొడ్యూసరు నాలుగోది చింపేసి తన "తార"ను పంపేసి వెంటనే కారెక్కి లీల దగ్గిరికిపోయి, "ఇదుగో నేను ఎల్లుండి ప్రారంభించే పిక్చరులో హీరోయిన్ వేషానికి కంట్రాక్టు. అంకెమాత్రం వెయ్యలేదు. ఎంత కోరతావో చెప్పు. నా కిష్టమైతే నువుచెప్పిన అంకె వేస్తాను. లేదా, పిక్చరు మానుకుంటాను." అన్నాడు.

కంట్రాక్టు ఫారంతీసుకుని జోగారావు లీలచేతికిచ్చి ఎక్కడ సంతకం చెయ్యాలో చూపించి సంతకంచెయ్యమన్నాడు.

"అంకె?" అన్నాడుప్రొడ్యూసరు.

"మీకు గిట్టినంత వెయ్యండి, మీరునష్టపడి లీల డబ్బుతీసుకో నవసరంలేదు, మీరు మా యింటికి వచ్చారు. మేం మీదగ్గిరికి రాలేదు. అతిథులతో ఎవరూ బేరం చెయ్యరు."

వ్యాపారస్థుడిలో మానవత్వం తలఎత్తింది. ఆరువేలదగ్గిర పాటప్రారంభించి ఎనిమిదివేల దగ్గిర ఆపు చేద్దామనుకున్న ప్రొడ్యూసరు పదివేల అంకె వేశాడు.

"ఇద్దామనుకున్న దానికన్న రెండువేలు ఎక్కువవేశాను, లీల నాకు మనస్ఫూర్తిగా పనిచేస్తుందని తెలుసుకున్నాక ఈ రెండువేలూ ఇంకోరకంగా నాకు గిట్టక పోవన్న ధైర్యం కలిగింది."

ప్రొడ్యూసరు సెలవు పుచ్చుకున్నాడు. ఆమెమీద కన్ను వేసిఉన్న మరి ఇద్దరు ప్రొడ్యూసర్లు ముగ్గులోకి దిగారు. మొదటి ప్రొడ్యూసరును తిట్టుకుంటూ వాళ్లుకూడా పదేసి వేలకు కంట్రాక్టు రాసి, ఇంత తెలివిమాలినపని ఎందుకుచేశామా అని చాలారోజులపాటు ఆశ్చర్యపడ్డారు.

## 3

అటు తరవాత లీలపైకిరావటంతో జోగారావుకు సంబంధం లేకుండాపోయింది. ఈ యేడు ఆమె ఆరుకంట్రాక్టులపై సంతకాలు పెట్టింది. ఒక్కొక్కటీ 30 వేలు. కిందటేడే లక్షరూపాయలుపెట్టి ఈ ఇల్లు కట్టించారు. కాని ఇందులో జోగారావుకు ఎటువంటి నిమిత్తమూ లేదు. ఈ రెండుమూడేళ్లుగా తెరమీద ఆమె సౌందర్యం ఎంతో పెంపొందింది. ఆమె నటన ఎంతో ప్రతిభ సంపాదించుకున్నది. కాని దీనికితోడ్పడ్డవాళ్లు మేకప్ చేసేవాళ్లూ ఫోటోగ్రాఫర్లూ, డైరెక్టర్లూ, ఆమెకు ప్లేబాక్ పాడినవాళ్లూ, ఆమెకోరకు పాత్రలు రచించినవాళ్లూనూ. ఇందులో జోగారావు ప్రమేయం ఏమీలేదు.

సినిమా ప్రపంచంలో కాలు నిలవనొక్కుకున్నాక లీలఅనేక విషయాలలో వెనకటికన్న వెనక్కుపోయింది. ఆమె వెంకటేశ్వరస్వామికి మొక్కులు చెల్లించింది, అభిషేకాలు చేయించింది, తొడుగులు తొడిగించింది. గడిచిన రెండుమూడేళ్లనుంచీ ఇద్దరు ముగ్గురు జ్యోతిష్కులను పోషిస్తున్నది, నాడీగ్రంథాలవాళ్లను పోషిస్తున్నది. ఇవన్నీ కాక ఆమె, తనను పైకి తీసుకురావటానికి తోడ్పడేవారందరికీ తన శరీరసౌఖ్యం ఇస్తున్నది. తన అభివృద్ధికి ఆటంకంగా ఉండగల పురుషులను ఇంకోవిధంగా వశం చేసుకోవటానికి ఆమె ప్రయత్నించటంకూడా లేదు. కేవలం తన శరీరంతోనే జయిస్తున్నది.

లీలనుచూసి అసూయపడేవాళ్లూ, ఆమె పతనాన్ని కోరేవాళ్లూకూడా ఆమెమీద దుష్ప్రచారాలు చేస్తూనే ఉన్నారు. ఆమెను భయపెట్టి డబ్బుగుంజలేనివాళ్లు పత్రికల్లో ఆమెనుగురించి అవాకులూ చెవాకులూ రాస్తూనే ఉన్నారు. ఈ ప్రచారం చూసి లీల బెదిరిందిగాని జోగారావు ధైర్యంచెప్పాడు.

"నీ వృత్తికి నీ అపఖ్యాతి అడ్డురాదు. నీకు మొగుడనే పేరుతో నే నున్నన్నాళ్లూ ఎవరూ ఏమీ చెయ్యలేరు. నీమీద రాళ్లు వేసేవాళ్లే గాయపడతారు."

లీల కృతజ్ఞతతోనూ, గాయపడిన ఆత్మాభిమానంతోనూ కంట నీరు గారుస్తూ జోగారావును కౌగిలించుకుని ముద్దుపెట్టుకున్నది. ఆమెను తెరమీద మాత్రమే చూసే లక్షలాది ప్రేక్షకులకు పారవశ్యం కలిగినప్పటికీ ఇటీవల జోగారావును ఆమె ఆలింగనం కదిలించ లేకుండా ఉంది. ఒకప్పుడు ఆమె కుండిన లావణ్యమూ,

అందమూ ఇప్పుడు లేవు. నిద్రాహారాలు సరిగా లేని సినిమానటనా, ప్రేమరహితమైన కామసంతృప్తి, ఆమెసౌందర్యాన్ని అపహరిస్తున్నాయి. ఆమె సహజసౌందర్యం క్రమంగా తగ్గినా, కృత్రిమ సౌందర్యం దినదినప్రవర్ధమానమౌతున్నది.

## 4

రెండు నెల్లక్రితం లీల సినిమావృత్తిలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమయింది. ఆమెతోకూడా మరికొందరు కలిసి సొంతాన పిక్చరు తీయాలని తలపెట్టారు. ఇది జోగారావు కిష్టంలేదు. కాని ఆమె నిరుత్సాహపడేట్టు కనపడటంచేత అతను వద్దనలేదు. ఈ ప్రయత్నం చాలా నష్టదాయకం కానున్న లక్షణాలు ఇప్పటికే కనిపిస్తున్నాయి. ఈ పిక్చరునిర్వహణ బాలనాయకత్వంగానూ, బహునాయకత్వంగానూ ఉన్నది. ఇంకా అలూ చూలూ లేకపోయినా లీలచేతి డబ్బు ఇరవై వేలదాకా వదిలింది. మిగిలిన వాళ్లది ఎంతెంత వదిలిందీ లీలకు సరిగా తెలీదు. జోగారావుకు ఆమె వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవటం ఇష్టంలేదు. తాను కథలు రాసేవాడై ఉండికూడా—అతను కథ అన్నది రాసి ప్రచురించి అయిదారేళ్లయింది!—లీల నటించే చిత్రాల కథల జోలికి ఎన్నడూ పోలేదు.

ఏవిధంగానూ లీలకు అడ్డం రావటం అతనికి ఇష్టంలేదు. ఆమె స్నేహితులనుగురించీ, ఆమె తిరుగుళ్లనుగురించీ అత నెప్పుడూ విమర్శించలేదు. "ఎక్కడికి వెళ్లావు? ఎక్కడినుండి వస్తున్నావు?" అనికూడా ఎన్నడూ అతను అడగలేదు. ఈ విషయంలో అతనికి అసూయకూడా లేకపోయింది. ఎందుకంటే లీల తన స్థానాన్ని మరెవ్వరికీ ఇవ్వలేదు. మిగిలినదంతా ఆమె వృత్తితో ఎట్లా పెనవేసుకుని ఉన్నదంటే తన వృత్తికి భంగం లేకుండా ఆమె ఈ సంబంధాలనుంచి బయటపడలేదు. కొత్తగా తియ్యబోయే పిక్చరుకూడా ఇంచుమించు అటువంటిదే.

ఇంకొకందుకుకూడా లీలను చూస్తే జోగారావుకు జాలి వేసింది. నీతిమాలిన ఈ నీతిప్రపంచంలోకూడా సంఘశాసనం యొక్క ప్రభావం ఉన్నది. లీలకు తనతో ఇప్పుడిక పనిలేదు. కాని, పాపం, ఆమె తనను విడిచెయ్యాలన్నా అది సాధ్యంకాదు. ఆమె తన భార్య అనే వంచనమీద ఆమె సినిమాజీవితమంతా నిర్మాణమయింది. సులభంగా లభించే విడాకులూ, పునర్వివాహాలూ లేకపోతే సినిమాప్రపంచంలో వాళ్లు ఈ కాడి మొయ్యక తప్పదు. లీలకింకా జోగారావుమీద ఏదో కొంత స్నేహభావం ఉంది. అది లేకపోయినా ఆమె గతి ఇంతే. జోగారావు అసూయాపరుడైనా ఆమె గతి ఇంతే. కాకపోతే కొంపలో అశాంతి ఉండేది.

లీలకు వర్తించినదే కొంతవరకు జోగారావుకూ వర్తిస్తుంది. లీలనుంచి అత నిప్పుడు వాంఛించేది ఆమె సంపాదనతప్ప ఇంకేమీ లేదు. అతనికి కావలసిన స్నేహంకూడా ఇచ్చే తీరిక లేదు లీలకు. ఆమె ఇప్పుడు చేస్తున్న కళారాధనకూడా ఏమీ లేదు. ఇప్పుడామెకు నటించటం ఒక కళా కాదు, కేవలం వృత్తీ కాదు. అది ఆమెకు వ్యాపారం. ఆమె తన స్నేహితులు పిక్చర్లు తీయటంమీదా, డిస్ట్రిబ్యూటర్లతో కంట్రాక్టులు చెయ్యటంమీదా, ఇతరనటులచేత పనిచేయించుకుని వారిద్వారా స్వలాభం సాధించటంమీదా పోతున్నది.

ఇందులో జోగారావుకు ఆసక్తి కలిగించే దేమీ లేదు. అరవ చెట్టియార్లను చూడటానికి పొరుగూళ్లకుకూడా వెళుతున్నది, వస్తున్నది. వాళ్లు వస్తున్నారు, వెళుతున్నారు. తాను చేసే ప్రయత్నాలనుగురించి ఆమె జోగారావుకు చెబుతుందిగాని అతని సలహా కోసం ఎదురుచూడదు. ఎందుకు చెబుతుందో జోగారావుకు స్పష్టంగా తెలీదు.

జోగారావు పూర్వం—పూర్వాశ్రమంలో—కన్న కలలు నిజమయాయి గాని అవి కేవలం పీడకల్లగా పరిణమించాయి. చిన్నరకు ఆ పాతజీవితం కలల్లోకికూడా వస్తోంది. రూపాయిడబ్బులతో మూడు నాలుగు రోజులు గడపటంలో ఒకప్పుడు కలిగిన ఆనందం ఇవాళ లేదు. ఎట్లా ఉంటుందీ? ఈ ఆశ్రమంలో తాను చేసే ప్రయత్నమూ లేదు, సాధించే విజయమూ లేదు. అందుకే ఆనందమూ లేదు. డబ్బుతో కొనదగిన సుఖాలున్నాయి. ఆనందంమటుకు లేదు.

పత్రికలో రోజూ ప్రజలు చేసేప్రయత్నం కనిపిస్తూఉంది. తమ స్వాతంత్ర్యంకోసం పోరాడే ఆనందం కొరకు ఆసియాఖండంలో అనేక ప్రాంతాల ప్రజలు ప్రాణాలర్పిస్తున్నారు. తన లీల ఒక్కరోజు సంపాదించే డబ్బు ఏడాదిమీద సంపాదించలేక అలమటించే జనం అధికసంఖ్యలో ప్రపంచమంతటా ఉన్నారు.

జోగారావు లీల డబ్బుకు దాసుడైపోలేదు. అట్లా అయిపోగలిగితే అతనికి ఏ చిక్కూ లేదు. కాని ఆనందంకోసం జీవితంలో పోట్లాడాలంటే లీలకు సమస్య కలిగించి తీరాలి. లీలను అటువంటిస్థితిలో పెట్టే హక్కు తన కున్నదో లేదో జోగారావు నిర్ణయించుకోలేకపోయినాడు. ఆమెను తానే సినిమాతారగా చేశాడు. ఇప్పుడు లీల కొనసాగిస్తున్నది తన ఆశయాన్నే. కాని ఆమె సాధిస్తున్న ఫలితాలు తాను ఆశించినవి కావు. అందులో లీల తప్పులేదు. వాతావరణం అట్లా ఉంది. తాను లీలను వదిలిపెట్టి తన కాళ్లమీద నడిచి జీవితంలో ప్రవేశించాలంటే సరిఅయిన సమయం లీల చిక్కిపోయిన తరవాతినే. కాని అప్పుడామెను విసర్జించటం శక్యమా?

## 5

గడియారం అయిదుకొట్టటం విని జోగారావు పక్కమీదినుంచి లేచాడు. ఎందుకో అతనికి చిన్ననాటి అనుభవం ఒకటి జ్ఞాపకంవచ్చింది. మంచాని కెదురుగా ఉన్న నిలువుటద్దంలో తన ఆకారం కనిపించగానే తన అన్న జ్ఞాపకం వచ్చాడు. అతను చాలా ఏళ్లక్రితం నాలుగు నెలలు మంచాన పడితీసుకున్నాడు. వ్యాధి నయమైనతరవాత అతను నడక మళ్లా మొదటినుంచీ నేర్చుకోవలిసివచ్చింది. నిజానికి తనుమాత్రం అటువంటిస్థితిలో లేడూ? లీలసంపాదనమీద బతకటం మానేసి తన కాళ్లమీదే నిలబడటానికి ప్రయత్నిస్తే తాను పడిపోడా? తప్పక పడిపోతాడు.

జోగారావు లీలమంచందగ్గిరికి వెళ్ళి దానిమీద కూర్చుని లీల వొంటిమీద చెయ్యివేశాడు.

ఆమె కొంచెంగా కదిలింది గాని నిద్ర లేవలేదు.

"లీలా ? ఏయ్ !"

"ఉండమ్మా, నిద్దర చాల్లేమా !"

"నే నూరికి పోతున్నా."

"ఏ వూరికి ?" అన్నది లీల కళ్లుమూసుకుని నిద్రమత్తుగా.

"ఏదో ఊరికి."

లీల బలవంతాన కళ్లు తెరిచి "ఏం?" అన్నది.

"ఏం లేదు. కొన్నాళ్లు తిరిగి రావాలని ఉంది."

లీల పక్కమీద లేచి కూర్చున్నది కాని కాస్సేపు ఏమీ అనలేదు.

"ఎప్పుడు వెళతావు ?"

"ఇవాళే."

"ఎక్కడికి ?" మళ్ళా అడిగింది.

"ఏమో, ఇంకా ఏదీ అనుకోలా."

"తోచటం లేదేమో. అవునా ?"

"అవును."

"మళ్లీ ఎప్పుడు వస్తావు?"

"గాలి మళ్ళినప్పుడు."

లీలమొహాన కత్తివాటేస్తే నెత్తురుచుక్క లేదు. ఏదో మునిగిందని ఆమె కిప్పటికి తెలిసింది. ఆమె లేని ఉత్సాహం అభినయిస్తూ, "ఒక్క పని చేద్దాం. కాస్త నాకు తీరికదొరికితే ఇద్దరం కలిసిపోదాం," అన్నది.

"నీకు తీరికంటూ ఉండదు. నువు పనిగలదానివి, నేను పని లేని వాణ్ణినూ,"

లీల మొహం కాస్త చిట్లించి, "నామోషీగా ఉందా ?" అన్నది.

"ఎట్లా ఉందో నాకే సరిగా తెలియటంలేదు. ఊరికే ఉన్నానని పిస్తున్నది."

"వెళ్లి ఏం చేద్దామని ?"

"అదీ ఆలోచించలేదు."

"నాసంగతి ?"

"నీకేం తక్కువయిందీ ?"

"నువు వదిలేశావనిపించుకోనా ?"

జోగారావు కొద్దిగా నవ్వాడు.

"నువే నన్ను వొదిలేశావని చెప్పు."

"నన్నొచ్చి అడుగుతారా?"

"పోనీ నే చెబుతాలే."

కాస్సేపు ఇద్దరూ మౌనం.

"అకస్మాత్తుగా నామీద నీ కెందు కంతకోపం వచ్చిందీ?"

"కోపమా? ఏం లేదే. నిన్నెప్పుడన్నా ఏమన్నా అన్నానా? నువు నాకు చేసినమేలు మరెవరు చేస్తారు?"

"మరెందుకు వెళ్ళటం?"

"నువ్వేదో చేశావని కాదు. నే నేమీ చెయ్యటం లేదని."

"ఎందుకు చెయ్యలేదూ? ఎన్నిసార్లడిగాను ఏదో ఒకటి చెయ్యమని? నువు చెయ్యకపోవటం నా తప్పా?"

"నీ విషయంతప్ప ఇంకొకటి ఆలోచించలేవా, లీలా? చెయ్యటానికి సరిఅయిన పనిఉంటే నే చేసిఉండనా?"

"ఇప్పుడుమాత్రం ఆ చిక్కుండదా? ఎందుకు నిష్కారణంగా వెళ్ళిపోయి ఇబ్బందిపడటం?"

జోగారావు మళ్లీ నవ్వాడు

"అంత ఏమీ చెయ్యలేక ఇబ్బందిపడితే నేను తిరిగి రాకూడదా? అభ్యంతరం చెప్పవుగద?"

ఆమాట లీలకు ఘాటుగా తగిలినట్టయింది. ఆమెకు కోపం కూడా వచ్చింది.

"అప్పుడే వెళ్ళిపోయినట్టు నువే మాట్లాడుతున్నావు గాని నేను నిన్ను పోవద్దనే అంటున్నాను," అన్న దామె దెప్పుగా.

"ఇన్నాళ్లూ పోట్లాడుకోలేదు. ఇప్పుడు వద్దు, లీలా. స్నేహితులంగా ఉన్నాం. అట్లాగే ఉందాం?"

"ఇంకెవత్తైనా దొరికిందా?" అన్నది లీల, కాస్సేపు ఆలోచించి.

"ఇంతవరకు లేదు. నువు దొరికినతరవాత ఇంకెవతె మొహమూ చూడలేదు. సినిమాతారల భర్తలు ఎటువంటి పతివ్రతలో నీకు తెలీదూ?"

లీల పెదిమ కొరుక్కుంటూ ఆలోచించింది.

"ఇదంతా నాకేం బాగా లేదు," అన్న దామె.

జోగారావు తన వెనకఉన్నప్పుడు ఎవరితో ఎప్పుడెట్లా మాట్లాడాలో చాలా బాగా తెలిసిన లీల ఇప్పుడు జోగారావుకు ప్రతిగా మాట్లాడాలనేసరికి నోట తప్పాతాలూ దొర్లిస్తున్నది.

"నా సంగతి ఆలోచిస్తే ఇంకా అసహ్యంగా ఉంటుంది ఈ ఏడెనిమిదేళ్లలో బాగా తుప్పుపట్టిపోయినాను. అందుచేత విచారించవలసినవాణ్ణి నేను."

"అబ్బో, అప్పుడే అయిదున్నర అయిందే. నే నిప్పుడే వస్తా," అంటూ లీల లేచి వెళ్ళిపోయింది. మళ్లీ తనతో తాను మాట్లాడుకునే అవకాశం దొరికింది జోగారావుకు. ఎక్కడికన్నా వెళ్లిపోదామన్నది మొదట్లో ఒక భావంమాత్రమే. దాన్ని ఎట్లో ఒకటు నిర్ణయంగా మార్చుకుందామనే జోగారావు లీలను మాటల్లో పెట్టాడు. ఈ సంభాషణ తరవాత అతనికి వెళ్లిపోవాలనే నిశ్చయం కలిగింది.

లీల బయటికి వెళ్లి తిరిగి వచ్చేసరికి జోగారావు వెళ్లిపోయినాడు. అతని పర్సు కోటుజేబులోనే ఉన్నది. అది తీసుకోకుండానే అతను వెళ్లిపోయిఉండాలి.

లీలకు ఉక్రోషంకొద్దీ ఏడుపొచ్చింది. తన కింత అవమానం ఎవరూ చేయలేదు.

"ఏం చేశాను? నావల్ల ఏం తప్పు జరిగింది? నన్నెందుకిట్లా శిక్షించాడు?" అని ఆమెమనస్సు ఆమెను ప్రశ్నిస్తున్నది. కాని ఎవరు సమాధానం చెబుతారు?

ఎక్కడ చూసినా జోగారావును జ్ఞాపకంచేసే వస్తువులే. చిత్రమేమిటంటే లీలకు ఈ ఎడబాటు ఇవాళే అయినట్టు లేదు, ఏనాడో అయినట్టూ ఇవాళే తనకు తెలిసినట్టూ ఉన్నది. చచ్చిపోయినవాళ్లనుగురించి స్మరిస్తున్నట్టుగా ఆమె తమ ఇద్దరి జీవితానికీ సంబంధించిన విషయాలు జ్ఞాపకం చేసుకోసాగింది. ఇటీవల—గడిచిన రెండుమూడేళ్లలో జరిగిన సంఘటనలు ఒకటీ జ్ఞాపకంరాలేదు. కాని చాలా ఏళ్లకిందట జరిగినవి అనేకం జ్ఞాపకం రాసాగాయి.

లీల తనజన్మలో జోగారావును ఒక్కణ్ణే సరిగా ప్రేమించింది. రానురాను తనపేరుమీదా, ప్రతిష్ఠమీదా ప్రేమ ఏర్పడి జోగారావుమీది ప్రేమ మరుగునపడిపోయింది. ఎప్పటికైనా రెండు ప్రేమల్లో చెయిజారి పోయిన ప్రేమకు విలవహెచ్చు. లీలకు గడిచిపోయిన రోజుల్లో కనిపించిన ఆనందం ఇప్పటిరోజుల్లో కనిపించలేదు, ఆలోచిస్తే.

అయితే జోగారావుమీది ప్రేమ ఒకంతట జయించలేదు. మధ్యమధ్య లీల విచారానికి ఆగ్రహం అడ్డొస్తూఉంది. కాని తీరా ఆగ్రహం అయిపోయినాక కూడా విచారం మిగిలింది.

ఆ రాత్రి ఆమె ఒంటరిగా ఇంట్లోపడుకోవలసివస్తే ఎంత బాధపడేదోగాని ఆ రాత్రి షూటింగున్నది. దాన్ని ఆమె పూర్తిగా తగలేసింది. మర్నాడు కాల్‌షీట్ నిరాకరించి తనకు ఒంట్లో ఏమీ బాగాలేదని చెప్పింది. తెల్లవారుజామున స్టూడియోటికి ఇంటికి వచ్చి మేకప్‌కూడా కడుక్కోకుండా పడుకుని ఏడిచి నిద్రపోయింది.

మర్నాడామె ఇల్లుకదలలేదు. టెలిఫోన్ చేసినవాళ్లకూ, ఇంటికొచ్చినవాళ్ళకూ తను ఇంట్లో లేనట్టు చెప్పించింది. జోగారావును మరచిపోవటం లీల ఉద్దేశమైతే ఆమె చాలా పొరపాటు చేసింది.

ఆ మర్నాడామె షూటింగుకు పోయినప్పుడు అందరూ జోగారావునుగురించి అడిగారు. ఊరికి వెళ్లాడని చెప్పింది. ఆరోజు కూడా షూటింగు రీటేక్స్‌తోనే జరిగింది. ఎట్లా పొక్కిందోకాని, లీలా జోగారావూ విడిపోయినట్టు పట్నమంతా గుప్పుమన్నది. ఈ వార్త బయటనుంచే వచ్చివుండాలి. కాని లీల మాత్రం తనను అడిగినవాళ్లతో అతను త్వరలో తిరిగివస్తాడనే చెబుతూవచ్చింది.

జోగారావు వెళ్లి పదిహేనురోజులయింది. ఏరోజుకారోజు అతను తిరిగివస్తాడన్న ఆశ ఎక్కువవుతున్నకొద్దీ లీలకు అతనురాడని నిరాశకూడాఎక్కువవుతున్నది. ఇన్నాళ్లు అతను ఎట్లా ఉన్నాడో, ఏంచేస్తున్నాడో, ఎక్కడికో లీలకు ఎంత ఊహించినా తెలియలేదు.

తప్పుచేశామనుకుని ఎవరూ దండించనవసరం లేకుండానే శిక్షఅనుభవించేవాళ్లున్నారు. శిక్ష అనుభవిస్తున్నామనుకుని ఫలానా అని తెలియకుండానే తప్పు చేసినట్టుభావించేవారూ ఉన్నారు. తానూ జోగారావుకు ఏదో గొప్పఅపచారం చేశానని లీల నిశ్చయం చేసుకున్నది. ఈ నిశ్చయం నానాటికీ బలపడింది.

ఎందుకంటే లీల చాలాపనులు చేసింది. అందులో అన్నీ జోగారావు క్షమించినవే అయినప్పటికీ ఆమెకిప్పుడవే ఘోరమైన తప్పులుగా కనపడి బాధించగాయి.

ముఖ్యంగా ఆమెకు జోగారావుతో అనదగినమాటలు చాలా తట్టాయి అతను వెళ్లిపోతున్నానని చెప్పినప్పుడు అతను తనకెంత ఉపకారం చేశాడో ఆమె చెప్పలేదు. ఇంకా అతనే తనకు కృతజ్ఞత తెలిపాడు! తన విషయమే ఆలోచించింది. అతని విషయం ఆలోచించలేదు— ఆమాట అతను రెండుసార్లు జ్ఞాపకంచేసినా తను తలకెక్కించుకోలేదు.

అన్నిటికన్నా ఆమెను మూఢ విశ్వాసం ఒకటి బాగా పట్టుకున్నది. తనకు దశ తిరిగి పోయిందనీ, అందుకే అతను వెళ్లిపోయినాడనీ ఆమెకు అనుమానం కలిగింది. తను కొత్తగా సినిమాలలో ప్రవేశించినప్పుడామె కొక జ్యోతిష్కుడు, "నాలుగేళ్లదాకా నీకు చాలా మంచి యోగకాలం," అన్నాడు. "నాలుగేళ్లదాకా ఫరవాలేదుగద? ఆ తరవాత ఏమయితేనేం?" అని ఆమె నిర్లక్ష్యంగా సమాధానం చెప్పింది. జోగారావు వెళ్లిపోయిన తరవాత తాను ఒక్కరోజుకూడా సరిగా నటించలేదు. అందుచేత ఈ అనుమానం మరింత బలమైంది.

ఒకనాడు ఇంటికివచ్చిన పత్రిక ఏదో తిరగేస్తుంటే ఒక పేజీలో జోగారావుపేరు కనపడింది. "ప్రత్యక్షనరకం" అని పేరుపెట్టి జోగారావు కథ రాశాడు. ఆ పేరుకేసి చాలాసార్లు చూసింది. అతనేనని నమ్మలేకపోయింది. అయితే అది అతనే రాశాడని ఆమెకు తెలుసు. ఎందుకో ఆపేరు చూస్తుంటే జోగారావు ఎదురుగా నిలబడి తనను నిందిస్తున్నట్టు తోచింది. కథ చదువుదామని ఎన్నిసార్లు ప్రయత్నించినా కళ్ల ఎదుట మాటలు చెదరటమూ, చదివేది తలకెక్కక ఆలోచనలు ఎటో పోడా లాగటమూ జరిగింది.

పల్లెటూళ్లలో ప్రజలు పడే ఇబ్బందులూ, డబ్బుగలవాళ్లు లేనివాళ్లను పెట్టే బాధలూ, జీవితంలో విచ్చలవిడిగా విహరించే అరాజకమూ గురించి రాశాడు జోగారావు. కొన్నికొన్ని వాక్యాలు అతని నోటంబడి వింటున్నట్టే ఉన్నాయి అచ్చులో కూడా.

ఆమె కథ చదవటం పూర్తిచేసి చాలాసేపు అస్పష్టమైన ఆలోచనల్లో మునిగి అట్లాగే కూచుంది శూన్యదృష్టితో. ఇంతలో టెలిఫోన్ మోగి ఆమెకు తెలివి వచ్చినట్టయింది.

"జోగారావ్?" అన్నాడవతల మనిషి.

"ఇంట్లో లేడండీ," అన్నది లీల, సాకరువచ్చి టెలిఫోన్ అందుకోవాలన్న ఆలోచనకూడా లేకుండా.

"ఎవరండీ ఆ మాట్లాడేది? రాయకరాయక జోగారావు మంచికథ రాశాడే. ఆమాట చెప్పామని చెప్పండి."



"ఈద్ ముబారక్"

చిత్రకారుడు:
శ్రీ ఆర్. యన్. వినాయక్



# ఉగాది కోరికలు

★ జీవితశకటం హాయిగా సాగిపోవాలి

—ఇది సామాన్యుని కోరిక

★ నా మోటారు హాయిగా సాగిపోవాలి

—ఇది శ్రీమంతుని కోరిక

ఉగాది కోరికలు యుగాంతాలుగా సాగేవి గనుక
అన్నితరగతులవారు సరియైన సాధనసామగ్రి సమకూర్చుకోవటం అవసరం

హాయిగా సాగిపోయే
**మారిస్ మైనర్** మోటారుపైన
కుటుంబముతో సహా నేడే సరదాగా ప్రయాణం చేయండి

---

ఇండియాలో అమర్చువారు

అడిసన్ అండ్ కంపెనీ లిమిటెడ్,

మౌంట్ రోడ్ మదరాసు - 2

ADZ 31






మద్రాస్ హాండ్‌లూం 'వీవర్స్ ప్రావిన్షియల్
కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్

ఎగ్మూరు — మద్రాసు

# మరియొక క్రొత్తమోడల్ 68B-6 వాల్వులు
## డ్రైబ్యాటరీ రేడియో



"హింద్" డ్రైబ్యాటరీ రేడియో

(1) 8 అంగుళముల స్పీకరు
(2) బాగా పాలిష్‌చేసిన కాబినెట్.
(3) ఎక్స్‌ట్రా స్పీకర్. పికప్
(4) డైల్ లాంప్
(5) ప్రపంచములోని అన్ని స్టేషన్ల నుండి వినవచ్చును.
(6) డ్రైబ్యాటరీ రేడియోలన్నిటికంటెమంచిది

**ఆంధ్ర ఎలక్ట్రికల్ హౌస్ లిమిటెడ్, ఏలూరు**
మద్రాసు ప్రెసిడెన్సీకి [స్టేట్సుతోసహా] డిస్ట్రిబ్యూటర్లు

---

సికిందరాబాదులో ఇచ్చటే మకాం చేయండి



*Taj Mahal*
**HOTEL**

ఈ పట్టణంలో అతి నవీనమైన, ఆధునిక వసతి గృహమిదే!

అన్ని యేర్పాట్లు గలవు.

* సింగిల్, డబుల్ రూములు, స్నానపు వసతులతో గలవు.
* సంసారముతో వచ్చినవారికి ప్రత్యేక సదుపాయములు.
* అందరి అభిరుచులకు తగినట్లు రుచి, శుచిగల ఆహారపదార్థములు.

పట్టణపు మధ్యభాగములో నున్నది

## తాజ్ మహల్ హోటల్

88, ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్, : : సికిందరాబాద్ (దక్కన్)

తంతి: "COURTESY" ఫోను: 7474.

అవతల మనిషీతగ్గవాడే. తను ఎవరో చెప్పకుండా టెలిఫోను పెట్టేశాడు.

టెలిఫోను పెట్టేస్తుండగా లీలకు ఆలోచన తట్టింది. డైరెక్టరీలో ఈ పత్రికాకార్యాలయం నంబరుతీసి డయల్ చేసింది.

"మీ పత్రికలో కథరాసిన జోగారావుగారి ఎడ్రస్ చెబుతారా దయచేసి?" అన్నదామె.

పత్రికాఫీసువాళ్లు చాలాసంతోషించి అతని ఎడ్రస్ చెబుతూ, "కథ ఎట్లాఉందండీ?" అని అడిగారు.

"చాలా అసహ్యంగా ఉంది," అని లీల టెలిఫోన్ పెట్టేసింది...

పూరిసడిసెలో కుక్కిమంచంలో పడుకుని తలవేపున హరికేన్ లాంతరు దీపంవెలుతురులో ఏదోచదువు కుంటున్న జోగారావు మనిషి అలికిడి విని తలఎత్తిచూసి నిర్ఘాతంపోయి లేచికూచుని, "నువ్వా?" అన్నాడు. ఈ పాకలోకి లీల అడుగుపెట్టటం ఇదే మొదటిసారి.

"నాకల! నాకల!" అన్నాడు జోగారావు ఉద్రేకంతో.

అతనే విషయం మాట్లాడుతున్నాడో లీలకు అర్థంకాలేదు. ఆమె అతని కేసి వింతగా చూస్తూ అట్లాగే నిలబడింది...

---

# స్వాగతము



శ్రీమతి అయ్యగారి రాఘవమ్మ

గున్నమామిడి పందిళ్ళుగూర్చి కట్టి
మామిడాకుల తోరణాల్ మలచి కట్టి
చిగురుటాకులు పందిళ్ళ చేర్చిపెట్టి
మసృణకిసలాలయంబైన మండపమున
రాజ్యమేలగవచ్చెడి రాజు వీవు
క్రొత్త వత్సరమా! రమ్ము కొలువు కిపుడు
స్వాగతంబోయి నీకు సుస్వాగతంబు
ఆటపాటల నీ కొల్వుకూటమునకు
మాలతీసన్నజాజులు మల్లెలెల్ల
పెద్ద ముత్తైదువులవోలె పేర్మి నొప్పె.
పొగడ సేసలు జల్లుచు పొగడుచుండె
కోకిలలు సుస్వరంబులఁ గూర్చిపాడె
తుమ్మెదలు నాట్యమాడెను రెమ్మలందు
పక్షుల రవంబులనెడు బాజాలు మ్రోసె
అబ్బురంబయ్యె సింహాసనాధిరోహ
ణంబు; గొనుమోయి! వేడుక నతులొనర్చి
ఆశతో నుంటి మిన్నాళ్ళు వేసరిలక
క్రొత్తవత్సరమా! నీవు క్రొత్తఁ జూపు
ప్రాత సంగతులన్నియు మరచిపోవ
లోకమంతయు నీ క్రొత్తరాకఁ జూచి.
'ఖరము' 'గాడిద' గాఁ గాక సురల మాకు
క్రొత్త యర్థంబు గూర్చి కొమరుమిగులు.
ప్రముఖులగువారి నెల్లర ప[illegible]టఁ గలిపి
వికృతి యేగెను ఎల్లెడ వికృ[illegible]ఁ జూపి
కాని నీ విప్పు డవియేవి గా[illegible]నీక
శుభములను జూపు నీరాక [illegible]భసమున!

---



"చెరువునుండి"

[లినోకట్ చిత్రము]

శ్రీ వెంక్కపాటి కృష్ణమూర్తి
(శాంతినికేతన్)

# కచేరీ కథనం

## [కాగితాల పొదుపు]



శ్రీ మాచిరాజు దేవీప్రసాద్

## 1

ఇన్స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసువారి కార్యస్థానం.

త. క్ర. క్ర. 3333/రాక్షస-నళ          దినం. చైత్రశుద్ధ పాడ్యమి.

1. ప్రస్తుతం ప్రభుత్వాన్ని కలవరపెడుతున్న మహాసమస్యలలో తెల్లకాగితాల పొదుపు అనేది ఒక క్లిష్టతర విషమసమస్య.

2. దాన్ని ఎదుర్కొనునిమిత్తం తత్సంబంధీయ మంత్రివర్గం ఒక ప్రత్యేక నిర్వహణాధికారిని నియమించడమైనది. ఏతత్ నిర్వహణాధికారి అఖిలప్రభుత్వ శాఖాచరణీయార్థం తయారుకావించిన అష్టోత్తర పేరాన్వితమైన ప్రణాళిక పూర్తిపాఠం (32 పేజీల నకలు) యిందుతో యావన్మందికీ జారీచేయడమైనది.

3. ఈ ప్రణాళికాఖండంలోని విశేషవిశేషాలను ప్రతి ఉద్యోగి కూలంకషంగా అవగాహన చేసుకొని అప్రమత్తతతో అనుసరించేది.

ఇన్స్పెక్టరు జనరల్,
పోలీసుశాఖ.

కాపీలు.

25 మంది జిల్లా సూపరెంట్లకు (ఒక్కొక్కళ్లకు 10 స్పేరుకాపీలు.)
50 మంది ఉపసూపరెంట్లకు ( „ 8 స్పేరుకాపీలు.)
250 మంది వర్తులాధికార్లకు ( „ 5 స్పేరుకాపీలు.)
1570 మంది సబ్‌యిన్స్పెక్టర్లకు ( „ 3 స్పేరుకాపీలు.)

"అ" సెక్షనుకు 25 స్పేరుకాపీలు.

"ఆ" సెక్షనుకు 25 స్పేరుకాపీలు.

యావన్మంది యివి ముట్టినవైనం వ్రాతమూలకముగా తెలియజేయవలెను.
సం. శూన్యం. } డి. చైత్రశుద్ధ షష్ఠి,

## 2

నుంచి
సబ్‌యిన్స్పెక్టరు
వసంతపురం.

కు
వర్తులాధికారి
మహానాంతర చతుర్భుజేంద్రవరం.

అయ్యా,

విజ్ఞాపనలు:—కచేరీ కలాపం - వ్రాతసామగ్రి - సరఫరా - సంబోధన.

[illegible]

గడచిన అష్టమినుంచి యీ కచేరీలో తెల్లకాగితం అనేది లేదు. నెలకు యీ ఆఫీసు సరాసరిఖర్చు 2 దస్తాలు. గనుక రెండున్నర దస్తాల తెల్లకాగితములు అత్యవసరముగా వాంఛించడమైనది.

కాపీ రివిన్యూ యిన్స్పెక్టరు వసంతపురంగార్కి. మీ ఆఫీసునుంచి చేబదులు పుచ్చుకొన్న ½ దస్తాయున్నూ యీ కోర్కె అమలుపడిన మరుక్షణం వాపసు చేయబడును. | సబ్ యిన్స్పెక్టరు. వసంతపురం.

## 3

వర్తులాధికారిగారి కార్యస్థానం.

విష:—శ్వేతపత్ర విహీనం-క్లిష్టతర విషమసమస్య-పునరుద్ఘాటితము.

సంధ:—1. ఇన్స్పెక్టరు జనరల్ వారి త. క్ర. క్ర. 3333/రాక్షస-నళ.

2. త్వదీయాఫీసోద్గారిత షష్ఠ్యోద్భవ శూన్యసంఖ్యాంచిత సంబోధనమ్.

వసంతపురం సబ్‌యిన్స్పెక్టరు యావద్దృష్టి

పై నుదహరించిన త. క్ర. క. కున్నూ, దానితో జతపరచిన అష్టోత్తర పేరాన్వితమైన 32 పేజీల నకలులోని 22 పేరాకున్నూ మరల్చడమైనది.

తదనుగుణ్యంగా తెల్లకాగితములు లేనిచో రంగుకాగితములు వాడవలెను.

వర్తులాధికారి.
మహానాంతర చతుర్భుజేంద్రవరం

## 4

నుంచి.
సబ్‌యిన్స్పెక్టరు
వసంతపురం.

కు.
వర్తులాధికారి
చతుర్భుజేంద్రవరం.

అయ్యా.

విష: కచేరీ కలాపం—ప్రతిష్టంభన—ఓకానొక విశేషం-సమర్పితం.

సంధ: త్వదీయ పునరుద్ఘాటనం.

ఈ ఆఫీసులో తెల్లకాగితములు లేవు సరిగదా, తమరు పేర్కొన్న సదరు రంగు కాగితములు ఏ రంగువో మేము నేటి వరకు ఎరుగము. కావున రెండు దస్తాలు రంగు కాగితములున్నూ అరదస్తా తెల్లకాగితములున్నూ (రివిన్యూవారికి వాపసునిమిత్తం) సరఫరా చేయునది. రంగుకాగితములు లేనిచో తెల్లకాగితములు సప్లయి చేసినను ఫరవాలేదు. వాటిని రంగుచేయుటకు మేము సర్వదా సంసిద్ధులము.

సబ్ యిన్స్పెక్టరు
వసంతపుంత.

## 5

వస్తులాధికారిగారి కార్యస్థానం

విషయం: శ్వేతపత్రవిహీనం—క్లిష్టతర విషమసమస్య—ఉద్ఘాటితం—పునః—పునః.

రంగుకాగితములు లేనిచో 23 వ పేరాలోని "ఎ". "బి". "సి" అంతర్ పేరాలలో సూచించిన విధముగా, రూళ్ల ఫారములు: ఎక్కువగా నిల్వయున్న అచ్చుఫారములు యితరత్రా పనికిరాని గీతల కాగితములు విశృంఖలముగా తెల్లకాగితముల స్థానే వాడవలెను. అవియు లేనిచో "ఒ". "ఓ". "ఔ"లు అవలంబించవలెను. వీటిప్రకారం కాగితం అనే ప్రతీదీ అన్నివైపులా వాడవలెను. అనగా యితః పూర్వమే ఒకవైపు వాడివేసిన పురాతన లేఖలు, మతలబులు వగైరా రెండవవైపుగల సహజఖాళీని పురస్కరించుకొని తెల్లకాగితంక్రింద రాజకీలితో వాడవచ్చును. ఈ రెండు వైపుల వాడుటఅన్న నిబంధన అన్నింటికీ అనగా వస్తువు కాగితములకు గోడ కంటించు నోటీసులకు కూడా వర్తించును. కాని కార్బనుపేపర్ల విషయం సందేహాస్పదం. దీని విషయమై వాద ప్రతివాదనలు జరుగుచున్నవి.

"ఒ". "ఓ". "ఔ"లు అవలంబింప వీలుగానిచో అవలంబింపుము "హ".

వస్తులాధికారి.
సమానాంతర చతుర్భుజేంద్రవరం.

## 6

| | |
|---|---|
| నుంచి<br>సబ్ యిన్స్పెక్టరు.<br>వసంతపుంత. | కు.<br>వస్తులాధికారి.<br>సమానాంతర చతుర్భుజేంద్రవరం. |

అయ్యా,

తమ ఆదేశానుసారం నిల్వయున్న అచ్చురూళ్ల ఫారములు యావత్తూ తెల్లకాగితములస్థానే ఉత్తరప్రత్యుత్తరములకు వాడియున్నాము. కావున నెలసరి లెఖ్ఖలు తయారుచేయుటకు అచ్చు ఫారములు లేవు. అచ్చురూళ్లఫారములు వెంటనే సప్లయి చేయునది:

సబ్ యిన్స్పెక్టరు,
వసంతపుంత.

## 7

వస్తులాధికారిగారి కార్యస్థానం:

నెలసరి లెఖ్ఖలకై అచ్చురూళ్లఫారములు లేనిచో, నగానా రూళ్లుగీచి తెల్లకాగితములు వాడవలెను,

ఈ ఆఫీసుకు నిన్ననే వచ్చిన ఉత్తర్వుల ప్రకారం రెండు దస్తాలుగాని అంతకులోపుగాని ఒక్కమ్మడి సరఫరాచేయుటకు మాత్రమే అధికారము గలదు. నీ మష్ట్యోద్భవవాంఛ గరిష్టప్రమాణం మించినదిగాన నూత్ననిబంధనల దృష్ట్యా ఆచరణనిమిత్తం ఉప సూపరెంటువారికి పంపబడ్డది.

కాగితపు కర్తవ్యదృష్ట్యా వారితో నేరుగా సంప్రదించునది. కాని డిపార్టుమెంటు నిబంధనల ప్రకారం యీ ఆఫీసుకు కాపీలు యథాప్రకారం పంపవలెను. [చూడుము నిబంధనల సంపుటి ౨ విధి 14.]

వస్తులాధికారి
సమానాంతర చతుర్భుజేంద్రవరం.

## 8

ఉప సూపరెంటువారి కార్యస్థానం

| | |
|---|---|
| నుంచి.<br>ఉపసూపరెంటు<br>అఖండపురీఖండము | కు.<br>సబ్ యిన్స్పెక్టరు<br>వసంతపుంత. |

విష: సంక్రమిత త్వదీయ పత్రవాంఛితము — కశ్చిత్ సంతోషితము—కించిత్ సంశోషితము.

రెండున్నర దస్తాలు అర్థిస్తూ నీవు వ్రాసిన ఉత్తరం యీ ఆఫీసుకు వస్తులాధికారిద్వారా చేరినది.

ఇతర డిపార్టుమెంటువారి కాగితాలు సేకరించి ఉపయోగించడంలో నీవు చూపించిన సంపాదనాసామర్థ్యానికి యీక్రింది చిరునామాదారుడు మిగుల ఆనందించి వెంటనే పరితపించవలసినది. కారణం. దాని వాడుకలో పొదుపు చూపించకపోవుటయే. నీ దినం చైత్ర. శు. షష్ఠి కల ఉత్తరంలో పైన పాఠమునకున్నూ (*Text*) క్రింద హోదాకున్నూ (*Designation*) మధ్య కొత్తేడు పైచిల్లర స్థళము కత్తి సంతకమునకై వృథాగా విడువబడ్డది.

ఇట్టి రిజ్జణానికి సమగ్రమైన సంజాయిషీ యిది ముట్టిన మూడు రోజుల్లో యిచ్చేది.

ఉపసూపరెంటు
అఖండపురీ ఖండము.

## 9

కు.

ఉపసూపరెంటు.

అఖండపురిగారికి.

అయ్యా,

విష: వర్జితపత్రాల ప్రవేశం-సంజాయిషీ-సమర్పితము.

సామాన్యముగా అందరి చేవ్రాళ్లు బల్లపరుపుగమనం కలవి. కాని నా వ్రాలు కేవలం ఏటవాలు గమనం కలది. అనగా యిది భూమధ్యరేఖనుంచి కోణాకృతితో పైకి లేచును. అట్లు ఎంత ఎత్తు వరకు లేచునో అన్న విషయం సంతకం పూర్తిచేసినంతవరకు దుర్గ్రాహ్యం. దానికి తోడు నాపేరు సుదీర్ఘమైనది అగుటచే సంపూర్ణసంతకము చేసినచో కౌరవసేనయావత్తూ "క్యూ"లో నిలుచున్నదో అన్నట్లుండును.

అందుకై పాతమునకు, అడుగున హోదాకు మధ్య అంత వైశాల్యము సంతకమునకై విడువవలెను. లేనిచో సంతకములోని ఆఖరు అక్షరము అంతరిక్షమువరకు లేచి పాత్యభాగమునకు గుచ్చుకొనును. అట్టి అంతర్లీన పరిస్థితులలో అసలే గొలుసుకట్టయిన నా వ్రాత ముప్పేట గొలుసుకట్టుగా పరిణమించును.

ఆ ప్రమాదనివారణనిమిత్తం ఆమాత్రం నిరక్షరస్థళం అనివార్యం అని విన్నవించు విధేయుడు.

సబ్ యిన్స్పెక్టరు,
వసంతపుంత.

## 10

ఉపసూపరెంటువారి కార్యస్థానం.

నీ చేవ్రాలు అతీతకోణాన్వితమై విజృంభించుట దుస్సహము. దానిని భూమార్గం పట్టించునది.

అంతియేకాక నీవు కవరు అంటించువిధానము అతి ఘోరము. నీవు సంజాయిషీ పంపిన కవర్ని అష్టదిగ్బంధన చేయుటవల్ల సక్రమమార్గములు దుర్భేద్యములు. అంత్యంలో దానికి హిరణ్యకశ్యప డిస్పోజల్ యిచ్చి పొట్టచీల్చినగాని అక్షరం ముక్కలు స్వాధీనము కాలేదు. ఫలితం కవరు తిరిగి యథాతథంగా వాడుటకు పనికిరాలేదు. [చూడుము పొదుపు ప్రణాళిక 101 పేరా]

కావున కవర్లు అంటించుటలో యీ క్రింది ముఖ్యాంశములు గమనించునది.

1. కవర్లు వీలైనంత చిన్నవిగా కట్టవలెను. కారణం ఎంత పెద్దయుత్తరమైననూ మడచినచో బహుచిన్నికవర్లోకూడా పట్టును.

2. ప్రతి కవరు త్రిభాగ విభాజితము.

1. చరమ భాగము.

2. కాండము లేక గర్భము.

3. అంచలము.

మరియు పై రెండవ అయిటం. (అ) ఉల్టా (ఆ) సీదా అని అంతర్విభాగితము.

ఈ అంచలమును కాండముయొక్క ఉల్టాభాగముపై చప్పగా కరిపించి కాండముయొక్క సీదాభాగముపై అద్దుసు ప్రాగుంట పూర్వాచారము. అట్టి కవరు యితరత్రా నిరుపయోగము. ప్రస్తుత పరిస్థితులలో ఆధునిక విధానములు పాటించుట అనివార్యం. పూర్వాచారమువల్ల అపాదించిన దుర్భిక్షమును పోగొట్టు నిమిత్తం "సంక్షిప్త ఖండము" లేక "పొదుపు పేలికలు" (*Economy labels*) సుభిక్షముగా అచ్చువేయించి పుష్కలముగా సప్లయిచేయబడ్డవి. వీటిని అశ్రాన్తమ్ కవర్లకు పొదుగునది.

కవర్లు పంపునపుడు ఆచరణ: అంచలముయొక్క పై భాగమునకు జిగురు పూసి సంక్షిప్త ఖండముయొక్క వామభాగమునకు అంటించవలెను. ఇప్పుడు ఖండముయొక్క దక్షిణభాగము గాలిలో తేలియాడుచుండును. దీనిని చదునుగా బిగలాగి కాండముయొక్క మధ్యభాగములో కరిపించునది. విలాసము యీ సంక్షిప్త ఖండముపైననే వ్రాయవలెనుగాని ఎట్టి ప్రమాదావస్థలోనైనను సరే సీదాపైగాని, కవరుయొక్క మరే శరీరభాగముపైనగాని వ్రాయతగదు.

కవర్లు చించునపుడు ఆచరణ: కవర్లు చించునపుడు సంక్షిప్త ఖండమునే చించి లోపలి విషయములు గ్రహించవలెనుగాని కవర్ని వికలాంగము చేయరాదు.

ఉపసూపరెంటు.
అఖండపురీ ఖండము.

## 11

కు—

ఉపసూపరెంటు

అఖండపురి.

అయ్యా,

విష: పొదుపుపేలిక—ఒకానొక పదార్థము—ద్విగుణీకృతవ్యయం.

సంద్: త్వదీయ సంక్షిప్తఖండ ప్రతిష్ఠాపనావిధాన ప్రథానాత్మక లేఖావతంసం.

వెనుకటి విధానము ప్రకారం కవర్ని ఒకచోటనే కరిపించుచున్నాము. కాని పొదుపు పాలసీ ప్రకారం సంక్షిప్తఖండమును ఉపయోగించవలసిన అగత్యం వచ్చినది. కనుక దాన్ని రెండు చోట్ల జిగురువ్రాసి కరిపించవలసిన ప్రత్యేకావస్థ ఏర్పడినది. కావున ప్రస్తుతం జిగురుఖర్చు ద్విగుణీకృతం. ఈ ఆఫీసులో నిల్వ సెలాఖరువరకు చాలదు కనుక కాగితములతోపాటు రెండు సవాశేర్ల జిగురు తిరుగుటపాలో పంపునది.

లేక మైదాపిండి మైలతుత్తము పంపిననూ ఫరవాలేదు. మైలతుత్తము కలపనిచో మైదాపిండి వంటకొన్ని కీటకములు తిని పోవును.

సబ్ యిన్స్పెక్టరు
వసంతపుంత.

## 12

ఉపసూపరెంటువారి కార్యస్థానం.

ప్రస్తుతం వస్తున్న మైదాపిండి నిసలైనది కాకపోవుటచే జిగురు తయారీకి పనికిరాదు. ఒకవేళ పనికివచ్చిననూ మైలతుత్తం కలప నవసరములేదు. ఏలనన దీన్ని క్రిమికీటకాదులుకూడా తినవు. పైపెచ్చు ఇది అత్యవసరమైన ఆహార పదార్థము. దుర్వ్యయం చేయరాదు.

జిగురుకూడా వ్రాతసామగ్రిగా పరిగణింపబడవలెనని 32 పేజీల ప్రణాళిక ప్రకటించియేయున్నది. (చూ. పేరా 101 కు) కనుక దీని వాడుకలోకూడ పొదుపు నిస్సంకోచము.

జిగురు అను పదార్థము దేశవాళీ ముడిసరుకు. ఇది చెట్లపై విరివిగా యుండును. వసంతపుంత "తోపుచిత్తా" ప్రకారం 2,500 చెట్లు గలవు. జమానులను సక్రమముగా ఉపయోగించినచో నీ రక్షకభట స్థావరం స్వయంపోషకము కాగలదు. స్వయంపోష కత్వము ద్వారాస్వయంసమృద్ధి (జిగురులో) సాధించి అదనపు నిల్వసరుకు మా ఆఫీసుకు పంపునది.

తుమ్మచెట్ల జిగురు శ్రేష్ఠము.

ఉపసూపరెంటు.
అఖండపురీ ఖండము.

## 13

కు.

ఉపసూపరెంటు,
అఖండపురీఖండము.

అయ్యా,

ఈ స్టేషన్ను ఆవరించియున్న చెట్లు యావత్తూ, మామిడి చెట్లు, తాటిచెట్లు అయిఉన్నవి. తాటిచెట్లకు జిగురు ఊరదు. ఇక మామిడిజిగురు వట్టి నాసిరకము. ఇది పూసినచో యింతకునుసుపే జిగురుపూతగల తిపాలాబిళ్లలుసయితం అంటుకోనవు. గనుక వర్జ్యము.

ఇక తుమ్మచెట్లు, యీ స్టేషన్ పరిసరాల అయిదుమైళ్ళ లోపు మొక్కకూడా లేదు. జమాన్ను ప్రధానస్థావరం దాటి 5 మైళ్లు పంపించినచో రోజు చేటూరు అర్హుడు. (గమనించునది ప్రాథమిక సూత్రములు.) అంతియేగాక తుమ్మచెట్లు అవతల గట్టున ఉండుటచేత మధ్యలో ఏరు దాటవలయును. (గుహూని రుసుము సారికి 3 అణాలు: రానుపోను రూ. 0-6-0) ఒకసారి వెళ్లి చెట్లకు పెచ్చులు ఊడదీసిరావలయును. రెండవ సారివెళ్లి ఊడిన జిగురు కేంద్రీకరించవలయును. ఖర్చు మంజూరుచేయనిదే జిగురుసేకరణ అమలుజరుప వలనుపడదు.

తుమ్మచెట్లు తగుమాత్రమే యుండుటచే రెండు సవాశేర్లకు మించి జిగురు రాదు:

సబ్‌యిన్సిపెక్టరు,
వసంతపుంత.

## 14

ఉపసూపరెంటువారి కార్యస్థానం-అఖండపురీఖండము అఖండపురి.
నెం. 123 బత్తెం/రాతుసనళీ ది: వైశాఖ బహుళ అమావాస్య.

ఇతర ఖాతాలవలె బత్తెంఖాతాకు పొదుపుఆంక్ష అమలులో లేనందున జిగురుసేకరణ నిమిత్తం జమానుకు రోజు 1 కి రూ 0-12-0 చొ॥ రెండు రోజులకుగాను రూ 1-8-0 న్నూ, పడవచార్జి సారి 1 కి రూ 0-3-0 చొ॥ నాలుగుసార్లకు రూ 0-12-0 నిక్కచ్చిఖర్చున్నూ, వెరశి రూ 2-4-0 ఖర్చు ఆమోదించడమైనది.

కు.

సబ్‌యిన్సిపెక్టరు వసంతపుంత
నెలాఖరున బిల్లు పంపునపుడు
యీ ఉత్తర్వు నెంబరు షరా
గడిలో పేర్కొనవలెను.

(సం)............
ఉపసూపరెంటు,
అఖండపురీ ఖండము.

## 15

నుంచి.
సబ్ యిన్సిపెక్టరు
వసంతపుంత.

కు.
ఉపసూపరెంటు.
అఖండపురీ ఖండము.

అయ్యా,

విష్: పత్రప్రమేయం—ప్రవర్తిత ప్రతిష్టంభితం—విజృంభిత స్తంభీకృతం—సమ్మార్జనం, సమర్పితం.

జిగురు సేకరణకార్యక్రమం ప్రకారం జరిగినది. పొదుపు పేలికలు పుష్కలము. కాని కవర్లుమటుకు లేవు.

వ్రాతకు కాగితములు లేక అచ్చురూళ్ల ఫారములు తెల్ల కాగితముల స్థానే వాడియున్నాము. రూళ్లఫారములు అయి పోగా ఉన్న డ్రాయింగు పేపరుపై రూళ్లు గీచి నెలసరి లెక్కలు తయారు చేసియున్నాము. ప్లాన్లు గీయవలసిరాగా డ్రాయింగు పేపరులేక కవర్ల నిమిత్తం సప్లయిచేసిన దళసరికాగితం, డ్రాయింగుపేపరుస్థానే వాడియున్నాము. కనుక ప్రస్తుతం ఒక్క కవర్లు చేయుటకేగాకు ఏ పని జేయుటకు కాగితం లేదు. ఉత్తర ప్రత్యుత్తరాలు రమారమి స్తంభీకృతం.

సబ్‌యిన్సిపెక్టరు
వసంతపుంత.

## 16

ఉపసూపరెంటువారి కార్యస్థానం

కొంగ్రొత్త నియమావళిప్రకారం యీ ఆఫీసునుంచి కానిచ్చే కాగితం సరఫరా యావత్తూ శ్రీ జిల్లా సూపరెంటువారిచే మున్ముందుగా సూక్ష్మపరిశీలన గావింపబడి ఆమోదింపబడవలసి యున్నది. కనుక నీ పత్రోద్భవ వాంఛ పై కార్యనిర్వహణ నిమిత్తం వారికి పంపబడ్డది. నిరీక్షించునది.

ఉపసూపరెంటు
అఖండపురీ ఖండము.

## 17

శూన్యబుర్రారం జిల్లా సూపరెంటువారి కార్యస్థానం—శూన్య బుర్రారం జిల్లా—శూన్యబుర్రారం.

మహా॥రా॥శ్రీ.........గారు.
జిల్లా సూపరెంటు
శూన్య బుర్రారం జిల్లా

సబ్ యిన్సిపెక్టరు
వసంతపుంత.

విష్: పత్రప్రమేయం—కొంబ్రొత్త సమాచారం—అఖిలవ జీయం.

సంగ్ : త్వదీయ దిన చైత్రశుద్ధ షష్ఠ్యాంచిత సంబోధనం.

ఉత్తర ప్రత్యుత్తరములకుగాను 2½ దస్తాలు తెల్లకాగితములు కావలెనని కోరియున్నావు. సరఫరా అనుమతించుటకు ముందు ఖర్చు సూక్ష్మపరిశీలన గావింపవలసియున్నది గాన యీ క్రింది సమాచారము నిర్దిష్టపట్టికలో తయారుచేసి తిరుగుటపాలో పంపునది.

| ఉత్తరములకు గాను ఖర్చు (తావులలో) | ప్రత్యుత్తరములకు గాను ఖర్చు (తావులలో) | లెఖ్ఖపనికి గాను చిత్తు ఖర్చు | వ్రాతపనికి గాను కలగూరగంప ఖర్చు | దండుగ | | మొత్తం (తావులలో) | షరా. |
|---|---|---|---|---|---|---|---|
| | | | | ఊహింపగల దండుగ | ఊహింపరాని దండుగ | | |
| సంఖ్య | సంఖ్య | సంఖ్య. | సంఖ్య | సంఖ్య. | సంఖ్య | సంఖ్య | |
| (1) | (2) | (3) | (4) | (5 క) | (5 ఖ) | (6) | (7) |
| | | | | | | | |

పై పట్టికలోని గళ్ళలో గడి (3) లెఖ్ఖ పనికిగాను చిత్తు ఖర్చు భర్తీ చేయునప్పుడు బహుళోపకారియగు పలకా బలపము జ్ఞప్తియందుంచుకొనవలెను.

కొందరు యీ పట్టికలను గాలికోట విమానమంత కాగితాలపై తయారుచేసి పంపుచున్నారు. వ్యయకర్తవ్యదృష్ట్యా అది నిషిద్ధము. వీలున్నంత చిన్న వాటిపై తయారుచేసి పంపునది.

జిల్లా సూపరెంటు.

## 18

జిల్లా సూపరెంటువారి కార్యస్థానం.

నీ పట్టిక ఆఫీసుకు అందినది. అది మానవ నేత్రములకు అగోచరము. వీలున్నంత చిన్న కాగితముపై వేసిపంపవలెనన్నచో వీలైనంత మరీ చిన్న కాగితం కాదని తెలుసుకొనవలెను. సమయోచితమైన చిన్నది అని భావము. నీవు పంపిన పట్టిక రైలుటిక్కెట్టు గ్రాము టిక్కెట్ల సైజులో నున్నది. నేను సూక్ష్మపరిశీలన జేయవలసినది విషయములు గాని అందులోని అక్షరములు గావు.

కనుక వీలున్నంత పెద్దసైజులో తయారుచేసి పంపుటకై (అనగా పెద్దసైజులో చిన్నది అని గమనిక) త్రిప్పి వేయడమైనది.

షరా గడిలో [గడి (7)] పూర్తి వివరములు పట్టనిచో వేరే కాగితముపైన విపులీకరించి దీనికి జోడించునది.

అనుబంధం-అగోచరమైన ఒక పట్టిక. జిల్లా సూపరెంటు.

## 19

పునర్నివేదించడమైనది.

2. ఈ సైజుకు మించి వేయుటకు కాగితం లేనందున తిరిగి దానినే పంపించుచున్నందుకు చింతించుచున్నాను. సర్వతోముఖ సూక్ష్మపరిశీలన గావించవలసిందిగా కోరుచున్నాను.

సబ్ యిన్స్పెక్టరు,
వసంతపురం.

అనుబంధం : ఒక పట్టిక.

## 20

జిల్లా సూపరెంటువారి కార్యస్థానం.

1. పెద్దసైజు కాగితములు లేనిచో నాలుగు చిన్నసైజు కాగితములు కలిపి అంటించినచో ఒక పెద్దసైజు కాగితం ఏర్పడును. గమనార్హం. 2. నీవు పట్టికలో చూపించిన గడి (5) లో ఖర్చు అపారం. ఇందులో ఊహింపగల దండుగ క్రింద (5 క) ఆరు తావులున్నూ, ఊహింపరాని దండుగ క్రింద (5 ఖ) పన్నెండు తావులున్నూ చూపించియున్నావు. ఊహింపగల దండుగను (5 క) ముందుగా ఊహించి, లేకుండా చేయుటకును, ఇక ఊహింపరాని దండుగను (5 ఖ) ముందుగా ఊహించి, ఊహింపగల దండుగ క్రిందకు (5 క) మార్చుటకు, ఎలా వలనుపడదో విపులముగా చర్చించునది. 3. నీవు కోరిన మొత్తం 2½ దస్తాలలో నీ వద్దనున్న ఆ రోజు నిల్వ మినహాయించి మిగతావి సప్లయి చేయవలెను గనుక నీ ఆఫీసులోని తెల్లకాగితముల నిల్వ దస్తాలలో తెలియజేయవలెను. అధికముగా ఉన్నచో రీములలో తెలియజేయునది.

జిల్లా సూపరెంటు,
శూన్య బుర్రారం.

## 21

కు

జిల్లా సూపరెంటు
శూన్య బుర్రారం.

అయ్యా,

ఊహింపరాని దండుగను ముందుగా ఊహింపలేకపోవుచున్నాను. ఈ ఆఫీసులో గడచిన ఫాల్గుణ బహుళ అష్టమినుంచి తెల్లకాగితం అనేది శూన్యం. ఇక నిల్వ దస్తాలలో సున్న. రీములలో సున్న.

సబ్ యిన్స్పెక్టరు
వసంతపురం.

## 22

జిల్లా సూపరెంటువారి కార్యస్థానం.

1. ఊహింపరాని దండుగను (5 ఖ) ముందుగా ఎందుకు ఊహించలేకపోయినావో యీ క్రింది చిరునామాదారుడు ఊహించలేకుండా ఉన్నాడు.

2. నీ ప్రవర్తన మాజ అష్టోత్తరపేరాన్వితమైన 32 పేజీల బృహత్పత్రికాళికలోని బిగియొక్క జిగి, నీకు పూర్తిగా అవగాహన అయినట్టు తోచుటలేదు.

3. కనుక దాని అంతరార్థములోని పరమార్థము గురించి నా సమక్షశిక్షణ నీ కవసరము. తన్నిమిత్తం నా ఆఫీసులో రాబోయే ఆదివారం సాయంత్రం 3-30 గం. నీవు హాజరుపడవలయును.

4. నీవు ప్రయాణం చేసే చిన్నబండిలో ఇంటర్ క్లాసు సదుపాయము లేనిచో హోదాకు భంగము లేని రీతిగా సెకండు క్లాసులో ప్రయాణం చేయవచ్చును.

జిల్లా సూపరెంటు.

## 23

నుంచి
సబ్ యిన్సిపెక్టరు
వసంతపురం.

కు
జిల్లా సూపరెంటు
శూన్యబుర్రారం.

స్వామీ,

తమ సాన్నిధ్యమందు బోధించిన సూత్రములు గూవత్తూ తల పట్టినవి. కాని అవి నా తలకాయలోంచి బయటకు వెళ్ళిపోవుటకు కూడా తలపెట్టినవి. కారణం. వాటిని అభ్యసించుటకు కావల్సిన సదార్థములు లేకపోవుటయే. పాఠితములు లేనప్పుడు సాధనములు దేనికి ?

ప్రప్రథమం వస్తులాధికారిని కోరినప్పుడు యీ ఆఫీసు కాగిత పరిస్థితి "ప్రతిష్టంభితం". తరువాత ఉపసూపరెంటువారితో సంప్రదించునపుడు "స్తంభీకృతం". నిన్న విపరీతం. నేడు యీ ఉత్తరం వ్రాయకపూర్వం (అనగా యీ ఉత్తరం వ్రాస్తున్న కాగితం వాడకపూర్వం) విపరీత విపత్కరం. కాని యిప్పుడు విపరీత విపత్కర అసాధారణం.

ఇది ఆఖరు కాగితం. దీని తరవాత యీ ఆఫీసులో కాగితం లేదు సరిగదా, లేదని తెలియజేయుటకుకూడా కాగితం లేదు.

ఇహనుంచి పై అధికార్లతో వ్రాతమూలక సంబంధ బాంధవ్యములు లేక యీ రక్షకభట స్థావరం సర్వతంత్ర స్వతంత్రంగా వ్యవహరించవలసిందే కాని, వేరే గత్యంతరము లేదు.

కాపీలు,
1. వస్తులాధికారికి.
2. ఉపసూపరెంటుకి.

సబ్ యిన్సిపెక్టర్,
వసంతపురం.

## 24

సబ్ యిన్సిపెక్టరుకు—

రెండున్నర దస్తాల తెల్లకాగితములు యింగుతో సరఫరా చేయడమైనది.

ఈసారినుంచి నీ వాంఛ రెండు దస్తాలను మించినచో ఉత సూపరెంటువారితో నేరుగా సంప్రదించునది.

వస్తులాధికారి
సమానాంతర చతుర్భుజేంద్రవరం

## 25

సబ్ యిన్సిపెక్టరుకు—

రెండున్నర దస్తాల తెల్లకాగితములు యింగుతో సరఫరా చేయడమైనది.

ఈసారినుంచి యీ ఆఫీసు సరఫరాలుగూవత్తూ మున్ముందుగా శ్రీ జిల్లా సూపరెంటువారి సూక్ష్మపరిశీలన బడయవలెను.

ఉపసూపరెంటు,
అఖండపురీ ఖండము.

## 26

సబ్ యిన్సిపెక్టరుకు—

రెండున్నర దస్తాల తెల్లకాగితములు యింగుతో సరఫరా చేయడమైనది.

నీ రక్షకభటస్థావరం సర్వతంత్ర స్వతంత్రంగా వ్యవహరించటానికి అంతర్జాతీయ నియమావళి ఒకవేళ ఒప్పుకున్నా, పోలీసు నిబంధనలుమటుకు ఒప్పుకోవు.

జిల్లా సూపరెంటు,
శూన్యబుర్రారం జిల్లా.



# పీయూషలహరి



మూలం :1

శ్రీ జయదేవకవి

అనువాదం :

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య

పరితః కేసర పుంజ పింజర దళ
త్పంకేరుహాంకూరమై
దర శంపా రుచిరాంశు మాంసల శర
త్కాదంబినీ డంబర
స్ఫురణన్ బర్వత కన్యకా మధు నట
త్ఫుల్లాస్య లాస్యాంచితం
బరుదౌ శంకర చండ తాండవము ని
ర్వ్యాజమ్ము మిమ్మోముతన్

లీలా కంపిత చంపకావళులు గా
లిం జేలి చుంబింపనా
హాళిం దూలెడు నల్లఁగల్వ చెలు వ
త్యంతమ్ము నొల్కించుచుం
దేలన్ రాసవిలాసలాలసత నెం
తే వల్లవీ పల్లవ
వ్రీళావల్గితమైన వెన్నెపుడు మా
హృద్వీథి వెల్గొందెడిన్.

సూత్రధారుడు : [నాంద్యంతమున ప్రవేశించి]

ఆలస్యమేల? [పరికించి] అహో! ఈ మధు మాస మెంత మధురము!

పంపా కంపవన నల్పు మెల్పుటలలం
బర్వెత్తుచుం జల్లనై
సొంపుల్ జల్లెడి మల్లెమొగ్గలపయిం
జూరాడి హల్లీసకం
బింపౌ తుమ్మెద లాడు తమ్ములను సి
గ్గేపార చుంబించుచుం
బెంపౌ మారుతుఁ డల్ల మెల్లన లతా
బృందంబు లందాడెడిన్

ఓహో! భాగవతజన శీతాంశువును నీలాచల మౌళి మండనమణియు నైన గరుడధ్వజుని అనుగ్రహము గోరి సాన్నిధ్యమున సామాజికులందరు గోష్ఠి నేసి యున్నారు గదా! మఱియు నొక విశేషము.

మించు న్మించిన చిత్ర చంచలతయు
న్పీయూష రుఙ్మండలీ
నంచిన్వన్మధురస్రవచ్ఛటయు భా
స్వచ్చిచ్చమత్కారమున్
పంచారించి కురంగలోచన చలా
పాంగంబన న్మోదము
ల్పెంచన్ శ్రీజయదేవగోష్ఠి యిష్టతరమై
వర్తించు నర్తింపఁగన్

[తెరవైపు జూచి] ఆహా! నా యీ చిరుగేహమున గల విశేషమనోజ్ఞత నేమని చెప్పుదును?

పెన్నెఱు లెన్నొ వంకలుగ,
బెన్నడి నేర్పున నొక్క కాంత, తా
నున్నవి చన్నుదోయిపయి
నూత్న లస న్మకరీవిలాసము
ల్పన్నొక రైత యొక్కరిత
బాహువులన్ వలయాళి దాల్చు, క్రే
గన్నుల బెళ్కు నించు నొక
కన్నియ కాటుకనీటు తేటలన్

నేనును పారిపార్శ్వకునిచే రంగమంగళము తరంగింప జేతును. ఇటురావోయి శృంగారకా! పారిపార్శ్వకుడు: [ప్రవేశించి] బావా! ఏమి విశేషము?

1 ఇది కళింగ చారిత్రక పరిశోధకమండలివారి పత్రికలో శ్రీ. శ్రార్ మహాశయునిచే ఆంగ్లానువాద, సంస్కృత వ్యాఖ్యాన సహితముగా ప్రకటితము.

సూత్ర: జ్ఞాని కెందుఁ జిత్తభంజన రంజనం
బొనరఁజేయనట్టి దొకట నాట్య
రంగమేని ప్రేమసంగమేనియుఁగాని
వానివలన గలుగు ఫలిత మేమి?

పారి: అట్లయినచో మనకిప్పు డంత భావబంధురమగు ప్రబంధమేది?

సూత్ర: పొలయల్కఁంగొను కాంత వింతపలుకు
లొప్పులె న్విన న్మచ్చటం
గొలువుల్, ఖేల దురఃపటాంతరబహి
ర్గుంభత్కుచంబట్లు క
న్నులకుం బండువయా, గవాక్షతరుణీ
నూత్నాన నేందుచ్ఛటం
బలె నున్మాదకమైన గోష్ఠి నర్తనకళా
పాత్రంబుగా వర్తిలుల్

పారి: [ఆశ్చర్యముతో] అంతటి కవి యెవరు?

సూత్ర: ఇట్లు పలుకఁగల సమర్థుఁడు
"పరమాత్మము గఱగించుట
కిరువురకే యనువుగలుగు-హృద్యవచోవి
స్ఫురణను నే జయదేవుఁడ,
కరముల చలువనుతుమారకరుఁడొక్కరుడుల్"

పారి: [తెరవైపునకు] అట్లయినచో గోష్ఠికై నర్తనాభినయ కోవిదులైన కుశీలవులు సంసిద్ధులుకండు.

[నేపథ్యమున] సఖి! ఇటు, ఇటు.

సూత్ర: [చూచి] ఓహో! భాగవతుల కేమి రసావేశము! వీణ లేకయే రంగమంగళ మారంభమైనదే!!

పంకజ ముఖి చంద్రకళా
శంకావహి యాచు ముందు చనుదేరఁగ నా
వంకనె మెలపుల నడకల
నింకొక సఖి రోహిణీసమీహితయయ్యెన్

మన మిరువురము నిక మాధవ రసాలకుల భూమికల ధరింతము. [నిష్క్రమింతురు]

[ఇది ప్రస్తావన]

[సఖు లిరువురు ప్రవేశింతురు]

ఒకతె: ఎవరి మానసముల నితఁడు
మోహ పరుపడు!
ఊహసేయ మోహనాంగి
మోహపరుపడు!!
పంచమాలాపమాలా వి
పంచికా ప్రపంచకుండు
మధుమహోదయుం డితండు
మధురమాన వంచకుండు!!...ఎవరిమాన...

మఱియొకతె: అవునే రాధికా! మఱి నీవంటి వారినో!

ఊర్పుల్ వెచ్చకు నొచ్చెనో యనఁగ గం
డోపాంత వాంతంబులో,
గర్పూరాంబుధి నట్లు పాండిమల మ
గ్నమ్మయ్యె మైకాంతి, సం
దర్ప త్కార్శ్యము కొనుదీవ కిదె శు
ష్యచ్చంద్ర మంద్రచ్ఛవి
న్నేర్పెన్ సుందరి! నందనందన రుచుల్
నీ కన్నులున్ గ్రోలెనే!

రాధి: సఖి, నవమాలికా! గంధర్వనగరుల నిర్మింతువా యేమి?

నవ: మనమున నీబోటుల కెటు
లనురాగము డాగు నింతి? యతిగహనంబై
నను వల్లరులం దిరులం
దున డాగిన సౌరభమ్ము దొఱలును విరులన్!

రాధి: నా రెండవ ప్రాణమైన నీదగ్గఱ దాపరికమెందుకు?

ఎపుడెపు డా మురారి ధ్వని
యింపఁగ నింపగు పాణి వేణువు
న్నవలత మందమంద ముఖ
సారణ ధోరణి నూదనెంచు న
ల్లపుడపు డాత్మలందు మద
నార్తి కతమ్మున నూర్పు వేడియూ
రుపు లధరాళి మ్లానిమల
రూపణ సేయు సరోరుహాక్షులన్

కేళీ మాధురి యిందునేమొ మురళీ
కేదార రాగచ్ఛటా
పాళిన్, పాద సరోజ నూపుర రణ
త్కాఙ్క్షణమ్మునం దుండఁగాఁ

బోలుచున్, క్లాంత కపోల ఘర్మవిశదాం
బుస్యంది హాసంబు లీ
లన్ లోలోఁ గల మాదు ధైర్యముల గ
ల్వం జాలఁ డన్యంబులన్

[పరికింపగాఁ జూచి నవమాలిక యించుక తలయూపును. తెరలోనుండి రాధకన్ను లెవరో మూయుదురు]

రాధ: (సీత్కారముతో)

మాధవా! రతిలంపట మానసా! యి
దేమి! కన్నులతోఁ బని యేమి సామి!
వదలరా! రాధికను నేను వదలవోయి!
చరణపంకజ సేవన షట్పదమను!!

సఖి: [రాధికాచిబుకమును స్పృశించి] ఇదేనా నీ సతీవ్రత మాహాత్మ్యము?

రాధి: [సిగ్గుతో] భ్రమచే నంటినే చెలీ!

సఖి: కాదు, కాదు. విభ్రమముచే ననుము.

రాధి: కులుకుల ముక్కుముత్తియము
కుండల మండిత గండపాళి, సం
కుల నవ నీలకుంతల వి
గుంచిత పింఛము, లోకమోహనా
కలిత తమాల నీలిమయుఁ
గాంచి సమంచితమా పటమ్ముతో
వెలసినవాడె తీపి యని
పించెడిఁ బ్రాణముకన్న నో చెలీ!

సఖి: అవును. నీకేకా దందఱకు నెక్కువే. అయినను సింగారుల జిహ్వాపిశాచ తాండవ మతి కట్టుట కులాంగనలకు సముచితము సుమా!

రాధి: సఖి! విషమాస్త్రుని బాణపాతముచే నైన మరత్ర వ్యథ సిబోటిదాని కేమి తెలియును? వలసినచోఁ బ్రేమకళ నడుగుము.

ప్రేమ: మాటికి లోకనిందయును
మాన్యుల నిందయు సోకనీక ను
మ్మాటికి రక్ష సేయవలె
మానిని! శీలము, మానినావా! ధీ
పాటవ విశ్లథత్వ మిడవచ్చును
మాధవు లేఁతబుగ్గలం

దూటలు దేరు మారుతము
లూగెడు మాంసల వంశగానముల్

[వంశీనాదమాలించి రాధిక ప్రేమావస్థ నటించును]

ప్రేమ: ఎడనెడఁ బుల్కలం బొటమ
రించిన బుగ్గల నిగ్గుతోడఁ జొ
ప్పడ మధుసీత్కృతాళి, ముఖ
పంకజ మొప్పుల కుప్పగాఁగ నె
న్లెడఁ గుచకాంచనాద్రుల స్ర
వింపఁగ సాత్విక ఘర్మబిందువుల్
వడఁకెద వేలనే చెలియ!
భావజహేతి విఘాతభీతవై

నవ: [రాధిక నీవీసంయమమున భినయించుటను జూచి మందస్మితముతో]

వేలవే! ఓ పృథునితంబిని!
నీవిబంధన మేలనే, చెలి... వేలవే,..
పంకజాక్షుని నయనకాంతుల
బద్ధవై పోవా!—....

రాధి [నవమాలికను బరికించి యానందముతో]
మాధవార్ద్రి మురళీ నినాద
మధురోహల పదనైనవి!
గండపాళిఁ బులకలవే
కలిగెనుమీా వరసతులకె!!

నవ: [సిగ్గునఁ దలవంచుకొని యాత్మగతముగ]
అందము చిందు నే విభు దృ
గగ్ర మనుగ్రహ మేపు చూపఁ బూ
ర్ణేందుఁడు చిందునిప్పుకలు
మృత్యు విహారము తాను హారముల్
గంధము తాపకందళము
గానగు నాయము తాను దాయ నా
సుందరు నందగోపసుతుఁ
జూడకమున్న తలిర్చె నీ దశల్

లేక యొకవేళ-

ఎపుడు కాంతల కంఠమం దిరికికొనెను
విషమశరుఁ డిడ్డయుర్రిఁతాఁడు వేణునాద
మపుడె గరుపారు పులకల విపులగండ
పాళితోఁ జిక్కె సౌభాగ్య బంధనమ్ము

[నేపథ్యమున]

దేవతల పైడి ముకుటాల దీప్తులొలసి
కందె నెవ్వని శ్రీపాద కంజయుగము
మనసిజుని విరాళి వ్రజాళి మనుపు రాగ
రీతి రసికుని రారాజుఁ బ్రేమ గొలుతు

ప్రేమ: రసాలకుఁడు చిత్రఫలకముతో నిటే వచ్చుచున్నాడే!

రసా: [ప్రవేశించి] తారహారాభిరాముని నీరదోరు
నీల సౌందర్యధాముని లీలఁ గొలుతు,
వామనీకృత వక్షోజ వల్లవీని
కామ కామనీతిరసికుఁ బ్రేమఁ గొలుతు

రాధి: రసాలకుని హస్తమున నున్న యీచిత్రఫలకమే యిన్ని యనర్థకందళములకును మూలకందము.

నవ: నీవే దీని నంకురింపఁ జేసితివి. వకుళమాళిక చేతికి దీని నీవలదని ముందే చెప్పితిని గదా!

ప్రేమ: చపలతలో నది యెటనో పారవైచియుండును. యిప్పు డీ వటువు గైకొనినాడు. ఇప్పు డుపాయముచే దీనిని బుచ్చుకొను టెట్లు?

రాధి: అదియే నే నిప్పు డాలోచించుచున్నాను. ఎట్లయినను సరిగాని యిదిమాత్రము గోవింద కరసరోజ మరందరసముచే నభిషిక్తము కాగూడదు.

నవ: అది నిశ్చయమే. అనుమాన మెందుకు?

రాధి: ఫలితమునుబట్టి నిశ్చయింతము లే.

రసా: [ప్రవేశించి] శుభమగుగాక

[చిత్రఫలకమును సమర్పించును]

అందరు: [ఫలకమును జూచి]

ఏమిది! బాలచంద్రకళ
వెట్లు విరాళికి నోర్చి తప్తచిం
తామణి వేచు నిల్చితివి;
దారుణ మన్మథ తాపఘాటికిన్
మేమె చకోరకంబులటు
మించిన తొందర దొంగచాటుగా
నీమెయిఁ దారటాడెద మి
దెంతయు నచ్చెరువయ్యెఁ గోమలీ!

సఖి! ఈ మురారి పొగడ్త నిన్ను గూర్చియే.
కాదు కాదు నిన్ను గూర్చియే [కలహింతురు]

ప్రేమ: [తనలో]

అందెలు చిందు పాదయుగ
మన్నువ కౌనును పచ్చపట్టు బల్
చందిర కావి పెన్నురము
సారణధోరణి వేణువుకన్ రస
స్యంది సుధారుణోష్ఠమున
జారెడి నవ్వును బింఛచూడమున్
బొందిన నీల మేఘమును
బొందు తపం బెవ రాచరించిరో!

[తెరలో]

ప్రాలేయాంశు ముఖాభిరాముఁడును వి
స్ఫారీభవోరస్కుఁడున్
ఖేలత్కేసరి మధ్యముండు నిభరా
డ్గీర్వాణ నిర్వాపణ
శ్రీలం జెందెడువాఁ డహో! మరకత
శ్రీచుంబి దోర్దంబరుం
డా లావణ్యపయోధి రంజితుల సే
యం డెవ్వరిన్ సృష్టిలో!

ప్రేమ: [దర్శించుట నభినయించి] నల్లకలువను మాటిమాటికి హృదయమునకు హత్తుకొనుచు వకుళమాలిక సంబరముతో మురిసిపోవుచు నిటే వచ్చుచున్నదే!

వకుళ: [ప్రవేశించి]

తొలకరించెను మురళిరవళులు
పులకరించెను చేతనమ్ములు
మురళితరళిమ సరళిలో-
మధుర చుంబన కళలవలెనే
తొగరు పెదవుల నిగయు సుధలో
పులకరించెను రసికవాహిని
అలలు దేరిన కలత దీరిన
మురళితరళిమ సరళిలో-

[చూచి] ఓహో! ఈ పొగడచెట్టువైపుననే సఖులు, రసాలకుఁడు వెంట రాఁగా రాధిక అనురాగకళికను వికసింపఁ జేసికొనుచున్నది. నేనును సఖిని సంభావించెదను.

రాధి: [నమీాపించి] నఖి! ఈ యవతంసనీలోత్పలము నింతగా సంభావింతు వేమి విశేషము?

వకుల: [రాధిక చెవిఁ జేరి]

జారిపడెనే నందసూనుని
చారు కర్ణకపోలముల విడి
ఒంటిపాటున నుండ నీతో
నుత్పలోజ్జ్వల కోరక మ్మిది - - -జారిపడెనే ...
నవశమునదా నందనందన
నయన నీతి వినిర్జితమ్మై .... జారిపడెనే....

రాధి: సఖి! బ్రదికితి నీ కర్ణావతంసముచేత—

నవ: అలంకరింపఁబడిన కృష్ణునిచేతనా?

(ఆకాశమున) అహో! మురారి మురళీ!
ఆనందనాద సరళీ!!
ప్రస్తావించెడి జగముల
రాసోత్సవ నాటకమున
మునిచంద్రుల హృదయమ్ముల
ముగ్ధమోహ మొదవించెడి
అహో ! మురారి మురళీ!
ఆనందనాద సరళీ!!

అంగన: [సంతోషముతో] ఔనౌను. నిజమే [మదనావస్థను నటింతురు]

రసా: [పులకించి అంజలిబద్ధుఁడై]

ఒక్క వాఙ్మానసములకు నొదుగఁబోని
దొక్క యాకారమని లేక యొప్పుదాని
పల్లవి తరళాపాంగ పల్లవీక్ష
నైకమూర్తియౌ వస్తువు నాశ్రయింతు
నందసూనుఁడు వేణు
నాదమ్ము లాలికించె
బృందావనమునందు నెందు-
నవనందనమ్మైన
బృందావనమునందు నెందు-
కందర్ప విశిఖాళిఁ
గాండీవికుని బోలి
గోపీమనోహారి
నటనమాత్రధారియై!....నటన...

నవ: కలువల నల్లరేకుల ని
గారము నోరఁగ నవ్వు మోహము, కాం
తలకును నీవికావిదళ
నంబులు గూర్చెడి మోహవిద్య, ప్రే
మలు బలు క్రొవ్వు కొన్న పొద
మావొన నొప్పెడి నీలకాంతి, మాం
సలమధు నిర్ఝరీ దర వి
సారణఁ గ్రమ్మెడి బృంద నెల్లెడన్

రసా: ఈ లతలలో పొంచి రాసోత్సవము చూచెదను

[నిర్దేశించిన విధమున మాధవుఁడు ప్రవేశము]

మాధ: వీరందరు నాసాన్నిధ్యము చేరుచున్నారుగదా! నిమిషమాత్రము ధైర్య మవలంబించెదను.

[అంతికమున కందరు చేరుదురు]

మాధ: [రాధిక నుద్దేశించి]
కలువలోలకులును నీల లలితతరళ
చేలనమలంకృతోరువుల్ చెఱగునుండి
సగము బాహుమూలములొప్ప సొగసు చూడ
విషమ బాణుని సమ్మోహవిద్య నీవు!

[ప్రేమకళ నుద్దేశించి]
చెందొవకన్నుల యీ నఖ
స్పందించెడు నసమశరుని చాపమె! బాహులం
దందమె కనఁబడుచున్నది
సిందూరపుఁ జేరుచుక్క చిరుకళిక యనన్.

[వకుళమాల నాశ్రయించి] ఇటనే డాగి వీరిభావములఁ బరికింతును

రాధి: ఏమిది! మాధవుఁ డిచ్చటనే మఱుగుపడినాఁడే!

[అందరు పరికింతురు]

రాధి: అనిమిషనాథ మస్తక స
మగ్రకిరీట సుశేఖరత్నముల్
గొని, వ్రజకన్యకా కుచ ని
గూఢ మృగీమద సౌరభోర్మిలం
దినది, పయోధి రాజసుత
దీధితి గొన్నది, నీపమూలమం
దున నుపలభ్యమైన మణి
తోఁచియు-నయ్యయో! జారిపోయెనే

వకుళ: ప్రాణజాలము వీడి బ్రదుకలేరేసరులు
ప్రాణాధికము వీడి బ్రదికియున్నానే!
అంగుళీముఖములం దల్ల చిబుకమ్మూని
శృంగారమున నర్ధచుంబన మ్మొనరించు
వ్రజనాథలీల నాస్మృతిఁ దవిలినంతనే
ప్రాణముల్ చుంబించు ప్రతినిమేషమునందు

నవమా: [చంద్రుని జూచి]
నూతనారుణ కిరణపావక
రీతి నెనఁగెను జంద్రకరములు!
ధూమధూసర లక్ష్మవల్లీ
భూమియా శశిమండల మ్మిదె!
చండమన్మథ హోమకుండము
చంద్రమండల ముజ్జ్వలించెడి
మారకాతర గోపయువతీ
మారణోజ్జ్వల హోమకుండము!

ప్రేమ: భర్గుని కంటి మంటలకు
భగ్గురుమన్న సుమాస్త్రుదేహ మీ
మార్గము గాంచి లేడియను
మచ్చకు మాటున శీతలత్వనం
సర్గమునంది చంద్రుఁడను
చల్లని జీవసుధా తటాక వా
ర్వర్గమునందు పూర్ణతను
వై మనవైపునఁ బూలు దూసెనే!

శాధి: ఐరావణ మదగజమే
విధుబింబము గాదె చెలీ!
మదమత్తము ధుతబంధము
విధుబింబము గాదె చెలీ!....ఐరా....
మరి నీలకళంకమటే
మదధారల చారికలే!....ఐరా....

ప్రేమ: గగన మ్మొక కాసారము!
మధుశోభా సంచారము!!
వెలుగుఁజుక్కా కలువపూలు!
కలువతూడ వెలుగుజాడ!!
ఇందుబింబమా మృణాలము!
ఎటు వచ్చినదో కోలము!!
చందురులో మచ్చగాదు
నచ్చెలీ! అది సత్యమే!!

నవ: వికాసమును మధువు
స్రవించెనే విధువు!
నవమదసుహాసి నీ
రదవిలాసమనఁగా!
స్ఫురణ సేయగా నిజ
దరహాసితసితచ్ఛవీ....వికాస....
శుకకిరణ మంజరీ
పరిచయమ్మో యనఁగ,
చలితమధు రోహిణీ
మండలము పండెనన....వికాస

రాధి: ఆందోళ స్పందన్నవ
చందనదళ చేలాంచల
మందపవనుఁ డుమియు నోహో!
చిందిన యీ వెనుమంటల!!
భర్గకోపశిఖి శిఖలను
భగ్గురనిన మన్మథుఁడే
మందపవనుఁడై యీగతి
చిందెనేమొ వెనుమంటలు!!

అందరు: తాలసాల తమాల మాలతి
తరుణపల్లవ వల్లకీ
జాల తక్కోలార్జు నామ్ర వి
శాల భూజములార! వినరే!
నీలదేహుని జాడలెఱిగిన
నీడ లెఱిఁగిన దెల్పరే!
వేలపూవులఁ బూజనేతుము
విచ్చు కల్వల జాలుగా!

ప్రేమ: ఓ మురళీ! నీతపమే సఫలమ్మా!
పరులకు దుర్లభమా మా
మురరిపు జిలిబిలిపెదవుల
ముద్దులు గొను నొద్దికగన....ఓ మురళీ!

వకుళ: [సకరుణముగా నాకాశమున కంజలించి]
శాఖుంతీ సుమవంత కుంతలము పిం
ఛప్రాంచదుత్పింజర
శ్రీమంతంబును మల్లికాంచిత కళా
[illegible]

స్తోమంబౌ హసితానన మ్మొకపరిం
జూపించినం జాలునో
సామీ! సర్వమునిత్తు నీకరుణ మా
పై నింతఁ జిందింపవే!

ప్రేమ: అమిత సంతప్తహరిణాక్షు లహహా! నీదు
కంటికొనల జీవముల్ గాంచరొక్కొ!
అందుననుగూడఁ గార్పణ్య మలమికొనిన
నీ దయారస మెంతయు నిబిడమయ్యె!

నవ : విమల కరుణాంబునిధి కొసల్ బిరుసు నురుసు
లనెడు కనుగోనలం జూతువయ్య! లేద!!
కన్నులను యోగనిద్రలకైపు విడువ
లేదొకో! స్వామి! మత్పాపలేశకలన

అందరు: [నమస్కరించి]
మురళీరవ తరళీకృత
దరవికసిత పద్మవదన ధాముని కన్నా
వరనీల దేహుకన్నం
బర మెఱుఁగము మందహాసవదనుని కన్నా
స్వామీ! నిజదాసీగణ
మీ మెయి నాకులత పొంద నీక్షింపవె! ఏ
లా మనసునందు కోపము?
ఈ విధి స్త్రీవధ మొనర్ప నేమి ఫలంబో!

[తెరలో] మాధవుం జేతెంచె మందయానమ్ముతో
మధురోహఁడరుదెంచె మధుర యానమ్ముతో...
అరనిందలోచనా మకరంద నవబిందు
లోచనాంచలచకో రానంద విధుమూర్తి...
మాధ...

పరిపీత పీతాంబరము చుట్టి మదమత్త
దరహాసపారణోజ్జ్వలమూర్తి...మంద...

అందరు: మందయానము తోడ మాధవుం డరుదేర
ఫాలలోచనవహ్నిఁ గాలిపోయిన వాఁడు
పంచత్వమును వీడి పంచబాణుఁడు నేడు
అభిరూపరూపియై అరుదెంచి పనమించె
లోకోపకారియై తంటలించి పులకించె...మంద...

రండు పోదము [మాధవసామీప్యము చేరుదురు]

రసా: ఇఁక నేనును గనుపింతును [సమీపించును]

మాధ: మీ కేమి ప్రియము సేయనగ్తును?

అందరు: ఇంతకన్న ప్రియము మేమున్నది?
నవమరుదంకుర
ఖేలాందోలన
పులకితనయనము
నీ లోచనము!
మధురసుధాసర
ణాసారాంచిత
మధురవ నవకము
నీ రాగఝరి!
నటనాఘటన
మైమై చెలువందును
మధుమయకిసలయ
మై వెలుగొందును

అయినను నిదిగూడ జరుగుగాక!
హరిణము లేని చందురుని
యందము జిందెడు కాంతినిం దిర
స్కరణము సేయు వాక్పటిమ
గాంతురుగాక కవుల్, నిరం
తర రసపానసంజనిత
తన్మయ చిన్మయ సత్వ ధర్మవా
స్సరణము చేర నద్యోజని
సజ్జనకోటికి హర్షవార్నిధుల్
శుభమస్తు సర్వజగతాం, నిరంతరం
శుభమస్తు సర్వజగతామ్!
పరిపోరపి విపద మస్తు
జగదీశ్వర కపటదారు
వేషః కామం వికిరతు
కరుణాకటాక్షలహరీం నిరంతరం
శుభమస్తు సర్వజగతామ్!



[లినోకట్ చిత్రము]

“ తాటి తోపు ”

శ్రీ బంకిమ్ సర్కార్

(శాంతినికేతన్)

# రాయల ప్రకృతివర్ణన

★



శ్రీ పి. గణపతిశాస్త్రి

శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద ఆంధ్రప్రబంధాలలో అగ్రశ్రేణికి చెందినదని అభియుక్తులందరు అంగీకరిస్తారు. దీనికి అనేక కారణా లున్నాయి. దీనిలోని నాయిక గోదాదేవి మిగిలిన ప్రబంధనాయికలవలె కాక మహావిష్ణువుపై మనసుకొన్న భక్తురాలు. ఈ ప్రబంధములోని ప్రధాన భావము భక్తిగాని శృంగారము కాదు. ఇదిగాక దీనిలోని ప్రకృతివర్ణన ఇతర ప్రబంధాలలో లేని క్రొత్తదారి త్రొక్కినది. సహృదయులను ఈ ప్రకృతివర్ణన ఆకర్షించినంత హృద్యంగా మిగిలిన మరి ఏ ప్రబంధములోని ప్రకృతివర్ణన ఆకర్షించలేదు. ఇది ఈ ప్రబంధంలో ప్రప్రథమంగా పేర్కొనదగిన ఉత్తమ సుగుణము.

ప్రకృతి అంటే నేటికాలంలో బాహ్యప్రకృతి (*Nature*) అనే అర్థం వచ్చింది. దీనికి 'స్వభావము' అనే అర్థంకూడా సాంప్రదాయికంగా వస్తున్నది. ఈ స్వభావము, వివిధప్రకృతులు గల మానవుల స్వభావంగాని, పశు పక్ష్యాది ప్రాణి స్వభావంగాని, కాలికంగా నిత్యము మార్పులు చెందే వసంతాది ఋతుస్వభావంగాని, సూర్యోదయాస్తమాదుల స్వభావంగాని, ఆయా వస్తు స్వభావంగాని కావచ్చును. వీటి వర్ణనలలో రాయలు ప్రదర్శించిన ప్రత్యేక దృక్పథం ఏదో పరిశీలిద్దాము.

ఈ సందర్భంలో రాయలకు ప్రత్యేకమైన కవితాదృక్పథం ఏదైనా ఉన్నదేమో చూదాము. ఆముక్తమాల్యద పీఠికలోని ఒక పద్యాన్నిబట్టి రాయల కవితాదృక్పథం కొంతవరకు ఊహింప వచ్చును. ఆంధ్రవిష్ణువు కృష్ణరాయనితో

"పలికి తుత్ప్రేక్షోపముల జాతి పెంపెక్క
రసికు లౌనన మదాలస చరిత్ర
భావధ్వని వ్యంగ్య సేవధి గాగ జె
ప్పితివి సత్యావధూ ప్రీణనంబు"

అన్నాడు. దీనినిబట్టి కావ్య జీవ భూతము లయిన భావధ్వని వ్యంగాదులతోపాటి కవికి ఉత్ప్రేక్షోపమా జాతులపై అభిమానం ఎక్కువ అని మనం ఊహించుకోవచ్చును.

ఈ పద్యపాదానికి వేదం వెంకటరాయశాస్త్రిగారు సంజీవినీవ్యాఖ్యలో "పలికి తుత్ప్రేక్షోపములు జాతి పెంపెక్క" అనే పాఠం స్వీకరించి, ఉత్ప్రేక్షోపములు, జాతి=స్వభావోక్తి పెంపెక్క=అతిశయింపగా" అని అర్థం వ్రాశారు.

వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు బహువ్యాఖ్యలు పర్యాలోచించి రచించిన రుచివ్యాఖ్యలో "పలికి తుత్ప్రేక్షోపముల జాతి పెంపెక్క రసికు లౌనన మదాలస చరిత్ర" అనే పాఠం స్వీకరించి "ఉత్ప్రేక్షోపములచేతను, జాతి=స్వభావోక్తిచేతను, పెంపెక్కన్=అతిశయింపగా" అని అర్థం వ్రాశారు. 'జాతిన్' అని తృతీయాంతం చేసి అర్థం చెప్పినప్పుడు 'జాతిఁ బెంపెక్క' అని ఉండవలసింది మూలంలో అల్లాగ లేనప్పుడు 'జాతిన్' అని తృతీయావిభక్త్యంతంగా ఎల్లాగ విరిచి అర్థం వ్రాశారో తెలియకుండా ఉన్నది. ఈ పాఠంలో మూలంలో అచ్చుతప్పు ఏదైనా దొర్లిందేమో తెలియదు. వీరిచ్చిన పాఠంలో అచ్చుతప్పు లేనప్పుడు, 'ఉత్ప్రేక్షోపములచేత, జాతి (స్వభావోక్తి) పెంపెక్కన్' అని అర్థం చెప్పవలసిఉంటుంది. ఆముక్తమాల్యద నిశితంగా పరిశీలించినవారికి కూడా ఈ పాఠము, ఈ అర్థము మాత్రమే ఎక్కువగా సముచితంగా ఉన్నట్లు కనిపిస్తాయి. ఏది ఎల్లాగ ఉన్నా, కృష్ణరాయలకు ఉత్ప్రేక్షోపములతో మిళితమైన స్వభావోక్తిపై ఎక్కువ మక్కువ ఉన్నట్లు మనం నిశ్చయించవచ్చును.

ఈకవి రచించిన మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథా సారసంగ్రహము మొదలైన ఇతరగ్రంథాలు మనకిప్పుడు దొరకడం లేదు. అందుచేత ఆముక్తమాల్యదలోని ఈ పద్యం తప్ప రాయల కవితాదృక్పథం తెలియజేసే వేరే ఆధారాలేమీ లేవు.

ప్రకృతివర్ణన అంటే సామాన్యంగా ఉత్ప్రేక్షాతిశయోక్తి శూన్యమైన సహజప్రకృతి, మానవస్వభావవర్ణనమే అని మనం అనుకుంటాము. ఈ ప్రకృతివర్ణనం ముఖ్యంగా రెండు విధాలుగా విభాగించవచ్చును. కవి భావనామిశ్రితముకాని శుద్ధమైన సహజ ప్రకృతివర్ణనం మొదటిది. ఈవిధమైన ప్రకృతివర్ణనలో కవిభావన బాగా అంతర్లీనమై లుప్తప్రాయంగా ఉంటుంది. ప్రకృతే స్పష్టంగా భాసిస్తుంది. రెండవదానిలో ప్రకృతిని ఆలంబనంగా తీసుకుని కవి భావన అలంకారాది సహకారంతో విశృంఖలంగా విజృంభిస్తుంది. ఈవిధమైన వర్ణనలో ప్రకృతి సూత్రప్రాయంగా ఉండి, కవిభావనకు కేవలం ఆలంబనంగా భాసిస్తుంది. ఈ రెండు విధాలయిన వర్ణనలు ఆముక్తమాల్యదలో ఉన్నాయి. ఈవిధమైన వర్ణనలలో మొదటిదానికి ఆముక్తమాల్యదలోని ఈ క్రింది పద్యం ఉదాహరణగా ఇవ్వవచ్చును.

"శయ పూజాంబుజముల్ ఘటిం దడబడన్, జన్దోయి లేగొనుపై
దయ దప్పన్ బసపాడి, పొగడపుఁ బోదం బొప్పఁ జెంగల్వడి
గ్గియ నీ రచ్యుత మజ్జనార్థము కటిం గీలించి దివ్య ప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపులోఁ ద్రోవలన్"

౧ ఆశ్వా—౫౬

ఇక్కడ అచ్యుత మజ్జనార్థమై చెంగల్వడిగ్గియనీరు కొని వస్తూ, దివ్యప్రబంధము పాడుకుంటూ గృహోన్ముఖులైన స్త్రీలను అతిసహజంగా కవి చిత్రించాడు. ఇక్కడ స్వాభావికమైన ద్రావిడస్త్రీ స్వభావమే కనబడుతున్నది. అంతేగాని కవి ఉత్ప్రేక్షాదుల కిక్కడ అవకాశం ఇవ్వలేదు.

ఇలాంటి సహజమైన స్వభావవర్ణనలు ఆముక్తమాల్యదలో చాలావిరివిగా కనిపిస్తాయి. ఇంక ప్రకృతిని ఆలంబనంగా తీసుకుని కవిఉత్ప్రేక్ష ఉపయోగించిన మరి ఒక ఉదాహరణం చూదాము.

ఈ క్రిందిపద్యంలో లకుముకి పిట్టలు నూతులలో తేటాలున్న వాలి చేపలు పట్టుకుని తిరిగి పైకి ఎగరడం స్వాభావికమైన ప్రకృతి సన్నివేశము. దీన్ని కవి, గృహలక్ష్మికి ద్రావిడస్త్రీ పరిచయంవల్ల అలవడిన బంతులాటగా ఉత్ప్రేక్షించాడు.

"కలయన్ నీలమయంపు దల్లియొఱ దాకం దేటనీ రొప్ప ర
థ్యల కూపంబుల వాల జూచి, వలభీ వ్యాసంగి తుంగ్రదు శా
ఖలలో డాగి గుభాలునన్ లకుముకుల్ క్రందై పడున్, లేచు ము
చ్చిలి గేహోదిర ద్రావిడీ పరిచితిన్ జెండాడు
చందంబునన్."

1—57

ఆముక్తమాల్యదలోని 7 ఆశ్వాసాలలోను సుమారు 8 వందల పద్యాలున్నాయి. ఈ పద్యాలలో ఇంచుమించు సగంవరకు కేవలం వర్ణనాత్మకమైన పద్యాలే. ఈ సంఖ్యనుబట్టి రాయల వస్తువర్ణనాభినివేశం గ్రహింపవచ్చును. మొత్తంమీద కావ్యకథానిర్మాణశిల్పం పరిశీలిస్తే ఈ వర్ణనలవల్ల కథాశిల్పానికి లోపం వచ్చినదనే చెప్పాలి. అయినా అభినివేశం ఎక్కడా మొక్కవోకుండా రాయలు వర్ణనలు అలాగ సాగిస్తూనే ఉంటాడు.

రాయల బాహ్యాంతర ప్రకృతి పరిశీలన చాలా సునిశితమైనది. సామాన్య పరిశీలకులకు కూడా అందని మారుమూలల ప్రకృతి స్వభావ చిత్రణలో ఇతనికి మిగిలిన ప్రబంధకర్త లెవరు సరితూగజాలరని అనిపిస్తుంది. వర్షావర్ణనలో పెద్దవై పండిన అడివి పేడిపండ్లలోనికి వాననీరు ప్రవేశించింది. అంతవరకు ఆపండ్లలో ఉండిపోయిన దోమలపంక్తులు వెంటనే వరసగా పైకి వచ్చేస్తాయి. ఇది సామాన్యుల కందని పరిశీలనము. ఈ క్రింది పద్యంలోని పై వర్ణనాపై ఖరి సమగ్రంగా చూడవచ్చును:

"స్థూల పరిపక్వ కాన నోదుంబ రాగ్ర
రంధ్రముల వాననీరు సోరంగ వెడలి,
మశకపంక్తులు దావధూమంబు లడగ
రచ్చసేయంగ వెడలె విశ్రాంతి కనగ."

ఆరవ ఆశ్వాసంలో కవి బ్రహ్మరాక్షసుని వర్ణించే టప్పుడు ఇలాంటిదే మరిఒక వర్ణన కనిపిస్తుంది. "సల్ల చీమల వక్ర భల్లాతకియు బోలె నెట్టు దుప్పటి నొప్పు కట్టె నాని" దీనికి, "పల్ల చీమలన్=బాపన చీమలచేత, వక్రభల్లాతకియబోలెన్=వంకర జీడిచెట్టువలె, ఎట్టదుప్పటిన్= ఎఱ్ఱని దుప్పటిచేత, ఒప్పు=ఒప్పుచున్న, కట్టెవానిన్=నల్లని శరీరముగలవానిని" అని అర్థము. ఇక్కడ జీడిచెట్లపై ఎఱ్ఱని చీమలు విశేషంగా పాకుతూండడము కవి సామాన్యులు పరిశీలించలేని ప్రకృతిసన్నివేశము. ఆరవ ఆశ్వాసంలోని మాలదాసరి కథలో కూడా ఇలాంటిది మరిఒక వర్ణన ఉన్నది.

"కాంచె న్వైష్ణవు డర్ధయోజన జటా ఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాటచరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృత ప్రణచ్ఛలన లిప్యాపాదితా ధ్వన్యని
ష్పంచారాత్తమహోఘలోఘముఘల స్ఫాయ ద్వటక్ష్మాజమున్."

౬—౧౫

దీని తాత్పర్యం ఇది. "ఆ మాలదాసరి అలా ప్రయాణిస్తూండగా అతని కొక పెద్ద మఱ్ఱిచెట్టు కనబడింది. దాని ఊడలు అర్ధయోజనం వరకు వ్యాపించి ఉన్నాయి. వాటినుండి బయలుదేరిన శాఖోపశాఖల పత్రాలు గాలితాకిడికి చాలాదూరంవరకు ఎగిరి పోతున్నాయి. పురుగులు కొట్టివేయడంవల్ల వాటిమీద ఏర్పడిన గీరలు వ్రాతలవలె ఉన్నాయి. ఇవి "ఈ మఱ్ఱిచెట్టుపై బ్రహ్మరాక్షసు డున్నాడు రావద్దని" పాంథులను హెచ్చరిక చేస్తున్నట్లున్నాయి. చెట్టు మఱ్ఱిపళ్లు ఈ పుణ్య కార్యంవల్ల లభించిన పుణ్యఫలితాలలా ఉన్నాయి." ఈవర్ణన అంతటిలోను మన కాశ్చర్యం కలిగించేది మఱ్ఱిఆకులమీద పురుగులు కొట్టివేయగా ఏర్పడిన గీరల పరిశీలన. ఇలాంటి సునిశిత ప్రకృతిపరిశీలన కల ఘట్టాలు ఆముక్తమాల్యదలో చాలా విరివిగా కనిపిస్తాయి. ఈ కవి ఈవిధమైన సునిశిత పరిశీలనంతో నేమృగపక్ష్యాదిప్రాణిస్వభావాలుకూడా చిత్రించాడు. పక్షి స్వభావ వర్ణనకు గ్రీష్మవర్ణనలో కొంగల స్వభావ వర్ణనం ఒక ఉదాహరణంగా తీసుకోవచ్చును. నీరులేని మడుగులలో కొంగలు మొదట పెద్దపెద్ద చేపల నన్నిటినీ మింగివేశాయి. తరవాత ఎండబీటలలో కలవవేరు వెంబడిని ఏటవాలుగా ఉన్న బొమ్మిడాయలనే చేపలగుడ్లు, డాక్కాటము లనేచేదు చేపలగుడ్లు, తిని వేస్తాయి. ఈ కవి ఈ విషయం ఈ పద్యంలో అతి సహజంగా చిత్రించాడు.

"మీటగు మీలనెల్ల మును మ్రింగి, క్రమంబున నైన రొండవె
న్నీటిక వెంటదోఁచుతోఁగ వేరుబడి న్గొడుపై నెలంగగా
ద్రోటికఁ గడ్డమ్రదవయుతో నె నశించిన బొమ్మిడాయ డా
కూ్కటకులంబులం దినె బకోటకులంబు జలప్రపాదంబులన్."

౩-౫౮.

సామాన్య ప్రబంధాలలో గజాశ్వాది వర్ణనలు అతిశయోక్తి పూరితాలై అసహజంగా ఉంటాయి. రాయలు మధురాపురి వర్ణనలో సాంప్రదాయికంగా చేసే ఏనుగుల వర్ణన చేస్తాడు. కాని ఈ వర్ణన ధోరణే వేరు. దీనివల్ల ఆకాలంలోని స్వాభావిక గజస్వరూపం చక్కగా అవగతం అవుతుంది.

"ఉపరిస్థజనవారణోక్తికి జెవిఁ దార్చి
యమ్మొగంబై బయల్చిమ్మి చిమ్మి,
గవని వెన్నోలయ మిన్నవియ దట్టించుతో
త్రోవరు బందపుదాంట్ల దటిమి, దటిమి
చలువచే ద్వారవేదు లెటింగి నిల్చి, త
జ్జనజిఘృక్షుకుఁ గేలు సాచి సాచి,
డిండిమంబుల కుబ్బి గండాల్పదాన మే
లులుఁ దద్వహ జాల లువ్వి లువ్వి,
వేణు కౌతుకులకు వీడు వెడలి వెడలి,
పరపథగజధ్వనికి బోక తిరిగి తిరిగి,
దృష్టుటలు వైరులకు, బంపు కృత్యలనవ
శానుగతి జేరు వెలిఁ గరు లగ్గలికల"

౨-౧౮.

ఆముక్తమాల్యద నాలుగవ ఆశ్వాసంలోని విష్ణుచిత్తుని వాదం వినడానికి వచ్చిన విద్వాంసుల స్వభావము, వాదంలో విజేత అయినా విష్ణుచిత్తుని యెడల, రాజుమీద వారికి కలిగిన అసూయ, తిరిగి పోయేవారి మనఃస్థితి కవి అతిసహజంగా వర్ణించిన ఈ క్రింది సీసంకూడా ఈ సందర్భంలో పరిశీలింపదగినది.

"సెలవులు నాకుచు వెలియరుంగులు నూడ
కరిగి పాదూవాహు నరయువారు;
తమప్రోల నుండు నందలము గానక దాటి
పేరెలుంగిడి బెత్త జీరువారు;
నగరు వెల్వడుదాక దెగిపోయి మరి నిల్చి
తోడివిద్వాంసుల గూడువారు,
సెదురైన తమవాని గృహకృత్య మడిగి, వా
డనునవి తప్ప నూకొనెడివారు,
'వాద మేమాయె' నన్న భూవరునిపక్షు
పాత మాదాసరికి గల్గి బ్రతికె, ననెడు
వారు; 'నౌ లెం డిటు విమర్శ దూరమైన
వాకిట వసించు నెవ్వ' డన్వారు నగుచు.
కలిసి యొక కొంతసేపు శృంగాటకముల
నగరిదెస జూచుచును మంతనంబు లాడి,
చనిరి, విద్వాంసు లింక్ష్మ కజ్జనవిభుండు
రూఢి కతని మహాగజారూఢు జేసి."

ఈ విధంగా ఆయాప్రకృతుల సునిశిత స్వభావ పరిశీలనము, ప్రతి చిన్నవిషయము అతి జాగ్రత్తగా పేర్కొనడము రాయల ప్రకృతి వర్ణనలోని ప్రత్యేకత.

రాయల ప్రకృతి వర్ణనలో మరి ఒక విషయం గమనింపదగినది. సామాన్యంగా ప్రకృతి వర్ణనలో సహజ రమ్యములైన సన్నివేశాలే స్వీకరంచి, ఆ దృక్పథంతోనే ప్రకృతివర్ణనం చెయ్యడం ఒక పరిపాటి. కాళిదాస మహాకవి ఋతుసంహారంలోను, మిగిలిన కావ్యాలలోను బహుళంగా ఈ దృక్పథంతోనే ప్రకృతివర్ణనం చేశాడు. కాళిదాస కవివాస్తవిక ప్రకృతిని చిత్రించినా సహజసుందరదృశ్యాలనే స్వీకరిస్తాడు. కాని రాయలు సహజంగా అందంగా లేని సన్నివేశాలుకూడా చిత్రిస్తాడు. వెనక ఉదహరించిన మేడిపళ్లలోనుంచి వెలికివచ్చే దోమలు, పురుగులు గీరలుగా తినివేసిన మ్రిఆకులు సహజంగా అందమైనవి కావు. అయినా ఇలాంటి సన్నివేశాలు వర్ణించడంలో రాయలు వెనకంజ వెయ్యడు. కాళిదాస మహాకవితో సరిపోల్చి రాయల లోపా లెన్నడం ఈ తారతమ్య పరీక్ష ఉద్దేశం కాదు. రాయల దృక్పథ పరిశీలనమే దీని ఉద్దేశము. అయితే ఈ విధమయిన అసుందర, సూక్ష్మవర్ణనవల్ల ఒకప్పుడు కవి ఆయా కాల నాతావరణాలు ఒక్క రేఖలో గీసి చూపడానికి వీలుపడుతుంది. దీనికోసమే రాయ లీవర్ణన చేసినట్లు కనిపిస్తుంది.

రాయలు అతి సుందరమైన ప్రకృతి సన్నివేశాలతో కూడా ప్రకృతివర్ణన చెయ్యగలడు. ఈ రెండు పద్యాలు ఈ విధమయిన ప్రకృతివర్ణనకు ఉదాహరణాలు. ఈ క్రిందివి పూచిన నారికేళాలు ప్రతిఫలించిన ద్వారభూముల వర్ణన.

"క్షారకిత నారికేళ
క్ష్మాగ్రహములు గత్ర కుట్టిమంబుల దోచున్
ద్వారము లయత్నకృతకృ
గారంబుగ నలికి మ్రుగ్గ ఘటియించి రనన్". ౧-౫౫

సుకృలు రెక్కలలో ముద్దుకొని కుల్యాంతరాలలో నిద్రించే ఈ బాతువుల వర్ణన సుప్రసిద్ధమయినది. ఇది రాయల మనోహర ప్రకృతివర్ణన వైఖరికి మరి ఒక ఉదాహరణము:

"గలబక్షుచ్ఛట ముక్కు బాతువులు కేదారంపుగుల్యాంతర
స్థలి నిద్రింపగ జూచి, యారెకు లుషస్స్నాత ప్రయాతద్విజా
వళిసిండీకృతశాటుల న్నవి దదావాసంబు జేర్చంగ రే
వుల డిగ్గ న్వెస బాలు వాని గని నవ్వ న్వాలిగోపాలకుముల్."
౧-౬౫

ఇలాంటి సహజ మనోహర దృశ్యవర్ణనలు కూడా ఆముక్తమాల్యదలో విరివిగానే కనిపిస్తాయి.

అయితే ఈ ఉదాహరించిన రెండు పద్యాలలోను ప్రకృతివర్ణన అలంకారసమ్మిశ్రితమై ఉన్నది. అలంకార సమ్మిశ్రితమైనా ఈ ప్రకృతివర్ణనము సహజ మాధుర్యము సౌందర్యము కోలుపోలేదు.

రాయల ప్రకృతివర్ణనలో వాస్తవిక (*Objective*) దృక్పథం ఎక్కువ. అందుచేతనే రాయలవర్ణనవల్ల ఆకాలపు పరిస్థితులు మన కళ్లకు అతి విస్పష్టంగా కనిపిస్తాయి. ఆముక్తమాల్యదవల్ల రాయల కాలికపరిస్థితులు తెలిసినట్టుగా మరి ఏ ఇతర ప్రబంధాలవల్లా తెలియవు.

కృష్ణరాయలకు ఋతువు లన్నింటికన్నా వర్షాకాలం అంటే ఎక్కువప్రీతి అని తోస్తుంది. ఈ కవి ఈ వర్ణనలలో వ్రాసిన పద్యాలు మరి ఏ ఋతువర్ణనలోను లేవు. ఈ కావ్యంలోని ఋతువర్ణన లన్నింటిలోను ఇవే ఎక్కువ హృద్యమైనదనికూడా చెప్పవచ్చును.

సహజమైన ప్రకృతిస్వభావ పరిశీలనం లేకుండా కేవలము ఉత్ప్రేక్షాతిశయోక్తులతో అసహజంగాను, విశృంఖలంగాను వర్ణ

నలు కల్పించడం మన ప్రబంధాలలో కనిపిస్తుంది. ఇది ఇజీవలి కాలపు సామాన్య ప్రబంధ రచయితలలోనే కాక ఉత్తమ ప్రబంధ రచయితలలోకూడా ఉన్నది. రాయల ప్రకృతివర్ణనలలో ఇతరుల నెవ్వరినీ అనుకరించ లేదు. ఆ కాలంలో అందరిలోను సర్వసామాన్యంగా కనిపించే ఉత్ప్రేక్షాది మిశ్రితమైన ప్రకృతి వర్ణనలలోకూడా ఈయన అతి నూతన కల్పనలు సంతరించుకున్నాడు. అయితే ఈ కల్పనలు కొన్నిచోట్ల చాలా అతిశయోక్తి పూరితంగాను, అసహజంగాను కనిపిస్తాయి. ఈ క్రింది రెండు పద్యాలు ఈ విధమైన అతిశయోక్తిపూరితమైన అసహజ వర్ణనలకు ఉదాహరణాలు. దీనిలో మొదటి పద్యానికి సర్పాలు భూమి ఆక్రమించడానికి నాగలోకాన్నించి మధురానగరి అగడ్త నీటినుండి పైకి వచ్చాయనీ, అయితే ఆ అగడ్తలలో అంతటా పొదగబడిన గరుడపచ్చలకు భయపడి వెంటనే అవి మునిగిపోతున్నాయనీ తాత్పర్యము. ఇది ఆ కాలంలో అలవాటయిన వర్ణనాపద్ధతే. ఇది కేవలం అత్యుక్తి పూరితము. ఈ పద్యం ఇక్కడ పూర్తిగా ఉదాహరిస్తున్నాను.

"క్షుద్రవేయులు భూమియు గైకొనంగ
నురగలోకంబు వెడలి తత్పరిఖనీట
నెగసితోడనె క్రుంకుదు ర్నిలువలేక
తత్తటాబద్ధగారుత్మతముల కులికి". 2—7

దీని తరవాతి పద్యంకూడా ఈ జాతిలో చేర్చదగినదే.

"తరుణశైవాలజలజపత్రములు వొదుప
మరకతచ్ఛాయ బొల్చు దత్పరిఖజలము
కోట బంగరుసేయుట కొరకు మున్ను
బ్రహ్మ పిడిచిన మందాకు పస రనంగ." 2—8

ఇలాంటి వర్ణనలు సావకాశంగా ఒకచోట కూర్చుని చేసే గడ్డు సమస్యా పూరణాలవంటివి. బహుశః ఆ కాలంలో ఇటువంటి వర్ణనలపై ఆదరం ఎక్కువగా ఉండిఉండవచ్చును. ఆముక్తమాల్యదలో రాయలు స్వాభావికమైన ప్రకృతి వర్ణన లెన్నో సంతరించుకుంటాడు. అయినా తాత్కాలికమైన సంప్రదాయానికి తలఒగ్గి ఇలాంటి కృతక వర్ణనలు చేసి ఉండవచ్చును.

## మానవ ప్రకృతి వర్ణన

మానవ ప్రకృతి వర్ణనలో కూడా రాయలు నూతన పంథాయే అవలంబించాడు. ఈయన మానవస్వభావ వర్ణనపద్ధతి పరిశీలించిన వారికి రాయలీ విషయంలో అవలంబించిన అతినూతన వైఖరీ, దానితోబాటు ఈయన అవలంబించిన కేవల సాంప్రదాయిక పద్ధతీ కూడా గోచరిస్తాయి. ఇంచుమించు వర్ణనలలో అన్నింటిలోను రాయలు అవలంబించిన ఈ ద్వివిధవైఖరి గోచరిస్తూనే ఉంటుంది.

రాయలు శ్రీ విలిబుత్తూరి వర్ణనలో స్వభావోక్తి ఎక్కువగా వాడి ఆ నగర సౌందర్యం సహజంగా మన కన్నుల ఎదుట చిత్రించాడు. మళ్ళీ మధురానగరవర్ణనలో ఇంతగా స్వభావోక్తి ప్రదర్శించలేదు. మధురానగర వర్ణన ఎక్కువగా ఉత్ప్రేక్షాతిశయోక్తి ప్రాయమైన సాంప్రదాయిక మార్గాలోనే నడిచిపోతుంది.

మానవ స్వభావోక్తి వర్ణనలో రాయలు ఎక్కువగా ప్రకృతిసిద్ధమైన సహజ స్వభావానికే ప్రాముఖ్యం ఇచ్చాడు.

ఆముక్తమాల్యదలో ప్రప్రథమంగా మనహృదయం ఆకర్షించే వ్యక్తి విష్ణుచిత్తుడు. ఆముక్తమాల్యదకు విష్ణుచిత్తీయ మనే పేరు చిరకాలంనించి సాంప్రదాయికంగా వినవస్తూంది. లాక్షణికులు కొందరు ఈపేరుతోనే ఆముక్తమాల్యదలోని పద్యా లుదాహరించారు. రాయ లెక్కడా తనకావ్యంలో ఈపేరు వాడలేదు. అయినా పండితలోకంలోను, లాక్షణికులలోను ఈపేరు వ్యాపించడంవల్ల ఈగ్రంథం విష్ణుచిత్తప్రధానమైనదిగా వారు భావించినట్లు కనబడుతుంది.

## విష్ణుచిత్తుడు

ఇతడు అమాయికుడు: వట్టి ఛాందసుడు. కేవలం ఛాందసుడై నిత్యపూజోపచారాదులచే సేవించే భక్తుని సాంప్రదాయిక భక్తి చిత్రించడానికై రాయ లితనిని ఉద్దేశించి ఉండవచ్చును. మొదట స్వామి పాండ్యరాజసభకు వెళ్ళి వైష్ణవ మత ప్రఖ్యాపనం చెయ్యవలసిందని ఇతనిని ఆదేశించినపుడు ఇతడు చెప్పినమాటలు ఇతనిలోని అమాయకత్వం అతిసహజంగా స్ఫురింపజేస్తాయి. ఇతనికి ధైర్యం కలిగించడానికే మొదట స్వామి ఇతన్ని "మహామతీ!" అని సంబోధించినట్టు కనబడుతుంది.

"నేను మహామతీ! మధుర
నీవు రయంబున జొచ్చి యందు బాం
డ్యుని దివాణము స్మెరయ నించిన
ప్రేలెడు దుర్మదాంధులన్
బోడిమి మాన్పి, మన్మహిమమున్
బ్రకటించి హరింపు శుల్క, మున్
వాడును రోసినా డిహము వైష్ణవుగా
నొనరింపు సత్కృపన్" 2—88

ఈ ఆజ్ఞ విని వడవడవడుతూ విష్ణుచిత్తు డన్నమాటలు వరహేళ మాటలు. ఇవి అతని అమాయికభక్తికీ, సంతృప్తభావానికీ తార్కాణాలు—

స్వామీ ! నన్ను నితఃపురాపఠితశాస్త్రగ్రంథ జాత్యంధు, నా
రామత్సొంఖనన క్రియాఖరఖనిత్రగ్రాహి తోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు న్భవద్భవనదాసు న్వాదిగా బంపుచో
భూమీభృత్సభ నోట మైననయశంబుల్ మీకు రాకుండునే !" 2—90

"గృహ సమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాజపత్ర ధృతియో, దా—ద్దీపికారోపమో
స్పృహరీ! వాదము లేల! లేరె యితరుల్ శ్రీలీలకుం బాత్రముల్." 2—91

ఇది కేవలం భయభక్తులతో కూడిన వినయం అని అనుకున్నా అనుకోవచ్చును. కాని తన కుమార్తె విరహవేదనతో బాధ పడుతున్నపుడు ఇతడా గోదవేమీ తెలియక విష్ణువుతో అతి అమాయికంగా ఆ విషయం విన్నవించుకుంటాడు. అప్పుడు అతని ఛాందసానికి చిరునవ్వునవ్వి విష్ణువు గోదాదేవిని శ్రీరంగానికి తీసుకు

రావలసినదని చెబుతాడు. గ్రంథం చివర ఆముక్తమాల్యద అంతస్థితి అయినప్పుడు ఇతడు చేసిన గందరగోళము, చెప్పినమాటలు మరింతగా ఇతని స్వభావాభివ్యక్తికి తోడ్పడుతున్నాయి. అప్పుడు విష్ణువు ఇతన్ని "ముది మది దప్పితోటు ముని ముఖ్య!" అని మందలించి "గోదాదేవి మీయింట్లోనే ఉండవచ్చును. మళ్లీ జాగ్రత్తగా వెతకవలసిం"దని ఆదేశిస్తాడు. విష్ణుచిత్తుడు తన కన్యను విష్ణుమూర్తి కిచ్చి వివాహం చేసేటప్పుడు విష్ణువు స్వయంగా తన యింటికి తరలిరావాలని పట్టుపట్టి ఆయన తన గృహానికి తరలివచ్చేటట్టు చేస్తాడు. ఇతడు తన స్వామిపై చూపించేది కేవలం పరిచితుడైన ప్రభువుదగ్గర భృత్యుడు చూపించే సేవ్యసేవకభావమే కాని అంతకంటె భిన్నంగా కనబడదు. రాయల ఆముక్తమాల్యదలోని వ్యక్తులలోనే విష్ణుచిత్తుడు అమాయికతా మిళితమైన సహజ మాధుర్యంతో దిద్దితీర్చిన మనోహరవ్యక్తి.

## చండాల బ్రహ్మరాక్షసులు

ఆముక్తమాల్యదలో విష్ణుచిత్తుని తరువాత పేర్కొనదగిన పాత్ర చండాల బ్రహ్మరక్షస్సు వాదంలోని మాలదాసరి. బ్రహ్మరాక్షసుని పాత్రనిర్వహణలో కూడా కవి ప్రత్యేకశ్రద్ధ ప్రదర్శించాడు కాని అతడు మాలదాసరి పక్కన నిలబెట్టవలసినవాడే. మాలదాసరి—

"జాత్యుచిత చరిత్రమ మ
త్ప్రీత్యర్థంబూని, తనదు హృదయము శుచితా
నిత్యంబుగ దత్తను సాం
గత్యము మసిపాత మానికంబై యొదుగన్" 6—5

'మసిపాత మానికంబై యొదుగన్' అనే మాటలోనే కవి ఈతని బహిరంత స్స్వభావాలు రెండు మన కన్నులకు కట్టేటట్టు చేశాడు. అంతటితో ఊరుకోక ఈ క్రింది పద్యంలో నిశితంగా అతని రూపు మన కళ్ళ ఎదుట సాక్షాత్కరింప చేస్తాడు.

"చమురైన తోల్కుబుసంబు టెంకియును, ని
త్తడి శంఖ చక్ర కుండలము లమర
దివెదారి కొమ్ము దోల్తిత్తియు జోడుమ్మ
మెడమీది మొగలాకు గొడుగు దనర,
మత్పాదరక్షయు, మావు వెన్నెలకగ
ట్టిన యోటి తిపిరిదం డెయును మెరయ,
జిటిదాళములు సంకపుటిక నొక్కొకమాటు,
గతిరయంబున దాకి కలసి మెఱయ,
వలుద వనమాలకంఠియు, మలిన తనువు
బట్టితిరుమన్ను బెదరుగొంబుట్టు జూపు
బసుపుకొట్టితోలు పల్లంబు సెసక మెసగ
వచ్చు సేవింప నరియాళు వైష్ణవుండు" 6—6

బ్రహ్మరాక్షసునిది భీతిజనకమైన అపూర్వ చిత్రణము. అయినా దీనిలో జీవం సన్నగిలలేదు.

రాయల మానవస్వభావ చిత్రణం ఎక్కువగా వర్ణనాత్మకమైనది. పాత్రల చర్యలతోగాని, మాటలతోగాని స్వభావాలను వ్యంగ్యంగా సూచించేపద్ధతిని ఈయన అంతగా అవలంబించలేదు. అందుచేత ఈ చిత్రణాలు కూడా వర్ణనాత్మకం (*Descriptive*) గానే ఉంటాయి. ఈ వర్ణనాత్మకమైన ఫణితిలోనే రాయలు అతి సూక్ష్మంగాను, తేలికగాను తన చిత్రణం ముగించివెయ్యగలడు. ఈ సూక్ష్మమైన వర్ణనపద్ధతిలోనే ఇతడు పాండ్య రాజు స్వభావము, అతని పరిపాలనలో బ్రాహ్మణులు అతని శైవస్వభావాను గుణంగా ప్రవర్తించినవిధము వర్ణించివేస్తాడు. విష్ణువు లక్ష్మీదేవితో ఇతని శైవ స్వభావం వర్ణిస్తూ చెప్పినమాటలు ఇతని సంగ్రహవర్ణన పద్ధతి నిరూపిస్తాయి.

"వెఱ్ఱిశైవంబు ముదిరి మద్వినుతి వినడు
నతి యొనర్పడు మామక ప్రతిమలకును
హరుడె పరతత్త్వ మను మదీయాలయముల
నుత్సవంబుల నులుకు; నెయ్యురును నట్ల!" 4—12

ఇంతేగాదు ఈ రాజు శైవాభిమానియై శైవులేమి చేసినా వారిని ఏమీ అనక తాను చేసినది సమర్థించేవారికే అగ్రహారాలిస్తాడు.

"శివలింగము దాల్చిన జన
నివహము లేమైన జేయ నిది పాపము దా
నవు గాదన డా సమయము
నవునను విప్రులక యగ్రహారము లిచ్చున్." 4—44

అప్పుడు ఆరాజు ఇచ్చకంకోసం ప్రవర్తించే బ్రాహ్మణుల మాయా నటనం కూడా రాయల నిశితదృష్టి దాటి పోలేక పోయింది!

"అప్పు డిచ్చకు లగు బ్రాహ్మణౌఘు మెల్ల
నాత్మ జనిభూమి విడువలే కలికభూతి
గడ్డముల నావ రుదురాక లిడ్డ సంది
స్నాతసంహిత లిరికించి చొరదొడగిరి." 4—41

ఇంతేగాదు; శైవ పక్షపాతిఅయిన ఈ రాజు జంగాలు రహస్యంగా గంజాయి మద్యం సేవించినా వారిసంగతులు బైటపెట్టేవాడుకాడట! మరి మిగిలిన బ్రాహ్మణులేమైనా కొంచెం పొరబాటుచేస్తే వారి తప్పులు గోరంతలు కొండంతలు చేసి హేళనచేసేవాడట!

"శిలను బట్టియు గంజా
హాల లుపాంశుల భజించు వ్రతుల బైటం
జాలను వైవన్; విప్ర
స్థాలిత్యము బైటవేసి కనుగిలుపు సభన్." 4—47

ఇంతేగాదు, ఇతడు యామునాచార్యుడు వైష్ణవమత ప్రఖ్యాపనకై వాదం ఏర్పాటు చేయించనున్నప్పుడు ఆ వైష్ణవ బ్రహ్మచారితో "నీవు వాదంలో ఓడిపోతే మెట్టో అన్నా విడువకుండా బలవంతంగా నీ మెడలో లింగం కట్టించకుండా విడిచిపెట్ట" నంటాడు.

"సంగతియో యోయి! ఇసుమంత టింగణావు!
తత్త్వ నిర్ణయవాదంబు తరమె నీకు!

నోడిశేనియు బట్టి మెట్టోయనంగ
లింగమును గట్టుకుడువు మెఱింగి నోడువు!"  4—60

కాని ఇతడు వైష్ణవ పక్షంపాతంగల భార్యయెడల చూపించిన సహనము, ఆదరము కవి అతిమనోహరంగా ధ్వనింపచేస్తాడు. రాయలు లేఖినితో స్పృశించినవిష్ణుచిత్తుడు, మాలదాసరి, బ్రహ్మరాక్షసుడు, యామునాచార్యుడు సజీవులై మనకు కళ్లఎదుట నిలుస్తారు. వాస్తవికమైన వర్ణనాపద్ధతిలోనే పాత్రల స్వభావ పోషణ కుపక్రమించినా, సంగ్రహావర్ణనతోనే వారిని మన కన్నులకు కట్టగలిగిన మహామహిత శక్తి ఈ కవిచక్రవర్తి లేఖినిలో నాట్యం చేసింది.

## పాండ్యరాజు భార్య

ఈశక్తి ఈపాండ్యరాజు భార్య చిత్రణంలో పరాకాష్ఠ పొందింది. ఈమెనుగూర్చి కవిచెప్పిన పద్యాలు మొత్తం మూడు. అందులో ఒకటి కందము, మరిఒకటి గీతము, ఇంకొకటి సీసము. ఈ వర్ణనతోనే ఆమె మూర్తి అజరామరమై ఆంధ్రవాఙ్మయంలో నిలిచింది! ఈమె వైష్ణవభక్తురాలు. తన భర్తకు వైష్ణవాభిమానం లేకపోవడం ఆమెకు దుర్వారవ్యథ కలిగిస్తుంది. ఆమె తనవైష్ణవ పూజాదికాలు యథావిధిగానే నిర్వర్తిస్తూ పతిభక్తితో మెలగుతూ ఉంటుంది. తన పతి పజ్జకు వెళ్ళినప్పుడు నిలువుబొట్టు మార్చి విభూతి చుక్కమాదిరిగా కర్పూరపుబొట్టు పెట్టుకొంటుంది! ఈమెస్వభావం వర్ణించే ఈ ఆముక్తమాల్యదపద్యం సంగ్రహ స్వభావ వర్ణనలో ఈప్రబంధాని కంతటికీ మకుటప్రాయమైనది!

"వింగడం బైనట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు బెట్టుదాన;
దశమినా డేకభుక్తము జేసి యవలినా
డోర్చి, జాగరముతో నుండు నిద్రు;
బారవి పోనీదు; పైనిద్ర బాలు ట
క్కులు బాడు మత్పుణ్యకథలఁ ద్రోయు;
సేమంపు మూఁబాళ్లు గామింప దధినాథు
మఱునాడు కన్నును మనసు పనియు
నారజపు వన్నె బతిసెజ్జ పురుగు గూర్మి
నరుగుచో శాఖ దుడిచి కప్పురపు శాఖ
బెట్టు, నిట్టులు మద్భక్తి పుట్టియును, ని
జేశు నెడభక్తిచెడదు మదిష్టమగుట!

ఇక మిగిలినది ఆముక్తమాల్యద అని కవి పేరుపెట్టిన గోదాదేవి స్వభావ చిత్రణము. ఈ కవి స్వభావపోషణ పద్ధతి చిత్రణ పద్ధతి (*Descriptive*) అని ఇంతకు పూర్వం అనుకున్నాము. ఆ దృష్టితోనే ఈకవి ఈమె వర్ణనకై సుమారు 30 పద్యాలు రచించాడు. అయినా ఈమెలో జీవచైతన్యం రాలేదు. ఈ వర్ణనం అంతా సామాన్య ప్రబంధాలలో మాదిరిగా కేవలం ఉత్ప్రేక్షాతిశయోక్తులతోనే నడిచిపోతుంది. ఈకారణంచేతనే గాబోలు కవి దీని చివర గోదాదేవి వర్ణన పరమైన ఒక సీసపద్యంలో ఈమెకు కొంతవరకు ప్రాణప్రతిష్ఠ చెయ్యగలిగాడు. ఈపద్యమువల్లనే ఈమె ఈప్రబంధంలో ఉన్నదని మనం స్మరిస్తాము. ఆ పద్యం ఇది:—

"తను తండ్రి శ్రీదత్త శ్రీలు గృహమున
ద్రవ్వి తండములయ్యు దనదు తొంటి
పరిగ్వినిర్మాణ దాస్యంబను స్నేకత
జరపుచు బ్రజ్ఞ వైష్ణవపురాణ
సంహితా వ్యాఖ్యా రచన బ్రొద్దు గడపుచు
గట్టెడు కమ్మచెంగలువ విరుల
తోమాలె లలకలు దువ్వి కంతునకు నా
ర్ధ్రి నిబద్ధ ఖేటకం బనగ, నీల
వృష కకుద్రేఖ నెఱమ కొక్కింతి రొయిఱగ
నిడిన ధమ్మిల్ల వలయంబు నడుగనందు
గొంతసే పర్థి గీలించి కూపవారి
నీడ వీక్షించి క్రమ్మర గూపెనునుచు.  5—38

ఈపద్యం తరవాత ఈమె సామాన్య ప్రబంధ విరహిణుల మార్గంలోనే మారి ఆయా అవతారాల్లో స్త్రీలను హింసపెట్టిన గాథలు ఉజ్జగిస్తూ ఉపాలంభనం ప్రారంభిస్తుంది. ఇక్కడ ఈమె మిగిలిన ప్రబంధ నాయికలలాగ చంద్రమన్మథాద్యుపాలం భనాలు ప్రారంభించకపోవడం కొంతమెరుగే!

ఈ ఉపాలంభలలో ఒక చోట ఈమె ముగ్ధ నాయికా సహజమైన ఔచిత్యం పాటించకపోవడం పాఠకులకు కటువుగా ఉంటుంది. ఇది రామ బలరామావతారాలలో విష్ణువు చేసిన స్త్రీహింసోపాలంభన పరమైన పద్యము. ఇక్కడ ముగ్ధ, తత్రాపి భక్తురాలు అయిన గోదాదేవి బలరాముని నిందిస్తూ "ముసలిక్ బెడ నిట్టతాడునం టతివ రమింపె డా ముసలియయ్యు" అనడం కేవలం అనుచితం, ఈ పద్యం ఇక్కడ పూర్తిగా ఉదాహరిస్తే పాఠకులే ఈ విషయం నిర్ణయించుకోగల రనుకుంటున్నాను.

"హాతల నొనర్చె మోహితల
నల్ల యయోముఖి నా పులస్త్యభూ
సుతను విరూప జేట ననుచో—
ముసలక్ బెడ నిట్టతాడు నం
టతివ రమింపె డా ముసలి యయ్యు
రహిన్ మఱుగుజ్జు ప్రేష్యకై
ధృతి నెడి యుగ్రసేనునకు
బ్రేమ్యత నొందియు దిద్ది యేలడే!"  5—58

అయితే ఈమెలో ప్రబంధనాయికలలో ఎవరిలోను లేని ఒక ప్రత్యేకత కూడా ఉన్నది. ఇతర ప్రబంధనాయికలు సామాన్యనరులపై కలిగిన మోహభావంచేత మైమరచినవారు. ఈమె సాక్షాత్తు మహావిష్ణువునే వరించింది. ఈవిధమైన నాయిక మరి ఇతర ప్రబంధాలలో ప్రత్యక్షం కాదు.

అయితే మిగిలిన ఈమె విరహావస్థాదికాలలో కవి ఏమీ ప్రత్యేకత చూపలేదు; ఈమె అంతర్ధానం పొందినప్పుడు కూడా మనకు పరమేశ్వరుని పరిహాసప్రియత్వము, ఆ సందర్భంలో

తండ్రి విష్ణుచిత్తునిలో ఉదయించిన ఆరాటము తద్వారా అతనిలో కలిగిన అమాయికత్వము మాత్రమే గోచరిస్తాయి. ఈమె అంతర్ధానం చెందినప్పుడు తండ్రికోసము చెలికత్తెలకోసము ఆరాటపడడమైనా కనబడదు. మరి ఈమె ఉపాస్యదైవము మహావిష్ణువు ప్రబంధంలో ఎక్కడ ప్రత్యక్షమైనా చిరునవ్వుతో గోచరిస్తాడు. ఆముక్తమాల్యదకంటె అనుసరలోనే మనకు జీవచైతన్యం గోచరిస్తుంది. చివరకు బ్రహ్మరాక్షసుకూడా ఈమెకంటె సజీవవ్యక్తిలాగే కనిపిస్తాడు. ఈ ప్రబంధంలోని గోదాదేవి, ప్రబంధంలోని మిగిలిన అందరి వ్యక్తులకంటె తక్కువ చైతన్యంతో స్ఫురిస్తుంది. దీనికి ఆమె భూదేవి అపరావతారమై ఉండడం ఒక కారణమేమో! ఏది ఎల్లాగ ఉన్నా అనుక్తమాల్యదా చిత్రణంలో రాయలు కేవలం సాంప్రదాయిక పద్ధతినే అవలంబించిన విషయం సుస్పష్టమే!

రాజనీతి ఉపదేశంలో కూడా రాయలు స్వతంత్ర పద్ధతి అవలంబించాడు. మిగిన కావ్యాలలోలాగ కాక దీనిలో అనుభూతనిశితమైన రాజనీతి కనిపిస్తుంది. ఇవన్ని రాయల వ్యక్తిగతమైన రాజకీయ దృక్పథాలై ఉండవచ్చును. అన్ని విధాలయిన చరాచర ప్రకృతివర్ణనలోను రాయలు నిశిత స్వాభావికదృష్టి అవలంబించి, "మిగిలినప్రబంధరచయితలకంటె ఈవిషయంలో ఈయనదే కొంచెం పైచేయి"అనిపించుకుంటాడు. కేవలం సాంప్రదాయిక దృక్పథంలో రచించిన వర్ణనలలోను, కల్పనలలోనుకూడా ఈయన మిగిలిన వారి కెవ్వరికి తీసిపోడు. వాస్తవిక దృక్పథం అవలంబించిన కవి కావటంవల్ల చివరికి ప్రతి ఆశ్వాసాంతంలోను కూడా "ఈప్రబంధం నేను రచించినదే" అని అర్థం వచ్చే ఉదాత్తవృత్తాలు రచించుకొన్నాడు! ఈపద్యాలలో పటిష్ఠమయిన ఆయన శేముషీ కరవాలపాటవం మన కొక మెరుపులా మెరుస్తుంది! వాస్తవిక దృక్పథంతో ప్రకృతి స్వభావము, మానవస్వభావము పరిశీలించిన మహారాజకవి కాబట్టి తన కర్తృత్వం విషయంలో అనుమానాలేవి కలగకుండా ఈపద్యాలు రచించుకొని ఉండవచ్చునేమో! నిశిత కరవాలాల వంటి ఈఆశ్వాసాంత పద్యాలలో ఒక పద్యం ఇక్కడ ఉదాహరించడం అనుచితం కాదనుకుంటాను!

"ఇది సింహాచల దంభకేసరి పదా
  భీష్టార్చనా పుణ్య ల
బ్ధ దురుట్టంకణ పొట్నూరి విజయ
  స్తంభోప లోట్టంకి తాం
క దృఢాష్టాక్షర కృష్ణరాయ ధరణీ
  కాంతా స్మ దాముక్త మా
ల్యద నాశ్వాస వరంబు వాఙవధిహృద్యం
  బై మహిం బొల్పుసన్."

ఇలాగ ఈకవి అన్ని ఆశ్వాసాంతాలలోను ఘోషించినా అదేమి దురదృష్టమో గాని ఆముక్తమాల్యద రాయలు వ్రాయలేదనీ, పెద్దనామాత్యుడేఈప్రబంధం రచించాడనీ ఆంధ్రవాఙ్మయరంగంలో అపూర్వమైన వాదధూళి రేగింది! కాని కవితా తత్త్వజ్ఞుల కీకర్తృత్వ నిర్ణయంలో అనుమానమే ఉదయించదని అనుకుంటాను.



"మరమ్మతు"

[ఎచ్చింగు]

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

<u>కథానిక:</u>

# నీలి దువ్వెన



శ్రీ బి. హెచ్. కృష్ణమూర్తి

వాచ్ చూసుకున్నాడు భాను. రెండున్నరయింది. నాగమణి అంటున్నది. పావురంలా మెడ ఒక పక్కకు వంచి, సూదిలో దారం ఎక్కిస్తూ "అవతలి గదిలో ఉన్నాయన ఇందాకంటున్నాడు ఆవిడతో, 'మొగుడు పెళ్ళాలంటే అలా ఉండాలి, ఒకళ్ళను చూసైనా నేర్చుకోం మనం' అని, మన నుద్దేశించేను. నవ్వొచ్చింది. మనన్నిలా అనుకుంటున్నందుకు, వాళ్ళొచ్చిన రెండు రోజులై చూస్తున్నాను, ఎందుకో అస్తమానం కీచులాడుకుంటూనే......"

ఇంకా ఆమె ఏవో చెప్తున్నది కాని వర్తమానంలో పయనిస్తున్న అతని మనస్సు ప్రవాహ మధ్యంలో ఏవో అడ్డు తగిలి ఆగిపోయిన రెమ్మలా అయిపోయింది.

మొగుడూ పెళ్లాలు! ఈ నాలుగు రోజుల్లో ఎంత చక్కగా అమరిపోయింది నాగమణి యీ రకపు జీవితానికి! అతి నిపుణంగా, తలగడా గలీబుమీద లతలూ పూలూ కుట్టడంలో, కదలుతూన్న ఆమె వేళ్లమీద నిలిచా యతని చూపులు. ఈ ఎంబ్రాయిడరీ సరంజామా నిన్ననే కొని తెచ్చాడు తాను. అప్పుడే ఎన్ని డిజైన్లు కుట్టింది!

గదంతా కలయజూశాడు. ప్రశాంతమైన సాంసారిక వాతావరణం ఎంతగా అలముకుంది యీ హోటలు గదిని! నాగమణి—ఎంత చక్కని పేరు!

లాభం లేదు.

జేబు తడిమి చూసుకున్నాడు, మెరమెర లాడుతూ తగిలింది కాగితం వేళ్లకు. నాలుగు పంక్తులే రాసినది తానా ఉత్తరంలో—కాని అరగంట పైగా పట్టింది అది రాయడానికి. పేపరు కొనుక్కొని వస్తా నని వెళ్లిన వాడింత ఆలస్య మెందుకు చేస్తున్నాడా అని ఆమె ఆశ్చర్యపడి ఉండవచ్చు. ఎంత అదుర్దాగా తన రాకకోస మెదురు చూస్తుండేది! కిటికీ ఊచ నొక చేతితో వదులుగా పట్టుకొని రోడ్డువైపే చూస్తున్న ఆమె కళ్లనుండి ఎక్కడో దూరాని కెగిరిపోతున్న ట్లున్నాయి ఏవో తలపులు ఈవేళకూడా.

మళ్లీ ఆమెమీద నిశ్చలంగా నిలిచా యతని చూపులు. పువ్వు కుట్టడం పూర్తయిపోయింది. ప్రక్కను నిన్న తాను పెన్సిలుతో రాసిన మొగ్గ ముడుచుకొని ఉన్న రేకులమీద లేతగులాబీ దారంతో ముద్దముద్దు కుడుతూన్న దామె. చంటిపిల్లవాడికి పాలిస్తున్న ఒక స్త్రీమూర్తి మెరసిం దతని మనోవీథిలో, లేనవ్వుతో కదలుతున్నా యా పెదవులు; "నీకొడుకే!"

ఊహాప్రపంచంనుండి బలవంతాన మనసు మళ్లించుకుని ఆమె మాటలమీద నిలిపాడు.

ఆమె తల పైకెత్తి తన కళ్లలోనికి తిన్నగా చూస్తూ అంది: "ఈవాళేగదూ వెళ్లిపోవడం? ఈ నాలుగురోజులూ మందే అనుకున్న యీ గదిని వదిలేసి......" కొద్దిగా సెంటిమెంటల్‌గా అయి మాట్లాడుతున్న ఆమె పెదవులమీద చిన్న చిరునవ్వు కదలాడుతూ ఉంది. ఆ నవ్వు బరువుగా ఉన్నట్లుండడం తన ఊహేనేమో!

భాను అన్నాడు నవ్వుతూ, "గదిలో ఏముంది?"

ప్రవాహంలో ప్రయాణం మొదలుపెట్టిన రెమ్మ మళ్లీ ఏదో అడ్డు తగిలి అక్కడే కొట్టుకోవడం మొదలుపెట్టింది.

పై దేశంలో ఈ గదీ, ఈ మనిషీ, నాలుగు రోజుల్లో ఎంత సన్నిహిత మయ్యాయి తనకు!

నాలుగు రోజుల క్రిందట—

భువనేశ్వరం స్టేషన్లో రైలాగింది. అంత వరకూ మోకాళ్లతో తనను పొడుస్తూన్న ముసుగులోని యువతి దిగి వెళ్లిపోయింది తన భర్తతో, విశాలంగా కూర్చోవచ్చుగదా అనుకుంటుండగానే మరో ముగ్గురు వచ్చి ఆ జాగాలో కూర్చున్నారు. దైనందిన జీవితంలో పాటించవలసిన ఆర్థిక సూత్రాలను తనకు బోధపరిచి ఒప్పించి థర్డ్‌క్లాస్ టికెట్లు కొనిపించిన నారాయణమీద ఎక్కడలేని కోపం వచ్చింది.

ప్రక్కనే కూర్చొనిఉన్న నారాయణ తన అంతులేని మాటలధోరణి ఉన్నట్టుగా మార్చి నెమ్మదిగా అన్నాడు: "చూడు భానూ— నేను చెప్పానుగదూ వెయ్యి మందిలో ఉన్నా తెలుగు మొహం ఇట్టే పట్టెయ్యొచ్చు. అదిగో, అవతల, ఆ చివర చిన్న బెంచీమీద మూడో మనిషి. పందెమేసి చెప్తా నబ్బాయి, ఆ మనిషి మన తెలుగుదే!"

తనదృష్టి అవైపు పోనిచ్చాడు భాను. మాసిపోయిన ఆకుపచ్చరంగు చీరా, తెల్లబ్లౌజూ, జడవేసుకోకుండా ముడుచుకొన్న ఒత్తైన జుట్టూ, చామనచాయగా ఉన్నా ఆకర్షణీయంగా ఉన్న

యువతి—తరువాత తెలిసింది ఆమె వయ సిరవైరెండేళ్లని, అప్పటికు మటుకింకా చిన్నదిలాగే కనిపించింది తన కళ్లకు—చేతిలోని నీలంగాఉన్న ఏదో వస్తువుమీద గోళ్లతో గాస్తున్నది.

నారాయణంటున్నాడు: "అరే, మ రెవరూ లేరే ఆ చుట్టుపక్కల తెలుసువాళ్లు! ఒక్కరితే ఎక్కడికి చెప్మా వెళ్తున్నది, ఎవరోగాని?"

ఆమాట నిజమేలా ఉంది. ఆ చుట్టుపక్కల మనుష్యులకూ ఆమెకూ సంబంధమున్నట్లు లేదు. తానన్నాడు: "ఎవరైతే మనకేం లెద్దూ." ఆ మాట అంటున్నప్పుడు ఇంతగా ఆమెతో తనకు ప్రమేయం కలుగుతుందని తాననుకోలేదు గాని మనసులో మటుకు కొద్దిగా ఆశ్చర్యమైంది.

తన కిటువంటి విషయాల్లో అనుభవం లేదు గాని, విచిత్రమైన మనిషి నారాయణ, ఎలా పరిచయం కలుగ జేసుకున్నాడో, ఆ కాస్తపాటి టైములో ఆవిడతో. ట్రెయిన్ బరాంగ్ స్టేషన్లో ఆగింది. ఎలాగూ ట్రెయినక్కడ అరగంట పైగా ఆగుతుందిగదా, అలా తిరిగివద్దామని తానన్న మాట కొప్పుకోనని నారాయణ నక్కడే వదలి, తాను వెళ్లి అలా తిరిగి, బండి కదుల్తుం డగా వచ్చాడు కంపార్ట్‌మెంట్ లోపలకు. తాము మొదట కూర్చున్న సీట్లుమార్చి, ఆవిడ కూర్చున్న బెంచీమీదకు చేరి, ఆమెతో ఏదో మాట్లాడుతున్నాడు నారాయణ. చచ్చినా తానంత చొరవ చెయ్యలేడు.

తాను రావటంతోనే పక్కనుంచిన కంఫర్టర్ అవతలకు తోసి నారాయణ అన్నాడు: "రా, భానూ. పాప మీవిడ విజయనగర మెళ్లాలిట, వాళ్ల పినతల్లిగారింటికి. ఖుర్దాలో యీ బండి మారాలని తెలియక ఇందులోనే ఉండిపోయింది. ఎవరో చెప్పారట ఇదే నేరుగా వెళ్తుందని—"

కూర్చుని తానామె వైపు చూశాడు. చేతిలో ఉన్న నీలిదువ్వెన పళ్లు గోళ్ళతో గీస్తూ తల వంచుకొని కూర్చుని ఉందామె. జాలి వేసింది తనకు. కాని నారాయణలా పైకి చూపెట్టలేక పోయాడు. ఏదో మాట అనవలసిన బాధ్యత తనమీద ఉన్నట్లనిపించి అన్నాడు తాను: "కొత్త జాగాల్లో సరిగా కనుక్కోవలసింది. ఏ టికెట్ కలెక్టర్‌నడిగినా చెప్పిఉండును."

ఏమాత్రపు కదలికా లేకుండా అంత బిజినెస్‌లైక్‌గా మాట్లాడినందుకు మందలిస్తూ నారాయణన్నాడు: "బాగా చెప్పావోయ్! పాప మాడమనిషి. అయినా ఇప్పు డేం మించిపోయిందిలే కటక్‌లో దిగి మళ్లీ అటునుంచి రాత్రి రెండుగంటలకొచ్చే పాసెంజర్‌లో వెనక్కు వెళ్లిపోతుంది."

"అనుకున్న దానికి మరొక పదిగంట లాలస్యంఅని, అంతకు మించి మరేం నష్టం అనికూడా కొనను కలపబోయాడు భాను—కాని ఆమె తనవైపు అదొక రకంగా చూస్తూ ఉండడం గమనించి ఆమాట అనలేదు.

తానూ నారాయణా సిగరెట్లు వెలిగించుకున్నారు. రెయిల్ ట్రెయిన్ పెద్దచప్పుడు చేస్తూనడుస్తున్నది—కాట్జోడి బ్రిడ్జిమీద, తనకు ప్రత్యేకంగా వేశారుగదా ఇది అన్న గర్వంతోలాగు. ఆమె అంతగా మాట్లాడినట్లు లేదు కాని ఆ రైలు హోరులో నారాయణ మాటలు మటుకు అక్కడక్కడ వినిపిస్తున్నాయి; వినాలని తన కంత ఆసక్తిగా కూడాలేదు. ఇంకో అయిదు రోజుల్లో మళ్లీ వెనక్కి బ్రిడ్జిమీదనుండే తన ఊరికి వెళ్లిపోతానుగదా అనుకుంటున్నాడు.

కటక్ స్టేషన్లో చేరుకుని రైలాగింది. నారాయణా, ఆమే, లేచి నిల్చున్నారు. పైన ఉంచిన చేతిసంచీ తీసుకుని తానూ నిలబడ్డాడు.

నారాయణ ఆవిడతో అంటున్నాడు: "ఇదే కటక్—సామాన్లేవీ లేవుగదూ?" ఆ గొంతులో ఉన్న చనువు చూసి తన కాశ్చర్యమైంది. ఆమె నెమ్మదిగా "లేవు" అని తనచేతి నున్న మడతపెట్టిన గోధుమరంగు చీరవైపూ నీలిరంగు దువ్వెన వైపూ చూచింది. వాలిఉన్న ఆమె కనురెప్పలక్రింద నీళ్లుకూడుకొంటూ ఉన్నాయేమో!

భూతకాలంలో తిరుగుతున్న మనస్సు మళ్లా హోటలు గదిలో ఉన్న నాగమణిమీదకు వాలింది. తనను చుట్టిఉన్న వస్తుసంచయమంతా తనదే అయినా ఆ స్పృహే లేని శ్రీమంతురాలి ధీమాతో, ఎంత సహజంగా కూర్చొని ఉంది ఈ గది నడుమ!

ఆమె అంటున్నది: "సరదా ఉందిగాని మన స్నసలు పుస్తకంమీద పట్టుమని పావుగంట నిలవదు......"

మళ్ళా ఆగిపోయింది రెమ్మ.

నారాయణ అంటున్నాడు: "ఎక్కేవాళ్లూ, దిగేవాళ్లూ—పద. భానూ. నిలబడితే ఎంతసేపైనా అంతే!" మాట్లాడకుండా దిగాడు తాను, తన వెనక వాళ్లూ దిగారు.

ప్లాట్‌ఫారమ్‌మీద అన్నాడు నారాయణ: "దూరపువాడివి, సిటీబస్సులో వెళ్ళాలిగదూ, నువ్వు? నే నీ మనిషిని పంపించేశాక వెళ్తాను, నువ్వెళ్లు. అన్నట్లు—నీ పని మరో మూడురోజుల్లో అయిపోతుందిగదూ, వెళ్ళేముందొకసారి కనుపించు."

"అలాగే, వస్తాను మరి."—వెళ్లిపోయేముందు ఆమెవైపు చూశాడు తాను, ఆమెకూడా తనవైపే చూస్తున్నది. మళ్ళా తల తిప్పుకుని పదడుగులు నడిచాడు. నారాయణంటున్న మాటలు వినిపించాయి: "దగ్గిరే హోటలు—ఇంకా నాలుగు గంటలపైముంది బండికి, భోంచేసి రావచ్చు."

ఎందుకో అనిపించింది ఆమె ఇంకా తనవైపే చూస్తున్నదని కాని వెనుకకు తిరిగి చూడకుండా మనుష్యులలో కలిసిపోయి అవతలకు వెళ్లిపోయాడు తాను. అవతల సిటీబస్సు సిద్ధంగా ఉంది. వెళ్లి లోపలకు చొరబడ్డాడు.

అప్పుడే వర్షం పడి వెలిసినట్లుంది. అక్కడక్కడ రోడ్డుమీద ఉన్న గోతుల్లో నిండుకొన్న నీళ్లల్లో ఎలక్ట్రిక్‌లైటు వెలుగులు పడి ఆ చిన్న అలలు బంగారు రేకుల్లా తళతళ లాడుతున్నాయి. బస్సు వేగంగా వెళ్ళిపోతున్నది.

నారాయణ—

నారాయణసంగతి జ్ఞాపకం వచ్చింది. అతన్ని బాగా ఎరుగును తాను. చిక్కిన అవకాశం పోగొట్టుకునే రకం కాదు. పాపమామె......

తన విధ్యుక్తధర్మం తప్పించుకుని పారిపోతున్నట్లనిపించి గుండె కలుక్కుమంది భానుకి. నిస్సహాయ ఐన ఆడదాన్ని నైతిక సంబంధమైన విలువలతో అంత అవసరంలేని మనిషితో వది లేసి......

అయినా అసలామె ఇంకా చాలా దూరం వెళ్ళాలి. నారాయణలాంటి వాళ్ళెంతమందో ఉంటారు ప్రపంచంలో. తన కెందుకీ అనవసరపు బాధ్యత?

కాని మనసొప్పుకోలేదు. మసీదు దగ్గర బస్సాగింది. తనూ దిగిపోయాడు. బస్సు కండక్టర్ అడుగుతున్నాడు: "కోర్టు వరకూ వస్తారేమో?"

"లేదు, పనుంది."

స్టేషను నక్కడకు రెండుమైళ్ళుంది సుమారు. నడిచివెళ్తే ఆలస్యమౌతుంది. రిక్షావాడిని పిలిచి స్టేషన్‌కు పోనిమ్మన్నాడు. స్టేషన్ మరో రెండుఫర్లాంగు లుండగా "ఫ్రెండ్స్ కేఫ్" తాలూకు నియోన్‌లైట్ సైన్‌బోర్డ్, ఆలోచనలో ఉన్న తన కళ్ళ నాకర్షించింది. తాను వస్తూన్నప్పుడు విన్న నారాయణ మాటలు జ్ఞప్తికి వచ్చాయి. స్టేషన్ దగ్గరలో ఉన్న దక్షిణాది భోజనహోటలిదే.

రిక్షాదిగి తిన్నగా భోజనశాల హాల్లోనికి వెళ్ళాడు. అక్కడ చాలమంది ఉన్నారుగాని తాను వెదికే వాళ్ళెక్కడా కనిపించలేదు. పక్కగదుల్లోనూ లేదు. ఇవతల హాల్లోనికి వచ్చి ఒక ఓవల్‌టిన్ తెమ్మన్నాడు.

మేనేజర్ టేబుల్ దగ్గర బిల్లు చెల్లించేటప్పుడు వాళ్ళను గురించిన ప్రశ్న నోటిచివర వరకూ వచ్చింది కాని అడగలేక పోయాడు ఎందువల్లనో.

ఎందుకివన్నీ ఆలోచించి ఏంలాభం? జరిగింది మళ్ళీ వెనుకకు తిప్పి మరోవిధంగా జరిగేటట్లు చెయ్యలేడు గదా!

ఎదురుగుండా ఉన్న నాగమణిమీద దృష్టివాలింది. గులాబీ మొగ్గ కుట్టడం పూర్తయింది. సూది దానికే గుచ్చి ఫ్రేమ్ విప్పకుండానే ఆ గలీబు కుర్చీమీద ఉంచి లేచి నిలబడి ఆవలించింది నాగమణి, చేతులు రెండూ పైకెత్తి తల వెనుక పెనవేసుకుని, తన ఇంట్లో గోడకున్న త్రివర్ణ చిత్రపటం—పురూరవుణ్ణి వదలి ఆకాశాని కెగిరిపోతూన్న అతిలోక సౌందర్యవతి ఊర్వశి—అతనికి జ్ఞప్తి వచ్చింది.

భాను కూర్చున్న పడకకుర్చీ దగ్గరకువచ్చి, దాని చేతిమీద ఎడమచెయ్యివేసి వంగి, అతని కళ్ళల్లోనికి తిన్నగా చూస్తూ అందామె: "మధ్యాహ్నంపూట నిద్ర బాగా అలవాటు. నేన నేది వింటున్నట్లు లేదే!"

ఆమె నున్నని ముంజ మీద వేళ్ళతో రాస్తూ అన్నాడు: "వింటున్నానే చివరను 'ఉద్యానవనంలో ఉంటే బాగుంటుంది' అంటున్నావుగదూ?"

అతని నుదుట చిందులాడు తూన్న జుట్టు కుడిచేతి వేళ్ళతో సరుదుతూ అందామె: "అవునుగాని, రాత్రి ఎన్నిగంటలికి ట్రెయిను సరిగ్గా?"

కట్టుకున్న లేపసుపు జార్జెట్ చీరా, వంగపండురంగు బ్లౌజూ అందమైన ఆమె శరీర నిమ్నోన్నతాలను పట్టి చూపుతున్నాయి, ఆకర్షవంతంగా: "రెండుంబావుకి—అన్నీ సర్దేసుకో"

"ఎంతసేపు! సాయంత్రం సరిదేస్తాను—" అంటూ అతని ఎడమచెయ్యి తిప్పి వాచీవైపు చూసింది: "అబ్బో, మూడవ్వస్తూందే! కాఫీ తెమ్మంటూ సంపండి."

తలుపు తీసుకుని ఆమె అవతలకు వెళ్ళింది. వాచీవైపు చూశాడతడు— అయిదు నిముషాలు తక్కువ మూడు. నాలుగున్నరకే ట్రెయిన్, టైమవుతూన్నది.

ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా ఒక్క ఉదుటున లేచి అల్మైరా దగ్గరకు వెళ్ళాడు. అటూ ఇటూ చూసి జేబులో చెయ్యి పెట్టి కాగితమొకటి పైకి తీసి, అల్మైరాలో ఉన్న పర్సులో పై అరలో కనిపించేలా దాన్నుంచి, మళ్ళీ మడిచి అక్కడే పడేసి వెనక్కువచ్చి కుర్చీలో చేరబడ్డాడు.

నాగమణి వచ్చింది. వెనకాలే హోటలు కుర్రవాడు ట్రేతో ఫలహారమూ, కాఫీ రెండు కప్పులూ, చిన్నగిన్నెలో పంచదారా, తెచ్చి భాను కూర్చున్న కుర్చీకి దగ్గరగా నాగమణి లాగిన స్టూలు మీద ఉంచి వెళ్ళిపోయాడు. నవ్వుతూ నాగమణి అంటున్నది: "గోవా బర్ఫీట ఇది—ఎలా ఉంటుందో చూడండి. చిన్నప్పుడు అమ్మ బర్ఫీ కథొకటి చెప్తుండేది—"

కొట్టుకునిపోతున్న రెమ్మ మళ్ళా ప్రవాహంలో ఏదో అడ్డు తగిలి ఆగిపోయింది. ఈ నాలుగు రోజులుగా ఎక్కడలేని ఆనందమూ మూర్తీభవించినట్లు తిరుగుతున్నది నాగమణి. షెల్లీ పద్యంలో ఒక భాగం జ్ఞాపకం వచ్చిందతనికి:

*"..........a mortal shape indeed*
*With love and life and light and gaity,*
*And motion which may change but cannot die;*
*An image of some bright Eternity;*
*A shadow of some golden dream;........."*

మళ్ళా నాలుగు రోజుల క్రిందట నాగమణి స్మృతిలో మెరసింది. ఇనుపబద్దీల కానించి ఉన్న నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్ల అడ్వర్టైజ్‌మెంట్ బోర్డుమీద దృష్టి నిల్పి—భార్యా, భర్తా, ఇద్దరు పిల్లలూ ఆనందంగా కలిసి కూర్చుని టీ తాగుతూన్న బొమ్మ అది—దైన్యమంతా మూర్తీభవించినట్లు కూర్చుని ఉందామె ఫస్ట్‌క్లాస్ పాసెంజర్స్ హాల్లో. మరి వాళ్ళు కనిపించరని స్థిరపరచుకున్నా స్టేషన్ వదలి వెళ్ళలేకపోయిన తాను, అటూ ఇటూ తిరుగుతూ, చివరకా హాల్లో ఒకమూల ఆకుపచ్చని చీర చూశాడు. చాలు గదం

గులు వేసేటప్పటికి ఆమే అని నిర్ధారణ అయింది. అతని గుండెలు వేగంగా కొట్టుకున్నాయి

భాను దగ్గరగా వచ్చేటంతవరకూ అతన్ని చూడలే దామె. చూడటంతోనే కొద్దిగా గాబరాపడి లేచి నిల్చుంది.

అతని కేమనడానికీ తోచలేదు. మాటలకు తడుముకొని చివర కన్నాడు: "భోంచేశారా?"

తా నడిగినదానికి సమాధానం చెప్పకుండా అడిగిం దామె: "మీరు వెళ్లిపోలేదూ బస్సులో?"

"వెళ్లాను—అంటే, మళ్లీ పనుండి వచ్చాను."

"మీరు—భోజన మైందా?"

"ఊఁ."

ఇద్దరూ ఒక నిమిషం మాటాడలేదు. తా నామె కిచ్చిన సమాధానం దిద్దుకోవాలనిపించి మళ్లా అన్నాడు: "భోజనమా? ఇంకా కాలేదు." ఆమె పెదవులు కనీ కనిపించని చిరునవ్వుతో విడాయి కాని అంతలోనే "మీ భోజనం?" అని అత డన్న మాటల్తో ఆ లేజిరునవ్వు మాయమైంది. కళ్లు నేలపై వాల్చి బొటనవ్రేలుతో గచ్చుమీద రాస్తూ నెమ్మదిగా అంది: "లేదు."

"ఏం నారాయణతో హోటలుకు వెళ్లలేదూ?"

ఆమె తలెత్తి తిన్నగా అతని కళ్లల్లోనికి చూసింది. ఏదో అనడానికి ప్రయత్నించి మళ్లీ ఆగిపోయి, చివరకు "లేదు" అంది.

ఆ హాల్లో ఒక మూలఉన్న దుకాణం దగ్గరకు తాను వెళ్లబోతుండగా "ఎక్కడికి?" అం దామె. "ఇప్పుడే వస్తాను" అంటూ తాను వెళ్లి తెచ్చిన రెండు బత్తాయి పళ్లూ అందించినప్పుడు వద్దని అనకుండానే తీసుకుంది. ఆపక్కనే ఒక బెంచీ అప్పుడే ఖాళీ అయింది. అది చూసి ఆమె "అక్కడ కూచోండి" అంది తనను. తా మిద్దరూ నిలబడి మాట్లాడడం తనకూ అదోక మోస్తరుగా అనిపించింది. పదిమందీ ఏ మనుకుంటున్నారో నని. వెళ్లి చివరను కూర్చొని ఆమెనూ కూర్చో మన్నాడు బెంచీ ఆ చివరను. కాని, ఆమె నేలమీద ధూళి దులుపుకొని కూర్చొని పళ్లు ఒలవడం మొదలు పెట్టింది.

ఈ సెలన్నీ శుభ్రంగా తీసి ఒక పండు తన కందించిం దామె. తా నన్నాడు: "నా కొద్దు—మీరు తినండి,"

"ఇంత కష్టపడి నాకోసమేనా ఒల్చుకున్నది! ఇదుందిగా నాకు!"

ఆయి దారు గంటల కిందట ఎవరెవరో తెలియని తమ నడుమ నా విధంగా మొదలైంది పరిచయం అతి సన్నిహితంగా.

"పంచదార తక్కువైనట్లుంది మీకు," అంటూ తన కప్పు తీసుకుని ట్రేలోఉన్న చిన్న గిన్నెలోని పంచదార ఆమె కల్పుతూంటే అనుకున్నాడు తన అభిరుచు లన్నీ యీ నాల్గురోజుల్లోనూ ఎంత బాగా కనిపెట్టిం దీమె, అని—అతడు కాఫీ తాగుతున్నాడు. ప్రవాహంలో ప్రయాణాని కుద్యుక్తమైన రెమ్మ మళ్లీ ఆగిపోయింది.

తొనలు విడదీసి, గింజ లవతలకు విసరి, రసవంతమైన ముత్యాలు తింటూ, తా నడిగాడు: "విజయనగరంలో మీ పినతల్లిగారా ఉన్నారు?"

తా నా అనవసరపు ప్రశ్న వెయ్యకుండాఉంటే ఆ పరిచయ మక్కడితో ఆగిపోయేదేమో! ఆ మొదటిరోజు జరిగిన సంఘటన లన్నీ అలాగే అనవసరంగా కనిపిస్తున్నాయి. కాని అన్నీ జరిగాయి. ఏ ఘట్టంలోనైనా కొద్దిగా ఆలోచించి ప్రవర్తిస్తే ఇంత రాకపోయి ఉండును!

ఆమె వెంటనే సమాధానం చెప్పలేదు. ముత్యాలపొట్ట విడదీసిన తొన అలాగే వేళ్లతో పట్టుకుని దూరంగాఉన్న N. S. C. బోర్డుమీద చూపులు నిల్పి కూర్చుండిపోయింది. రెప్పలు మూతబడని ఆమె కళ్లల్లో కూడుకుంటున్న కన్నీటిచుక్క లొక్కొక్కటి చెక్కిళ్లమీదనుండి, విద్యుత్కాంతిలో మిలమిలా మెరుస్తూ కిందకు రాలడం మొదలుపెట్టాయి నెమ్మదిగా.

తన కెందుకో కొద్దిగా భయం వేసింది. అటూ ఇటూ చూశాడు. సాధ్యమైనంతసేపు నిద్రపోవడానికి ప్రయత్నిస్తూన్న చుట్టుపక్కలవాళ్లు తమపై వింతగా చూడటం లేదు. ఆ ప్రశ్న ఎంత బాధ కలిగించిం దామెకు! రెండు నిమిషాలు తానూ మాట్లాడలేదు. సంతతధారగా కారుతున్న ఆ కన్నీరు చూడలేక చివర కన్నాడు: "క్షమించండి. కష్టంగా ఉంటే చెప్పొద్దు."

చూపులు నేలమీదకు మరల్చుకుని బాష్పరుద్ధకంఠంతో అం దామె: "లేదు—ఎవ్వరూ లేరు నాకు, విజయనగరంలోనే కాదు, ఎక్కడా లేరు." ఈ మాట లంటూనే వేళ్ల సందుల్లోనుండి బత్తాయితొన ఒళ్లో జార్చి, రెండు చేతులతోనూ మొగం కప్పుకుని నిశ్శబ్దంగా ఏడవడం మొదలుపెట్టింది. ఏం చేయడానికీ తోచలేదు తనకు. ఆమే చివరకు పైటచెంగుతో కళ్లు తుడుచుకొని, చెప్పడం ప్రారంభించింది:

"ఇలా చాలమం దడిగారు గాని ఎవరికీ నా సంగతి చెప్పలేదు. ఎందుకో మీకు చెప్పా లనిపిస్తున్నది......"

తరువాత నెమ్మదిగా వచ్చిం దామె జీవిత కథ. అలాంటి వాళ్లెంతమందో ఉంటా రీ దేశంలో. మామూలు అభాగ్యజీవుల కథే అది చాలావరకు. ఏం చేస్తుందో, ముందు బతు కంతా అంధకారమయం.

ఆమె మాటలు వింటున్నంతసేపు పరూలంగా ఊగులాడిపోయినమనస్సు యథాస్థానానికి స్థిరంగా చేరుకోలే దింకా. ఏం చేయగల డామెకు తాను సాయం!

ఆమె చెప్పడం పూర్తయ్యాక అయిదు నిమిషా లిద్దరూ మాట్లాడలేదు. చివర కతను నెమ్మదిగా పర్సు తీసి పాతికరూపాయలనోట్లు పైకి తీశాడు. ఆమె తన కళ్లల్లోకి తిన్నగా చూస్తూ అంది: "జాలిపడి డబ్బిస్తున్నారా? వద్దు. నా గాథ చెప్పుకుని మీ దగ్గర డబ్బు లాగడం నా ఉద్దేశం కాదు." లేచి నిలబడి నేలమీద చూస్తూ అంది: మీరు చూపిన దయ చాలును." ఆమె కళ్లవెంబడి మళ్లీ నీళ్లు కారుతున్నాయి.

తాను తెల్లబోయి నోట్లు పర్సులో ఉంచి జేబులో ఉంచుకున్నాడు. ఆమె మనసు నొచ్చినట్లయింది. అయినా ఉత్తమాట అతో మటుకే సానుభూతి చూపటం తన మానవత్వానికి పెద్ద దెబ్బలా అనిపించిం దతనికి. తన ప్రకృతి సాధారణంగా ఉద్వేగం చెందదు; చెందుతే ఆపడం కష్టం. ఆ ఉద్వేగంమీదనే ముందు వెనుక లాలోచించకుండా తన ఇంట్లో చోటివ్వడానికి సిద్ధపడ్డాడు. అప్పు డెంతో సబబుగా కనిపించింది. ఎవళ్లూ ఇంట్లో తోడులేకపండా చిన్న వయసులోనే నాలుగేళ్ల కొడుకుతో నానా బాధలు పడుతున్నది తన భార్య సత్యవతి. ఈ నాగమణిలాటివాళ్లు వెనకాల సాయంఉంటే ఎంత బాగుంటుంది! సాయమంటే ఇంట్లో చాకిరీ చేసిపెట్టాలని కాదు. ఆ పనికి వేరే మనుషు లున్నారు. ఆ విషయం తానా విడకు స్పష్టపరిచే చెప్పాడు. ఒకరి తోకరు సాయంగా ఉంటే చాలును. తానూ ఆర్థికంగా స్థిరమైన సదుపాయమైన ఉద్యోగమే చేస్తున్నాడు. తన కెవరూ అక్క చెల్లెళ్లు లేరు. ఆ లోటు తీర్చేట్టుగా ఆమెను చూసుకుంటాడు.

ఎంతో సహేతుకంగానూ న్యాయ సమ్మతంగానూ తోచింది, తాను చేస్తున్న పని అప్పుడు. ఆమె ఒప్పుకో లేదు ముందు. ఎంతో యిదిగా తాను రకరకాలుగా బోధపర్చి చెప్పాడు. చివరకు పాసింజ రింకో గంటకు వస్తుం దనగా ఒప్పుకుందామె.

నాగమణి అడుగుతున్న దానికి సమాధానం ఆలోచించి చెప్పవలసిన అవసరం కలిగి, ప్రవాహంలో వచ్చిన అడ్డు తొలిగి మళ్లీ మామూలు దారిని పడింది రెమ్మ.

నాగమణి : "దారిలో మన భోజనమెక్కడ ?"

"ఆఁ?...పలాసా. టైముంటుందిలే పలాసాలో ?"

"పరధ్యానంగా ఉన్నట్లుందే!"

నవ్వుతూ అన్నాడు భాను. "పరధ్యానమైతే జవాబెలా చెప్పాను."

ఆమె నవ్వుతూనే అంది : "చెప్పొచ్చు. ఎంత పరధ్యానంగా ఉన్నా వినబడుతూనే ఉంటాయి. జవాబు చెప్పాల్సి వస్తే ఆఖరు మాట లొకసారి మనసులో అనుకుంటే సరి, అర్థం బోధపడుతుంది. ఇందాక నిద్రమత్తుగా ఉన్నప్పుడూ ఇలాగే చేశారుగదూ ?"

ఎంత చలాకీ పిన మనిషి ! అందుకే ఇంతలా పెన వేసుకు పోయింది తన జీవితంలో నాలుగురోజుల్లోనే యీామె.

ఆల్మైరా వైపు చూశాడు. పర్సక్కడే ఉంది. తనచూపుల ననుసరించి ఆమె చూపులూ దాని మీదే వాలాయిగాబోలు నాగమణి అంది నవ్వుతూ :

"పస్తొవ్వరూ కాజెయ్యరు లెండి—మన మిద్దరం ఉండగానే ?"

"అదిగాదు—ఊరికేనే."

"అలా వెళ్ళేటప్పుడు బజారులో ఏమన్నా కొనాలి గాబోలు !"

"లేదులే, జేబులో నాలు గైదు రూపాయల చిల్ల రుంది."

"అవునుగాని, ఎందు కలా ఖర్చుపెడతారు డబ్బు ? ఈ నాలుగైదు రోజుల్లో చాలా ఖర్చైనట్లుంది నా గురించి."

"ఏం ఖర్చది పోనిద్దూ."

పర్సుతీసి చూస్తుందేమోనని అనవసరంగా భయపడ్డాడు భాను, తన కక్కడే ఉండగా ఆ ఉత్తరం ఆమె చూసిందంటే ?

తనకు ధైర్యంలేదు. కాగితంమీద రాయగలిగిన మాటలామెతో చెప్పేస్తే ? అయిదారుమార్లు వెనకకూ ముందుకూ తిరుగుడు పడ్డాయి ఆ ఉత్తరంలో రాసి ఉన్న మాటలు తన మనసులో, నాటకంలోవలె రాసినట్లున్నాడు :

"జారి పోతూన్న నాగమణికి—

అనుకున్న దొకటీ, అయిందొకటీ.

ఈవిధంగా జరిగిన తర్వాత నిన్ను తీసుకువెళ్ళి ఇంట్లో ఉంచలేను. మరోవిధంగా చేసే అవకాశంలేదు. పర్సులోసుమారు రెండువందలున్నాయి. నీపై అభిమానంతో మటుకే ఇవి వదలడం.

ఏమి రాయడానికీ తోచడంలేదు. క్షమించు, నిన్ను పోగొట్టుకుంటున్న–భాను."

ఆమె ఏదో మాట్లాడుతూంది. రెండుమూడు సార్లు నోరు విప్పబోయాడు కాని అవకాశం కలగలేదు. కలిగినా ఉపయోగించుకునే శక్తిలేనట్లుంది పెదవులకు. లాభంలేదు. నోటితో చెప్పలేడు.

డబ్బువదిలి వెళ్తున్నందుకే మనుకుంటుందో ? ఏ మనుకున్నా తనకు తిప్పిపంపే అవకాశంలేదు. ఊరిపేరు తప్ప అడ్రెస్ చెప్పలేదే తాను.

ఏమైనా తన విధితాను నెరవేరుస్తున్నాడు.

నాగమణి అంటున్నది : "తప్పకుండా వెళ్లాలేమిటి వాళ్లింటికి భోజనానికి ?"

"లేదు, నారాయణ మరీ మరీ బలవంతపెట్టాడు, వెళ్లకపోతే బాగుండదు"—తడుము కోకుండా చెప్పాడు సమాధానం. చిన్నప్పటినుండీ స్నేహితుడు, నిన్న భోజనానికి పిలిచినప్పుడు రావడానికి వీలుకాదన్నాడు తాను; ఏమనుకున్నాడో ? లేచాడు తాను కుర్చీమీదనుండి.

ఆమె అంది : "ఇప్పటినుంచీ లేస్తున్నారేమి ?"

"ఇంకా ఆఫీసుపనుంది. అది చూసుకొని అలాగే భోజనమూ పూర్తిచేసుకుని వస్తాను. తొమ్మిదిదాటుతుందిలే వచ్చేటప్పటికి." తడబడకుండా మాట్లాడ్డానికి ప్రయత్నించి కృతకృత్యుడయ్యాడు.

"నీళ్లు తెప్పిస్తానుండండి."

నీళ్ళు వచ్చాక వెళ్లి మొగం కడుగుకుని లోపలకువచ్చాడు. తల దువ్వుకు నేటప్పుడు నాగమణి అడ్డువచ్చి తానే దువ్వింది. దువ్వెన దులుపుతూ అడిగిం దామె:

"డూప్లికేటు తాళం మీ దగ్గిరుంది కదూ ?"

"ఏమి ?"

"మీరు వచ్చేంతవరకూ ఒక్కదాన్నీ—ఏమీ తోచదు. అలా ఎక్కడికన్నా......"

"సినీమాకు వెళ్లకూడదూ పోనీ ?"

"చూద్దాంలెండి."

భాను గడపదాట బోతుండగా చేయి పట్టుకుని వెనకకు లాగి తిన్నగా కళ్లల్లోనికి చూస్తూ అడిగింది ; "వేగం వచ్చేస్తారు గదూ ?" ఆమె కళ్లనిండా నీళ్లు నిండుకుని ఉన్నాయి. భాను తటపటాయించి రెండడుగులు వెనుకకువచ్చి ఆమెను దగ్గరకు తీసుకుని చెక్కిళ్లమీద ముద్దుపెట్టుకున్నాడు. అతని నోటి చివరవరకూ వచ్చింది : "మరిభోజనానికి వెళ్లనులే !" అని ; ఇంతలో మధు నెత్తుకున్న సత్యవతి మూర్తి అతని తలపు తెరమీద గోచరించింది. ఎందుకంత కోపంగా చూస్తున్నది, సత్యవతి ? లేదు—నాగమణికక్కడ స్థానంలేదు.

జాలిగా అన్నాడు : "ఒకపూట ఆలస్యానికేనా బెంగ, వెర్రినాగూ ?"

* * *

స్విచ్ వేసే ఉండడాన్ని, హోటల్ మెయిన్ స్విచ్ వెయ్యడంతోనే టేబుల్ లైట్ వెలిగింది. కాని ఇంకా సరిగా చీకటిపడక పోవడంవల్ల కిటికీలోనుండి లోపలకు వచ్చే సంజ వెలుగులలో అదంత ప్రకాశవంతంగా కనిపించడంలేదు. మంచంమీద వారగిల పడుకుని గోడవైపునకు తల తిప్పుకుని ఉన్న నాగమణి ఉలికిపడి ఇటు తిరిగి చూసింది. ఎవరూ లేరు.

ఏమిటి ఆలోచిస్తున్నది తాను ? నిద్రపట్టినట్లుంది. ఏదో కలవచ్చింది నిద్రలో, సరిగా జ్ఞాపకం తెచ్చుకోవడానికి ప్రయత్నించింది.

ఆ కలలో—తాను సావడిలో పడుకొని ఏడుస్తూంది. అవతల గదిలోనుండి ఎవరో స్త్రీకంఠం పాడుతూండడం వినిపిస్తున్నది. ఉన్నట్లుగా ఉండి ఎవరో పకపక నవ్వడం మొదలుపెట్టారు. ఆ స్త్రీ కంఠమూ పాటమాని కిలకిల నవ్వుతున్నది.

ఆ పక పక మనే నవ్వు !

ఆయన, తనభర్త ! ఆయనే నవ్వుతున్నాడు.

తరువాతేమిటో సరిగా జ్ఞాపకం రాలేదు కల. ఎక్కడో ఒక కారడవిలో తాను పరుగెత్తుతున్నట్లుగా కూడా అయినట్లుంది.

ఎంత భయంగా అనిపించింది తనకా కలలో! ఆ స్త్రీ......

ఆయనెప్పుడూ పరస్త్రీల జోలికి పోయేవారు కాదు, తనను మరోవిధాల ఎంత బాధపెట్టినా. మరి కలకర్థం ?

బల్బువైపే చూస్తున్న ఆమె కళ్లు కొద్దిగా ఉబ్బి ఉన్నాయి. చెక్కిళ్లమీద ఎండిన కన్నీటి చారలు అంతకంతకూ స్పష్టమవుతున్నాయి.

ఆ బల్బుకు వెనకాల ప్రాపుగా డూమూ, స్టాండూ. ఆ కాంతి కాధారంగా కరెంటూ, ఇవి లేకపోతే ? అసలది నిలవగలదా యీ విధంగా, కాంతి మంతంగా ?

ఇదే ఆలోచన వచ్చింది ఆరోజు—ఎనిమిదేళ్లై నట్లుంది. ఫోర్తుఫారమ్ చదువుతున్నది తానప్పుడు. నాన్నపోయాడని టెలిగ్రాం సాయంత్రం వచ్చినప్పటినుండి ఏడ్చి ఏడ్చి చివరకు మరి ఏడ్చే శక్తిలేక, గోడ కున్న లైటువైపు చూస్తూ ఇలాగే పడుకుని ఉంది ఆ వేళ తాను, ఎందరెందరో తోటి విద్యార్థినులు వచ్చి ఓదార్చడానికి ప్రయత్నించి వెళ్ళిపోతున్నారు. అప్పుడూ ఇదే ఆలోచన వచ్చింది. నాన్నే ఉంటే ? తనీ స్థితిలోనికే వచ్చి ఉండేది కాదు.

ఆ రోజు రాత్రి హాస్టలు వదిలి ఊరికి వెళ్ళుతున్నప్పుడు మరి తిరిగి అక్కడ అడుగుపెట్టుతానని అనుకోనేలేదు. బ్రతికున్నంత కాలం నాన్న తాము బీదవారమని ఎప్పుడూ తనకు తెలియనివ్వనే లేదు.

అమ్మ—అమ్మమటుకేం చేసింది ? ఏదో కూతురును ఒక ఇంటిదాన్ని చేసి సుఖపెడదామనుకుంది. కాని యీవిధంగా అవుతుందని కలగన్నదా !

తనతప్పూ ఉండేదేమో ఆయనతోడిబ్రదుకులో సామరస్యం కుదుర్చుకోలేక పోవడంలో ? తప్పొప్పుల నిర్ధారణచేసి ఏం ప్రయోజన మిప్పుడు ?

అదీ కొంతమంచిదే అయింది, తన పెళ్లయిన కొద్దిరోజులకే అమ్మపోవడం. లేకపోతే ఎంత బాధపడి ఉండేదో తన యీ దుర్గతికి !

తనకు ధైర్యం లేకపోయింది. ధైర్యం లేకపోవడం కాదు, బ్రదకలేక చనిపోవడం పిరికి తన మనిపించిందప్పుడు. లేకపోతే ఆ యింట్లో ఉన్న లోతైన నూతి చల్లని నీళ్లు శారీరకంగా, మానసికంగా, తనకు బాధలనుండి విముక్తినిచ్చి ఉండేవి. అప్పుడే సాహసంచేసి ఉండవలసింది, తన జీవితం యిలా పక్కదారి తొక్కివప్పునే ! ఇప్పుడా ఆలోచన అనవసరం.

ఆరోజు గవరయ్య—తనతో ఫస్ట్ ఫారమ్‌వరకూ చదివి మానేసిన గవరయ్య—మళ్ళా తన జీవితంలో ఎందు కడుగుపెట్టాడు ! ఆ ఊళ్ళోకతడు రాకుండా ఉంటే ? తన కాతడు కనిపించకుండా ఉంటే !

ఇది కాకపోతే—అది కాకపోతే—ఎందుకీ వృథా ఆలోచన ?

కాని, అయింది మర్చిపోవడమెలా ?

అయిదు రోజులకిందట......

పూరీలో జరిగిన సంగతి జ్ఞాపకంవచ్చింది.

పంచదార వేసిన పెరుగు తెచ్చిచ్చాడు హోటలు బ్రాహ్మణుడు. గవరయ్య తలవంచుకుని తొందరగా తింటున్నాడు. తనకా తీపి సహించలేదు. "మామూలు పుల్లమజ్జిగ కావాలా ?"

అని అడిగింది తాను, కిందకు వంచిన గవరయ్య కళ్లల్లోనికి తిన్నగా చూడడానికి ప్రయత్నిస్తూ.

కసిరికొట్టినట్లుగా అన్నాడు: "ఇల్లనుకున్నావేమిటి? కొండమీది కోతిని తెచ్చిపెట్టడానికి నేనేం మోళీవాణ్ణిగాను."

ఆయనే, తనభర్తే నయం. మొదటనుండీ ఒకటే విసుగూ, కోపం; కాని ముందు మంచి మాటలూ తరువాత మరోవిధం లేదు.

ఇల్లు వదలి అతని వెంట కుక్కలా వచ్చేలా తనను సమ్మోహనంచేసినవాడు త్రోవలో లారీ ఆపి తానడిగానని వెళ్లి చెరువులో తామరపూలు కోసుకొని తెచ్చిన గవరయ్యే, నిర్దాక్షిణ్యంగా పైదేశంలో తనను వదిలేసి మాయమైపోయాడు!

చిన్నప్పటినుండీ అద్దంలో చూసుకొని ఎంతో గర్వపడేది తాను తన అందానికి కాని. ఆ అందమూ పరులతో సామరస్యం కుదుర్చుకోవడంలో తనకు సహాయపడటంలేదు. ప్రతీవాళ్లూ తన అందాని కాకర్షింపబడేవాళ్లే. కాని చివరకు పురుగుకన్నా హీనంగా తన్ను దులిపి వేస్తున్నారు.

ఏదో అహంభావం చిన్నప్పటినుంచీ తనకు. తనొక్కతే పై అంతస్తునకు చెందినదనీ, తక్కినవాళ్లందరూ అడుగంతస్థుల వాళ్లనీ. ఆ అభిప్రాయం మనసులోనే ఉంచుకుంటే బాగుండేది కాని ఎంతగా అణచుకున్నా అణిగేది కాదది. ఎప్పుడో తనకు తెలియకుండానే పైకి వచ్చేసేది.

మొదట ఆయన, తరువాత గవరయ్య, తరువాతనారాయణ—

నారాయణకు మటుకు తానా అవకాశం ఇవ్వలేదు. అవసరం తీరిన వెనుక తనను పురుగులా అవతలకు విసిరివెయ్యడానికి! ఎంత చొరవ నారాయణకు! ఆ ఉద్దేశం అతని కుందని తెలుస్తే తానసలా హోటలుకే వెళ్లకుండా ఉండే దతనితో. భోజనాని కన్న వంకపెట్టి ప్రత్యేకంగా మేడ మీది గది కతడు తనను తీసుకు వెళ్లేటప్పుడన్నా గ్రహించు కోవలసింది.

ఎన్ని ముక్కలు చేసేసిందత డివ్వబోయిన అయిదు రూపాయలనోటు తాను!

భాను—

అలాటివాడుకాదు భాను. మళ్ళా వస్తాడు తనకోసం. రాకుండా ఉంటే? ఈ రెండురోజుల్లోనూ ఎన్నిసార్లో అనుకుంది. అతడు రాకుండాఉంటే బాగుండునని కాని అతడు మటుకు రావడం మానలేదు—మానలేదు కూడాను. వాళ్లకీ, భానుకీ ఎంత తేడా!

భాను నా స్టేషనుహాల్లో చూడటంతోనే ప్రాణంలేచి వచ్చినట్లయింది. అంతకుముందు తన నుద్దేశించి అన్న రెండు మాటలూ మందలిస్తున్నట్లుగా అన్నా అతడే ఎక్కువ దగ్గర వాడిలా కనిపించాడు తనకు.

భోంచేశారా అని అత డడిగినప్పుడు నారాయణ సంగతంతా అతనికి చెప్పుకుని ఏడుద్దామనిపించింది తనకు. కాని చెప్పలేక పోయింది.

తన దీనత్వం చూపుకోకుండా ఉందామని ఎంత ప్రయత్నించినా భాను దగ్గర సాధ్యంకాలేదు. అత డడిగిన ప్రశ్న కంతవరకూ దిగమింగుకుంటున్న ఏడుపు పైకి వచ్చేసింది. ఎందుకలా అయిపోయింది తను? తన అహంభావం పూర్తిగా దిగజారిపోవడ మితని దగ్గరే!

అతనితో అబద్ధాలు చెప్పాలని చెప్పలేదు తాను. కాని తన పతనం సంగతి చెప్పకోలేక పోయింది. మరొకళ్లైతే నమ్మే వాళ్లుకాదు తన మాటలన్నీ. ఎంత అమాయకుడు భాను!

తన గాథ విని అతడు జాలిపడి డబ్బివ్వబోయినా కోపం రాలేదు. తనకు ఎక్కడకు పోయిందో తన అహం భావం!

అతని వెంట వెళ్లి అత నింట్లో నీతిమంతురాలిలా మసలగల ననుకుని తాను తయారవడం పిచ్చిలో పైఅంతస్థు. అతని సుహృద్భావనూ, నైతిక వాతావరణంలో అలవర్చుకొన్న నడవడీ మటుకే లెక్కలోనికి తీసుకుందిగాని, అతడూ మొగవాడే అన్న సంగతి మర్చిపోయింది. అంతేగాదు, తన యీ ఖండాలవుటందమో! సమయాని కితని ఎదుట ఆరోజు స్టేషన్ హాల్లో తానందగత్తె నన్న విషయమే స్ఫురణకు రాలేదు.

తామిద్దరూ ఈ ఒంటరి కాపురం పెట్టకుండా అక్కడనుండి అలాగే తిన్నగా అతనింటికి వెళ్లిపోతే బాగుండేది. అతనిభార్య, కొడుకూ, ఆవాతావరణంలో......

లాభంలేదు. ఎప్పుడో ఒకనాడిది జరిగి తీరేదే! సైభాగం నగునుచేసి ఇల్లు కట్టుకున్న తర్వాత కాకుండా ఇప్పుడే ఈ అగ్నిపర్వతం బ్రద్దలవడం మంచిదే అయింది.

ఇక్కడే—అప్పుడే మూడురోజులైంది.

ఆ వేళకూడా అంతకు క్రిందటిరాత్రిలాగే ఇద్దరూ విడివిడిగా రెండు మంచాలుమీద పడుకున్నారు మొదట... కాని......

తనదే తప్పు. మొగంవాచిపోయి ఉన్నదానిలా అతడు తెచ్చిన విలాస వస్తువు లన్నీ ఉపయోగించుకుని సన్నని మెరమెరలాడే తెల్లని వాయిల్ చీర కట్టుకుని తయారయింది తాను. తనకంటే అంతపై ఎత్తులో ఉన్న అతన్ని క్రిందకు పడగొట్టాలని తనలో దాగిఉన్న అహంభావపు పట్టుదలేమో!

మూడురాత్రిళ్లు!

ఇదివర కెప్పుడూ శరీరానికింత పవిత్రత ఉందని తనకు తెలేదు. ప్రతి ఫలాపేక్ష లేకుండా మరొకరి కానందం ఇవ్వగలశక్తి తనలో ఉందనే తానెరగదు.

ప్రతి ఫలాపేక్ష లేదా తనకు? తాను పొందిన అతిలోకమైన ఆనందం? కాదు—అపేక్షించి పొందలేంది తాను.

తన కతడు ముందు జీవితానికి చూపుతున్న వెలుగులు? ఆ ఉద్దేశ్యమే తన మనసులో లేదు.

ఉంటే అతన్నావిధంగా చేయనిచ్చేదే కాదు తాను.

ఇప్పుడు మరి లాభంలేదు. మళ్లీ తెరలు తెరలుగా శాశతి వచ్చింది దుఃఖము.

ఎక్కడెక్కడికో వెళ్ళి మళ్ళా అతడు తిరిగి వస్తూనే ఉన్నాడు తన దగ్గరకు.

అతని సత్యవతీ, అతని మధూ, ఎందుకు జ్ఞాపకం రారతనికి? తనకీ విధమైన సంబంధంగల యువతిని తీసుకువెళ్ళి ఎలా ఉంచుదామనుకున్నాడు వాళ్ళ నడుమ!

ఈ ఆలోచన లతనికి వస్తే తనింత బాధ పడవలసిన అవసరమే ఉండేదికాదు. ఎంత అమాయకుడతను, తన జీవితానికతి ముఖ్యమైన ఘట్టంలో నిశ్చయానికి వచ్చే గురుతరమైన బాధ్యత ఒకపటుత్వం లేనిచేతిలో ఉంచి తనకేమీ సంబంధం లేనట్లే తిరుగుతున్నాడు! అతనికా బాధ్యత ఉన్న స్పృహే లేనట్లుందసలు.

లేచి కూర్చుంది. మెరుపు కొట్టినట్లుగా జ్ఞాపకం వచ్చిందిందాకటి కల.

అవతలిగదిలో ఆ నవ్వులు వినలేక పోయిన తాను చివర కొనదాకా మూసి ఉన్న తలుపులు పగులగొట్టి లోపలకు వెళ్ళి వాళ్ళ నెదిరించి నిలబడి గర్జించింది. ఆయన కళ్ళు జేవురించాయి. ఉగ్రమూర్తి అయి మీదకువచ్చి చావగొట్టారు. ఆయన దెబ్బలనుండి తప్పించుకుని ఆమెమీదకు వెళ్ళి కసితీరా కొట్టడం మొదలు పెట్టింది తాను. ముందామె తిరగబడింది కాని తరువాత బెదిరిపోయి పరుగెత్తి పరుగెత్తి ఒక అడవిలోనికి దూరింది. తానూ ఆమె వెనకాలే పరుగెత్తుకుని వెళ్ళింది అడవిలోకి. తమ వెనకాల ఆయనా వస్తున్నారు పరుగున. చివర కందరూ అడవిలోనే అల్లాడుతూ ఉండిపోయారు.

ఆకల అర్థం ఇప్పుడు బోధపడ్డది. భాను ఇంటికి తాను వెళ్తే, సత్యవతి సుఖపడినప్పుడు తాను ఆనందించలేదు; తాను ఆనందిస్తే సత్యవతి సుఖం పొందలేదు.

చివరి కిద్దరకూ నరకమే! భాను ఇద్దరి నడుమా నలిగి పోతాడు—

ఇన్నాళ్లుగా తన కందని మాధుర్యం అక్కడ దొరుకుతుందనుకోవడం వెర్రి—లాభం లేదు.

లేచి టేబిల్ దగ్గరకు వెళ్ళింది. లెటర్ పాడ్ అట్టపైన, "రెక్కలు చాచుకొని తీరికగా" నీలాకాశంలోనికి ఎగిరిపోతున్న గరుడపక్షి బొమ్మమీద వాలాయామె చూపులు. ఎంతనిశ్చలంగా ఉన్నాయి దాని కళ్లు!

బిగించిఉన్న పిడికిళ్లు విప్పి, ఎంబ్రాయిడరీ జాగ్రా ఉంచిన అట్టపెట్టెలోనుండి పెన్సిలు తీసి టేబుల్ దగ్గరకు కుర్చీ లాగుకొని కూర్చుని లెటర్ పాడ్ విప్పిందామె.

పాలమీగడలా తెల్లగా ఉన్న దా కాగితం, తానాతని కిదివరకు చెప్పని నిజమంతా రాయమని ప్రోత్సాహిస్తూ.

*　　　　*　　　　*

ఆ హోటలు ముందుహాల్లో గడియారం సాగో పది నిమిషాలకు ఎనిమిది గంటలు కొట్టబోతుండగా గోధుమరంగు చీర కట్టుకొన్న ఒక ఆడమనిషి హోటలునుండి వెళ్ళిపోవడం చూసి, "ఎవరది?" అని అడుగబోయిన మేనేజరు ఆమె ముఖం నిదానంగా పరిశీలించి మళ్లీ ఊరుకున్నాడు.

కాని అతనికి వింతగా తోచాయి, హోటల్లోకల్లా నాణ్యమైన ఎక్కువైన గదుల వరసలో ఉండే స్త్రీ చేతిలో కనిపించిన మాసిన ఆకుపచ్చని చీరా, నీలి దువ్వానా.



# మెట్రోపాలిటన్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

(హెడ్డాఫీసు: కలకత్తా)

**1950** లో పూర్తిచేసిన నూతన వ్యాపారము రు **7** కోట్ల **7** లక్షల **35** వేల **5** వందలు.

అన్ని జిల్లాలలోను ప్రతినిధులు కావలెను.

విజయవాడ బ్రాంచి:
నం. 17/167 స్వామి వీధి,
**గాంధీనగర్, విజయవాడ.**



మద్రాసు బ్రాంచి:
నం. 52/53 తంబుచెట్టి వీధి,
**జి. టి. మద్రాసు.**




# మైయర్సు పంపులు

జగత్ప్రసిద్ధిగాంచినవి



* బుల్‌డోజర్, ఎజెక్టా పంపులు,
* విండ్‌మిల్లు పంపులు,
* స్ప్రే పంపులు కలవు.

వివరములకు నేడే వ్రాయుడు:

అన్ని విడిభాగములు సదా సప్లైచేయగలము.

# వాటర్ సప్లై స్పెషలిస్టుల లిమిటెడ్.,

23/24 సెకండ్ లైన్ బీచి, మద్రాసు-1.

# ఆంధ్రుల నలలారింపగల ఉత్తమచిత్రం ఈ నెలలో విడుదల




డిస్ట్రిబ్యూటర్లు :

| ఆంధ్ర : | చిత్తూరు, దత్తమండలాలు : | ఇతర వివరాలకు: |
|---|---|---|
| రాధాకృష్ణాఫిలింసు, రాజమండ్రి. | నేతాజీ ఫిలిం డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ, ధర్మవరం. | రవీ పిక్చర్సు, రాజరత్నా బిల్డింగ్, హాస్పిటల్ రోడ్డు, రాజమండ్రి. |

నేడే శాంపిల్ చూడండి.

## మీ శిరోజములకు గొప్ప వరప్రసాదము

# కామినియా ఆయిల్ రిజిష్టర్డు



కేశపోషణకు కావలసిన ప్రకృతి సిద్ధమైన దినుసులు కలిగిన తలనూనెను శ్రద్ధగా ఎంచుకొనటంలోనే ముఖ్యంగా మీ కేశసౌందర్య మాధారపడియుంటుంది. వెంట్రుకల ముస్తాబుకు సొంపైన **కామినియా ఆయిల్** సాటిలేనిది. వెంట్రుకలు రాలిపోవటం, నెరవటం, బిరుసెక్కటం, చుండు మొదలైన తలచర్మము, కేశముల సంబంధమైన అన్ని అనారోగ్యములను నివారించును మెదడును చల్లబరిచి ఆరోగ్యవంతమైన నల్లని కేశముల వృద్ధిపొందించుటకు తోడ్పడును. దీని—మనోహర పరిమళము ఈరోజున కూడా అపూర్వమైనది.

## పరిమళముల రాజు ఆటో దిల్బహార్

(రిజిష్టర్డు నం. 777)

మజాగా ఉండే ఈ ప్రాచ్యదేశపు అత్తరుయొక్క ముగ్ధ పరిమళం జగత్ప్రసిద్ధము. ఇది ప్రశస్తమైన జాజి, మల్లెపూలసారము. "అత్తరులరాజు"గా ప్రజానీకంలో ప్రసిద్ధమైనది. ప్రతివారికి అందుబాటులో నుండు ధరలకు అనేక సైజులలో దొరకును. అన్నిచోట్లను అమ్మబడుచున్నది.

పోస్టేజికి నాల్గణాల బిళ్లలు పంపి శాంపిలు ఉచితముగ వాడి చూడండి.

పోస్టేజికి ఒకటిన్నర అణాబిళ్ల పంపి ఒక శాంపిల్ ఉచితముగ వాడిచూడండి.




## కేటి వైట్ రోజ్ ఆయిల్

(రిజిష్టర్డు నం. 777)

ఇది లావణ్యమగు (తాజా) గులాబిపూల అద్భుత పరిమళము కలది మెదడుకు చలవచేయును. కేశపోషణకు ఆదర్శప్రాయమైన నూనె.

మీరు అంగడికి వెళ్లినప్పుడు కేటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. 777 ను మాత్రమే కోరండి. ప్రత్యామ్నాయమేదీ అంగీకరించకండి. అదే విధముగా పేరొందిన దిగువ నూనెలుగూడ ఒకసారి వాడండి.

## కేటి పుష్పసేన తలనూనె నెం 777
## కేటి పుష్పమాలతి తలనూనె నెం 777

# కేటి ఆటోరోజ్ (రిజిష్టర్డు నం. 777)

మనోహరమైన నవ గులాబిపూల కమ్మటి సువాసనను స్వచ్ఛముగా నిరూపించును. మిక్కిలి నిగ్గుదేర్చినది గనుక విశేషకాలము నిలుచును. అత్తరుల ప్రేమించేవారి కతి ప్రియమైన యీ సెంటు ఒక్కమారు వాడితే చాలు. మిమ్ము ను ముగ్ధపరచును.




# ఆటో మధుకర్ (రిజిష్టర్డు)

అసదృశమైన యీ క్రొత్త అత్తరును ఒకసారి వాడిచూడండి.

పోస్టేజి మొదలగువాటికి నాలుగణాల బిళ్లలు పంపి ఉచితముగ శాంపిలుకు వ్రాయండి.

Sole Agents:

**ANGLO INDIAN DRUG & CHEMICAL CO., BOMBAY, 2.**

# ధీరోదాత్తత



శ్రీ ఆదిభట్ల రామమూర్తి

## ౧

[అచ్యుత అళియరామరాయల కాలమున విజయనగరమునకు సామంతుడై పాండ్య దేశమునకు మధురయె రాజధానిగ నెలకొని దాదాపు ముప్పది వర్షములు (1534 - 64) మిక్కిలి వితరణతో దక్షిణప్రాంతము నేలి, సామ్రాజ్యమునకే కీర్తిగడించి ఖ్యాతిగన్నవాడు విశ్వనాథనాయకుడు. తంజావూరున ఆంధ్రప్రభుత్వ మేర్పడుట కిదియే మొదలు. మధురను పాలించిన నాయకవంశపరంపరకు మూల పురుషుడు. రాజాజ్ఞ శిరసా వహించి, తండ్రినే యెదుర్కొనిన మహాస్వామిభక్తుడు......అళియరామ భూపాలుడు.]

ద్రోహకుని బందిచేసి, ప్రభుశాసనముల్ శిరసా వహించు నీ
శాసనమగు రాజభక్తికి నఖండ బహూకృతి కాదె యిద్ది; నా
శనమయె చంద్రశేఖరుని చావుతో పాండ్యకుల మ్మదెల్ల; కా
రణ మిటు లుంటచే మధురరాజ్యము నీదయె విశ్వనాథుడా! ౧

శిథిలపు గొత్తళమ్ముల విశీర్ణపు గోటల నుద్ధరించి, డె
బ్బదియును రెండు రాజ్యపు విభాగముల్ సరిచేసి, రాజ్యసం
పద యభివృద్ధికాగ పరిపాలన జేసెడు రాజనీతికో
విదమణి వీవు; నీ కెదురువిప్లవ మున్నదె- నాగమాత్మజా? ౨

అరియనాథ మొదలియార్, కేశవప్పల
మంత్రి, దండనాథమణుల జేసి;
అరవ తెలుగు భేద మంత మొందించి, తా
దర్శ మయ్యె నీవిధాన మెల్ల ౩

వార్త యదేమి? దేవర! యుపద్రవ మున్నె? అశాంతి మోమునన్
వర్తన మాడుగా! అరియనాథుడు సైన్యసమేతుడౌచు భూ
భర్తల సత్వరాజ్ఞకయి వంగి జోహా రొనరించు నింతకున్
మార్తుర దెవ్వరో కద? అనర్థ మదెట్టి విషాదమో కదా! ౪

సరి, సరి, పూర్వపాండ్యులకు జ్ఞాతులమన్న యసూయ బెంచుచున్
చిరము విరోధులైన కులశేఖరులాదిగ పాండ్యు లేవు రీ
వరకును పాళెగాండ్రగుచు, పాళెపు రాణువ గట్ట మాని, యా
పరిసర భూములన్ దిరుగుబా టొనరింపగ నుద్యమింతురా? ౫

కొమ్మల్ దిర్గిన సాహసమ్ము మధురాక్షోణీశుపై నెత్తి, రా
జ్యమ్మున్ జేకొనసెంచి గైకొను ప్రతిజ్ఞాదీక్ష! పట్టాభిషే
కమ్మయ్యెన్ కులశేఖరుండు బిరుదాంకాల్ తోడ "తెన్కాశిలో"
తమ్మల్ నల్వురు నాణిముత్తెముల శ్వేతచ్ఛత్రమున్ బట్టగన్ ౬

అయయయో, ఏమది? విప్లవమ్ము బహిరంగాకారమున్ దాల్చెదున్.
'కయటత్తూరు'న సైన్యవర్గము లసంఖ్యాకమ్ముగా జేర్చుచున్
క్రియకున్ బూనిన తెన్గుశాత్రవదళానీకమ్ముల న్నొంచుచున్,
జయమున్ గైకొనె పాండ్యపంచక మఖండఖ్యాతియై దేవరా! ౭

అపజయ మెట్టిదో యెరుగనట్టి బలాఢ్యుడు ఆర్యనాథుడే
తెపతెప జూచుచుండెను, విధి న్నిరసింపగ శక్యమౌనె? యీ
నెపమున త్వద్గుణోత్తమమణీఘృణిలోకము నిండబోవునే
అపజయమన్న శాశ్వతజయమ్మునకున్ దొలిమెట్టులే కదా! ౮

స్వయముగ సైన్యముల్ నడపి శత్రుల నుక్కడగింపనెంచినన్
జయమది యెంతకున్ శశవిషాణమహో! యిరువాగులన్ నృప
ద్వయమునకై యసంఖ్య భటవర్గము లాజిలో రోజురోజుకున్
క్షయమగు; తత్కుటుంబ జనకంటక ఘోషణ మక్షయమ్ముగాన్. ౯

తెగిన భటాళి ఘోషల ప్రతిధ్వను లిచ్చె దిశాళి; నెత్రుటా
పగలు ప్రవాహ మయ్యె! పరిపంథుల దోర్బల మింక లేదు; ఈ
పగ నిక నాప వేరొక యుపాయము లేదె? త్వదీయ చిత్త మెం
తగ విలపించుచున్నదో వృథా నరహత్యల జూడలేకయో! ౧౦

౨

ఇన్న మనస్కతన్ ప్రభు! లిఖింతు వదెవ్వరి కుత్తరమ్ములా
గున్నది; యంశ మెద్దియొ దురూహ్యమదే కొలువుండి పాండ్యులున్
స్విన్నముఖాబ్జులై; విజయభేరులు మ్రోగుచు నుండె; నంతనా
పన్నమయెన్ త్వదీయ పరిచారకు డల్లదె, కొల్వుగూటమున్ ౧౧

వీరన్నపోచితోద్ధృత గభీప్లుత దృక్కు, లుదార ధీర వి
స్ఫార శుభాననమ్ములు, ప్రశాంతగుణస్థిత తాజనా బ్యహా

త్సార మ్మదుస్మితమ్ములు, ప్రసన్నతనూలత లొప్ప బాంధవ్యులన్
గౌరవబుద్ధి చారుని సుఖాసనమం దుపవిష్టుజేయుచున్ ౧౨

సాదరభక్తి త్వత్కుశల మడ్గుచు జయ్యన దివ్యరత్న వ
స్త్రాదుల పీడుకొల్పిరి, ప్రజాక్షయకారక ఘోరయుద్ధ వి
చ్ఛేదము, లోకసంగ్రహావిశిష్ట ముదారమునౌ వినిర్ణయం
బేది లిఖించితో సభప్రవ్యాప్యము;విందము లేఖనార్థమున్ ౧౩

“మధురాధీశుడ నేను, కప్పమిడు సామంతాధిపుల్ మీరు, నా
కెదురుం దిర్గిరి, వీరభోజ్యమె కదా యీ రాజ్య మెల్లప్డు, నే
నది కాదందునె, క్షాత్రరీతి? మనకై యాశేండ్ల యుద్ధమ్ములన్
నదులై పారెను సైన్యరక్తము లనంతప్రాణి నష్టమ్ముగాన్; ౧౪

కరములు కాళ్లు లేని క్షతగాత్రుల రోదనమెల్ల భూనభోం
తరములు నిండిపోయె; కదనస్థలి పీనుగుపెంట లయ్యె; మే
దురమయె బంధు దార సుత దుఃఖము, లందరు గోలపెట్ట ని
ర్వ్యరము జనాళి కట్టుసురు పోసుకొనం దగవౌను భూవరా! ౧౫

మన యుభయుల దీర్ఘాజియె
పనిగా లక్షలకొలంది బలియై రింకన్
గజాల మీ దురంతము
వినుతు నొకటి దీని మాన్ప వినుడీ శ్రద్ధన్ ౧౬

ఏ నొక్కండను మీర లేవురును, వేరే యుద్ధమున్ జేత, మం
దేనే యోడిన రాజ్యమున్ విడిచి యట్లే గట్టుపుట్టమ్ములన్
కానం బట్టెద; మీర లోడిన నిదే కార్యమ్ము, దీనిం బ్రమా
ణానుష్ఠేయముగా స్మరించు చిది యంతన్ తామ్రపర్ణంబునన్ ౧౭

వ్రాసి, శిలాఫలకమ్మున
శాసన మొనరించి పోరుసల్పెదము, ఫలం
బేసరణి దోచునో మన
మాన్యతులన్ సమయబద్ధమై నడుపవలెన్. ౧౮

ఇదియె పోరాట మంచిదం చేను తలచు
వాడ, నింతకు మించి యుపాయ మున్న
తెలుపు డే నట్లు నడచెద; దీని మీరు
సమ్మతించిన సరె, జనసమ్మతమ్ము” ౧౯

భళిరా! యెట్టి యుదారసూచన; ప్రభుత్వమ్మన్న నిట్లుండగా
వలదే! నూతన మారణాద్భుత రణప్రాధాన్యముం బెంచుకొం
దలపుం బాంబు ఫిరంగి టాంకుల నియంతల్ నీకడ న్నేర్వగా
వలె పాఠమ్ములు విశ్వనాథ! దురహంభావంబు ప్రోదోయుచున్ ౧౦

## ౩

చేరె ప్రత్యుత్తరము "దేవ! చిత్తగింపు
డీ! మహారాజ మన్నరాజేంద్రులైన
విశ్వనాథయ్యగారికి వినయగరిమ
పాండ్యు లొనరించెదుల్ విన్నపాధికములు ౧౧

ధీరోదాత్తులు మీరలు
ధీరత సూచించు గురుహితార్థము లోకో
ద్ధారకమును స్తవనీయం
బౌ, రాజా! నమ్మతింతు మందులకైనన్ ౧౨

మీ రొంటిగ మే మేవుర
మై రణమును జేయ దగదు; మాలో నొకనిన్
గోరుకొను, డతడు మీతో
పో రొనరించున్ ప్రమాణముం గైకొంచున్ ౧౩

మాలో నెవడే నోడిన
జాలున్ మే మోడినట్లె, సాటి యొకనితో
నాల మొనరింపు, గెలిచిన
పాలింపుము రాజ్య, మడవిబట్టెద మేమే" ౧౪

మీ రొక రొకరిని మించిన
ధీరోదారులు కదండి; దేవర, మీ రీ
తీరు సహియింతురా? ఏ
మా రచనము? వెల్లడింపరా ప్రభువర్యుల్ ౧౫

ఎట్టి యౌదార్య మహా! జవా బేమి స్వామి?
"పాండ్యులకు మధుర నేత—సెబాసు మీ యు
దార ధీరత! యేవురు మీర లేక
కారణోన్ముఖు లౌట, నొక్కడను నాతో
పోర నగు, ధర్మబోధము పాలగ వింతు" ౧౬

౪

అదె రణభూమి! యుద్ధకవచాదుల దాల్చి, కరాసి బూని, మం
చిది హయరాజ మెక్కి, నిలిచెన్ ప్రభుపాండ్యనృపేంద్రు డొక్కడే
కదనము కాయిత మ్మగుచు, కళ్లెము ద్రిప్పటు చూచినావె నీ
యెదిరిని? యేమి వానితో వచింతువు, ముందుగ దాకుమందువా? ౨౭

సరె, యిక కాచుకొమ్ము పెలుచన్ ఝళిపించుచు ఖడ్గరాజమున్
గురి సరిచూచి నీ శిరసుకున్ భుజశక్తిని వ్రేటు వైచె, శ్రీ
హరి! యిక చూడజాల, కలయా, నిజమా, అదె రెండు తునకలై
ధర బడె వ్రేటు తప్పి నిశితాసి త్వదశ్వము దాకుచున్ భళీ! ౨౮

గండము తప్పిపోయినది; కాని, మరింకను నాల్గు వ్రేటులా!
గుండెలు దీయు సాహస! మొకొక్కని కొక్కక వ్రేసె! యెల్ల బ్ర
హ్మాండచరిత్రలో నిరుపమం బహో, ఇట్టి యుదాత్త ధీరతా
భండనరీతి! దేవ, మము పాలను ముంతువా? నీళ్ల ముంతువో? ౨౯

వ్రేసిన వ్రేటులెల్ల దలవెండ్రుకవాసిలొ తప్పిపోయె, నే
భాసుర మన్నెరాజ! యిటువంటి మహాద్భుత ఖడ్గయుద్ధవి
న్యాసము నెప్డు నేర్చితివి? ఆంధ్రుల తేజము కొజ్జబంతి వీ
వే సుమి; తెన్గుజాతి పులకించును నీ స్మరణమ్ముమాత్రచే ౩౦

తత్తడి దిగ నదె ధీరో
దాత్తుడు పాండ్యుండు వంతు తనదయె, వ్రేటిం
కెత్తెరగు తప్పకొనునో
కత్తులపై సాము క్షాత్రకఠినప్రతిభల్! ౩౧

కండల్ దిర్గిన బాహుదండమున ఖడ్గం బూని, ఆంధ్రాచ్ఛపుం
జెండా పై కెగురించి, హెచ్చరిక చేసెన్ విశ్వనాథుండు, దో
ర్దండాఘాతమువోలె దాకె నిశితాస్త్రం, బంత మధ్యమ్ముకున్
ఖండింపంబడి వ్రాలె పాండ్యుని తనూకాండమ్ము రెండై ధరన్! ౩౨



**కథానిక:**

# శ్రామికుడు

●

శ్రీ బలివాడ కాంతారావు

**1944** ఏప్రెల్ 1వ తేదీన విశాఖపట్నంలో ఆర్డినెన్స్ డిపో (*Ordnance Depot*) లో గుమాస్తాగా చేరాను. క్రొత్తగా తెరవబడివదవటంవల్ల అట్టే పని లేదు. పుస్తకాలు తెరచిన డ్రాయరులో పెట్టి చదువుకోవటం, పక్కవాడితో బాతాకానీలోకి దిగటం తప్పించి యింకేపనీ లేదు.

మా ఆఫీసుకు యెదురుగానూ, వెనుకస్థలంలోనూ కొందరు డిపో కూలీలు అప్పుడే తోటవేసే ప్రయత్నంలో వున్నారు. ఆ గేంగ్ మేస్త్రీ దుబ్బుగా చెయ్యెత్తు పొడుగు భారీమనిషి. చామన చాయగా వుండేవాడు. వయసు అరవై పడిలో వుంటుంది. పండిన మీసాలు బాగా ఒత్తుగావుండి గొర్రెపోతు కొమ్ముల్లా తిరిగున్నయ్. తలకి యెత్తైన పాగాచుట్టి, బొజ్జను గట్టిగా పట్టివున్న మోటు బనియను వేసేవాడు.

పనీపాటూ లేని నేను పనిపాట్లు చేసుకునేవాళ్ళ వేపు అప్పుడప్పుడు దృష్టి పోనిచ్చేవాడిని. ఒకనాడు ఉబుసుపోక "నీ పేరేంటోయ్" అని అడిగాను. "అప్పన్న బాబో" అన్నాడు. కానీ నేను తరవాత ఆ పేరెట్టి యెప్పుడూ పిలవలేదు. ముసలి వాడికి పర్యాయపదంలా "తాతా" అనే పదమే ఉపయోగించేవాడిని. రానురాను మా పరిచయం ద్విగుణీకృతమైంది. నే నొకనాడన్నాను. "గేంగ్ మేస్త్రీవి. కూలీలచేత నువ్వు పని చెయించాలి గానీ—నువ్వే పని చేస్తావెందుకు ?"

"ఎవరు సేస్తే యేంవుంది బాబో—తోట యేపుగా పెరగాలి గానీ" అంటూనే పారపట్టుకొని నేలను గొప్పు పెట్టున్నాడు.

ఎండనక, వాననక, కూలీలు పనియెగవేసినా పని చేస్తుండేవాడు. లంచ్ టైమ్‌లో కూడా తాతను తోటలో పని చేస్తుండగా చూశాను. చెమట నీరులాకారి మొక్కలమీద పడేది. పైనుంచి బొప్పాయ్, కొబ్బరి, అరటి యిత్యాది మొక్కలన్నీ తెచ్చి నాటేవాడు. మట్టుటెండలో మొక్కలు నాటడం చూసి "అవన్నీ పెద్దవై కాస్తాయా" అన్నాను.

మొక్కను పాత్తూనే "ఓర్పు బాబో—ఓరిస్తే కోడిగుడ్డు సకైడౌతుందంటారు." అన్నాడు. ఇదివరకెప్పుడూ వినని యీ పల్లె సామెత వినగానే నేను మాటాడలేకపోయాను.

ఆ వారంలోనే ఒకనాడు తాత ఒక కవరు తీసుకొచ్చాడు. వాడి కొడుకు వ్రాసిన వుత్తరం అది. వంద తప్పులతోనూ, వంకర టింకరలతోనూ వుంది. చదివి వినిపించాను. అంతావిన్నాక చ(స)రున లేస్తూ "అదూ, అడి తలలోని పేనీ వస్తాది. యెదవకి సాలాకాలం బట్టి ఒళ్లు బలుసెక్కిపోనాది" అన్నాడు.

"నువ్విలా అంటే యెలా తాతా? వాడికి శెలవు దొరకద్దూ" అన్నాను. "ఇదంతా యేసం బాబూ! ఆడెంత మిలిటరీవోడైపోయినా యీ జెబ్బవంచేనేడు సే. ఈనాడు కాకపోతే యింకో నాడు రాడా ?"

"ఏం వొచ్చింది ?" అన్నాను అసలు గుట్టు లాగుదామని.

"ఎందరు పోనారు ? ఆ డొక్కడేనా. ఆ గుంట పుట్టిన దగ్గిరనుంచీ యీడిపేరె యెట్టేసాం. మాదగ్గిరోల్లే. రారా పెళ్లి సేస్తానూ అంటే యీడికి గోరోజనం యెక్కువైనాది. యీడికి పెద్ద పెళ్ళాం కావాలట !"

"మంచిదే కాదా" అన్నాను.

"అదా బాబూ సెప్పినావు. ఇప్పుడు పెద్దదాన్ని సేస్తే యీడింకా రెండు, మూడేళ్ళదాకా మిలిటరీనించి రాడుకదా— అదేం తిరుగులు తిరిగితే నా మీసం వుండెందుకూ ? ఈ గుంటని సేసుకుంటే ఆ డొచ్చేసరికి కాపరానికొస్తాది." అంటూ వుత్తరం పట్టుకొని వెళ్లిపోయాడు.

అప్పుడప్పుడు తాత పనిచేస్తూనే మంచి మంచి కబుర్లు చెప్పేవాడు. తోట యిన్స్పెక్షన్ (*Inspection*) చేస్తున్నట్లు అక్కడక్కడే తిరిగి తాత మాటలు వింటుండేవాడిని. రంగూన్‌లో దర్వానుగా వుండేటప్పుడు చూపించిన పౌరుషాన్ని, యజమాని మెచ్చియిచ్చిన బహుమానాన్నిగూర్చి చెప్పాడు. నేను అడిగాను. "అయితే రంగూన్‌లో యేమాత్రం గడించావ్ ?"

"గడింపు! కడుపుకిబాగా తిన్నాను. రోజు కోక్కోడియే సోలం. తిన్నదే దోదక్కోలు—జపానోడు బాంబులేసేటప్పుడు యిలా ఒల్లు దిట్టం లేకపోతే నడిసిరాగలవా బాబో" అన్నాడు. నిజమే, అన్నట్లు నా తల నాకు తెలియకుండానే వూగివుంటుంది. బర్మావాళ్ళ అచార వ్యవహారాలు, డిపోకు మూడుమైళ్ళదూరంలో వున్న వాళ్ల పల్లె విషయాలుకూడా చెప్తుండేవాడు.

ఆ నెలలోనే ఒకరోజు ఉదయం పనిలోనికి రాగానే నా టేబిల్ దగ్గరకువచ్చి "నా కొడుకు వచ్చాడు బాబూ—వచ్చే వారంలో పెళ్లి" అన్నాడు.

"ఆపిల్ల నేనా ?" అన్నాను.

"దాన్ని కాక—యేం వుండగా ఆడిమాట పెట్టుతాడా ?"

నాలో రేగిన సంశయంకొద్దీ "యింత తొందరేం వొచ్చిం" దన్నాను.

"పెద్ద గాడిదనా వున్నాడు. అడి కింకా సెంబుడె నీరు పొయ్యకపోతే వూళ్ళోవాళ్లేమనిపోతారు? పెళ్లయినాక పోకిరీయే పాలు మాని అడి గుర్రానికి ఆజే గడ్డేసుకుంటాడు."

నే నేమీ మాటాడలేదు. ఏక్టివ్ సర్వీసులోని కెళ్లబోయే వాడి కెందు కంటగట్టడమని నే ననలేకపోయాను. పెళ్లికి వెళ్లలేదు గానీ ఆ విషయాలన్నీ తాతద్వారానే విన్నాను. ఏకరాత్రిలో డుబ్—డుబ్ మనిపించేశారు.

ఏనాలనాడు తాగడానికీ మాంసాలకీ ఖర్చు, పెళ్ళిఖర్చు కంటే హెచ్చే అయ్యిందట.

## ౨

కాలగర్భంలో కొన్ని నెలలు క్రుంగిపోయాయ్. తాత యథావిధిగా కష్టపడుతున్నాడు. చరిత్రలో ఆరోజుల్లో తెచ్చిన తీవ్రమైన మార్పులు నాలో సంశయాలను రేగగొట్టినా తాత నిశ్చింతగా వున్నట్లు గుర్తించాను. 1947 సంవత్సరంలో కాలుపెట్టాం. మే మున్నది అతి తాత్కాలిక వ్యవహారశాఖ కాబట్టి దినదిన గండంగా బ్రతుకుతున్నాం.

ఒకరోజు తాతను పిలిచాను. చెప్పాను. తాత ముక్కుమీద వేలు వేసుకొని "తెలీక అడుగుతాను గానీ—యీ ఆఫీసులు మూసేస్తే—యీ సెట్టులు, యీయన్నీ దండగే కదా" అన్నాడు.

"నేవల్ ఆర్మమెంటుడిపో వాళ్ళకి యివన్నీ అప్పచెప్తా" రన్నాను.

"అలు మనల్ని తీసుకోరా?" అన్నాడు.

"ఇప్పుడు మన అవ రం లేదు" అన్నాను.

"పోనీలే బాబూ—పుట్టించినోడు పెట్టకపోడు. ఆ వొచ్చిన మారాజులేనా యీతోట ఫలసాయం తింటే పున్నె మేనా వస్తాది." అంటూ వెళ్లిపోయి తోటపనిలో నిమగ్నుడైపోయాడు.

1947 మార్చి 31 తేదీ—ఆవేళ నేను యిటూ అటూ పనిమీద పరుగెత్తుతున్నాను. తాతకు ఆఖ్రోజు అదే. మట్టమధ్యాహ్నమప్పుడు గాలిదుమారం రేగింది. నే నప్పుడే కేంటీన్లో భోజనం చేసి వస్తూ దుమారంలో చిక్కుకున్నాను. ఎలాగో ఆఫీసు చేరుకునేసరికి తాత తోటలో పనిచేయటం గమనించాను. రెండు బొప్పాయిచెట్లు కూలిపోయినాయ్. మిగతా చెట్లు కూలిపోకుండా కొయ్యలు పాతటం గమనించాను. దుమారం ఆగాక తోటలోనికి వెళ్లాను. కూలిపోయిన చెట్లదగ్గర నిల్చొని గాలిని తిట్టూ విచారిస్తున్నాడు. "ఈవేళతో నీకూ యీ తోటకూ సంబంధం తెగిపోయిందికదా—ఎందు కింత శ్రమపడుతున్నా" వన్నాను.

"ఇంత పెద్దకాయలు కాసేవి యీ సుట్టుపట్టున లేవు బాబో—తొందర గాలి కడుపు సేసుకుం" దన్నాడు. వాడి బాధ స్ఫుటంగా అగుపించింది. కొంచెం దగ్గరగా వెళ్లి "రేపటినుంచీ యేం చేస్తావు తాతా?" అన్నాను.

"ఎక్కడో కూలిపని"

"దొరుకుతుందా?" అన్నాను.

"నే నేం పాపం సెయ్యలేదు బాబో—పొట్టై కరవటానికి. నిజంమీద యెళ్లేవోడికి బగమంతుడు నిజంగానే సూత్తాడు."

నా యెదరగా వున్న నిదర్శనంబట్టి "నా కేం నమ్మకం లేదు తాతా" అన్నాను. తాత వాడిపోయిన ముఖంలో చప్పున నవ్వు ప్రత్యక్షమయింది. "రా బాబో! వయసులో గడించిన డబ్బైనా వయసొచ్చిన కొడుకైనా వుండా లంటారు. ఆ గాడిదున్నాడు గాదా? అలాగే గడిసిపోతాది." అభినయంతో నోటి తుంపరలు పైకి విరజిల్లి యీ మాటలు పూర్తిచేసినవెంటనే, నేను చెప్పాను "వాళ్లకి గుమాస్తాలే కావాలట! మన దొర నన్నురిక మండు చేశాడు. నేవీవాళ్లు నన్ను రేపటినుంచి తీసుకుంటున్నారు." తాతముఖం చేటంతయ్యింది. నవ్వుతూ "మంచిది బాబో రాత కోతా సేతనైన బాబువి. నీపాపకాన మాక్కొంత యేనాడైనా ఆదరువు దొరుకుతాది." అన్నాడు.

## ౩

నేను నేవల్ ఆర్మమెంటుసర్వీసులో చేరిన వారంలోనే యెవరైనా బొంబాయి బదిలీమీద వెళ్తారా అని అడిగారు. బొంబాయి చూడాలని చాలాకాలంనించి వుండటంవల్ల మొదటి వాలంటీరును నే నయ్యాను. అదీ కాకండా మా పెదనాన్న అల్లుడు రిజర్వుబ్యాంక్ ఆఫ్ యిండియాలో పనిచేస్తున్నాడు. ఇక్కడలా హోటల్లో బాధపడే అవసరం లేదు.

బొంబాయిలో 1949 జూన్ నెలాఖరువరకు వున్నాను. తరవాత తూర్పుకోస్తాకు బదిలీకోసం మా నాన్న వుత్తరాలలో బలవంతంచెయ్యటంవల్ల ప్రయత్నించాను. అదృష్టవశాత్తూ విశాఖపట్నం బదిలీఅయ్యింది. జూలై మొదటివారంలో పనిలో చేరాను.

ఒకనాడు మొదటి ఆట సినీమానించి గేటుదాటి రోడ్డుమీదకు వచ్చాను. కారుహారను విని ప్రక్కకు తప్పుకుంటుంటే 'బాబో' అన్న కేక పేలవంగా వినిపించింది. ఎక్కడో విన్న గొంతుకలా వుంది. ఆగి చప్పున చుట్టూ చూశాను. వస్తున్న కారును లక్ష్యంచెయ్యకండా ఒక రిక్షా నావేపు వస్తోంది. "సాలాకాలానికి కనపడ్డావు, కూర్చో బాబో నాగేస్తాను" అన్నాడు. గొంతుకబట్టి తాత అనుకున్నానే గానీ ఆ మనిషిని చూస్తూ అలా స్తబ్ధుడ నయ్యాను. ట్రాఫిక్ ఒత్తిడివల్ల అక్కడ నిల్చొనే అవకాశం లేక పది గజాలు ముందుకు సాగాం. ఆ జంక్షన్లో మెర్క్యురీబల్బు వెలుగుతోంది. ఆ వెలుగులో బక్కచిక్కిన ముసలిగుబ్బలా దీనంగా మృత్యువును మౌనంగా పలకరిస్తున్నట్లున్న ఆ యెముకల పోగును చూశాను. తలమీద చింకి తలపాగైనా లేదు. మూతిమీద మీసాలు అకలికి చచ్చిపోయినయేమో! కళ్లు అరంగుళం లోతుకు పోయాయ్.

కుంభాకారంగా వున్న కడుపు పుటాకారంగా మారింది. నాకుయింకొక క్రొత్త కనిపించింది. పాదాలకు చింకి కేట్స్... నన్ను రిక్షామీద కూర్చోమని బలవంతం చేస్తున్నాడు. ఆ రిక్షా యెక్కితే నేను చాలా బరువుమనిషి నైపోతాను.

నా వెనకాలే రిక్షాతోనే మెల్లగా నడుస్తూ కుశలప్రశ్నలు వేస్తున్నాడు. నా సంగతి వేగంగా తేల్చేసి, తాత యిలా చిక్కిపోటానికి కారణ మేమిటని అడిగాను. "ఏదైనా జబ్బు గాని పడ్డావా?" అన్నాను. "తిండికి లేకపోవట మే జబ్బు" అన్నాడు. తరవాత హీనస్వరంతో చెప్పుకొచ్చాడు. "కూలి సేసినా కడుపుకి సాలేది కాదని యీ గాడీ కొనుక్కున్నాను. ఆడు అప్పుడే మిలిటరీనుంచి యెలిపొచ్చినాడు. పనిపాట్లు సెయ్యడు. కూలిపని కెల్లమంటే యెల్లడు. పోనీ గాడేనా నాగరా కూలీపనికి నాను ఎల్తానంటే నా నెక్కితానుగాని నాసతానా అంటాడు. నెలజీతం వొచ్చిన నౌకరీ చూపించు, సేస్తాను అంటాడు. నా నెక్కడ సూపించేది బాబూ. నా కే మారాజుల్ని తెలుసని? ఇలా రేతిరిపగలు, గాడీ నాగి, సానీరుమీద పాణం నిలబెట్టుకొని వోరానికి రెండు దపాలు యింటి కెల్తాను. పూరవతలే కాల్ని సగం డబ్బు నాగేస్తాడు. పెళ్ళాన్ని వొదిలేసినాడు. సానీరు రోజుకి యినమాటు వుండాలి. సిగిరేట్లు కాల్చడం యింతా అంతా కాదు. వోరానికి మూడు దపాలు పన్నెం బైస్కోపులకని వస్తాడు. బేరాలు వదిలేసి ఆడిని కూర్చోబెట్టి గాడీ నాగాల. ఆ యన్నిటికి నాను డబ్బివ్వాల. లేక పోతే తంతా నంటాడు. ఇన్నాళ్ళాగ పిక్కబలం వున్నాదిగనక నా ఆడిని యెదిరించటానికి. ముసిలివానిమీద సెయిసేసుకుంటాడు......"

ఇంతలో సందులోవున్న నా లాడ్జిని చేరుకున్నాం. తాళం తీస్తూ "అప్పుడప్పుడూ కనిపిస్తూవుండు. ఇక్కడే వుంటాను" అన్నాను.

"అలాగే బాబో—నన్ను మరిసిపోకండి" అన్నాడు చేతులు నులుపుతూ.

నేను ఆగాను.

"ఆ యెదవని మీ పాదాలదగ్గిర పడేసుకోండి."

"ఇప్పుడు ఖాళీలు లేవు. అయినా అలాంటి వెధవ వస్తే వంచి కష్టపడుతాడా ?"

"బాబో బాబో...నాలుగు సీవాట్లు తమరే పెట్టురుగాని... మరిసిపోకండి."

"చూద్దాంలే" అని ఒక పూత పదం పారేశాను. కాని లోపలకు వెళ్లాక కుర్చీకి చాలసేపటివరకు అంటుకుపోయాను. కష్టపడిన వాడి బ్రతుకు యిదీ !!

తాత అప్పుడప్పుడూ వస్తుండేవాడు. కొడుకు వుద్యోగంవిషయమై జ్ఞాపకంచేసి వెళ్లిపోయేవాడు. అప్పుడప్పుడూ రోడ్డుమీద యెదురుపడినా, వెనుకనించి బరువుతో వస్తున్నా నన్ను చూడగానే మెల్లగా పోతూ "దండం బాబయ్యా" అనేవాడు. ఒకనాడు సాయంత్రం నేను వచ్చేవరకు కూర్చునివున్నాడు. నా ఆలస్యానికి కారణం చెప్పాను.

"అడిగిపోమ్మేం పోకేంటి బాబూ ప్రారికేయిస్తే" అన్నాడు.

"తోటలు పెంచటానికి యివ్వు వెంటు చెప్పేవ్వాడు. అంచేత ఆతోట ఫలసాయం చవగ్గా పనివాళ్లకే అమ్మి, ఆ డబ్బుతో విత్తనాలు యెరువులు కొని తోట బాగుచేయమని దొర చెప్పాడు" అన్నాను.

"ఏం యితనాలు కొన్నావుబాబూ" అన్నాడు.

"అన్నీ యింగ్లీషువిత్తనాలే."

"పేరు పెద్ద వూరు దిబ్బ—అటికంటే మన దేశవాళీవి సాలా మంచి" వన్నాడు.

నేను నవ్వి యింకోవిషయం చెబ్దామని ప్రయత్నంమీద ఆపుకొన్నాను. తాత "నల్లమందుపిసరి నేను బాబో"అన్నాడు. నే నావిషయం గ్రహించనట్టుగానే "దున్నపోతుల్లాంటివాళ్లని ఎలా లాగుతున్నా"వన్నాను.

"దున్నపోతులా! కాదుబాబో - సాలా మంచోల్లు - ఏదో ఆలెక్కబట్టి మానోటికి బుక్కెడు గంజి."

"ఇద్దరేసి యెక్కి, లావుగ్గా పొంగులిస్తూ—" హేయంగా అన్నాను.

"సైకిలు రిక్షాలు వచ్చినాక నూబేరమే పడిపోనాది. అలాంటోలు నల్లమందు పిసరకేనా యిస్తారు."

"అంత తక్కువకు లాగుతున్నావా?" అన్నాను.

తాత ప్రసన్నవదనంతో "రా బాబో! కానీసాని బెళికిందా రూపాయి సాని బెళికిందా ? అదే పదేలు."

ఈ సామెతలు నానోటికి తాళాలులా పనిచేస్తున్నయ్. అవి మరచిపోకండా మనసులో ఎన్నోసార్లు అనుకోవటంతో అసలు విషయాన్ని విడిచిపెట్టుండాను.

అసలు తాత యెందు కొచ్చాడో కొంతసేపటికిగానీ జ్ఞప్తికి రాలేదు. నా జీవితవిధానంలో, నా రాబడి బట్టి నేను పేదవాడినే. పొదుపుగా ఖర్చు పెట్టుకున్నా కాఫీ త్రాగకుండా గడిపిన రోజులు లేకపోలేదు. పావలా కాసు తీసియిచ్చాను. సంతోషంగా తీసుకొని వెళ్లిపోయేముందు కొడుకు వుద్యోగం విషయం జ్ఞాపకంచేశాడు. అప్పుడు, ఆవేళ విత్తనాలు తెమ్మని డబ్బిచ్చేటప్పుడు యెస్టాబ్లిష్ మెంట్ ఆఫీసరుతో మాట్లాడిన విషయం చెబ్దామనుకున్నాను. గాని మళ్ళీ చెప్పకపోవటమే మంచిదని "చూద్దాం" అనే పదం పారేశాను.

ఆ వారంలోనే రెండుసార్లు కనిపించాడు. మొదటిసారి కొడుకు వేషాలు గూర్చి కళ్లల్లో నీటితో చెప్పుకొచ్చాడు. భరించలేని కోపంతో ఏదో అనేశాను. రెండోసారి కొంచెం సర్దుకొని చెప్పాడు. నా కోపంకు, నా మాటకు యెంత విలువయిస్తున్నాడో ఆ వేళే కొంచెం అర్థం చేసుకున్నాను.

మూడోసారి తెల్లవారేసరికి ఒంటిగానే వచ్చాడు. "రిక్షా ఏదీ" అని అడిగాను.

ఈ ప్రశ్నకు వెంటనే తాతకళ్లు నీటి మయమైపున్నాయ్. ముందుసారివచ్చి చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయ్.

"చెప్పు తాతా—ఏమైందో" అన్నాను. మనిషి గతుక్కు మనటం గుర్తించాను. కట్టుకున్న చింకి మాసిన గుడ్డపీలికతోనే వంగి కళ్లు వత్తుకుంటూ "వారం రోజులైనాది జేరం తగ్గిపోనాది... నల్లమందు పిసరుకే డబ్బు నేకపోతే... ఆడి రేసాలకి డబ్బు ఎక్కడ తేను... కోపం వచ్చి రాతిరి గాడీ యిరిసేసినాడు."

వెక్కుతున్న యీ మనిషి ఒకప్పుడు రంగూన్‌లో వీరుడని స్ఫురించి యిలాంటి దృశ్యాన్ని మాడవలసి వచ్చినందుకు బిక్క చచ్చిపోయాను. చాలసేపటికి.

"ఏం చెయ్యదలచావ్ ?" అన్నాను.

"ఏం సేస్తాను—ఇక అడుక్కు తినటవే—ఆ డక్కడ... నానిక్కడ..."

"ఇంత చేసిన ఆ వెధవని యింటినుంచి తగిలేలేక పోయావా ?"

"పూరోలు యేవనిపోతారు—యెంత సేసినా కనుకున్న పేణం. మనిసి మిగల్దుగానీ మాట మిగిలిపోతాది...ఆడు పంపిన డబ్బుతోనే పెళ్లి సెయ్యగా మిగిలినదాంతో గాడీ కొన్నాను. ఆడి డబ్బు ఆడే కాల్చుకున్నాడు."

నా కోపానికి యెంత విలువవుందో నాకర్థమయింది. యెంత సేసినా కనుకున్న పేణం అనే తాతమాటలు నా చెవుల్లో గింగురు మనటంవల్ల మౌనం దాల్చాను.

వెళ్లిపోయేముందు "మరిసిపోకు బాబో" అన్నాడు. తల ఆడించటానికైనా నాకు శక్తి లేకుండా పోయింది.

౮

ఆదివారం—నేను యింటికి రావటం చాలా ఆలస్యమైంది చేతిలో పూతకర్ర వుండబట్టి తాతను చప్పున పోల్చుకోలేకపోయాను.

"కర్ర పట్టుకున్నావేం తాతా" అన్నాను.

"తిన్నగా వడిస్తే యే బాబు ధర్మం సేస్తాడు? కర్ర పట్టుకొని సొట్టగా నడిసి కేకలేసి గుమ్మ గుమ్మానికి యెత్తే యే యమ్మకైనా కనికారం పుట్టాది..." అన్నాడు.

ఈసారికూడ కొడుకు విషయం జ్ఞప్తికి తెచ్చాడు.

ఆ వారంలోనే తాత మనుషులవెంట "ఒక్కానీ పడే యండి బాబూ...మీ తల్లిదండ్రికి పుణ్యం వుంటుంది బాబూ" అంటూ పడటం చూశాను.

ఒకరోజు సాయంత్రం కాఫీహోటల్లోనికి వెళ్దామని మొదటి మెట్టుమీద కాలు వేసేసరికి ఆ మెట్టుదగ్గరగా గప్చున తాత కూర్చుండటం చూశాను. తాతా అని పిలుచుందామంటే యేమయ్యిందో— గట్టిగా మూతిని బిగించుకున్నాను. కానీ తాత అరుస్తున్నాడు "గుడ్డివాడ్ని బాబయ్యా! నాలుగు—రోజులై కడుపు మాడిపోతంది బాబయ్యా...మీ తల్లిదండ్రికి పుణ్యం వుంటుంది బాబయ్యా..."

నేను వేసిన బేడకాసు తడుముకుంటూనే "ఈ మారాజుని బగమంతుడు ఒకకంట సూస్తాడు" అన్నాడు. కళ్లుమూసుకొని వున్న తాతవేపు అలా చూస్తుంటే ఆ ప్రక్కనే యింకో మనిషి "చొట్టదాన్ని బాబయ్యా...వారం రోజులై కడుపు మాడిపోతంది బాబయ్యా..."

ఇలాగ ప్రపంచంలో అరిచేవాళ్లందరూ నా చెవిదగ్గరే అరుస్తున్నట్లనిపించింది. వచ్చినదారంటే తలవంచుకొని లాడ్జికి వెళ్లిపోయి రుమాలు తీసుకున్నాను.

ఈ సంఘటన తరవాత తాత కొన్ని రోజులవరకూ అగపడలేదు. కనపడినా చూడలేకపోయేవాడినేమో!

ఆ నెలలో ఆఖరివారం. వాకది "పాపర్ వీక్". అసలే అప్పుపుట్టటం లేదు. రెండుసార్లు అగ్రికల్చర్ డిమాన్‌స్ట్రేటరు ఆఫీసుకెళ్లాను. డిమాన్‌స్ట్రేటరు చివరకు రానందుకు విసుక్కుంటూ యింటికొచ్చాను. అప్పటికి చీకటిపడింది. ఆ చీకట్లో వాకిట ఎవరో కూర్చున్నట్లు దూరంనించే చూశాను. నా కోసం కూర్చునేవాడు తాతే అనుకున్నాను. యేం వచ్చిందో యేంటో అని అనుమానిస్తూనే వున్నాను. బాధపడుతున్న వాళ్లకే యింకో కరిబాధలు అగుపిస్తాయ్. సానుభూతి తప్పించి యింకేవిధమైన సహాయం చెయ్యటం సాధారణంగా జరగదు.

నేను దగ్గరకు వెళ్లగానే తాత భోల్లున యేడుస్తూ రెండు పాదాలమీద పడిపోయి "నా కొడుకుని రచ్చించు బాబో" అని నాలుగుసార్లు నెత్తిని నా పాదాలమీద కొట్టుకున్నాడు.

లేవదీసి "ఏం వచ్చింది తాతా" అన్నాను.

"వారం రోజులైనాది. జొరం కాస్తంది. అదే పోతాదనుకున్నాం. మిలిటరీలో సర్రున సీదితే డాక్టేరు వస్తాడు. ఇంత జొరం వస్తే డాక్టేరుని ఎందుకు తేరని ఒక పేగోల—యీ సిన్న జొరానికి డాక్టేరేలని వూరుకున్నాను. యిప్పుడు వాకిటే సేశాం. వయిదుగుడు బాబుదగ్గిరికి కెత్తే జట్కా కరుసికి మందు కరుసికి పది రూపాయలు తెమ్మన్నాడు. నా దగ్గిర సిల్లిగవ్వ నేదు..."

ఆ చివరివాక్యం నేనూ మనసులో అనుకున్నాను. చప్పన—మాటాడలేకపోయాను. తాత శరీరం కుషి్కించినట్లుగానే మనో ధైర్యంకూడ కుషి్కించిపోయిందని ఆ యేడుపే చెప్తోంది.

"ని స్నేం బాగుచేశాడులే ఆ వెధవ" అన్నాను.

"అంతే అన్నావా బాబో! ఇంత హీనస్థపడి యెందుకు బతికున్నాను? ఆడిని సూసేనా? నేదా అంటే ఏ నూతిలోనో గెడ్డలోనో పడి సావనా ?"

తాత యీ మాటలు శోకంతో తబ్బిబ్బై పోతూ అంటున్నాడు. కానీ నా పరిస్థితి నన్ను తబ్బిబ్బు చేస్తోంది.

"ఆడు బాబుకి కోపం తెప్పించినాడు. నాను మీ పాదాలు పట్టుకున్నాను. సెమించండి, నా ముడుకుల్లో సెక్తి నేకపోతే అడుంటే తిట్టో కొట్టో బుక్కెడు గంజి పోస్తాడు."

నేను స్తంభించి పోయాను.

"ఆడు సస్తే ముసిలిది యే నూతిలోనో పడి సస్తాది. ఆ లిద్దరూ సస్తే నానుండి యేం సేస్తాను? ఆడుంటేనే నా వంశం నా బతుకూనూ. అంతా ఆడేనాకు, నాను ఆడికోసవే పుట్టాను... ఆడికోసవే రంగం వళ్లాను...ఆడికోసవే గాడీ నా గాను.—ఆడి

కోసవేం సద్దోణ్ణని, కంటోణ్ణని యేసాలేసి అడుక్కుతిన్నాను బాబో..."

ఈ బాబో అనేస్వరం వెయ్యిగొంతుకలు కలిసి యేడ్చేటట్లు నాకు వినిపించింది. నీరునిండిపోయిన కళ్లకు నా చుట్టుప్రక్కల కొందరు నిల్చొని వున్నట్లు గమనించాను. తలుపు తోసి లోపలకు వెళ్లి కుర్చీమీద వాలిపోయి జుత్తుపీక్కున్నాను.

కొంతసేపటికిగాని గాబరాపడ్డ నా మనసుకు ఒక విషయం జ్ఞప్తికిరాలేదు. ఇన్నాళ్లకి నా సంశయం తీర్చుకోడానికి అదను దొరికింది. తాతను లోపలికిపిల్చి పదిరూపాయలనోటు చేతిలో పెట్టూ "రేప్రొద్దున్నవచ్చి యెలావుందో చెప్పు" అన్నాను.

కాళ్లకుముద్దులాడి చీకటిలో లీనమయ్యాడు. ఆ రాత్రి నేను చేసినపనివల్ల ఆ మరుచటిరోజు ఆఫీసుకు శలవుపెట్టవలసి వచ్చింది.

ఉదయం తాత అగపడలేదు. నిరాశచేసుకున్నాను. మరుచటి రోజు ఎస్టాబ్లిష్‌మెంటు ఆఫీసర్‌తో చెప్దామనుకున్నాను. "ఖాళీ వస్తే యే ఎక్స్‌సర్వీస్‌మెన్‌ని వేస్తాననుకున్నావో నా డీప్రపంచాన్ని విడిచిపెట్టాడని"

సాయంత్రమైంది. ఉదయంనుంచీ తెలిసినవాళ్లందరినీ సిగ్గు విడిచి అడగ్గా పదిరూపాయలు అప్పు పుట్టింది. ఆ డబ్బుతో ఎగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు ఆఫీసుకువెళ్లి వచ్చేసరికి చాలా ఆలస్యమైంది.

నన్ను చూడగానే తాత ఒక్క నవ్వు నవ్వి చేతులెత్తాడు. "నోరల్లాపళ్లే, ఊరల్లా పెజలే. ఎందుకుబాబో? నీలాంటి బాబులు పదిమందుంటే సాలదా?" అన్నాడు.

తరవాత కొడుక్కు కొంచెం నయంగా వున్నట్లు, బ్రతుకుతాడని ధైర్యంగా చెప్పాడు. నా నోరు పెగల్లేదు. తాతవెళ్లిపోయాక అలా కూర్చొనే ఆలోచించుకుంటున్నాను. తాత ఒకనాడు చెప్పిన—మాటలు జ్ఞాపకానికి వచ్చాయ్. "నిజంమీద యెట్లే వోడిని బగమంతుడు నిజంగానే సూస్తాడని."

ఆ పదిరూపాయలు తాత వేసిన తోటఫలసాయం అమ్మగా వచ్చినది. ఎరువులకోసం ముందురోజు ఆ డబ్బుపట్టుకొని రెండు సార్లు తిరిగినా డిమాన్‌స్ట్రేటరు అగపడలేదు. ఎందుకగపడలేదనేదే ఒక జవాబు చెప్పలేని పెద్దప్రశ్న...

ఇదంతా చెప్తే తాతమాత్రం జవాబు చెప్పగలడని నా ఉద్దేశం—ఆచిన్న నవ్వుతోనే అంటాడు. "నన్ను రచ్చించింది—నా సెవలే" అని.

---

# మధుమాధురి



శ్రీ చింతలపాటి నరసింహదీక్షితశర్మ

శ్రీలు రేకెత్త సరిక్రొత్త చెలువు హత్త ప్రకృతి రమణీమనోజ్ఞ విభ్రమపదంబు,
సకల జాంతవహృదయతోషప్రదంబు దివ్యమధులక్ష్మి నేడు తోతెంచె నదిగొ. 1

చిలుక హుమావజీరుఁ బలు చిన్నెల వన్నెల పూవుటమ్ములం
జిలుగు హారంగు హంగు నగిషీల రచించి ధరింపఁజేయు నె
చ్చెలివి; సెబాసు, నిన్నొకనిఁ జేకొని కాదె జగంబులెల్ల బూ
విలుదొర మేటిజోదయి తపింపఁగఁజేయుఁ గడంక నో మధూ! 2

అచ్చపు మావు లేఁజివురుటాకుల జొంపము కెంపుసొంపులే,
నిచ్చలమైన చందిరపు నిగ్గుల నీటులహాసు నింప, ఁబై
పెచ్చుగ విచ్చు క్రొవ్విరుల పెంపుపసందులఁ జిమ్మ వెన్నెలై
హెచ్చు; వియోగిచిత్తముల నేకటబెట్టెద వేల? మాధవా! 3

గందపుఁ గొండదండఁ దిరుగాడెడు గాడుపుగుఁజ్జు డాత్మనా
నందము నొంది; ఫుల్ల సుమనస్తత సౌరభసారవీచికా
బృందము చింద నిన్నుపచరించును నీ వరుదెంచునంత, నీ
కుం దగు నందగాడెవఁడు, కోమలరూప! వసంతమోహనా! 4

సికవిరిపూవు ఱెత్తులను జేరిచి; కన్గవఁ దేటి నీటుకా
టుక జిగి రేకఁ దీరిచి గడుం దళుకారిగురాకు చేతిలోఁ
జికిలి పిసాళి మేల్పసిమి చేలచెఱంగు మెఱుంగులీనఁ బూ
సిక నిను డాయుచున్నది, వనీరమ "ముద్దుల పెండ్లికూతురై" — 5

ఎల్ల జగముల కానంద మల్లుకొనఁగ సరసనవసుమకోమలాస్తరణ రచన
సాయపడుదువు రతి పంచసాయకులకు; నామనీ! నీదు నీమ మే నేమనందు 6

పైకము వృద్ధియౌ, నలరుపద్ధతు లుద్ధతి కెక్కు మోడులుం
గైకొను గట్టిచేవ జిగిఁగాంచును గొమ్మలు పల్లవాప్తి, నా
జూకులు దీరఁ గామగుణశోభలు దిక్కుల మారుమ్రోగుఁ బు
ష్పాకర! నీ సమాగమమె హాయిగదా సుమనోముదాప్తికిన్ 7

అనఁగఁబెనంగి తేంట్లు కుసుమైకపుటీన్ స్రవియించుచున్న క
మ్మని విరిదేనెపానకము మాటికి జోటులఁగూడి యాని "ఝు
మ్మని" కలగీతికారుతి హాయల్ గొన నీ విజయంబు బాడఁగా
మొనసిన వందిమాగధసమూహమున న్విహరించు, మాధవా? 8

లోలకరప్రవాళములలో వలపుల్ దలపుల్ జిగుర్చ నం
దాలను జిమ్మ మోము సరదాలు సదా హసితోదయాల చం
దాలుగ, నీ వసంతవనితా లలితోద్యదపాంగభంగిమల్
రాలును మారు పూవుల సరాల వరాల శరాల పోలికన్ 9

కఱకుగ సానవెట్టి సహకారపరీమళ చూతమంజరీ
శరములఁ దోడినెచ్చెలులు చాలుకొనన్ మకరందమాధురిం
దిరిగెడు కోడె తుమ్మెదల దిమ్మల మారుని పేరుఁ జెక్కు మా
దిరిఁ దనరింతు నీ కెవరు దెల్పిరో? యీ నగిషీపనుల్, మధూ! 10

సుమనోవృద్ధికి నీవు కారణము, తేజోముగ్ధ వన్యేందిరా
రమణీశోభల కీవు తావు, కుసుమాస్త్రిస్ఫూర్తి నీయందుఁ గ
ల్గు మధూచ్ఛస్థితి నీ కవశ్యము ఘటిల్లున్ సాధనంబై రథాం
గమనోజ్ఞత్వము నీకుఁ జెల్లును వసంతా! మాధవస్ఫూర్తియున్ 11

ధీరతమైఁ బచేళిమ భిదేళిమ క్రమఫలప్రవాళ కా
హారము మెక్కి చొక్కి చెఱలాటము లాడు శుకీపికీతతుల్
సారెకు నుచ్చరించు సుమసాయకతంత్రకథావతారికా
కారికలన్, వసంత! వినఁగాఁ గనఁగా నగు నీ విలాసముల్ 22

కనరాని రాకపోకల లోకముల నేచు నంగహీనుఁ డొక నెయ్యంపుకాఁడు
బూతమై యందఱఁ బూసుక తిరుగాఁడు గాడ్పుగా డొక్క సంగాతికాఁడు
నిరతంబు ఘనమాధుకరవృత్తిఁ ద్రిమ్మరు తుమ్మెదవటుఁ డొక దోస్తికాడు
పడిపల్లవగ్రాహపాండిత్యపటిమఁ గుందెడు పరభృతుఁ డొక నేస్తకాఁడు
వీరి సఖ్యాన తొలిసారి రాక మొదలె నలువురినోట నానెదవు నీవు
మంచి సాంగత్యమే దాపరించె లెమ్ము, విధి బలీయమ్ము మధురజీవి, వసంత! 13

వేములు మీఱె కెంపు టరవిచ్చిన మోదుగమొగ్గనిగ్గు లో
హో, మృదుభావ! నిగ్గలసియున్న నఖున్నతనూత్నమంజులా
రామరమా కపోల కుచరంజిత వక్రనఖక్షతంబులై
యీ మధురప్రసంగముల కిక్కువ నిక్కువ మీవకా? మధూ? 14

ఆతిథ్య మొసఁగు నీ కనయంబు విరిసెజ్జ
లమరించి నందనోద్యానలక్ష్మి
స్వాగతం బిడు పల్లవాస్వాదకలకంఠ
రవళి నీ కెపుడు చైత్రరథరమణి
గారాముసేయ ని న్గాంచి కమ్మని పూవు
తావుల నొలుకు బృందాకుమారి
గారవించును మాక్షికాపూర మాధురీ
రసముల రాజదారామతరుణి
సకలకేళీవనేందిరాచారుతరళలోచనాంచల కళలసెళ్ళులకు. నీవ
తావలము;పల్లవితరాగ ధన్యమూర్తి! తరుణ కుసుమాకరా! సుఖోత్కర! జోహారు !!

తీరఁగ నున్న పుష్పాదుల తిన్నని తిన్నెలపై మధూళికా
సారము సారసౌరభవసంతముఁ బంతము లాడియాడి యా
జారుల జాణలైన యభిసారికలం దనరించె దాహముం
దీరిచి మేని సొక్కుఁ బసి తెమ్మెరవాపఁగ నీదయ స్మరా! 16

ఆమని! నాకు నీ పరిచయం బొకనాటిది గాదు, మెచ్చుకొ
న్నామని, నీ గుణంబు; వినినామని నీ మహితప్రశస్తి; క
న్నామని, నీ పదమ్మలరినామని నీ నవవిభ్రమాప్తి; ను
న్నామని హాయిగా, వలచినాము పెద్దలనుండియే సుమీ 17

క్రొంజివురాకుకన్న నతికోమలమై తగు భావరీతి శ్రీ
విం జెలువార నేరిపి కవిత్వ మధుగ్రహణత్వలీలలన్
రంజిలు నా విలాసినికరంబుల నందమునం బరీమళ
స్మంజరి మంజిమంబు "మధుమాధురి" మోహనము పెంపు నింపురన్! 18





"చిత్రకారుని ఇల్లు"

[లినోకట్ చిత్రము]

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

# సప్తనారీహంస

[ తరువాయి ]

న్నాయి. వాహననిర్మాణ సౌకర్యమునకు గాబోలు ఆంగిక నిర్మాణము కొంత కుదిరింపబడినది. దీర్ఘనాశిక, విశాల నేత్రములు, అగ్రచుబుకము, సన్నని నడుము, మంచి శరీరసౌష్టవము గల ఆ విగ్రహములు ప్రతిభావంతుడైన శిల్పియొక్క భావ సంపూర్ణతను వ్యక్తపరుస్తున్నాయి. వీరకట్టు, అలంకరణ విధానము, శిరోజముల ముడుపు, శిరోలంకరణములు ఒక శతాబ్దికి పూర్వమున గల హైందవ సంప్రదాయములకు మచ్చుముక్కలుగా ఉన్నాయి. నిర్మాణ చాతురికి ముగ్ధుడనై తదేకదృష్టితో ఆ వాహనాన్ని చూస్తూ కొంత దూరం నడచి, అనంతరం నా బస చేరుకున్నాను.

మరునాడు మహాశివరాత్రి. పల్లెప్రజలు వేలాదిగా, గుంపులు, గుంపులుగా ఆలయానికి పోతున్నారు. ఉదయమే లేచి నలుగురితోపాటు బయలుదేరివెళ్ళి పాదగయలో స్నానం చేసికొన్నాను. స్వామిదర్శనం చేసుకోవాలి. కష్టపడి, ఆ జనసమ్మర్దంలో త్రోవ చేసుకొని గర్భాలయంలోకి పోయాను. స్వామికి ఊపి రాడటం లేదు. తండోపతండాలుగా ప్రజలు వచ్చి చేసుకుంటున్న అర్చనలను నిర్లిప్తుడై స్వీకరిస్తున్నాడు స్వామి. అమాయక ప్రజలు భక్తితో చేస్తున్న సపర్యలను ఉన్నతదేహంతో స్వామి కెదురుగా నున్న నందికేశ్వరుడుకూడా బెదురుచూపులతో చెవులు నిగిడ్చి, చూడటంకన్నా ఏమీ అనలేకపోతున్నాడు. తీర్థప్రజలు, శాంతమూర్తియై చూపుతున్న ఓర్మినిబట్టి అరటి పళ్లను ఆ నందికేశ్వరుని ముఖానికి రాసిపోతున్నా ఉదాశీనంగా ఊరుకొన్నాడు గాని ఉగ్రమూర్తి కావడంలేదు. ఆ సమున్నత కృష్ణశిలామూర్తిలో చూస్తున్నకొద్దీ శాంత గంభీరముద్ర గోచరిస్తూనే ఉన్నది.

ఎన్ని చూచినా సప్తనారీహంస రూపం నా మనస్సులో అచ్చుగ్రుద్దినట్లయింది. భోగట్టాచేసి, ఆ వాహననిర్మాతలైన శిల్పుల కుటుంబీకులు ఆ గ్రామంలోనే ఉన్నట్లు తెలిసికొన్నాను. ఆలయంనుండి శిల్పుల గృహానికి వెళ్లాను. వారి యింటికి వెళ్లగానే ఒక దారుఖండాన్ని ముందుంచుకొని, దాని కేదో ఆకృతిని కల్పిస్తున్న ఒక వృద్ధశిల్పిని చూశాను. ముడతలు పడినా అతని శరీరంలో మంచి సౌష్ఠవం కనిపిస్తోంది. మెడలో లింగకాయ. ముఖాన విభూతిరేఖలు. వెనకగా గోడమీద నాలుగైదు అడుగుల ఎత్తుగల నందివాహనంయొక్క రేఖాచిత్రం వ్రాయబడి ఉంది. పైన యింటి కప్పుకు రంగులు సగం పూసినవి, పూయనివి, పాలవెల్లి, కొన్ని బొమ్మలూ ఉన్నాయి. ఇంచుక విద్యావంతులై స్వవృత్తులయెడ సాధారణంగా చూపే నిర్లక్ష్యభావంతో, బొమ్మను చెక్కుతూన్న ఆ వృద్ధుని తను కేమీ సంబంధంలేని అనాగరికుని చూచినట్లు చూస్తూ బయటికి ఒక తరుణ వయస్కుడు వచ్చి, ‘ఏం పనిమీద వచ్చా’ రని ప్రశ్నించాడు. ‘ఏమీ పనిలేదు. మిమ్మలనూ, మీ పనినీ చూచిపోదామని వచ్చాను,’ అన్నాను. ఈ మాటలు విని ఆ వృద్ధశిల్పి ఒకమారు తలయెత్తి నన్ను తేరిపార చూచాడు. వెంటనే ‘అయ్యా, ఆ గోడమీద గీసే రేమి’ టన్నాను. ‘బాబూ, అది వెంకటాయపాలెం గ్రామపెద్దలు ఈశ్వరుడికి నందివాహనం చేయిస్తున్నారు; దాని నమూనా! లోపలికి దయచెయ్యండి. వాహనం చూతురుగాని’ అని లోపలికి తీసుకొనివెళ్లాడు. తెల్లగా సుద్ద పూత పూయబడి హిమగిరి శిఖరంవంటి మూపురంతోవున్న వాహనం చూపించాడు. ఇంకా ఏవేవో తయారులోవున్న కొన్ని బొమ్మలనుకూడా చూపించా డాయన.

‘మీరు ఎంతకాలంబట్టి యిక్కడ వుంటున్నారు?’

‘మా తాతలనాడు యీ పిఠికాపుర సంస్థానానికి వచ్చి వారి ఆశ్రయంలోనే ఉంటున్నాము. కుంతి మాధవులకు, కుక్కుటేశ్వరులకే గాక యింకా అనేకచోట్ల మా తాతలు, తండ్రులూ తయారుచేసిన వాహనాలున్నాయి.’

‘ఏమండీ! ఇప్పటి రంగులవలె వివర్ణంకాకుండా పూర్వ కాలపు రంగులు కాంతిగలవిగా ఉంటాయే! దానికి కారణం ఏమిటో చెపుతారూ?’

‘మేము ఉపయోగించే రంగులు ఖనిజసంబంధమైనవి. ఇంగిలీకము, జుగాలీపచ్చ, నీలిమందు, అరదళము మొదలైన రాళ్లను తెచ్చి సుద్దకలిపి కావలసిన రంగులు మేమే స్వయంగా చేసుకుంటాము. ముఖ్యంగా యీ వాహనాలకు ఆ రంగులైతేనే కాంతి చెడకుండా ఉంటాయి.’

‘మీరు ఉపయోగించే కలాలు ఎక్కడ దొరుకుతాయి?’

‘మా కలాలు ఎక్కడా దొరకవు. మేక, ఉడత వెంట్రుకలతో స్వయంగా మేము కట్టుకుంటాము గాని, కంపెనీ కలాలు మా కెందుకండీ? కలం కట్టుకోవడమే చేతకాకపోతే ఇక రంగులు వేసినట్లే.’

‘మీరు తయారుచేసిన వాహనాలయొక్కగాని, ప్రతిమలకు, వాహనాలకు మీరు దిద్దవలసిన అలంకరణాల తాలూకు మాతృక చిత్రాలు ఏమైనా ఉంటాయా మీవద్ద?’

‘ఉగ్గుపాలతో వచ్చిన సంప్రదాయాలకు మళ్లీ నమూనాలెందుకు బాబూ! మా తాత చేసినది మా తండ్రికి వస్తే, నాపని నా బిడ్డలకు వస్తుంది. తోచినట్టు చిత్రం చెక్కుకుపోవడమే. చేయి సాపుదనం వుంటే ఏమీ అక్కరలేదు.’ అన్నాడు.

ఆనాటి నిర్మాణశక్తిని, భావనాపటిమను ఊహించగలమా అనిపిస్తుంది. చిత్రకారుని భావవీధిలో నున్న రూపం తూలికచే వ్యక్తమౌతుంది. కవియొక్క రసావేశమువలెనే కాబోలు. ప్రతిభావంతుడైన కవినోటినుండి ఏమన్నా కవిత్వమైనట్లుగానే ప్రజ్ఞావంతుడైన చిత్రకారుడు తన తూలికను ఎటుత్రిప్పినా చిత్రమౌతుంది. కొంత ప్రసంగం నడిచాక, శివాలయంలోని సప్తనారీహంస విశేషమేమిటన్నాను. ఆ శిల్పికన్నులార్ద్రము లైనాయి. ‘బాబూ! మా పితృపితామహులందరు నిత్య శివపూజాధురంధరులు. వారు శివానుగ్రహపాత్రులు. వారిముందు మేము అణుప్రాణులము. దానిని మా తాత ఎంతో శ్రమకోర్చి నాలుగు మాసాలాలోచించి చేశాడట. ఆయన సంకల్పించిన మూడువాహనాలలో ఇదొక్కటిమాత్రమే నేటికి మిగిలింది. నవనారీకుంజరము, పంచనారీతురంగము కూడా తయారుచేయడానికి ఏర్పాటు చేసుకున్నాడట. కళాలక్ష్మి మాయిళ్లనుండి తొలగిపోయింది. ఆనాటి

ప్రభువుల కొలువు కూటంలో ఈవిధంగా కల్పన చెయ్యమని కోరడానికి, దాని కనుగుణ్యంగా రూపొందించడానికి, వారికి వారే తగుతారు. కొలువులో వున్న ప్రభువును ఏ రీతితో దర్శిస్తే ఆ రీతితో ఉన్న తస్వీరు మరునాటికి తయారుచేసియిచ్చేవారు. అందుకు తగినట్లుగా వారు వారి ఆదరణతో అర్పించిన మృష్టాన్న భోజనానికి తోడు మురుగుల జోడా లిచ్చి బహూకరించేవారు. నిశితమైన ఆనాటి గ్రహణశక్తి, వారి దీక్ష, ఓర్మి, కళోపాసనయం దుండ కలసిన తృష్ణ యీ తరంలో పోయాయి. దానికి తోడు అనుదిన జీవితము, మోయలేని భారంగా వుంటే యీకళ లెందుకు బాబూ! ఈ జీర్ణావస్థలో ఉన్న కులవృత్తిని చేతులారా వదలలేక, చేసి ప్రయోజనంలేక, ముందు గొయ్యీ వెనక నుయ్యీ పరిస్థితిలో దినాలు వెళ్లబుచ్చుతున్నాము. మీవంటివారు వచ్చి చూచిపోతారు. అంతా అరణ్యరోదనమే. అదుగో మాపిల్లలు. స్వవృత్తులు వంట పట్టక, అన్యవృత్తులు లేక, రాక, ఎలా వున్నారో చూచారా. అన్ని వృత్తులతో బాటు యీకళకుకూడా చరమదశను చూస్తున్నాము. ఈ తాతలనాటి ముచ్చటలు ఎవరికి కావాలి బాబు?' అని అతనిలో అణగి మణగి వున్న ఆవేదన రగిలి మాటాడేడు.

ఇక అతనితో మాట్లాడలేకపోయాను. స్వరాజ్యం వచ్చిందనీ, భవిష్యత్తు ఆశాజనకంగా వుంటుందనీ, నిరాశ కూడదనీ, యిలాటి ఊరట గొలిపే మాటలు కొన్ని అనడానికి నోటిచివర వరకు వచ్చికూడా ఉద్రిక్తమైవున్న అతని మూర్తిముందు యికమారు మాట చెప్ప సాహసించలేకపోయాను. శిల్పి ప్రదర్శించే కళాప్రతిభకూ, పొందే ప్రతిఫలానికీ మధ్య గల అఖాతాన్ని తలచుకొంటూ అటనుండి కదలిపోయాను.




THE WHOLE OF INDIA
CLAMOURS FOR
STAR OF INDIA★

*The Perfect Pencil*

THE
PRIDE OF
INDIA






3, STRINGER STREET, MADRAS.



భువనేశ్వర దేవాలయం

(ఒరిస్సా)

ఛాయాచిత్రణ: శ్రీ సి. [illegible]. అప్పారావు





★

ముక్తేశ్వరాలయ దక్షిణభాగ తటాకం

(భువనేశ్వరం, ఒరిస్సా)

ఛాయాచిత్రణ: శ్రీ సి. యస్. అప్పారావు.



ముక్తేశ్వరాలయ దక్షిణప్రాకారము

(భువనేశ్వరం, ఒరిస్సా)

ఛాయాచిత్రణ: శ్రీ సి. యస్. అప్పారావు.



సింహాచల దేవాలయం - ఉత్తరదిశ ఆవరణ

ఛాయాచిత్రణ : శ్రీ సి. యస్. అప్పారావు

సంపూర్ణ వాహనము

# సప్తనారీహంస



శ్రీ కామఋషి సత్యనారాయణవర్మ

ఆ రోజు మాఘ బహుళ త్రయోదశి. తెల్లవారితే మహాశివరాత్రి పర్వం. చుట్టుప్రక్కల గ్రామాలనుండి జనం తండోపతండాలుగా ఆ రాత్రికే వచ్చి చేరుకున్నారు. జన్మానికొక్క శివరాత్రి అంటారుగదా! మన భారతభూమిలో వెలసిన పుణ్య గయాక్షేత్రాలలో పీఠికాపురంలోని పాదగయ ఒకటి. తెలిసో, తెలియకో, పండితులు, పామరులు, భక్తులు, సామాన్యులూ, ఆధివ్యాధిపీడితులూ ఎందరెందరో తరతమభేధాలు లేకుండా అశేషజనం తరతరాలుగా ఆ పర్వదినంనాడు పాదగయలో స్నానం చేసి, కుక్కుటేశ్వరుణ్ని సేవించుకుంటారు. అంతకు రెండుదినాలు పూర్వమే ఏకాదశి నాటిరాత్రి స్వామికి కళ్యాణోత్సవం జరిగింది. ఆనాటి సదస్యంకూడా వైభవంగా జరిగింది. పెండ్లిపందిరిలోనుండి ఆదిదంపతుల ఉత్సవ విగ్రహాలను గ్రామోత్సవానికై బయటకు తీశారు. మంగళతూర్యనాదాలతో కుక్కుట పతిని వాహనారూఢుని చేశారు. ఉత్సవ సందర్శనానికై వచ్చిన జన సమూహం ఆవేశంతో జయ జయ ధ్వానాలు చేస్తుంటే వాహనం కదిలింది. దీపాల కాంతిలో పసుపుబట్టలతో నున్న రాజరాజేశ్వరీ కుక్కుటేశ్వరులు చిరునవ్వులతో ఒకరినొకరు ఏదో కనుసన్న చేస్తున్నట్లనిపించింది. కొల్లలుగా పూలబంతులతో అలంకరించిన ఆ వాహనం - ఆ తూర్యనాదాలు ఆవేశంతో భక్తులు పఠిస్తున్న వందిమాగధ గానాలు, స్తుతిమాగ్గికలూ ఎంతటి పాషాణ హృదయాన్నైనా ద్రవింపజేసి, భక్తిపరవశునిగా చేస్తున్నాయి. అప్రయత్నంగా చేతులెత్తి ఉద్రిక్తహృదయంతో నేను పరమపునకు నమోవాకాలు సమర్పించుకొన్నాను. అనంతరం, నా దృష్టి ఆ పురాణ దంపతులు అధిష్ఠించిన వాహనంమీదకు, పోయింది. అంతా అపూర్వంగా గోచరించింది. ఆకృతినిబట్టి స్థూలంగా హంసవాహనంలాగనే తోస్తుంది. జనసమూహాన్ని త్రోసుకొనిపోయి వాహనాన్ని పరిశీలించనారంభించాను. ఆ వాహనం కొన్ని స్త్రీ విగ్రహాలతో విచిత్రంగా అమర్చబడివుంది. శిల్పియొక్క నిర్మాణచాతుర్యంలో ఒక విశిష్ట ప్రజ్ఞ ద్యోతకమౌతుంది. పీఠభాగంలో మయూరాసనవిధాన పద్ధతిలో నాభిస్థానంలో అనుకొన్న రెండుచేతుల ఆధారంపైన, శరీరం అంతా ఒక ధనుస్సుగా ఆకారంలో వెన్నుపైపు వంగియున్న ఒక స్త్రీ విగ్రహం వుంది. ఆ విగ్రహంయొక్క భంగిమలో ముకుళితాంగుళులతో ఉన్న చేతులు హంస పాదములను, తక్కిన ఆంగిక విన్యాసం హంసయొక్క ఉదరప్రదేశాన్ని స్ఫురింపజేస్తుంది. ముందుకుపోయి చూస్తే రెండు



పార్శ్వభాగము
రెక్కలు



ముఖము



పార్శ్వభాగము
రెక్కలు



పార్శ్వభాగము
రెక్కలు



పుచ్ఛ భాగము



చేతులనూ జోడించి వినమిత వదనంతో నమస్కరిస్తున్న విగ్రహం ఒకటి కనబడింది. ఆ విగ్రహానికి గల శిరోలంకరణ వైఖరి, తలమీదనుండి యిరుప్రక్కలా కటిప్రదేశం వరకూ జీరాడుతున్న వల్లెవాటు చీరచెంగులు, చుబుకమునకు అన్వియించుక అధోముఖంగా జోడించిన హస్తవైఖరి హంసయొక్క శిరస్సు, కంఠము, చంచువులను స్ఫురింపచేస్తున్నవి. హంసయొక్క ఉదర పార్శ్వభాగాలలో గల మరి రెండు విగ్రహాల చేతులపైన యీ ముఖ విగ్రహంయొక్క రెండు పాదాలు సమంగా ఒకదానిపైనొకటి ఆనుకొనేటట్టుగా అమర్చబడిఉన్నాయి. పార్శ్వభాగంలో గల విగ్రహాలు ఒక చేతి మణిబంధాన్ని ఒయ్యారంగా కటిసీమనుంచి రెండవచేతితో ముఖ విగ్రహముయొక్క పాదములను మోస్తున్నట్లున్నాయి. ఒక చేతితో ఆది దంపతుల ఉత్సవ విగ్రహాల నుంచిన చలవ చప్పరాన్ని మోస్తూ రెండవ చేతితో పార్శ్వ భాగంలోగల విగ్రహంయొక్క జబ్బ నానుకొని మరొక విగ్రహం అమర్చబడింది. పీఠభాగంలో ధనురాకారంలోనున్న స్త్రీ విగ్రహంయొక్క పాదతలంపై నిలువబడి రెండుచేతులు వెనుకకు విన్యాసమొనర్చు మరొక విగ్రహం ఉంది. ఆ విగ్రహము యొక్క శిరస్సునుండి జీరాడు ఉత్తరీయము, మడచిన కుచ్చెళులరీతి హంసయొక్క పుచ్ఛమును అనుకరిస్తుంది. ఈవిధంగా శిరమున కొకటి, రెండుపక్షములకు నాలుగు, పుచ్ఛమున కొకటిపాదతలమున ఒకటి మొత్తం ఏడు విగ్రహాలు వివిధ భంగిమాలలో సంపుటీకరింపబడి హంస ఆకృతిలో పరమశివునకు వాహనమైనారు. ఈ వాహనమునకు ఇరుప్రక్కలా చామరగ్రాహికలైన రెండు స్త్రీ విగ్రహాలు ఎంతో ఆకర్షణీయంగా అమర్చబడి ఉన్నాయి. ఈ అపూర్వ శిల్పసృష్టికి ఆశ్చర్య చకితుడనైనాను. శిల్పియొక్క యోచనా చాతుర్యము, కల్పనానైపుణి అనితరసాధారణము లనిపించింది. కవియొక్క కావ్యరచనా సామర్థ్యముకంటె శిల్పియొక్క నిర్మాణ కౌశలము ఎక్కువైనదని యీ శిల్పము రూఢిపరచినది.

మనుష్యత్వంలో అంతర్యాతమైన భావమాధురిని మూర్తి కల్పనలోనే వ్యక్త పరుప సాధ్యమౌతుంది. అశ్వము, గజము, నంది మొదలైన జంతువులయొక్క గరుడ, మయూరాది పక్షి వాహనములను, సహజకళ ఉట్టిపడ చెక్కిన శిల్పులున్నారు. గాని ఏడుగురు స్త్రీలతో ఇట్టి విచిత్రకల్పన గావింపగల్గుట అపూర్వము గదా! మూర్తుల రూపురేఖలు ప్రాచీన ఆర్య సంప్రదాయములను స్ఫురింపజేస్తు

(111-వ పేజీ చూడుడు)



పార్శ్వభాగము
రెక్కలు



పాదములు
ఈ విగ్రహముపై ఆధారపడి తక్కినవిగ్రహములుండును.






“మహావెల్లిపురము”

చిత్రకారుడు శ్రీ పి. వి. రామారావు.

# వికృతి సాహిత్య విమర్శ



శ్రీ సత్యనారాయణ' శ్రీ వాత్సవ'

వేపపూవు మావిపిందియలును వేసి పచ్చడిచేసుకొని రానున్న సంవత్సరంలోని కష్టసుఖాల చేదు తీపులు రుచిచూస్తాం! ఈ సమయంలోనే, కడచిన సంవత్సరంలో కలిగిన మంచిచెడ్డలూ అనుభవించిన మేలు కీడులూ మననం చేసుకుంటాం. ఆ మననంలో మనల్ని బాగా కదలించి మనస్సుకు బాగా పట్టినవే జ్ఞాపకం ఉంటాయి. ఏదో తాత్కాలికంగా ఆ క్షణానికి మనం చూచినవీ, విన్నవీ అనుభవించినవీకూడా మరచిపోతాం. అయితే--సాహిత్యం అలాంటి తాత్కాలికానుభవాలలోనికి వస్తుందా అనే సందేహం కలుగవచ్చు. ఉత్తమసాహిత్యం తాత్కాలిక ఫలితాలతో నిలిచిపోదు. సర్వకాలీనంగానూ, సార్వజనీనంగానూ పరిణమించి తాను నిర్మించిన భావాలతో ఎన్నటికీ చెరగనిముద్రలు—పాఠకహృదయాలలో ముద్రించి మరీ వికసిస్తుంది. అసలు సాహిత్యం అనే శబ్దనిర్వచనంలోనే ఆ అర్థం ఇమిడిఉన్నదేమో!

నేటి ప్రపంచంలో సాహిత్యం వేరు, మిగిలిన సాంఘిక రాజకీయ రంగాలు వేరు, అని విభజన చేయడానికి వీలులేదు. కళ, విద్య, సాహిత్యం, శాస్త్రం, విజ్ఞానం—సంస్కృతికి సంబంధించిన ఏయంశంగాని-ఇతర విషయాలతో సంబంధంలేకుండా 'నన్ను ముట్టుకోకు' అని తప్పుకొని ఉండటానికి అవకాశంలేదు. రోజూ జరుగుతూవున్న, చరిత్ర, రాజకీయాలు, సంఘటనలు, ప్రజాసమూహంలోని దైనందిన కష్టసుఖాలు మన సంస్కృతినీ, మన ఆశయాలనూ, మన ఆదర్శాలను మార్చివేస్తూ ఉన్నవి. అందుకే సాహిత్యవిమర్శచేసేటప్పుడు ముఖ్యసంఘటనల పర్యాలోకనంకూడా చెయ్యక తప్పనిసరి అవుతూఉంది. కడచిన సంవత్సరం ప్రపంచ చరిత్రలో గడ్డుసంవత్సరం. ఏక్షణానికి ఆక్షణం ఉన్నట్టుండి యుద్ధదావానలం భగ్గుమంటుందేమో అనిపించింది. చివరికి-ఆసియా కొరియారంగంలో చిన్నబరాటాగా కొట్టుకొనిపోయింది. అయినా ప్రజలలో భయం, ఆశంకపోలేదు. మునపటిలాగే జనసామాన్యం బ్రతుకు అవసరాలయిన అన్నవస్త్రాలకు కూడా మొగంవాచి నానాఅవస్థలకూ పాల్పడ్డారు. కరువుకాటకాలకుతోడు, అతివృష్టి అనావృష్టులతో పంటలు సన్నగిల్లడం, ప్రజలలో దగా, మాయ, దురాశ, ద్రోహబుద్ధి యెక్కువై మానవసహజమైనదయ, దాక్షిణ్యం ఏమ్యం అయిపోయి మనుష్యుల్ని రాను రాను రాక్షసులగా తయారుచేస్తున్నవి. ఉన్నవారు లేనివారికి సహాయం చేయడానికిబదులు, వాళ్ల కష్టదశచూచి వాళ్లమీద స్వారిచేస్తున్నారు. పాపభీతి, పరోపకారచింత అనేవి పూర్తిగా నశించిపోయాయి. ఇదివరకు వ్యక్తులలోఉండే దుర్గుణాలు ఇప్పుడు రాజ్యాలలోనూ, జాతులలోనూ కరుడుగట్టి జాతీయత, అంతర్జాతీయత అనే పేరులతో విచ్చలవిడిగా విహరిస్తూ తమ పలుకుబడిలో నిస్సహాయులమీద దాడి చేస్తున్నవి. నీతి, ధర్మం శాంతి, సత్యం అనే మంచిపేర్లతో స్వార్థం, కౌటిల్యం, కార్పణ్యం, అన్యాయం బాహాటంగా చెలామణీ అవుచున్నవి. ఇలాంటి పరిస్థితులు ఊహించే జార్జిఆర్వెల్-చచ్చి ఏళ్లోకాన్ని ఉన్నాడో- 1984 అనే గ్రంథంలో యీ మూకుమ్మడిరాజ్యాల మొండి పరిపాలన వర్ణించాడు. ఇంకా 33 సంవత్సరాలకి ముందుగానే అందులో సంగతులు అక్షరాలా నిజమవుతున్నాయి.

ప్రజారాజ్యాల పేరున కూటతంత్రాల ప్రాబల్యం మితిమీరిపోయింది. ప్రజాప్రభుత్వాలలో ప్రజల క్షేమాలుగాని, హక్కులుగాని, కోరికలుగాని మన్నించడం శూన్యం. ప్రజలపేరున అన్ని రాజ్యాలవారూ కయ్యానికి కాలు త్రివ్వుచున్నారు. ప్రపంచమంతా ఈనాడు రెండుకూటాలుగా విడిపోయింది. ఉభయులూ శాంతినిమిత్తం బ్రహ్మాండమైన మారణాస్త్రాలు నిర్మిస్తున్నారు. ఉభయపక్షాలవారూ ఘోరాతిఘోరమైన అసత్యాలతో ప్రచారం చేస్తున్నారు. ఉభయులూ విశ్వశాంతి కోరేవారే. ఉభయులూ ధర్మం స్థాపించేవారే? ఎవరిది నిజం? ఏది శాంతి? ఏది ధర్మం?

ఈ అంతర్జాతీయ సంఘర్షణల్లో, భారతదేశ విదేశాంగనీతి ఎటూ మొగ్గని తటస్థవిధానం అవలంబించినా గాని, ఎదుటివారి దుష్ప్రచారాల మధ్య సత్యంకూడా అసత్యంగా గోచరిస్తూఉంది. 'ఉద్ధతుల మధ్య పేదల కుండ తరమె' అన్నట్లు రెండు ప్రబలరాజ్యకూటాల కుటిల రాజనీతి మధ్య భారతదేశ తటస్థవిధానం ఎంతవరకు నిలుస్తుంది? అదీగాక భారతదేశంలో తిండికి కరువు; ప్రత్తికి, నూలుకు కరువు; ధనలోపం, సాధనలోపం. ఇన్నింటికి ఇతరులమీద ఆధారపడి ఉండవలసిఉంది. ఇన్ని లోపాలతో తాజాక స్వతంత్రవిధానం ఏర్పరచుకొని వ్యవహరించడం ఎంతవరకు జయప్రదం అవుతుంది?

భారతదేశానికి ప్రపంచ రాజకీయాలతో సంబంధం అటుంచి - ఇంట గెలిచి కదా రచ్చ గెలవడం - మన కాశ్మీర సమస్య రావణాబ్రహ్మకోష్ఠంలాగ ఎప్పటికీ కడతేరకుండా ఉంది. కోట్లకొలది దిక్కులేని నిర్వాసుల పునరావాసం, అన్న సమస్య,

వస్త్ర సమస్య, ఇన్ని సమస్యలు తీరని సమస్యలుగా ఉండిపోయాయి. స్వాతంత్ర్యం తెచ్చుకున్న సంతోషముతో తమ నేలం వెజ్జీతో మన వివిధ రాష్ట్రప్రభుత్వాలు సాధ్యంకాని పెద్ద ప్రయత్నాలు తలపెట్టాయి. మద్యనిషేధం, బేసిక్ విద్య, జమీందారీ నిర్మూలన సమస్య, ఎన్నికలు, జనాభా లెక్కలు ఒక్కొక్కటి ఒక్కొక్క భీషణసమస్యగా తేలి ప్రశ్నవేస్తూ ఉన్నాయి? స్వాతంత్ర్యం పుణ్యమా అంటూ, భాషలవారీగా రాష్ట్ర విభజన కొంచె యెక్కింది. దానితో భాషల మధ్య, ప్రాంతాల మధ్య, జాతుల మధ్య వైషమ్యాలూ, కావేషీలూ పెరిగిపోయాయి. ఉన్నవాళ్లు లేనివాళ్ళని లేవిడీ కొట్టున్నారు. లేనివాళ్లు అశక్త దుర్జనత్వం చూపిస్తున్నారు. ఉడుకుమోతుతనంతో ఉపాయం కోల్పోయి - ఉభయ భ్రష్టత్వం పొందుతున్నారు.

ఈ పరిస్థితులలో సామాన్య మానవుడు ఏమంటున్నాడు! తిండి లేకపోతే పస్తుంటున్నాడు. రేషన్లు తగ్గిస్తే సరే అంటున్నాడు. పన్నులు ఎక్కువచేస్తే భారం వహిస్తున్నాడు. అతను ఎంత సంపాదించేదీ, ఎంత ఖర్చుచేసేదీ, ఏమి తిన్నదీ, ఏమి అనుభవించిందీ తెలుసుకోలేక పోతున్నాడు . కాని అందరూ అతని మంచి కోరేవారేనట. ప్రభుత్వాలూ, ప్రజామంత్రులూ, అధికారులూ ఆర్డినెన్సులూ, హంతకులూ అత్యాచారులూ, రాజ్యాంగాలూ రాజకీయాలూ, రేషన్లూ, రిమిషన్లూ, యుద్ధాలూ, యునైటెడ్ నేషన్లూ, పత్రికలూ, సినిమాలూ కూడా అతని క్షేమంకోరేవేనట. అతనికేమీ తెలియదు. మాటాడకుండా తన మార్గాన తాను పోతాడు. తనపని తాను చూచుకుంటాడు. సంసార తాపత్రయం, పిల్లలు భార్య, జబ్బులు అవసరాలు వీటితోనే అతని బ్రతుకు తెల్లవారి పోతుంది. అతడు ఆలోచించడానికి తీరికయేది? అతని ఆలోచనలు, పత్రికలూ, వ్యాపారసంస్థలు, ప్రభుత్వాలూ తయారు చేసి పెట్టూఉన్నవి. స్వతంత్రంగా ఆలోచిస్తే సంఘం వెలివేస్తుందేమో ననేభయం.

ఇలాంటి వాతావరణంలో ఏమిసాహిత్యం వస్తుంది. ఏమి కొత్త ఆలోచనలు సాహిత్యవేత్తలు ఆలోచించగలరు? పత్రికా యుగంలో పెద్ద వ్యాపారస్థులు ధనమిచ్చి సాహిత్యవేత్తల్ని కొనివేశాయి. స్వతంత్రించి వ్రాసేవారే అరుదు అయిపోయారు. రచయితలంతా వ్యాపారస్థుల కోసమో, ప్రభుత్వాలకోసమో ప్రచారకులుగా పనిచేస్తున్నారు. సామాన్య మానవుడి దృష్ట్యా ఆలోచించే వాళ్లు లేకుండా ఉన్నారు.

సాహిత్యం అనగానే మొదటినించీ అగ్రతాంబూలం కవిత్వానికే ఇస్తూవచ్చారు.

ఈసంవత్సరం వచ్చిన కవితా గ్రంథాలలో చెప్పదగినవి (ఎజ్రాపౌండ్) *Ezrapound* వ్రాసిన '*80 cantos*' 'ఎనభైఆశ్వాసాలు' అనే కావ్యం. పౌండు, చాలకాలం క్రితంనించి వ్రాయడం మొదలుపెట్టాడు. ఇంతకాలం అజ్ఞాతవాసంలో ఉండి ఈసంవత్సరం తిరిగి కావ్యాలు ప్రకటించాడు. అయితే ఈకావ్యాలన్నీ పూర్వం గ్రీకు పద్ధతిని మెరపిస్తూ మహాకావ్య ధోరణిలో ఉండటంవల్ల అంతగా ఎవరినీ కదపలేకపోతూడు.

కల్లోల ప్రపంచంలో కూడా, ఆదర్శమూ, అందమూ తలచుకొని వాటికోసం శ్రమపడిన కవులే ప్రజాదరణ పొందగల్గడం ఒక విశేషం. దీనిని ఒకవిధంగా సమన్వయం చేసుకోవచ్చు. లోకంలో సామాన్య మానవులు రోజూ పడుతూవున్న బాధలూ, దుఃఖాలూ మరచిపోవడానికి గాను ప్రాచీన కావ్యధారామృతం అర్థించవచ్చు.

ఒకఅర్థశతాబ్ది గడచిన తర్వాత ఏమిసాధించామని పరామర్శ చేసుకోవడం అందరికీ వరిపాటి. ఈయాభై సంవత్సరాల ప్రగతి పరిశీలనచేస్తూ ప్రసిద్ధతత్వవేత్త *Bcrtrand Russ el* బెర్ట్రాండు రస్సెల్ (గత సంవత్సరం సాహిత్యంలో నోబెల్ బహుమతి విజేత) యిప్పటియుగం పూర్వకాలంకంటె అన్నివిధాలా వికాసం చూపుతూ ఉందని చెప్పాడు. అయితే మనలో కొందరు అది ఒప్పుకోరు. ముఖ్యంగా వ - వృద్ధులు, మా కాలంలో, ఆరోజుల్లో... అవేబాగుండేవి. ఏదీ మాలాగ కావ్యాలు అల్లకలిగేవాళ్లు ఏరీ? రచనలు చేసేవాళ్లు ఏరి? అంటారు. ఈనాటిసాహిత్యరంగంలో వయస్సులో పోటి లేదు. భావాలలోపోటి. వెనుకటి యాభైసంవత్సరాలలో వచ్చిన కొత్తభావాలు ఈనాడు లేవు. నాటి దేశభక్తి, స్త్రీస్వాతంత్ర్యం, ప్రేమారాధన, ప్రకృతిపూజనం, ఈనాటి వాతావరణంలో కావ్యవస్తువులుకావు. ఒకవేళ ఎవరైనా మొండిగా అటువంటి కావ్యరచనచేసినప్పటికీ, ముసలిముత్తైదువకు జార్జెటు చీర కట్టినట్టు ఎబ్బెట్టుగా ఉంటుంది. అందుచేత ప్రేమ కవిత్వాలూ, ఖండకావ్యాలూ నేడు హాస్యాస్పదంఅయిపోయాయి.

అయితే ఈయుగానికి కావలసిన రచనలు ఏవి? అనేదానికి మన అందరిగొంతుకలలోనూ ఏదో కొట్టాడుతూఉంది. కాని చెప్ప లేకపోతున్నాము.

కవిత నుద్దేశించి—

నా రచనలలో లోకం ప్రతిఫలించి
నా తపస్సు ఫలించి నా గీతం
గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతి
జనులు పాడుకునే మంత్రంగా
ప్రయోగించాలని, నా ఆకాశాలను
లోకానికి చేరువగా నా ఆదర్శాలను
సోదరు లంతా పంచుకు లేవెలుగుల
రవ్వలజడిగా చేయడానికి

సంకల్పించానని శ్రీశ్రీ చెప్పి,మన భావాలకు కొంత రూపం ఇచ్చాడు.

అధివాస్తవికత (*Sur-realisam*) ఏనాడో సాహిత్యరంగం నుంచి నిష్క్రమించింది. కళారంగంనించికూడా నిష్క్రమిస్తూ ఉంది. నిన్నమొన్నటివరకు పరిపాటిఅయిన కర్మవాదం (*Existentialism*) కూడా నేటి సాహిత్యరంగంలో ప్రాతబడిపోయింది. కడచిన రెండుమూడు సంవత్సరాలనించీ కవిత అనగానే ప్రచారసాధన అయిపోయింది. పలువురు యువకకవులు తమ తమ రాజకీయవాదాలకి ప్రచారంకోసం కవితారచన సాగిస్తున్నారు. ప్రజలకి మరీ చేరువగా పోవడానికి 'బుర్రకథలు' చెప్పి వారిని రెచ్చగొట్టూ ఉన్నారు. ఈ కథాకావ్యాలలో కవిత కూన్యమైనా

ప్రయోజనం కొంతవరకు సాధించ కలుగుతున్నారు. ఇంక ఇటీవల వెలువడిన మరికొన్ని గీతాలు పాటలుగా పాడి అమాయక జనాన్ని ఆగ్రహావేశుల చేస్తున్నారు.

అయితే కవిత ప్రయోజనం ఇదేనా? జనసమూహంయొక్క భావాలు, ఆశయాలు కవితలో ప్రతిఫలింపచేయడం, అందంగా పాడటం తప్పని ఎవ్వరూ అనరు. కాని వైషమ్యాలు రెచ్చగొట్టి, ద్వేషపూరిత భావాలతో విషప్రచారంతో మానవుల్లోని పశు క్రోధాన్ని ప్రకోపింపచేయడం కవిత అనిపించుకొంటుందా?

విశ్వశ్రేయస్సుకూర్చవలసిన కవిత, రమణీయార్థం ప్రతిపాదించవలసిన కవిత, ద్వేషదావానలం పురికొల్పడానికి వినియోగించడం ఎంతవరకు సమంజసం? ఈనాడు వెలువడుతూవున్న కవితా గ్రంథాలు చూస్తే ఈ అభిప్రాయం కలగక తప్పదు. దీనికి దృష్టాంతాలు చూపనక్కరలేదు. అందనూ, ఆనందనూ లేని ప్రచారకావ్యాలు తమప్రచారధర్మంలో కూడా కృతకృత్యత పొందకుండా పోతాయి.

హర్తాల్! అని రమణారెడ్డి వ్రాసిన ఒక గీతం చూడండి.

'అనుక్షణ నిరీక్షణ మివాల్టికి నశించెన్
సమున్నత మహోక్షణ మివాల్టికి హసించెన్

అని చెప్పి హర్తాల్ గురించి ప్రశంసచేస్తాడు.

కరమ్ముల శిరమ్ములు హతాదధి గమించెన్
కరమ్ముల ధ్వజమ్ములు జ్వరార్చులను నింపెన్
జ్వలాంశువులు నించెన్ జ్వలాంబువులు జార్చెన్ హర్తాల్
హర్తాల్

ఇకెందుకు వశీకరణ తంత్రాంగ భ్రాంతి
విశృంఖల మగాధము మహో వీరక్రాంతి
విహంగమ సమాతురము చైతన్యక్రాంతి
మహాక్రాంతి విశ్రాంతి సంక్రాంతి హర్తాల్

ఇందులో శబ్దాల ధ్వనులు తప్ప, వ్యాకరణం అర్థం భావం అంతగా గమనించినట్టు తోచదు. పోనీ అవేమీ అవసరం లేదనుకుందాం. సాధించ దలచుకున్న ప్రయోజనం! హర్తాల్ చేసిన శ్రామిక సోదరులకుగాని, వారి పై సానుభూతి చూపే వారికి గాని యీ కావ్యం బోధపడదేమో!

ఇటీవలే వచ్చిన మరోపుస్తకం 'సంఘర్షణ' ఒక మచ్చుతునక 'నవభారతం' అనే శీర్షికలో రెంటాల గోపాలకృష్ణ వ్రాసింది.

నవభారతం శుభదాయకం
జననాయకం జయసాధకం
నవభారతం ధృవతారకం,
సస్యశోభిత సంపదోజ్జ్వల
సర్వశిక్షిత రక్షితం,
విశ్వమానవ శాంతిస్థాపక
విజయశంఖ ధ్వనితం.

అర్థరహితంగా పేర్చిన కొన్ని సంస్కృత పదాలకూర్పు లాగా ఉంది. ఇతరులూ కూడా శ్రీశ్రీని అనుకరించి——

"నాకావ్యం ఒక కల్చర్, ఒక సోల్జర్" అని ప్రతిజ్ఞ చేస్తాడు. అర్థంలేని కావ్యాలు అటుంచి, మరికొన్ని గీతికలు సానుభూతితో పరిశీలిస్తే నేటియువక హృదయాల్లో భావాలు పోల్చుకో గలుగుతాం. కొన్ని యథార్థదృశ్యాలు కండ్లకు కట్టినట్టు కనిపిస్తాయి.

అదుగో! వ్యాపారస్తులు
నల్లని ముస్తులతో దూరంగా
బాకీనారల పెండ్లాం పుస్తెలు
తాకట్లను చీకట్లో మొట్లం
కట్టుచు పోతున్నారు!
గస్తీబంట్రోతులు కానీకి
చేయిచాస్తున్నారు.

పాపం ! ఏం చేస్తారు?
ఇంట్లో పెళ్లాం బిడ్డలు

పస్తుంటే చస్తుంటే !...........నగ్న సత్యం నగ్నంగా చెప్పాడు. రెంటాల గోపాలకృష్ణ యీ 'సంఘర్షణ' రచయిత, ఇతరుల శబ్దాలతోనూ భావాలతోనూ చెడుగుడు ఆడేటప్పుడు కాకుండా తాను స్వయంగా ఆలోచించి వ్రాసేటప్పుడు నిజంగా కవిగా వినిపిస్తాడు.

దుర్భర మానవ జీవిత
గర్భంలో దాగిన వ్యథ
నిశ్శబ్దం తెరుచుకుంది.
నవచైతన్యోద్దీపిత యువహృదయం పలుకుతోంది.

అయితే ఈ యువహృదయాలన్నీ తమ పలుకుల్లో నిరాశ, నిస్పృహ మాపుతున్నాయి. ఆశ సంతోషం ప్రకటించడంలేదు. దానికి కారణం నేటి పరిస్థితులు. వారినని ప్రయోజనంలేదు. 'అనిశెట్టి' వ్రాసిన బిచ్చగాళ్ల పదాలలో బిచ్చగాడు——

పాడలేనోయ్ పాతపాటలు
వీడిపోదోయ్ పాడుప్రాణం
నాసటిరాతకు నోరు లేదోయ్
ఉండిఉండీ బండరాయిగ మారిపోతానోయ్.

గుండె తడబడినదీ
గొంతు తడుపమ్మా
తులసికోటకు నీరు
తోడినంతమ్మా
కాలిపోయే యిల్లు, చల్లార్చినంత
పనికిరానీ చిరుగుపడ వేయితల్లీ
పెలికై చేతిలో వాలిపోతున్నాడు
బిడ్డకొక పిడికిలి
—విడువమ్మ తల్లీ !...
అని జాలిగా పాడుతాడు.

ఊరు పూరా బావురుమని తిరిగీ నా
గడప గడప తల కొట్టుకున్ననూ
వచ్చిపడును అంటుకు నా తంత్రీ

మదపుటేనుగై మాపటి చీకటి
తరిమి తరిమి కొడుతుందయ్యా!

కృంగి కృశించే కూలే నాకే
కొండలు మింగే కోరికలిచ్చే
పసిబిడ్డే కడు పూడి పడ్డదే!!

ఈ సంవత్సరం యువక కవులలో మరి యిద్దరి పేరులు పాఠకుల దృష్టి నాకర్షించి ఉండాలి. 'బైరాగి'అను పేరుతో ఎక్కువ రచనలు కవితా పాఠకు లందరూ చదివే ఉంటారు. ముఖ్యంగా ఇతడు వ్రాసిన గీతాపతనం చాలమందిని ఆకర్షించి ఉంటుంది. ఈ కవిలో భావాలకి తగిన శబ్దాలు పుంఖానుపుంఖాలుగా వస్తాయి. వచ్చినవేగంతో అవి వెలువరిస్తున్నాడు. కాని కవితకు ముఖ్యంగా కావలసినవి, శిల్పం, సంక్షిప్తత. సాధ్యమైనన్ని యెక్కువ భావాలు తక్కువపదాలతో వ్యక్తపరచడం. కవితాసామగ్రిలో పదాలు రత్నాలకంటె విలువగా వాడుకోవాలి. ఆ పొదుపు లేకపోతే 'కవిత' రక్తి కట్టదు.

తనదగ్గర ఉన్న పదశబ్ద భాండారంలో మరీ చౌకగా, ధారాళంగా వాడటంచేతనో యేమో 'బైరాగి' కవిత ఒక్కోసారి చాదస్తంగా వినిపిస్తుంది. నిజంగా ఎవరో 'బైరాగి' వేదాంత గోష్ఠి మొదలు పెట్టాడా అనిపిస్తుంది. కాని ఆ రచనలకు అలవాటు పడితే అమూల్య రహస్యాలు గోచరిస్తాయి.

జలజలరాలిన చినుకులు
వణికిన వనుకటి కినుకల
కన్నీరుల తలమునకలు;
శంకాపంకిల జీవితపథాన
హోరున వీస్తున్నది గాలివాన.

ఇతడి అనుప్రాసలు వెదకుకుంటూ వాటంతట అవి రావు. బలవంతాన లాగి కూర్చోబెట్టినట్టు ఉంటాయి.

జోరున పెరిగిన కెరటం
నావ తెగిన గాలిపటం
చిరిగిన పుస్తకపుపుటం (?)
తప్పేదెలాగు జీవితపుఆన
హోరున వీస్తున్నది గాలివాన

అయితే 'బైరాగి' మంచుమంచు పేరో సాధించుకలిగే రచయిత.

మరొక వర్ధమానుడు దాశరథి! 'బైరాగి'కి ప్రతిగా, దాశరథి మరీ క్లుప్తపరచి వ్రాస్తాడు. ఇతని మాటబొమ్మలు (*Imagery*) మరీచిన్నవిగా ఏదో పోల్చుకోలేనంత సున్నితంగా ఉంటాయి. ఛందస్సులు తీరు వేరు. చెప్పదలచుకున్న దానికి ఏదో అడ్డువదుతూ ఉన్నట్టు కనిపిస్తూ ఉంటుంది.

వీరూ, మరికొందరు రచయితలూ వ్రాసిన రచనలు పరిశీలిస్తే ఒకటి స్పష్టం. అందరి తెనుగు యువక రచయితలలోనూ నిస్పృహా నిరాశ కనిపిస్తున్నది. వర్తమాన పరిస్థితులగూర్చిన న్యాయమైన అమర్ష, వ్యక్తం అవుతుంది (*Righteous Indignation*)

ఆంధ్రసాహిత్యంలో ఎటువంటి పురోభివృద్ధి జరుగుతూ వున్నదీ-ఎలాంటి రచయితలు న్నదీ, దాని వికాసం ఎలాగ ఉన్నదీ తెలియపరచే గ్రంథాలు అంతగా లేవు. క్రిందటి సంవత్సరం ఆంధ్ర సాహిత్యచరిత్ర ఒకటి హైదరాబాదునించి ఖండవల్లి లక్ష్మీరంజనం గారు ప్రకటించారు. ఇది చిన్నగ్రంథం అయినప్పటికీ సాహిత్య చరిత్ర సమగ్రంగా సమీక్షచేసింది. మరొక విలువయిన గ్రంథం హైదరాబాదునించే వెలువడింది 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర,' దీని రచయిత సురవరం ప్రతాపరెడ్డిగారు— ఆంధ్రుల సాంఘికచరిత్ర-మన సాహిత్యగ్రంథాలలో దొరికిన ఆధారాలననుసరించి చక్కగా పొందుపరిచారు.

ఇదివరకు నిగూఢమైవున్న ఎన్నో కొత్తవిషయాలు ప్రతాపరెడ్డిగారు ప్రకాశంలోకి తీసుకొనివచ్చారు. వీరు వ్రాసిన అంశాల మీదనే పరిశోధనచేస్తే యింకా యెన్నో విశేషాంశాలు విభిన్న యుగాలకి సంబంధించినవి వెలుగులోకి తేవడానికి అవకాశం కలుగుతుంది.

మొత్తంమీద, తెలంగాణా, కోస్తాజిల్లాలు రాయలసీమ మూడు విభిన్న భాగాలుగా ఉన్నప్పటికీ, యావదాంధ్రం ఒకటేనని మన సాహిత్య ప్రగతిచూస్తే స్పష్టపడుతూఉంది. హైదరాబాదు నించి వెలువడుతూ ఉన్న సాహిత్య మాసపత్రికలు చక్కని వికాసం కనపరుస్తూ ఉన్నవి.

ఎప్పటిలాగే యీ సంవత్సరంకూడా వివిధ పత్రికలలో సీరియల్సు వెలువడ్డాయి. వీరేశలింగంగారి చరిత్రనుగురించినకథ అవసరాల వెంకటరావుగారు ప్రకటించిన(సినీమా కథాసంగ్రహం) కథ జీవితవివరాలు అనేకం సంపుటీకరించినప్పటికీ దానిలో జీవిత చరిత్రగా గాని, సినీమాకథగా గాని ఉండవలసినంత శిల్పం లేదు. ఈ సంవత్సరం వంగభాషలో ఈశ్వరచంద్ర విద్యాసాగరుల చరిత్రగూర్చిన ఒక చిత్రం వచ్చినది. విద్యాసాగరులు, వీరేశలింగం ఇంచుమించు సమకాలికులు. వారి జీవితచరిత్రలో ఎన్నో పోలికలున్నవి. ఉభయులూ పేదరికంనించి పెద్దవైనవారే. విద్యాసంస్కరణకోసం పాటుపడినవారే. విధవావివాహం చేయించి విజయం సముపార్జించుకొన్నవారే. ప్రేమకథ లేని యీ జీవితచిత్రం వంగ భాషలో ఎంతోచక్కగా తీశారు. ఇదేపద్ధతిని వీరేశలింగంగారి జీవితంకూడ చక్కని చిత్రంగా తయారు చేయవచ్చును.

ఇతర సీరియల్ కథలలో కొడవటిగంటి కుటుంబరావుగారి 'చదువు' చెప్పదగింది. మన ప్రస్తుత విద్యావిధానాన్ని పిల్లల్ని తయారు చేయడంలో తల్లిదండ్రులు అవలంబించే విధానాన్ని వ్యంగ్యధోరణిలో విమర్శిస్తూ వాస్తవరీతిని ఈ నవల వ్రాయబడింది. పిల్లల చదువుల్లో ప్రస్తుతలోపాలు ఎటువంటివో చూపి, ఎలాగ ఉంటే బాగాఉంటుందో కూడా నిరూపించింది. విద్యావిధానంగురించి వ్రాసిన నవలలు ఇంగ్లీషులోనూ, యూరపియన్ భాషల్లోనూ ఎన్నో ఉన్నవి. మనకికూడా ఈ చైతన్యం కలగటం ప్రశంసార్హం.

మన సాహిత్యంలో వెలువడుతూవున్న గ్రంథాలకంటె ఆ గ్రంథాల మంచిచెడ్డలు విమర్శించే సద్విమర్శకులు అరుదుగా

ఉన్నారు. వివిధపత్రికలలో వెలువడుతూవున్న పుస్తకసమీక్షలు నామమాత్రానివే. ఇంతకంటె సక్రమపద్ధతులలో మంచి చెడ్డలు విమర్శచేయకలిగే విమర్శకులచేత ప్రసిద్ధపత్రికలు విమర్శలు చేయిస్తే మన రచయితలు మరింత ప్రోత్సాహం పొందడానికి అవకాశం కలుగుతుంది. ఇంగ్లీషులో సాహిత్యపత్రికలన్నీ, ఉత్తమ సాహిత్య వేత్తలచేత పుస్తకాలు సమీక్షచేయించి పుస్తక విక్రేతలకు, రచయితలకు పాఠకులకుకూడా అమూల్యసేవ చేస్తున్నవి. మనదేశంలో విమర్శకులే అరుదు. దానికితోడు ఆంధ్రసాహిత్య విమర్శకులలో అగ్రగణ్యులని పేరుపొందిన మహామేధావులు దిగ్గంతులవంటి పండితులు ఇద్దరు ఈ వత్సరం పరమపదించడంతో మన విమర్శనాశాఖకు మరింత గొప్ప ఆఘాతం కలిగింది.

అనేక ప్రాచీన అర్వాచీన గ్రంథాలకు అమూల్య పీఠికలూ వ్యాఖ్యానాలూ రచించి ప్రాచీన సాహిత్యంమీద పాఠకులకు అభిరుచి కలిగించిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కృషి ఎవరు మరువగలరు? పరిశోధనాక్షేత్రంలో, అముద్రిత గ్రంథపరిశీలనలో, అపురూప అర్థవివరణలో, అసామాన్యపాండితీ ప్రకర్షలో ఆయనకు ఆయనయేసాటి. ఆంధ్రసాహితికి ప్రభాకరశాస్త్రిగారు గతించిన లోటు తీర్చడం అసంభవం.

అలాగే అనన్యప్రతిభాశాలి, అద్వితీయ భాషాభిమాని అయిన కట్టమంచి రామలింగారెడ్డిగారి మృతికూడా ఆంధ్రసాహితికి తీరనిలోటు. సాహిత్య విమర్శనమన్న, స్వస్తుతి పరనింద అనేరోజులలో, కావ్యరీతులలోని సౌందర్యం తొలిసారి కట్టమంచివారు తమ 'కవిత్వతత్త్వ విచారం'లో కనబరచినారు. తదనంతరం, కళాపూర్ణోదయ పీఠికలో వారు వ్యక్తపరచిన నూతనవిమర్శన విధానము—ఇంగ్లీషు సాహిత్య విమర్శనాపద్ధతులు పొందుపరచి తెనుగు భాషకి మేలుబంతి ఒకటి అందిచ్చారు. వారి యనంతరం ఎందరో ఆ పద్ధతుల ననుసరించి కావ్యవిమర్శనమన్న కవిహృదయగ్రహణం కాని, కవికాలదేశాలగురించి ఖండనముండనలు కావని వ్యక్తం చేశారు. రెడ్డిగారు విమర్శకులే కాకుండా ఎందరో మంచి విమర్శకుల్ని తమ తరిఫీదువల్ల తయారుచేశారు. కవులై కవులకు ప్రోత్సాహం కలుగ చేశారు. సాహిత్య వేత్తలై సాహిత్య పోషణచేశారు. చమత్కృతివారికి వెన్నతో పెట్టినవిద్య. ఛలోక్తిలేనిదేవారు వ్రాసేవారుకారు. మాటలాడేవారుకారు. వారిని తెనుగు సాహిత్యం మరచిపోలేదు.

వికృతిసంవత్సరం—సాహిత్యరంగంపాలిటి విరోధి అయినది. వంగసాహిత్యంలో గొప్పనవలా రచయిత విభూతిభూషణ ముఖోపాధ్యాయుడు గతించాడు. కన్నడనాటక కర్తలలో అగ్రగణ్యుడు 'కస్తూరి' దివంగతుడయాడు.

యావద్భారత సాహిత్యక్షేత్రంలో మహాకవిగా కీర్తిచెందిన అరవిందయోగి భౌతికశరీరంచాలించాడు. అరవిందుడు అత్యుత్తమ కవి. ఛాయావాదంలో ఆయనకు మించిన కవిలేడు. అసదృశమైన ఛాయాధ్వని కావ్యమై 'సావిత్రి' భారత సాహిత్యంలోనే కాదు విశ్వసాహిత్యంలోనే శాశ్వతస్థాన మాక్రమించుకొన్నది. అరవిందుడు; కవి; యోగి; దార్శనికుడు; భాష్యకారుడు. భగద్గీతలకు ఆయనరచించిన భాష్యం అమూల్యమైన విజ్ఞానఖని.

ఈకీడు, విశ్వసాహిత్యరగంలోకి కూడ వ్యాపించి అమేయ మేధస్సంపన్నులయిన ఇరువురు మహారచయితలను పొట్టబెట్టుకొన్నది. ఇటీవలే సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత యాంద్రీ జీద్ పరమపదించాడు: 81 వ సంవత్సరంలో పండినవయస్సులో ఇతడు తనువుచాలించి నప్పటికీ తనరచనలతో యూరపు ఖండం అంతటినీ ఒకసారి ఉఱ్ఱూతలూగించాడు. అతడు కవి, నాటకర్త, కథకుడు, నవలారచయిత. అయినప్పటికీ జీవితంలో జరిగిన విశేషాలన్నీ ఆత్మకథగా యథార్థ విషయాలమీద లఘుటిప్పణిగా తనడైరీలో వ్రాస్తూవచ్చాడు. అవే రెండు ఉద్గ్రంథాలుగా *Journal of Andre Gide*, అని వెలువడ్డాయి. వాటికే ఇతనికి నోబెల్ బహుమానం లభించింది. ఇతడు సంప్రదాయాలకి వెరవకుండా సమస్తాన్నీ ధిక్కరించి తనకునచ్చిన పంథాలోనడిచి అందరినీ ఘాటయిన విమర్శలతో హేళనచేసేవాడు. కాంగోలోనూ, ఉత్తరాఫ్రికాలోనూ పర్యటించి సామ్యవాదిగా మారాడు. తరవాత మాస్కో వెళ్లి స్వయంగాచూచిన దానిని వివరిస్తూ వ్యాసాలువ్రాసి కమ్యూనిజాన్ని ఖండనచేశాడు. జీద్ గొప్పతత్త్వవేత్త. మెదడుకు పదును ఎక్కించే నిశితమైన రచనలతో ఫ్రెంచి సాహిత్యంలో కలవరం తెచ్చినవాడు. మరొక సాహిత్యవేత్త జార్జిబెర్నార్డుషా. ఏనుగు బ్రతికినా చచ్చినా వెయ్యివరహాలు అన్నట్టు, 'షా' బ్రతికినా మరణించినా సంఘాన్నీ పెద్దల్నీ నువ్వులిప్పలూ పెట్టి మూడుచెరువుల నీళ్లుతాగిస్తాడు. అతడుపుట్టుక నించీ సంఘానికి ఎదురుతిరిగాడు. సంఘాన్ని తీవ్రంగా విమర్శించి పెద్దల్నీ పెద్దసంస్థల్నీ కసితీరా తిట్టి, తనదూషణలతో భూషణల నందుకొన్నాడు. షేక్స్పియరు తరవాత విశ్వనాటకరంగంలో 'షా' తెచ్చిన మార్పులు మరెవ్వరూ తేలేదు.

దేశంలో రచయితలూ, సాహిత్యవేత్తలు ఎవరికివారుగా ఏదో వ్రాసుకుంటున్నారు. సన్మానాలు జరిగినవారికి జరుగుతున్నవి, లేనివారికిలేదు. ఒక భాషసంగతి ఒకరికి తెలియడంలేదు. ఒక ప్రాంతంసంగతి మరొక ప్రాంతంవారికి తెలియడంలేదు. ఈ అంధకారంలోంచి బయటికి తీయడంకోసమని వికృతిసంవత్సరాంతంలో ఢిల్లీలో రచయితలసమ్మేళనం జరిగింది. వారికృషివల్ల యావత్ భారతసాహిత్య పరిషత్తు వస్తే దానివల్ల వివిధ భాషా సామరస్యానికీ—పరస్పర గౌరవభావానికీ దోహదం కలుగుతుంది. ఈ కొత్తసంవత్సరపు శుభాకాంక్షలతో యిదొకటి కలుపుకొని సాహిత్య ప్రియులం సంతసిద్దాం.

---

# రాతిగుండెలు



శ్రీ కొమఱవోలు వెంకటసుబ్బారావు

మామా! నీవును చేరినావు దిగిరమ్మా! కొంతసేపైన నా
తో మాడుటకేనియుం దొరకిరి దూరంపు ఖిల్లా శిర
స్సీమన్ శత్రుల చేహారా గనగ గస్తీగాయుచున్నట్టి నా
కీ మూపెక్కి నవారి చేసెడి తుపాకీతప్ప వేఱెవ్వరున్.

ఆకాశాన ముసాఫిరట్లు యుగసంధ్యల్ చూచియున్నావుగా
యేకాలమ్మున నేని మానవపద మ్మిచ్చోట తారాడెనా?
యేకాలమ్మున నేని మాధవసుమమ్మో మోళ్ళ నవ్వించెనా?
లే కిట్లే తొలినుండి మృత్యువిట నాశ్లేషించియే యుండెనా?

ఖడ్గధారల దాకి కరగి జాఱిన భానుకిరణాలు సలసల దొరలుచోటు,
కుంభించి పవనమ్ము గోళాగ్నులం గూడి మృత్యుఫూత్కారమై మిడుకుచోటు,
ప్రాణవాహిని కడ్డువాటుకట్టలు గట్టి కాలు మళ్ళకు నీరుగట్టుచోటు,
అధికారగృధ్రాలయాశార్చి సురసనై గగనావధిగ నార్చి నగెడుచోటు,
తారకలు రాల నటరాజతాండవాంఘ్రి ధిమిధిమిధ్వను లవనిపై దిగెడుచోటు
లైన గనియుంటిగాని నే నరయనైతి నిట్టి కోణపకోణమ్ము నింతవఱకు.

పందిరివోలె క్రమ్ముకొని పాపము, శాపము, నీ సుధారస
స్యందిమయూఖమాలికల కడ్డుగ ఛత్రము పట్టె, తామసీ
కందరమందు రక్కసులకైవడి చుట్టును గుట్ట లాకృతుల్
జెందె, నిరంకుశక్రియగ జేసెడ రాజ్యము నొంటిప్రాణినై

కాలుం జేతులు ముళ్లు గట్టుకొని, భూగర్భాన శీర్షమ్ము పా
తాళమ్మంటగ దూర్చి, పండుకొని, నిద్రంబోవుచున్నట్టి యీ
శైలస్వామి శరాలయ ట్లుబికెదున్ సర్పంబులున్, వల్లరీ
జాలమ్ముల్, దళహీన పాండుర ధరా జాతాంగుళివ్రాతముల్

అదిగో! దూరమునుండి కన్పడెడు శైలాగ్రమ్ముపైనిన్ మహా
సదపాషాణశిరస్సు; దాని కను లశ్రాంత మ్మదేరీతిగా
నదులై పాఱుచు నుండు, శూన్యమున సున్నల్ జుట్టుచుం దానిపై
నెదియో పక్షి యొకండు ద్రిమ్మరును రోజే డారు పర్యాయముల్

ఏమయ్యా! ఉడురాజ! నాడు మొఱ నాడే యయ్యె, దక్షాస్త్రి తీ
రా మంజూరొనరించి నావ మతి గ్రైర్మంజూర? నానాతరుగ్
మో మొక్కింతగ విచ్చి నవ్వి వరహాల్ పూరించి వర్షింప, నే
నా మైకమ్మున మున్గి వాని గను మోహావేశమం దుండగన్

లబ్బుడప్పను లబ్బులబ్బుడ ప్పనుకొంచు నతిరహాస్యంబుగా నవల కొన్ని
దడబిడ బిడదడా బిడదడా యనుకొంచు నెగురు గంతులతోడ నివల కొన్ని
ఫుప్ఫుఫప్పను ఫప్ఫుఫప్పుఫు ప్పనుకొంచు కొలిమి తిత్తులవోలె కెలన కొన్ని
ఇప్చ ఇప్చప్ చ్చప్చ చప్చ్చప్చ యనుకొంచు స్తనపాయులట్లుగా దవుల కొన్ని
గుండెచప్పుళ్లు జనియించి కొండ నాల్గుదెసలనుండియు నావైపు ముసరికొనియె
అదరిపడి లేచి చేతితో నందుకొంటి నాడు ప్రేయసినైన "త్రీనాట్ర్రీని" *

ఎదియో తప్పక శత్రుయోధదళమే యేతెంచె నం చెంచి, నే
పదిలమ్మైన గుహాముఖాంతరమునుం బ్రాపించి, బందూకి క
ట్టెదుటన్ సూటిగ నిల్పి పట్టుకొని, యింకేమైన విన్పించునో
తదరాతిధ్వనులంచు నొగ్గితి శిలాద్వారస్థలిన్ వీనులన్.

ఇంకే చప్పుడు నా చెవిం బడనిదయ్యెన్ దచ్చితాసీమహా
త్సంకేతధ్వని దప్ప, రాతికి హృదిస్పందంబులా యంచు నే
సంకోచించితిగాని తక్కిన శిలాజాతంబులనం గూడ త
త్సంకాశధ్వనులే వినంబడగ నాశ్చర్యప్లుతాత్ముండనై.

గౌతమశాపముం దినిన కన్నియలో! తన మంత్రదండపుం
గీతలచేత మాయలపకీ రొనరించిన బొమ్మరాలొ! యా
రీతి చరాచరమ్ముల విరించి లగించిన సర్గబంధమో!
యా తెఱగంచు మిక్కిలి భ్రమించుచు నచ్చెరువందుచుండగన్

కిలకిల నవ్వుచు, జాజరు లొలికించుచు మంచునుసుల నూడుచు నల మా
యిలవేల్పగు వలజేనికి, చెలికాడగు మామ యిటుల చెప్పం దొడగెన్.

"అన్నా! వీరును నిన్ను బోలిన మనుష్యవ్రాతమే మున్ను తా
మన్నిలై యధికారగర్వమున సామ్రాజ్యాశచే పాపమం
బున్నెంబుం గననట్టి పేదల శవమ్ముల్ మెట్లుగా గట్టికొం
చన్నాకంబున కెక్కజూచిన యమోఘౌఘమ్ముచే నైరిటుల్
అశనిపాతములచే నశ్మఘాతములచే భిన్నభిన్నములౌచు బ్రిదులువఱకు,
ప్రళయవాతస్రోత బహుళఘర్షణలచే నణుదఘ్నమై ప్రాణ మడలువఱకు

* 308 *Rifle*=శిపాయీల తుపాకీ

సంకర్షణానలచ్ఛటలచే భేదనంపుటలచే మఱుగూళ్ళు పొందువఱకు,
కర్మతాడనముచే గగనపీడనముచే కాలగర్భములోన గలియువఱకు,
కనులు కైకాళ్లు నోళ్లును కఱవుగాగ, మనసులో బాధ మనసులో మఱుగుచుండ
నుసురు గల బండలై పడియుందు రంచు, వీరి నీరీతి శిక్షించె విశ్వవిభుడు.

బండలయట్లు వీరు కనుపట్టుదు రైనను లోన ప్రాణముల్
గుండియ లున్న వందఱకు క్రుళ్లుచు క్రుళ్లుచు మృత్యుదేవతా
ఖండకృపావలోకనముకై పడిగాపులు గాయుచుందు రీ
శుండె యెఱుంగు నీ బ్రతుకుశోక మదెన్నడు తెల్లవారునో!

మున్ను నీ విన్న గుండెచప్పుళ్లు గూడ
వీరి గుండెలవే! యైన వెఱవకోయి!
తోడుగా నుందు పున్నమ నేడు కాన
నాల్గు జాముల ద్యూటియె నాకుగూడ.

జంకకు మన్నా! యీ ముది
జింకయు నీడిగిలబడిన చిక్కొడపుతు నా
కింకం బోయెదనని హరి
ణాంకుడు సనుటయును చిత్త మద్భుతమందెన్.

అధికారోల్లసితాత్ములై ప్రజల నన్యోన్యక్రుధావేశసం
గ్రథితోన్మాదుల జేసి, వారల ధనప్రాణంబులం గ్రోలి, దు
ష్పృథకుం జంకక, స్వీయజీవితమె కల్పస్థాయిగా నెంచు నీ
బధిరాంధ్రప్రభుకోటి కీ గతులె సంప్రాప్తించున౦ చెంచితిన్

* * * * *

గడ్డిపోచయైన గల్పింప జాలవు
దేవు డిచ్చినట్టి జీవకోటి
నుత్తరింప జనెదు యుద్ధాలపేరట
మతియు సుతియు లేదె మానవుండ!



# ఇండియా రాజ్యాంగచట్టములో సవరణలు



శ్రీ చావలి వెంకట హనుమంతరావు

మన క్రొత్త రాజ్యాంగచట్టమును పరిశీలించి, దానిలో ఏయే విషయములలో సవరణలు అవసరమో ఆలోచించుటకు, పార్లమెంటులోని కాంగ్రెస్ పార్టీవారొక ఉపసంఘమును నియమించియున్నారు. ఈ ఉపసంఘమువారి రిపోర్టు ననుసరించి ఏయే మార్పులు చేయవలెనో వాటికై సవరణలను పార్లమెంటులో ప్రవేశపెట్టెదరు. రాజ్యాంగచట్టమును అమలులోనికి పెట్టి ఒక సంవత్సరము మాత్రమేకదా అయినది. ఇంతలోనే దానిలోని సవరణలు ప్రతిపాదించుటకు అవకాశమెక్కడ, అని కొంతమంది ప్రశ్నించుచుండుటలో ఆశ్చర్యమేమియు లేదు. ఆ చట్టమును, దానిలోని వివిధవిషయములకు సంబంధించిన క్లాజులను రెండు సంవత్సరములన్నరకాలము తీవ్రముగ, అన్నిదృక్పథములనుండి చర్చించి ఏర్పాటుచేసినతరువాత. ఇంత తొందరగ మరల వాటిలో కొన్నిటిని సవరించుటలో ఎంతవరకు సమంజసత్వమున్నదీ ఆలోచనీయమే.

కాని అట్టి సవరణలు కొన్ని ముఖ్యవిషయములలో అవసరమని ఈమధ్య జరిగిన కొన్ని సందర్భములనుబట్టి తేలినదన్నమాట కూడ నిజమే. కాంగ్రెస్ పార్టీవారి ఉద్దేశ్యములో రెండు విషయములలో రాజ్యాంగచట్టమును సవరించుట అవసరమని వారాలోచించుచున్నట్లు తోచుచున్నది. మొదటిది: జమీందారీలను రద్దు చేయుటకు వివిధరాష్ట్రప్రభుత్వములు ప్రవేశపెట్టిన చట్టములను అమలులో పెట్టుటలో ఏర్పడిన ఇబ్బందులు. మద్రాసు రాష్ట్రములో జమీందారీ రద్దు చట్టము ఆమోదింపబడి, జమీందారీ ఎస్టేట్లన్నియు ప్రభుత్వమువారు వశపర్చుకొనియున్నారు. ఆ చట్టము ననుసరించి జమీందారులకు యీయవలసిన నష్టపరిహారమును ఇచ్చు మార్గములుకూడ ఏర్పాటు కాబడినవి.

ఈ నష్టపరిహారము మొత్తము సుమారు 14 కోట్ల రూపాయిల వరకుండునని అంచనావేయబడి, దానిలో సగమువంతు జమీందారీలను వశపర్చుకొనగానే ఇచ్చుటకును, మిగతా సగమును నష్టపరిహారము మొత్తము పూర్తిగ నిర్ణయింపబడినతరువాత ఇచ్చుటకును ఏర్పాటయినది. మద్రాసులో ఈ విధముగ ఏర్పాట్లు చేయబడినను, మరికొన్ని రాష్ట్రములలో—ముఖ్యముగ బీహారులో—జమీందారీరద్దు చట్టము ఆమోదింపబడినప్పటికిని, నష్టపరిహారము నిచ్చుటకు రాష్ట్రప్రభుత్వముచేతులలో డబ్బులేకపోవుటచే, ఎస్టేట్లను వశపర్చుకొనుటకు అడ్డంకులు ఏర్పడినవి. మన క్రొత్త రాజ్యాంగచట్టము ప్రకారము, ప్రభుత్వము ప్రజాహిత కార్యములకై ఏ ఆస్తినికాని వశపర్చుకొనదలచిన, ఆస్తికలవారికి సరియైన నష్టపరిహారము నీయవలసియుండునని నిర్ణయింపబడినది. ఈ క్లాజు ప్రకారము వారికి రావలసిన నష్టపరిహారమును ఏవిధముగ బీహార్ ప్రభుత్వము ఈయదలచినదో అది ప్రప్రథమునకే నిర్ణయించినకాని జమీందారీ ఎస్టేట్లను వశపర్చుకొన వీలులేదని కొంతమంది జమీందార్లు కోర్టులలో దావాలువేయగా, వారి వాదన సమంజసమైనదేనని హైకోర్టు తీర్పు నిచ్చెను. దీనివలన శాసనసభ చట్టము నామోదించినప్పటికిని, ప్రభుత్వము దాని నమలులో పెట్టుటకు వీలులేకుండ పోవుచున్నది.

ఈవిధముగా నష్టపరిహారము నిచ్చు విషయములో ఏర్పడిన సందిగ్ధములు, ఇబ్బందులు తొలగించినకాని జమీందారీ రద్దు విధానమును ఏరాష్ట్రప్రభుత్వము కాని పూర్తిగ అమలుజరుపుటకవకాశము లుండవు. ఇది రాజ్యాంగచట్టమునకు సంబంధించిన విషయమగుటచే, ఆచట్టములో నష్టపరిహారమును గురించి ఏర్పాటు చేయబడిన క్లాజును మార్చినకాని ప్రజాహిత దృక్పథమునుండి చేయబడిన జమీందారీ రద్దుచట్టమువలన రాష్ట్రప్రజల కెట్టి లాభమును ఉండకపోవచ్చును. కాన ప్రభుత్వము ప్రజాహిత కార్యములకొరకు ఆస్తినికాని, ఏ పరిశ్రమను కాని వశపర్చుకొనుటకు నిశ్చయించిన, ఆకార్యసాధనకై ఆస్తిదారులకు ఎంతవరకు నష్టపరిహారము నీయవలసియుండును, ఏరూపముగ దాని నీయవలసియుండును, అను విషయములు స్పష్టముగ నిర్ణయించుట అవసరమని తోచుచున్నది: ఈ విధముగ నిర్ణయించుట అవసరమా లేదా, అవసరమైన ఎడల వెంటనే సక్రమ పద్ధతులపై పని జరుగుటకు వీలగునట్లు చట్టములో సవరణ ప్రవేశపెట్టుట తగినదో కాదో, అను విషయములుకూడ ఆలోచనీయము లగును. ఈసమస్య పూర్తిగ ప్రజాహిత దృక్పథములనుండి ఆలోచించుట చాల ముఖ్యమని వేరుగ చెప్పనక్కరలేదు.

రాజ్యాంగచట్టమును సవరణచేయుటకు రెండవ అవసరము, ఈమధ్య ప్రాథమిక హక్కులు, సివిల్ లిబర్టీస్ - వీటినిగురించి కొన్ని హైకోర్టులు, సుప్రీమ్‌కోర్టువారు ఇచ్చుచున్న తీర్పులు: ఈ తీర్పులలో కొన్నింటినిబట్టి, మన దేశములో వివిధరాష్ట్రములలో

అమలులో నున్న విచారణలేని నిర్బంధవిధానము, రాజ్యాంగచట్టములోని ప్రధానసూత్రములకు భిన్నముగ నున్నదనియు, అట్టి నిర్బంధవిధానమును ప్రభుత్వము విడనాడవలెననియు, రాజ్యాంగచట్టములో ఏర్పాటు కాబడిన పౌరసత్వహక్కులను ప్రభుత్వము తమ ఇష్టమువచ్చినట్లు విచ్ఛిన్నము చేయరాదనియు, కోర్టులు తీర్పుల నిచ్చియున్నవి. పార్లమెంటుచే ఆమోదింపబడిన ప్రివెంటివ్ డిటెన్షను చట్టము ననుసరించి, అట్టి నిర్బంధములు దేశక్షేమమునకై అవసరమను నంతవరకు చట్టసమ్మతము చేయబడినప్పటికిని, అవి రాజ్యాంగచట్టములోని ప్రాథమికహక్కులకు వ్యతిరేకమను విషయమును, ప్రజల పౌరసత్వపు హక్కులను సంకుచితము చేయుచున్నవను సంగతినియు అంగీకరింపక తప్పదు. పార్లమెంటు ఈమధ్య ఆమోదించిన ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టము ప్రకారము ఇట్టి నిర్బంధములు ఒక సంవత్సరమువరకు చట్ట సమ్మతముగ చేయబడినప్పటికిని, ప్రభుత్వమువారు అట్టి నిర్బంధితుల కేసులన్నియు, ఒక అప్పెలేట్ ట్రిబ్యునల్ వారి ఎదుట పెట్టి, వారి సలహా ప్రకారము నిర్బంధితులను విడిచిపెట్టుటయో, నిర్బంధమును పొడిగించుటయో చేయవలసియుండును. కాని విచారణలేని నిర్బంధవిధానము రాజ్యాంగచట్టము యొక్క మూలసూత్రములకు, ప్రజాప్రభుత్వ మూలసిద్ధాంతములకు వ్యతిరేకమనియు, పౌరసత్వపు హక్కులను ప్రభుత్వమువారు తమ యిష్టమువచ్చినట్లు తారుమారు చేయుటకా పద్ధతి తోడ్పడుననియు అంగీకరింప వలసియున్నది.

ఇది ఒకవైపున ఉండగానే వేరొకవైపున ప్రాథమిక హక్కులను గురించి ఎక్కువగ పట్టుపట్టుచు, వాటినిగురించి పదేపదే ప్రచారము చేయుచున్నవారిలో, దేశక్షేమమునకు వ్యతిరేకముగ ప్రవర్తించుచు, అరాచకహింసాపద్ధతుల ననుసరించు కమ్యూనిస్టు పార్టీవారు ముఖ్యులని జ్ఞాపక ముంచుకోవలసి యున్నది. కమ్యూనిస్టులు ఒకవంక ఇట్టి దురాగతచర్యలకు పాల్పడుచు వేరొకప్రక్క తమ చర్యలను, కార్యక్రమమును ఆ హక్కులను పురస్కరించుకొని సమర్థించుకొన చూచుట హాస్యాస్పదము. మన న్యాయాధిపతులు చట్టమునుబట్టి మాత్రమే తీర్పు నిచ్చుచున్నవారగుటచే, కమ్యూనిస్టుల వాదన చట్టవిరుద్ధమనియు, రాజ్యాంగచట్టములో ఇప్పుడు చేర్చబడియున్న ప్రాథమికహక్కులకు విచారణలేని నిర్బంధము కేవలము విరుద్ధము కాదనియు నిర్ణయింపలేకున్నారు. కాన రాజ్యాంగచట్టములో పేర్కొనబడిన ప్రాథమిక పౌరసత్వపు హక్కులు హింసాకార్యక్రమము ననుసరించువారిపట్ల దేశద్రోహకరములగు కార్యములుచేయువారిపట్ల వర్తింపవని నిర్ణయించుట అవసరమని చెప్పవలసి యున్నది. "హింసాకార్యక్రమము" "దేశద్రోహచర్యలు" అను పదములకు సరియైన అర్థము స్పష్టముగ చెప్పుట కూడ ఈ సందర్భములో అవసరమగును. ఇది రాజ్యాంగ చట్టమును సవరించుటవలననే జరుగును కాని వేరొకపద్ధతి లేదు.

ఇదికాక వేరొకవిషయములో కూడ రాజ్యాంగచట్టమును సవరించుట అవసరమేమోనని నాకు తోచుచున్నది. అది ఇండియా దేశపు జాతీయభాషకు సంబంధించిన విషయము. ఇప్పుడు నిర్ణయింపబడిన ప్రకారము, 15 సంవత్సరములలో మనదేశమందంతటను హిందీ జాతీయభాషగా చేయుటకును, ప్రభుత్వవిధానమంతయు ఆ భాషద్వారానే నడుపుటకు ఏర్పాటయియున్నది. కాని 15 సంవత్సరములలో ఇంత పెద్ద మార్పువచ్చుట కవకాశము కలదా యనునది వివాదాంశము. ఇంత స్వల్పకాలములో హిందీ ఇంతవరకు అమలులోలేని దక్షిణఇండియా ప్రాంతములలో ఆ భాషకు పూర్తియగు ప్రచారము వచ్చునా అనునది ఒక ముఖ్యప్రశ్న. హిందీ విరివిగ ప్రచారమునకు వచ్చినప్పటికిని, ఇంగ్లీషు భాషను పూర్తిగ తొలగించి దానిస్థానే హిందీని ప్రవేశపెట్టుటకు అవకాశముండునా యనునది వేరొకప్రశ్న. హిందీ జాతీయ భాషగా ఏర్పడినప్పుడు, వివిధప్రాంతీయభాషల కెట్టి స్థానము విద్యావిధానములోను ప్రభుత్వవిధానమును నడుపుటలోను ఉండు ననునది మూడవప్రశ్న. ఈ సందర్భముల నన్నిటినిబట్టి హిందీ జాతీయభాషగా ఏర్పాటుచేయుటకు పెట్టబడిన గడువును పొడిగించుట అవసరమని తోచకతప్పదు. ఎప్పటికైనను ఆ భాష దేశభాష, జాతీయభాషగా ఏర్పడుట తప్పదని ఒప్పుకున్నప్పటికిని, 15 సంవత్సరములలో ఈమార్పు రావలెనని నిర్బంధముగ ఏర్పాటు చేయుటవలన ఏమి లాభమో తెలియుటలేదు. జాగ్రత్తగ ఆలోచించి ఈ సందర్భములో రాజ్యాంగచట్టమును సవరించుటవలన లాభముండునని చెప్పవలసి యున్నది.

పైన చెప్పినదానిని బట్టి ఒకటి రెండు విషయములలో నూతన రాజ్యాంగచట్టమును సవరించుట అవసరముగ కన్పించుచున్నది. కాని ఆ చేయవలసిన సవరణలను ఈపార్లమెంటులోనే ప్రవేశపెట్టుట అంత ముఖ్యమా అనునదికూడ ఆలోచింపవలసిన విషయమే. ఈసంవత్సరాంతములోగా, పార్లమెంటుకు, వివిధ రాష్ట్రశాసనసభలకు ఎన్నికలు జరుపుటకు ఇండియాప్రభుత్వము వారు కృతనిశ్చయులై యున్నట్లు ప్రధాన మంత్రి ప్రకటనలవలన తెలుచున్నది. అదే నిజమైన, రాజ్యాంగచట్టములో చేయవలసిన సవరణలను క్రొత్తపార్లమెంటులో ప్రవేశపెట్టి ఆమోదింప చేయుట సమంజసముగ నుండునని తేలగలదు. ఎన్నికలలో ఏపార్టీవారు అధికసంఖ్యాకులుగ వచ్చెదరో, వారేవిధానము ననుసరించుటకు నిర్ణయించుకొందురో దాని ననుసరించి సవరణలను ప్రవేశపెట్టుట మంచిది. అట్లు కాక వెంటనే వాటిని ప్రవేశపెట్టుటవలన కాంగ్రెస్‌పార్టీవారు తమ పార్టీని బలపర్చుకొనుటకు మాత్రమే వాటిని ప్రవేశపెట్టుచున్నారనియు, తమకు వ్యతిరేకముగనున్న పార్టీలను అణచివేయుటకు ప్రయత్నించుచున్నారనియు వాదించుట కవకాశ ముండును. మరియు, క్రొత్తరాజ్యాంగచట్టములోని ప్రతి క్లాజుకూడ, అందు ముఖ్యముగ ఇప్పుడు సవరింపదలుచుకొనిన క్లాజులన్నియు, వివిధదృక్పథములనుండి చర్చింపబడి చివరనిర్ణయమునకు తేబడినట్టివే యగుటచే, ఇంత త్వరలోనే వాటిని మార్చుట ఆ నిర్ణయములు తప్పనిసరియైనవి కావని అంగీకరించుటయే యగును.

రాజ్యాంగవిధానములోను, దానికి సంబంధించిన చట్టములోను అత్యవసరమగు మార్పులు కాలమానపరిస్థితుల ననుసరించి ప్రవేశపెట్టుట తప్పనిసరియగును. కాని ఈవిధమగు సవరణలు చాల దీర్ఘవిచారణచేసి, శాసనసభలోని అన్ని పక్షముల అభిప్రాయములను సమన్వయించి చేయుట శ్రేయస్కరము. అమెరికా సంయుక్తరాష్ట్రముల రాజ్యాంగచట్టము ఏర్పాటయి ఇప్పటికి 175 సంవత్సరములైనప్పటికి, 15,16 సవరణలుమాత్రమే దానియందు ఇంతవరకు చేయబడినవి. దానినిబట్టి మనము నేర్చుకొనదగిన విషయమేమన రాజ్యాంగచట్టములో ఏ మార్పు అవసరమైనను, ప్రజాభిప్రాయమును పూర్తిగ కనుగొనిన తరువాతనే చేయుట సమంజసముగ నుండు ననునది. వచ్చే ఎన్నికలలో ఈవిధముగ ప్రజాభిప్రాయమును తెలుసుకొనుట కవకాశమేర్పడును. కాన ముఖ్యమైన సవరణలు క్రొత్తగా ఎన్నుకొబడిన పార్లమెంటు వారిచే చేయబడినవాటికి నైతిక పునాది గట్టిగ నుండును; ఆ విధానములో ఎవరును లోపము కాంచింపజాలరు.

# మధురథము



శ్రీ దాశరథి

చిగురు చేదువేపపూవుల
పరిమళముల దారులందూ పరువిడి వచ్చెన్
ఖరకర తీక్ష్ణాతపములు
కొదకొరలాడఁగ మధుండు, కుసుమ రథుండై.

మధు రథమార్గమందు సుమమా సుకుమార రసార్ద్రి మల్లికా
గ్రథన మెఱసర్ప జోతెలను కట్టుక వచ్చిరి సుందరాప్సరో
మిథునము; లామనిఁ దొరయు మృత్తిక సైతము దివ్య సౌరభ
ప్రథితము గాఁదొడంగె సురపాద తలాంకిత సాధు రాగమై.

విచ్చిన మోదుగుం బుత్రుల మెచ్చని చూపులలో వసించు కా
ర్చిచ్చులు రెచ్చిపోయి విరచించిన రొజ్జని నాట్యశాలలో
అచ్చర లాడినారలు, నవాబ్ద మధూదయ సాధు లక్ష్మికిన్
ముచ్చటగా—సముచ్ఛ్వసిత మోహన యౌవన భాగధేయలై.

శీతవాతంబు క్రకచంబుచేతఁ గోత
పడిన గుండెల నతికించ వచ్చినాడు
మధు రథమ్మున మాధవ మానివరుడు
కుసుమ విస్మయర మధు రసగుళిక తోఁడ.

ఒంటరితనాన గడచిన కుంటి బ్రతుకు
కంటకాయిత శైశిర మంటపమున
వడవడ వడంకి కన్నీరు వార నేడ్చి
నేడు క్రొత్త నవ్వుల దారి నిక్కి—చూచె.

పూవుల జొన్నతో మధువు పుక్కిటఁబట్టి వసంత పుణ్యవే
ళా వికచాంతరంగమున లావగు హర్షము చిమ్మిరేగ నా
పోవుట మాని పేరలత పోవిడు జీవిత మట్టిదానకున్
యౌవన ముగ్గలించె నభునాతన నూతన గీతికాతతిన్.

మాధవస్వామి చైత్ర రథారూఢు
డై, ధనుర్ధారియైన పుష్పాయుధునకు
శాణ కర్కరోల్లీఢ నిశాత శరము
లిచ్చి పోవఁగ వేవేగ వచ్చినాఁడు.

ఆకు రాలి దిగంబరమైన నాఁడు
శుష్కజీవన భూజమ్ము చుట్టుకొనఁగ
పూల పుట్టమ్ములోనఁగడి పుణ్యమూర్తి,
మాధవుఁడు, వనరాజ్య రమాధవుండు.

తూణీరమ్మున పూలబాణములు చిందుల్ద్రొక్క, నక్రధ్వజ
స్థూణాశృంగపటంబు కంపిల, జయస్తోత్రమ్ములన్ షట్పదీ
వేణుల్ పాడ, సుమాయుధుండు కుసుమప్రేంఖద్రసాలాగ్ర ని
శ్రేణీ రోహకుఁడౌచుఁ జేరె గమికర్మీభూత వాసంతమున్.

చిరిఁగిన కోరికల్ మరల శృంగములెత్త, నిరాశ యేగి నై
శిర మరుదంకురమ్ముల నశింప, వియోగ విషాద వేదనా
భరములు సన్నగిల్లి గత వర్షముతో జతఁగూడ, కేతకీ
సురుచిర పత్రికాకనక శోభలతో మధు వేగుదెంచెనున్.

స్మర ఖర సుమశరములఁబడి
వెరగున నిందించునట్లు, విరుల నవలతో
ఖరవత్సర మరుదెంచిన
మొరకులరై జనులు తిట్టిపోయఁగ తగునే!

ఏదైన నేమి! క్రొత్తది
రాఁదలచినయపుడు గుండెలన్ శుభాకాంక్షల్
గాఁ దొడిగి సమర్పించుట
కాదే సుమనస్కులైన ఘనులకుఁ బ్రియమా.



# నేటి నాటక రంగము



శ్రీ తెన్నేటి సూరి

"నాటకకళ ఉంటుందా? నశించిపోతుందా?"—ఈ ప్రశ్న పలువురి నోట దినదినం వింటున్నాం. ఈ ప్రశ్నలోనే కొంత అనిర్దిష్టతవున్నట్టు కనుపించుతుంది. ఏమంటే, కళ అనేది యేదీ—ఆ యుగానికా యుగం ప్రవర్ధమానం కావలసిందే తప్ప, నశించిపోవటమంటూ, వుండదు. కళ అనగానే సృజనా శాస్త్రమని అర్థం చెప్పుకోవలసిందేకాని, ఆ శాస్త్రరీత్యా సృష్టించబడిన రూపమూర్తిగా అర్థం చెప్పటానికి వీల్లేదు. బహుశా యీ ప్రశ్న వేసేవారి అభిప్రాయ మేమై వుంటుందంటే—'నాటక కళా రూపాలు—లేదా రూపకములు ఉంటాయా నశించుతాయా?' అని అయివుంటుంది. లోగడ సృష్టింపబడిన రూపకములు అలా వుండేవే గనుక, అవి నశించుతాయా వుంటాయా అన్న ప్రశ్న లేదు. పోగా యికముందు కొత్తరూపకాలు సృష్టించబడతాయా అనేది.

నిర్మాణశాస్త్రం అంటూ శాశ్వతమైనది వొకటివుందిగనుక ఈనాడు కాకపోతే మరో యుగానికైనా క్రొత్త రూపకాలు వెలువడే అవకాశం యెప్పుడూవుంది.

పూర్వం అసలు తెలుగుజాతిలో నాటకకళ అనేదే, మొన్న మొన్నటివరకూ, వుండేదే కాదేమో; యక్షగానాలరూపంలో వున్న నాట్యకళతప్ప నాటకకళ ప్రత్యేకం వున్నట్టు కనుపించదు. అయితే అతిప్రాచీనములైన సంస్కృతనాటకము లున్నయ్. వాటిని యెవరెవరు యేయేదేశాలలో ఆడేవారో, నడివీధుల్లో ప్రజాబాహుళ్యానికంతకూ అందుబాటుగా వీధుల్లో ప్రదర్శించేవారో, లేక కేవలం సంస్కృతభాషాపాండిత్యంగల రాజాదిపూరుషుల వినోదార్థం రాజప్రాసాదాలలో మాత్రమే ప్రదర్శించేవారో ఆ చరిత్ర యేమీ మనకు సరిగ్గా లభ్యంకాలేదు. ఈ ప్రసక్తి యెందుకు తేవలసివచ్చిందంటే, సంస్కృతరూపకాలు తెలుగు దేశంలో ప్రదర్శించబడేవో కావో తెలియదని మనవి చెయ్యటానికి.

పార్సీ కంపెనీలువచ్చి మనదేశంలో పర్యటించి నాటకాలు ఆడటంతో మన భాషలోకూడా అలాంటి నాటకాలను అవతరింపజేయాలనే అభిలాష దేశంలోని కళోపాసకులలో చాలామందికి కలిగింది. తెలుగు వాఙ్మయంలో ఆనాటికి నాటకకళ అనేది వుండేదే కాదుగనుక సంస్కృతభాషాపరిచయమున్న ధర్మవరం కృష్ణమాచార్యులవారు మొదలైన పండితకవులు కొందరు సంస్కృత నాటకకళను ఆధారంచేసుకుని ఆంధ్రవాఙ్మయంలోకూడా నాటకాలు సృష్టించారు. ఇంతా చెప్పవలసివచ్చిం దేమిటంటే, యేనాడో ప్రచారంలోనుంచి నశించిపోయిన సంస్కృతంలాంటి భాషలో మరుగుపడివున్న కళే అయినా, దాని అవసరం వచ్చేసరికి యథాచైతన్యంతో తెలుగు వాఙ్మయంలో తిరిగి అవతరించింది. దీనివల్ల, కళ అనేది యెన్నటికీ నశించేదికాదని విస్పష్టంగా తేలుతున్నది.

కాగా యీ ప్రశ్న యెలా వుండాలంటే—'రూపకాలు ప్రదర్శించబడుతూ ప్రచారంలో వుంటాయా లేక నశించిపోతాయా?' అని వుండాలి. ఈప్రశ్న ఉదయించటానికి బలమైన కారణం లేకపోలేదు. ఈరోజున దేశంలో నాటకాలు పూర్వం మోస్తరుగా విరివిగా ప్రదర్శించబడటం లేదు. రెండవవైపున సినిమాప్రదర్శనాలు బహుళంగా జరుగుతూ వున్నయ్. దీన్నిబట్టి సినిమాల ప్రాబల్యంవల్లనే నాటకాలు దెబ్బతిన్నాయి అనే భ్రమ కలగటానికి సావకాశం వుంది. కాని కేవలం యిది భ్రమమాత్రమే. నాటకాలు ప్రచారంలో లేకుండా, తాత్కాలికంగా, యిలా, మరుగున పడివుండటం, నశించిపోతున్నట్టు కనుపించటం నాటక రంగానికి చుట్టుకున్న ఈతిబాధలవల్లనేగాని, సినిమాల పోటీవల్లగాదు. నిజానికి నాటకరంగంతో సినిమాలు యెన్నడూ పోటీ చెయ్యలేవు; ఆ కారణాలను క్రమశః తదుపరి మనవిచేస్తాను.

మరి నాటకాలకు ప్రచార మెందుకు తగ్గతోంది? నాటక రంగానికి ప్రస్తుతం చుట్టుకున్న యీతిబాధ లేమిటి? దీనికి ఒక్కటే బండసమాధానం: నాటకరంగం నాటకరంగంగా వుండటానికి బదులు ఇతరంగా మారటానికి ప్రయత్నించటం; ముఖ్యంగా సినిమా కళను అనుకరించి సినిమాలతో పోటీచెయ్యటానికి ప్రయత్నించటం. ఇది ఇంచుమించు, కత్తిసాము నేర్చినవాడు, కత్తి అక్కడ పారేసిపోయి, సూదిపుచ్చుకు లేసులల్లే అమ్మాయితో పోటీచేసి ఓడిపోవటంగా వుంది. ఇది ఎలా జరుగుతోందో కొంచెం పరిశీలించుదాం. నాటక రంగంలో రెండు ప్రధానభాగా లున్నయ్. మొదటిది నాటకరచన, రెండవది ప్రదర్శనం. వీటిలో రెండవదాన్ని మొదట తీసుకుని సంక్షిప్తంగా పరిశీలించి, తరువాత నాటకరచన విషయం యెత్తుకుందాం.

## ప్రదర్శనానికి గల ఇబ్బందులు

మొట్టమొదట జరిగిన పనేమిటంటే; నడివీధిలో, ప్రజాపోషణలో, ప్రజలకందరికీ అందుబాటులో వుండే యీ కళను, దీని ద్వారా డబ్బు సంపాదించటానికి అవకాశం వున్నదని తెలుసుకున్న కొంతమంది తెలివిగల వారు, దీన్ని నడివీధిలోనుంచి లాగేసి తమ అజమాయిషీలోకి తెచ్చుకుని, ప్రదర్శనశాలలు యేర్పాటు చేసి, టిక్కెట్లు పెట్టి ప్రేక్షకుల దగ్గిర డబ్బు వసూలుచేస్తూ, దీన్ని ఒక విధమైన వ్యాపారంక్రింద తయారుచేశారు. నడివీధిలో ప్రదర్శనా లివ్వటం అగౌరవమైన పనిగా ప్రచారంకూడా సాగింది. పదిమంది నటకులూ పది రూపాయలు చందా వేసుకుని లేదా ఉత్సాహ్యవున్న పదిమంది దగ్గిరా పది రూపాయలు పోగుజేసి, చాలా స్వల్ప వ్యయంతో, కళా ప్రకాశనాభిలాష మాత్రమే ముఖ్యోద్దేశ్యంగా, విరివిగా గ్రామగ్రామానా నాటకాలాడుకునే ప్రాప్తి దీంతో తీరింది. ఈ వ్యాపారస్తులు, తాము నాటకరంగానికి యెంతో సేవజేశామనీ తద్వారా ఆర్థికంగా చాలా దెబ్బలు తిన్నామనీ అనేవారు. కాని, యీ విషయంలో యీషణ్మాత్రమైనా సత్యం లేదని తోస్తుంది. నాటకకళకు వీరివల్ల జరిగిన మేలుకంటే అపకారమే యెక్కువ జరిగింది. అంతేకాక వీరు ఆర్థికంగా దెబ్బలు తిన్నది, నాటక కళతో సంబంధంలేని, యితర స్వంత వ్యాసంగాలకూ, అభిలాషలకూ పోవటంవల్లనేగాని. కేవలం నాటక కళవల్ల వీరు చెడిపోవటానికిగాని చెడిపోయిందిగాని యేమీ లేదు. పైగా వీరు తాము నాటకకళను పోషించుటవల్లనే చెడిపోయామని గోలచెయ్యటంమూలాన, తరువాతి తరువాత దాని జోలికి పోవటానికి చాలామంది జంకిపోయారు. అంతేగాక రంగవ్యవస్థలోకి వీరు వ్యాపింపచేసిన అవినీతివల్ల నాటకాలతో యే రకం జోక్యంవున్న వ్యక్తినైనా ప్రజానీకం, అవినీతిపరుడుగా పరిగణించే పరిస్థితి యేర్పడ్డది. నాటకరంగానికి అలాంటి దురదృష్టాలు కలగటం నిజంగా విచారకరం.

కాగా కళావిషయంగా వీరు తీసుకువచ్చిన మార్పులేమిటో గమనించుదాం.

ఒకే ఒక తెల్లటిగుడ్డ తెరతో కొబ్బరాకుల పందిరిగా ఉండే సర్వ సముజ్వలమైన నాటకరంగంగా వుండగలిగినదాన్ని చేపట్టి దానిమీదికి అనేక వికారాలను యెక్కించారు. నాటకకళకు కేవల ఉపాంగాలుగా ఉంటూన్న యితరకళలకు, చిత్రసంగీత కళలకు, ఎక్కువ ప్రాధాన్యతను తీసుకువచ్చి అభినయ సౌష్ఠవాన్ని మొత్తం దెబ్బ తీశారు. నాటకం కళారూపంలో కేవలం వాస్తవిక ప్రపంచమునకు అనుకరణంగా వుండవలసిందేగాని యథాతథ ప్రదర్శనంగా వుండకూడదన్న, మహామహులైన కళాకారుల అభిప్రాయాన్ని విస్మరించి, అనేక వంకదారులు త్రొక్కారు. సంభాషణారూపంలో మనోద్యేగాలను స్ఫురింపచేయటానికి వున్న సావకాశాన్ని చంపేసి, ప్రతిదీ రంగంమీదప్రదర్శించి నానా భీభత్సపరిస్థితినీ తీసుకువచ్చారు. యమధర్మరాజు అట్టదున్నపోతుమీద యెక్కి ఉక్కుతీగల సహాయంతో నాటకరంగం మీదికి అవతరించే దురదృష్టం నాటకకళకుపట్టింది; కథాగమనానికి ప్రతిబంధకంగా, అట్టలతో కట్టిన ద్యుమత్సేనుడికోట తగులబడిపోతూ వుండటం అరగంటసేపు మనం రంగంమీద చూడవలసి వచ్చింది. చిత్రకళ నాటకకళను పీకనొక్కి తాను రంగాన్ని యావత్తూ ఆక్రమించుకుంది. అర్థం పర్థం లేని వెర్రి తెరలు, వెర్రిసామానులూ అవకతవక హంగామాలూ చెలరేగి నాటకరంగం ఒక చిత్రవస్తుప్రదర్శనశాలగానూ, జంతు ప్రదర్శనశాలగానూ, ఇంద్రజాల ప్రదర్శనశాలగానూ, సర్కసు గోదాముగానూ తయారైంది. ఈ హంగామాల కన్నిటికీ బోలెడంత డబ్బు తగలేయటం జరిగింది. రంగంమీద, నటకుల విలువకంటే, కొయ్యసామానుల విలువా, గుడ్డపేలికల విలువా, గాజుపూసల విలువా పరమ కిరాతంగా పెరిగి నాటకకళను మొత్తంగా చితక ద్రొక్కింది. ఆహార్యవిషయంలో, ఆయాపాత్రల మనోభావనలను ప్రవేశనం చెయ్యటానికీ, రసపోషణకూ అనువుగానూ చిహ్నప్రాయంగానూ వుండే విశిష్టసంప్రదాయమంతా నశించి దుష్యంత మహారాజు యెంత్రసిల్కు షర్టుతోనూ, ఆకుపచ్చ అంగరఖాతోనూ, చెమ్కీ వెయిస్టుకోటూ కాబా తగిలించుకుని గడ్డం విసా, ఢిల్లీసుల్తాన్ పద్ధతిలో తయారయ్యే దౌర్భాగ్యం పట్టింది. ఒక రంగాలంకార, ఆహార్య విషయాలలోనే కాక, అభినయాది విషయాలలో కూడా, సూచనా సాంప్రదాయం అంతరించి, వాస్తవికత పేరుతో శకుంతల కళ్లలో గ్లిసరిన్ పోసుకుని, దుఃఖాతిరేకం పేరుతో, గయ్యాళిగంపలా వెక్కి వెక్కి పెద్దపెట్టున గుక్కపట్టి యేడుస్తూ రాగాలుతీయటం దాకా నడిచింది.

మరొక రెండో పెడద యేమిటంటే, వ్యాపారదృష్టితప్ప, నాటకకళయందు శ్రద్ధలేని, నాటకకంపెనీల యజమానులూ, కంట్రాక్టర్లూ, బాగా సంగీతం పాడగలవారిని గనుక రంగంమీదికి తెస్తే, బాగా డబ్బు వస్తుందనుకున్నారు. సంగీత విద్వాంసులను అభినయకళలో ప్రవేశమున్నా లేకపోయినా, పెద్దపెద్దమొత్తాలు యిచ్చి, నాటకరంగంమీదికి తీసుకురావటం ప్రారంభించారు. ఆ విద్వాంసులు నాటకరంగంతో యెట్టి విధమైన ప్రమేయమూ కలవారు కాదుగనుక సహజంగా నాటకరంగాన్ని పాటకచేరీ వేదికగా ఉపయోగించుకున్నారు. ఆయా కారణాలవల్ల నాటకరంగమంటే, చిత్రవస్తుప్రదర్శనశాలలో కూర్చుని గాయకులు పాటకచేరీలు చేయటంగా తయారైంది.

ఇది ఇలా వుండగా ఆడవాళ్లను రంగంమీదికి తీసుకువస్తే బాగా డబ్బువస్తుందని గ్రహించిన కొందరు, అదో ఉద్యమాన్ని లేవదీశారు. రంగ మెక్కతొనన్న అడవులనుల్లా లాక్కొచ్చి ఆడవేషా లేకాక మొగవేషాలకుకూడా వినియోగించారు. సొంతం మొగతనం లేని నవలా నాట్యమండలులుకూడా ప్రారంభమైనై.

సినిమాలు ప్రచారానికి రావటంతో ఈ వికారాల కన్నిటికీ సంపూర్ణంగా పరిణతివచ్చింది. సినిమాలలో మాదిరిగానే పెద్దపెద్ద సెట్టింగులు తయారుచేయించటం, లాక్ స్ప్రేకర్లు, రంగురంగుల లైట్లూ, యీ హంగామాఅంతా బయలుదేరింది. దీనికంతకూ అనంతంగా డబ్బు కావలసివచ్చింది.

సినిమాల అనుకరణ, అభినయాదికాలలో కూడా ఎంచాక్కా వచ్చిందంటే, ఆ పాత్ర పేరగాని, పాత్రిగాని, మరో మరో

మహారాజులుగాని, ఏ పూలదండనో, పూలగుత్తినో, పావురాన్నో బంతులనో, చేత్తో పుచ్చుకుని ఇలా తెరయెత్తగానే రంగంలోకి ఉరికి ఏ పాటో లంకించుకొని చెడుగుడుకూస్తూ గాడిద గంతు లెట్టటందాకా పోయింది.

సినిమాకు పనికివచ్చేలాంటి అభినయ చాకచక్యం చూపించినా, రచనా సామర్థ్యం చూపించినా ఏ సినిమా ప్రొప్రైటరు దృష్టినైనా ఆకర్షించి డబ్బు చేసుకోగల్గుదుమనే అభిలాష, నాటక రంగానికి అంటిపెట్టుకునివున్న కళాకారు లందరికీ—రచయితల దగ్గరనుంచి, నటీనటులవరకూ—బయలు దేరింది. "సినిమాకు పనికి వస్తే ఉత్తమనాటకం" వగైరా అసందర్భపు అడ్వర్‌టైజుమెంట్లు బయలు దేరినై.

ఇలా నాటకరంగం ప్రజాబాహుళ్యం చేతుల్లోనుంచి మొదటిమెట్టుగా, వ్యాపారస్థుల చేతుల్లోకిపోయింది. వ్యాపారస్థులు దాన్ని డబ్బుచేసుకునే కర్మాగారంగా ఉపయోగించే ప్రయత్నంలో ఆకొడికి తెచ్చారు.

ఇక చిట్టచివరకు జరిగిన హత్యాకాండ ఏమిటంటే, ఈ వ్యాపారస్థులకు, నాటకరంగాన్ని పట్టుకు పెనుగులాడటం కంటె, సినిమాప్రదర్శనాల వ్యాపారం పెట్టుకుంటే లాభదాయకంగా వుంటుందని తోచింది; దాంతో, ఈ మహానుభావు లంతా నాటక కళను అలా ఏ కొన ప్రాంతలకో పోయి బ్రతక మని పంపేసి చేతులు కడిగేసుకున్నారు. చక్కగా ఆ నాటకశాలల్లో సినిమా ప్రొజెక్టర్లు తగిలించుకుని, తిరిగి పుష్కలంగా డబ్బుచేసుకుంటున్నారు. ఇంకా యీ నాటకరంగాన్ని వదలలేని పిచ్చులకేసే ఏ వెర్రివాడన్నా వుండి, పదిమంది నటీనటులను పోగుజేసి కష్టపడి ఏ నాటకాన్నో సాధన చేయించి తీరా దాన్ని ప్రదర్శించటానికి హాలు యిప్పించమని యీ యజమాను లెవ్వరి దగ్గిరకేనా వెడితే, వారు అసలు ఆ వ్యవహారం పొసగటానికి వీలులేకుండా, అథవా పొసగినా, ఆ వెర్రివాడు మళ్లా భూమ్మీద నిలిచే ఆస్కారం లేనివిధంగానూ బేరా లాడుతున్నారు.

హాలు అద్దె రు 300-0-0, అడ్వర్‌టైజుమెంటుకు మూడు వందలూ, లౌడ్‌స్పీకర్లకూ, లైట్లకూ వందా, గేట్ల వద్ద సిబ్బందిని వుంచినందుకు మరో వందా, హాలుతరఫు కాంప్లిమెంటరీలు 50, డ్రెస్సులు వగైరా అద్దెలక్రింద మరో వందా—అంతా తడిపి ముప్పందుంచేసి, వా డా దెబ్బతో, నటీనటులకు కానీ యివ్వకుండానే, ఉన్న రెం డెకరాల కొంప్రా కరారావుడి చేసుకుని అవతలికి పోవలసిన ఏర్పాటంతా చేశారు. ఇది ప్రస్తుతం నాటక ప్రదర్శనాలకు పట్టుకున్న దుర్గతి.

## నాటకరచనలో వచ్చిన మార్పులు

ఇక నాటకరచన విషయం తీసుకుందాం.

కథా, నవలా సాహిత్యాల విషయంలో మనం తక్కిన జాతి కంటే చాలా వెనుకబడివుంటే వుండవచ్చునేమో గాని, సంస్కృత వాఙ్మయం మనదే ననుకుంటే కావ్యనాటక సాహిత్యాల నిర్మాణవిషయంగా మనకు ప్రపంచ వాఙ్మయాలలో ప్రథమ స్థానమే వుందని చెప్పుకోవటం డాబుసరి మాటకాదేమో. నాటక నిర్మాణవిషయంలో, భాస భవభూతిశూద్రకులతో పోటీ చేయ గలిగిన ఘటికులను ఏ జాతిగాని ప్రభవింపజేసుకో గలిగిననాడు, మనం ఆ జాతిని కళాభిక్ష యాచించవలసి వుంటుందేమో గాని ఈలోగా అలాంటి ప్రమాద మేమీ లేదు.

కాగా యిప్పుడు నాటక రచయితల పద్ధతులు చూస్తే చిత్రవిచిత్రంగా వున్నయ్. ఇబ్సన్ నాటకాలను అనుకరించామనే వా రొకరూ, షెరిడెన్ 'రైవల్సు' మక్కీ దించామనే వా రొకరూ, మాది, మాటర్‌లింకు మహా పంథా అనేవా రొకరూ, వాతావరణ కల్పనలో చకోవును చెప్పి మరొకర్ని చెప్పాలనేవా రొకరూ—ఇలా బయలు దేరుతున్నారు.

ఇతరులవద్ద విశిష్టత గోచరించినప్పుడు దాన్ని తెచ్చుకో గూడదనికాదు అనటం: తప్పకుండా తెచ్చుకోవలసిందే, మనలో లోపాలుంటే సవరించుకోవలసిందే. మన నాటకకళ, వీలైతే పూర్వంకంటే ఒక మెట్టు పైకి పోగలిగిందనిపించుకోవలసిందే.

కాని మనం ఒక నాటకాన్ని వ్రాయటానికి పూనుకునే ముందు, దాన్ని మన రంగంమీద ప్రదర్శించాలనే విషయాన్నీ ఆ ప్రదర్శనాన్ని మన ప్రేక్షకులు చూచి ఆనందించాలనే విషయాన్నీ మాత్రం మరచి ప్రయోజనం వుండదు.

మనకు ఎలిజబెత్ దర్బారులోవుండే మోస్తరు రెండుగూడు అంతస్థుల నాటకరంగం లేదు, గ్లోబ్ థియేటర్లు లేవు; రివాల్వింగ్ స్టేజస్ లేవు. ఇంత త్వరలో అలాంటివాటిని నిర్మించుకోగల తాహతుకూడా మనకు లేదు. ఉన్నా అలాంటివన్నీ వట్టిడాబుసరికేగాని కళాభివృద్ధిదృష్ట్యా వట్టి అనవసరమైన కొమాటం అలాంటి వ్యర్థ దుర్వ్యయంవల్ల ఉత్తమమైన నాటకకళ పెంపొందుతుందనుకోవటం కటిక పొరపాటు. ఈలాంటి లేనిపోని అనవసరపు పటాటోపాలకుపోయే నాటకరంగాన్ని మనం ఈనాడు యీ కొడికి తెచ్చుకున్నామనే సంగతి యెవ్వరూ మరువకూడదు. ఈ విషయం యింత తీవ్రంగా యెందుకు ప్రతిపాదించవలసి వస్తున్నదంటే, మనకేదో ఆదర్శప్రాయమైన నాటకప్రదర్శనశాల లుండాలనీ, అలాంటివాటిని ప్రభుత్వం తగినడబ్బు ఖర్చుచేసి నిర్మించాలనీ, అలా చేస్తేనేగాని ఉత్తమతరగతి నాటకప్రదర్శనాలు జరగవనీ, యిటీవల చాలా ప్రచారాలు వింటున్నాం. అలాంటివాటివల్ల కలిగే మేలేమీ లేకపోగా, నాటకకళకు లేనిపోని బానిసత్వస్థితి కూడా యేర్పడుతుంది.

కాగా మనకు వున్న నాటకరంగ మేమిటంటే సుమారు 35 అడుగుల పొడవూ 17½ అడుగుల వెడల్పూ వెనకా ముందూ, తెల్లవిగానీండి, రంగువికానీండి రెండు తెరలు, ఇరుపార్శ్వములలోనూ తగిన ఆచ్ఛాదనలూ—ఇదీ మనకున్న కొమాటం. ఈ పరిమిత రంగంలో అనంతమైన కళాసృష్టి జరగటానికి ఆస్కార ముంది.

ఈ రంగానికి, ముందుభాగంలో, ప్రేక్షకులు, అది అరుబయలుగాని గొడ్లపాకగాని, నాటకశాలగాని, డేరాగాని, అయినా సుమారుఒక రెండు వేలమంది మానవమాత్రులు కూర్చుని ప్రదర్శనాన్ని చూస్తూవుంటారని మనం లెక్క వేసుకోవలసి వుంటుంది. అలాంటి

రంగంమీద ప్రదర్శించటానికీ అంతమంది జనం, కళ్లతో చూచీ, చెవులతో వినీ ఆనందించటానికీ తగిన నాటకాన్ని రచయితలు అందచేయవలసి వుంటుంది. అందుకు అనువైన శిల్పమేమిటో దాన్ని అభివృద్ధికి తెచ్చుకోవలసి వుంటుంది. ఈ ప్రేక్షకులను, తృప్తిపరచవలసిన బాధ్యత తనకు వున్నదని రచయిత గుర్తించితే తాను వ్రాయవలసిన నాటకం ఎలా వుండాలో, ఏరకం శిల్పాన్ని వాడుకోవాలో సునాయాసంగా బోధపడుతుంది.

ఈ ప్రేక్షకులు సామాజికజీవితాన్ని గౌరవించుతున్న వారుగా వుంటారు. అందుచేత సామాజికమర్యాదలు అతిక్రమించి రచయిత నడవటానికి వీలుండదు. ఒకవేళ సమాజం అంగీకరించని ఒక విప్లవభావాన్ని ప్రచారంచేయ సమకట్టినా, అది కళాపరిపుష్టిగల సూచనగానూ, నచ్చచెప్పేదిగానూ వుండాలిగాని, జుగుప్సార్థమైన ప్రదర్శనంద్వారా యేవగింపు పుట్టించేదిగా వుండరాదు.

ముందు కూర్చునివుండే ప్రజానీకంలో అనేక రకరకాల అభిరుచులు గల ప్రేక్షకు లుంటారు. వీరందర్నీ తృప్తిపరచవలసిన బాధ్యత వున్నదని గమనించితే రచయితకు ఎలాంటి చాకచక్యం అవసరమో తెలుస్తుంది.

ఇక ఈ ప్రజలంతా మానవమాత్రులని చెప్పాం—అంటే చెప్పిందే చెప్పతుంటే వినుకూ, చెప్పదలచిన విషయాన్ని తల పకులగొట్టుతున్నా అర్థంకాని పద్ధతిలో చెబితే నిస్పృహా, యిలాటివన్నీ కలగటానికి వీలుంటుంది.

ఇలాంటి ప్రసక్తి ఎందుకు తేవలసి వచ్చిందంటే, ఇటీవల వచ్చిన కొన్ని నాటకాలలో, పాత్రలు రంగంమీది కొచ్చి యేవో భావకవిత్వాలు మాట్లాడటం, జనానికి అర్థంకాని, యేదో సాంకేతిక పరిభాషలో మాట్లాడటం, దాంతో ప్రజలు గోల చేసి అక్కడికి ఆ మహా రచయితలు వ్రాసిన గొప్ప నాటకాలని చెప్ప బడుతూన్నవాటిని ఆపించి, మామూలు 'సక్కుబాయి' వగైరా నాటకాలు ఆడమని నటీనటులను వత్తిడి చేయటం, ఇలాంటి అఘాయిత్యాలన్నీ జరిగినై. ఆ యా మహామహులు ఆ సంఘటనలు చూసి కోపాలొచ్చి 'సంస్కృతి లేని జనం' అంటూ ప్రేక్షకులను దుమ్మెత్తిపోయటం ప్రారంభించారు. ఈ రచయితలు ఒక్క విషయాన్ని గుర్తించకపోవటంమాత్రం చాలా విచారకరం. తమకు తగిన సంస్కృతి లేదనీ, నాటక రచయిత, నటీనటులు కలసి, తమలో లేని నూతన తేజాన్ని దీన్ని అందించుతారనే అభిలాషతోనే యీ ప్రేక్షకులు ఇలా నాటకం చూడ్డానికి వచ్చారని గుర్తించకపోవటం.

ఈ వ్యవహారాలు యిలా వుండగా, నాటకం అంకాలుగా వ్రాయాలని కొందరూ, రంగాలుగా వ్రాయాలని కొందరూ ముష్టియుద్ధాలదాకా దిగుతున్నారు. అంకాలుగా వ్రాసుకుంటారో రంగాలుగా వ్రాసుకుంటారో, ఆ సంగతి ప్రేక్షకుడికి యేమి పట్టింది ? ప్రేక్షకుడికి కావలసిందల్లా ఒక్కటే— మధ్యమధ్య తెరదించేసి గంటగంటసేపు కూర్చో బెట్టి చంపకుండా యెక్కడి కక్కడ తెగే అడ్డంకి లేకుండా కథ మొదల్నుంచి తుదివరకూ చకచకా సాగిపోవటం. ఏ రచనాసాంప్రదాయ బయలుదేరినా దాని ప్రధానాశయం ఇదే. ఈవిషయాన్ని గమనించితే, "ఎలా వ్రాయాలి ?" అన్న తర్జనభర్జనలకు తావే లేదు — "ఎలా వ్రాయాలి ?" అన్న తర్జుమా రావటానికి వీల్లేదు.

ఎలా వ్రాయాలి ?" అన్న ప్రశ్న తేలితే, ఇక రచయితలను వేధించుతున్న రెండో సమస్య—"ఏమి వ్రాయాలి" అన్నది. "ఏమి వ్రాయాలి" అన్న ప్రశ్న అడ్డు తగిలినతరువాత అలాంటి రచయిత కొంతకాలం, కలం క్రింద పెట్టేయడమే మంచిది. తాను ప్రజలకు అందజేయదగిన సందేశమేమిటా అని సందేహం కలిగిన రచయిత ఏ రచన చేసినా, అసంబద్ధంగానే వుంటుంది. పైగా ప్రజానీకానికి విశిష్టమైన మార్గమేదీ సూచించలేని అసమర్థస్థితిలో లేనిపోని డొంకదారులకు తీసుకుపోయే ప్రమాదంకూడా వుంది. ఇప్పటి రచయితలలో ఇది చాలా కనుపించుతోంది. ప్రజలకు అందజేయదగిన సందేశ విషయంలో, రచయితకు సంపూర్ణమైన విశ్వాసం వుండాలి; ఆ సందేశాన్ని అందజేయటానికే, తాను రచయితగా అవతరించాననే, పరమబాధ్యతను గుర్తెరిగి వుండాలి; లేకపోతే జాతికి యెంత అనర్థమైనా సంప్రాప్తించవచ్చును. పిచ్చివాడిచేతి పరసువులా, నిర్ణీతమైన లక్ష్యంలేని రచయితచేతిలో ఉన్న రచనాపాటవం, ఫలప్రదమైన యే మహావృక్షాన్నో విచ్ఛేదం చేసే ప్రమాదం వుంది.

వాస్తవిక రచనలనే పేరుతో యిటీవల కొన్ని నాటకాలు బయలుదేరుతున్నై. వాటిని చూస్తే, నిజంగా 'వాస్తవిక రచనా'వాదానికే అపఖ్యాతికరంగా వున్నాయ్. వాస్తవిక రచనావాదమంటే, మానవాలు ప్రజానీకానికి సంబంధించిన కష్టసుఖాలను చిత్రించాలనీ, ప్రజాజీవితాన్ని ప్రతిబింబించేదిగా వుండాలనీ, యింతవరకే అర్థంకాని, బజార్లో చూసిన ప్రతి విషయాన్ని యథాతథంగా రంగంమీదికి తీసుకురావాలంటే అదిమాత్రం, ఆచరణ యోగ్యంకాదు. దానివల్ల సాధించగల ప్రయోజనమూ వుండదు. బజార్లో దినందినం మనం అనేకమంది వ్యక్తులనూ, సంఘటలనూ, చూస్తున్నాం; అవన్నీ మన హృదయాలను కదలించుతున్నాయా, లేదు. వ్యగ్రమైన కళారూపాలలో వాటిని రంగంమీదికి తెచ్చినప్పుడే అవి మన్ని ఉత్తేజపరచగలుగుతున్నాయి. వాస్తవికత పేరుతో జుగుప్సాకరమైన పాత్రలను గాని, సంఘటనలను గాని రంగంమీదికి యెన్నడూ తీసుకరాకూడదు. ఇది రచయితలూ, ప్రదర్శకులూ కూడా గమనించవలసిన అత్యంత ప్రధానవిషయం.

సినిమా నాటకాలు :— సినిమాకళను అనుకరించి వ్రాయబడిన మరికొన్ని నాటకాలు వ్యాప్తిలోకి వస్తున్నయ్. సినిమాలలో చూపించినట్టుగానే, పెద్దపెద్ద టీపార్టీ రంగాలు యేర్పాటుచేసి, రంగం పట్టినంతమంది జనాన్నీ పాత్రసామగ్రినీ ప్రవేశపెడతానంటాడు రచయిత. నాటక ప్రదర్శనానికి వుండే సాధక బాధకాలతో యేమాత్రం పరిచయమున్న రచయితగాని, యిలాంటి అఘాయిత్యానికి పూనుకోడనుకుంటాను. రంగానికీ రంగానికీ మధ్యను యెక్కువ కాలయాపన జరగటానికి వీల్లేని సందర్భంలో ఈ టీపార్టీ ఏర్పాట్లున్నా రంగం ఫెళఫెళలాడించాలంటే యెలా ? అయినా అంతమంది నటకులు కావాలంటే లేవడం యెలా సాధ్యం ?—ఆ పదిమందీ పది ధోరణులుగా మాట్లాడితే, ప్రేక్షు

సౌందర్యమునకు
అత్యావశ్యకమైన
మూడు
దోహదములు




రతోడ్ ట్రేడింగ్ కంపెనీ, మద్రాసు 1.

# జిన్‌టాన్ మాత్రలు

**JINTAN**  **PILLS**

(Made in Japan)

**World Renouned Aromatic Pills**

ఆనందారోగ్యములనిచ్చుటలో సాటిలేనివి.

**ఒకపర్యాయము వాడిన**
**మీకే తెలియును.**

అన్నిచోట్లా దొరకును.



ఆంధ్ర జిల్లాలకు సబ్-ఏజంట్లు:

**ది టారస్ కంపెనీ,**

పో. బా. నెం. 24, నెల్లూరు.

*Stay at :*

# Sri Udipi Krishna Bhavan

**POPULAR BOARDING & LODGING**
**Station Road,**
**GUNTUR.**



Luxuriously furnished and well ventilated. Prompt Service & under efficient supervision.

**Charges Moderate.**

**A TRIAL WILL CONVINCE YOU.**



**W. Raghavendra Rao & Bros**

PROPRIETORS.

# భారతదేశ సరిహద్దు రక్షణ సమస్యలు



శ్రీ సూరంపూడి సీతారామ్

భారతదేశ చరిత్ర అంతా చిరకాలం వాయవ్యాన ఖైబర్ కనుమలగుండా పరజాతీయుల దండయాత్రల కథనంగా ఉండేది. ఆర్యులు, హూణులు, కుషాణులు, మహమ్మదీయులు, మంగోలులు ఒకరి తరువాత ఒకరు ఈ పర్వతమార్గం గుండానే సైన్యాలతో వచ్చి ఉత్తరహిందూస్థానాన్ని ఆక్రమించుకున్నారు. దండయాత్రకై వచ్చినవారిలో గజనీమహమ్మదు, కొందరు మంగోలులు తప్ప మిగిలినవారందరూ భారతదేశంలోనే స్థిరపడిపోయినారు. 12 వ శతాబ్దంలో అరేబియన్ జాతీయులు అరేబియన్ సముద్రంమీదుగా వచ్చి పశ్చిమతీర ప్రాంతాన్ని కొంత ఆక్రమించుకున్నారు. చివరి దండయాత్ర సముద్రాలమీదుగా అతి దూర దేశాలనుంచి వచ్చిన యూరోపియన్ల వ్యాపారయాత్ర.

బ్రిటిష్‌పరిపాలనకు లోబడిన తర్వాత భారతదేశం సరిహద్దులు బ్రిటిష్‌పాలకులసంరక్షణకు అనువుగా నిర్ణయించబడినాయి. ఇంగ్లండ్ దేశంనుంచి భారతదేశానికి బ్రిటిష్‌వారి నౌకలు వచ్చే మార్గమంతా వారి సంరక్షణకు అవసరమయింది. ఈ నౌకామార్గం పొడుగునా కల జిబ్రాల్టర్, మాల్టా, సైప్రస్, సూయజ్, ఏడెన్ బ్రిటిష్‌వారి రక్షణదుర్గాలుగా ఉండేవి. అంటే భారతదేశ రక్షణకు మధ్యధరాసముద్రం, అట్లాంటిక్ మహాసముద్రాలు కలిసేచోట ఉన్న జిబ్రాల్టర్ కూడా సరిహద్దయిందన్నమాట.

నౌకామార్గరక్షణ తరవాత, బ్రిటిష్ ఇండియా పాలకులకు వాయవ్య సరిహద్దు సంరక్షణ ప్రధానంగా ఉండేది. చాలకాలం పంజాబ్‌కు ఉత్తరాన, ఖైబర్‌కనుమవరకూ కల ప్రాంతానికి ఒక సైనికాధికారిని కమిషనర్‌గా నియమించి పరిపాలించేవారు. తరవాత ఆ ప్రాంతమే, వాయవ్య సరిహద్దురాష్ట్రమయింది. ఈ రాష్ట్రానికీ, ఆఫ్ఘనిస్తాన్‌కీ మధ్యప్రాంతంలో కొండజాతులవారనేకులు బ్రిటిష్ పరిపాలనకు లోబడలేదు. లోబడక సరిహద్దురాష్ట్రంమీదికి గుంపులుగుంపులుగావచ్చి దోచుకుని వెళ్లిపోయేవారు. ఈ దాడులనుంచి రాష్ట్రాన్ని కాపాడ్డానికి బ్రిటిష్ పాలకులు సరిహద్దు ప్రాంతంలో కొన్ని దుర్గాలను నిర్మించి, విస్తారంగా సైనిక దళాలను అక్కడుంచేవారు. ఈ ప్రాంతంలో ఆఫ్ఘనిస్తాన్‌కీ భారతదేశానికీమధ్య సరిహద్దు స్పష్టంగా ఎప్పుడూ నిర్ణయం కాలేదు. ఉభయులకూమధ్య కలహాలు వచ్చేవి. కలహాలు అధికమై, ఆఫ్ఘనిస్తాన్‌లో బ్రిటిష్‌వారు తమ ప్రాబల్యం స్థిరపరుచుకున్న సమయానికి, ఉత్తరాన రష్యాలో బలీయమైన కమ్యూనిస్టు ప్రభుత్వం స్థాపితమయింది. రష్యానుంచి దాడి జరగగలదనే భయంతో బ్రిటిష్‌వారు సరిహద్దువద్ద రక్షణబలాన్ని పెంచారు. ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వాన్ని తమ చెప్పుచేతల్లోకి తీసుకున్నారు.

బ్రిటిష్ పరిపాలన తొలగిపోవడంతో, దేశం రెండు రాజ్యాలుగా విభజించబడింది. ఇప్పుడు మన సరిహద్దుల స్వరూపమే మారిపోయింది. పాత సమస్యలుపోయి కొత్త సమస్యలు ఉత్పన్నమైనాయి. ఇంగ్లండ్‌నుంచి నౌకాయాన మార్గాన్ని సంరక్షించుకోవాలనే ఆవశ్యకత ఇప్పుడు లేదు. వాయవ్య సరిహద్దులో పఠాన్ల దాడి భయంలేదు. కాని దేశవిభజన, ఈశాన్య దిక్కున చీనాలో బలీయమైన కేంద్రప్రభుత్వం స్థాపించబడ్డం, మనదేశానికి రక్షణ సమస్యలను, కొత్తవీ దుర్ఘటమైనవీ, తెచ్చిపెట్టాయి.

భారతదేశానికి దక్షిణాన సముద్రం, కొసను సింహళం, ఉత్తరహిందూస్థానాన్ని అంటి పశ్చిమాన, తూర్పున పాకిస్తాన్, అస్సాంరాష్ట్రానికి పశ్చిమాన తూర్పుపాకిస్తాన్ తూర్పున బర్మా, ఉత్తరాన చీనాలోని సింకియాంగ్ రాష్ట్రం, టిబెట్, నేపాల్, సిక్కిం, భూటాన్ రాజ్యాలున్నాయి. ఈ రాజ్యాలకూ భారతదేశానికీ మధ్య సరిహద్దుల్ని రక్షించే భారం కొత్తగా భారతప్రభుత్వంపైన పడుతోంది. ఈ సరిహద్దుల రక్షణ ఉద్దేశం ఏమిటంటే, పొరుగురాజ్యాలనుంచి సైన్యాలుగాని, కొండజాతులు మొదలైనవారుగాని దండయాత్ర చేయకుండా, అరాచకం రేచ్చగొట్టే ఏ వర్గాలూ ప్రవేశించకుండా, నియమవిరుద్ధంగా అన్యరాజ్యాలవారు మనదేశంలోకి ప్రవేశించకుండా, కాపాడటం. అవసరాలనుబట్టి సరిహద్దులో పోలీసు గస్తీ కేంద్రాలూ, సైనికస్థావరాలూ, రవాణా సుంకాలకు సంబంధించిన ఉద్యోగులూ ఈ సరిహద్దుల్లో కాపలా వేస్తారు. మనదేశాన్ని ఇతరులెవ్వరూ ఆక్రమించకుండా కాపాడ్డానికి ప్రభుత్వం తీసుకోవలసిన చర్యల్లో సరిహద్దురక్షణ ముఖ్యమైనది.

రక్షణసమస్యల దృష్ట్యా భారతరిపబ్లిక్ సరిహద్దుల్ని స్థూలంగా మూడుప్రాంతాలుగా విభజించవచ్చును. 1. ఉత్తరసరిహద్దులు: అంటే చీనాలోని సింకియాంగ్ రాష్ట్రం, టిబెట్, నేపాల్, సిక్కిం, భూటాన్ రాజ్యాలు. 2. అస్సాం, బర్మాల మధ్య పర్వతమయ ప్రదేశం. 3. తూర్పు, పశ్చిమపాకిస్తాన్లతో సరిహద్దులు

టిబెట్ దేశాన్ని ఆసియాఖండానికి ఆగిపోయిన గుండె అనేవారు. కాని చీనాలో బలీయమైన కేంద్రప్రభుత్వం స్థాపన కావడంతో, టిబెట్ వ్యవహారాలలో చైతన్యం బయలుదేరింది. చీనా దేశాన్నిగురించి "నిద్రావస్థలో ఉన్న మహాశక్తి"అన్నాడు నెపోలియన్. ఈమహాశక్తి ఇప్పుడు మేలుకుంది. టిబెట్ పైన సామంతాధికారాన్ని పునః స్థాపించుకోడానికి చీనా నిశ్చయించింది.

1914 లో ఇంగ్లండూ, చీనా, టిబెట్ ప్రభుత్వాల మధ్య జరిగిన ఒడంబడిక ప్రకారం, చీనా ప్రభుత్వం టిబెట్లో మిలిటరీ మిషన్ ఒకటి ఉంచడానికీ, భారతదేశం తరఫున ఒక ప్రతినిధిని ఉంచడానికీ, టిబెట్ భారతదేశాలమధ్య వ్యాపారమార్గాన్ని రక్షించడానికిగాను టిబెట్లో దక్షిణాన సరిహద్దుకు సమీపంలో యాటుంగ్, గ్యాంట్సేలవద్ద భారతసైనిక కేంద్రాలను స్థాపించడానికీ నిర్ణయమైయింది.

చీనాలో చియాంగ్ కై షేక్ పరిపాలన అంతం కానున్న రోజులలో, టిబెట్ ప్రభుత్వం చీనా మిలిటరీ మిషన్ను వెళ్లగొట్టింది. అక్టోబర్ 1950 లో చీనా కమ్యూనిస్టు సేనలు తూర్పు టిబెట్లో ప్రవేశించాయి.

తూర్పు టిబెట్లోని చాండోదుర్గపతనంతో, టిబెట్ ప్రభుత్వం చీనా కమ్యూనిస్టు ప్రభుత్వంతో రాజీకి సిద్ధపడింది. ఇప్పటికి సైనికయాత్ర నిలిచిపోయినప్పటికీ, టిబెట్లో చీనా కమ్యూనిస్టులు సైన్యాలను నిలవరించకమానరని స్థిరపడింది. దీనివల్లనే ఇంతవరకూ లేని రక్షణ సమస్య ఇక్కడ అవసరమౌతున్నది.

చీనాతో మైత్రి సాధ్యంకాదనీ, సరిహద్దుమీదుగా దండయాత్ర జరుగుతుందనీ ఇప్పుడు భయం చెందవలసిన అవసరం లేకపోయినప్పటికీ, అపార సైనికబలంకల ప్రభుత్వం పొరుగున చేరడంతో, శాంతిసమయంలోకూడా సరిహద్దుల్ని కాపాడవలసిన కర్తవ్యం ప్రభుత్వంపైన పడింది. అదీకాక, కమ్యూనిస్టులు గూఢచారులుగా దేశం ప్రవేశించే అవకాశం లేకపోలేదు. అవకాశాలను గమనించి, అన్నిపరిస్థితులకూ అనుగుణంగా ముందే జాగ్రత్త వహించడం ప్రభుత్వ కర్తవ్యం.

అయితే టిబెట్ సరిహద్దురక్షణ అనేక క్లిష్టసమస్యలతో కూడుకునిఉంది. ఇంతవరకూ ఎన్నడూ జరగని రక్షణ సన్నాహాలు ఇప్పుడు అవసరమౌతున్నందువల్ల, ముందుగా సరిహద్దు ఏరీతిగా ఉందో గమనించడం అవసరం.

టిబెట్కీ భారతదేశానికీ మధ్య సరిహద్దు స్థూలంగా 1914 లో సిమ్లా సమావేశంలో చీనా, టిబెట్, భారత ప్రభుత్వాలమధ్య నిర్ణయమైయింది. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన బ్రిటిష్ ఉద్యోగి సర్ మెక్మహాన్ పేరున ఈ సరిహద్దు పిలవబడుతోంది. అయితే, సరిహద్దు నిర్ణయం అప్పుడు సక్రమంగా జరగలేదనే చెప్పాలి.

టిబెట్కీ భారతదేశానికీ మధ్య నేపాల్, సిక్కిం, భూటాన్, రాజ్యాలున్నాయి. వీని సరిహద్దులుగాక, టిబెట్కీ భారతదేశాన్నంటి మూడుచోట్ల సరిహద్దుఉంది. 1. కాశ్మీర్లోని లడఖ్లోయవద్ద 2. పశ్చిమబెంగాల్లోని డార్జిలింగ్ జిల్లాకు చెందిన కలింపాంగ్ వద్ద. 3. అస్సాం ఈశాన్యప్రాంతంలో రీమావద్ద. ఈ మూడుప్రాంతాలలోనూ కలింపాంగ్ వద్దనుంచి టిబెట్ ప్రధాన నగరమైన లాసాకి వ్యాపారమార్గం ఉంది. ఈ వ్యాపారమార్గంలోనే యాటుంగ్, గ్యాంట్సేల భారతసైనిక కేంద్రాలున్నాయి.

ఈ మూడు సరిహద్దులూకాక, కాశ్మీర్లోని లడఖ్లోయ ప్రాంతాన్ని అంటి చీనాలోని సింకియాంగ్ రాష్ట్రం ఉంది. మొత్తం ఈనాలుగు ప్రాంతాలూ చీనా కమ్యూనిస్టుప్రభుత్వంతో మనదేశాన్ని అతి సన్నిహితం చేస్తున్నవి.

చీనా కమ్యూనిస్టులు భారతదేశంపైన దండయాత్ర చేసే పక్షంలో (ఇది అసంభవమని భారతప్రభుత్వ అభిప్రాయం) ఈ నాలుగు దిశలనుంచీ భారతదేశానికి ముప్పు ఉంటుంది. ప్రపంచ యుద్ధం సంభవించినట్లయితే రష్యన్లు సింకియాంగ్ రాష్ట్రం ద్వారానో, చీనా కమ్యూనిస్టులు ఈ నాలుగు సరిహద్దుల ద్వారానో, భారతదేశంపైన దాడిచెయ్యగలరని అమెరికన్ల అభిప్రాయం. అయితే, కమ్యూనిస్టుల తరహా దండయాత్ర చెయ్యడం కాదనీ, దేశీయకమ్యూనిస్టుపార్టీల ద్వారా విప్లవం లేవలసిందే కాని దురాక్రమణ జరగబోదనీ భారతప్రభుత్వ విశ్వాసం. ప్రపంచ యుద్ధం సంభవించినట్లయితే, పరిస్థితులు భిన్నంగా ఉండవచ్చును. అమెరికన్లు భారతదేశాన్ని ఆక్రమించుకుంటారని కమ్యూనిస్టులూ, కమ్యూనిస్టులే ఆక్రమించుకుంటారని అమెరికన్లూ భావిస్తున్నందువల్ల, అట్టి భయాలకు ఆధారమున్నప్పటికీ లేకపోయినప్పటికీ, ఒకరికంటె మరొకరు ముందు ఆక్రమించుకోడానికి యత్నం జరగవచ్చును.

అగ్రరాజ్యాలయుద్ధ వ్యూహాలు అనూహ్యాలు. అందువల్లనూ, అటువంటి దురాక్రమణకు అవకాశం లేకపోయినట్లయినా కనీసం కమ్యూనిస్టు గూఢచారులు రహస్యంగా ప్రవేశించకుండా నిరోధించవలసిన అవసరంకూడా ఉండడంవల్లనూ, భారతప్రభుత్వం ఈ సరిహద్దుల్ని అతి జాగ్రత్తగా కాపాడక తప్పదు.

అయితే సరిహద్దుల్ని కాపాడాలి అంటే, ఈప్రాంతం అనువైనది కాదు.

మొన్న మొన్నటివరకూ జనసంచారం అసాధ్యమని భావించబడిన హిమాలయ శ్రేణులలో ఇప్పుడు దుర్గమమైన వైనప్పటికీ కనుమ మార్గాలు కనిపెట్టబడినాయి. తూర్పున సైకాంగ్ రాష్ట్రం నుంచి టిబెట్కి వచ్చే మార్గం ఎంత దుర్గమమైనా, చీనాకమ్యూనిస్టు సేనలు సాహసించి, అన్ని నిరోధాలనూ అధిగమిస్తున్నారట. చీనానుంచి టిబెట్ ప్రయాణంకంటె, టిబెట్ నుంచి భారతదేశానికి ప్రయాణం సులభం. టిబెట్ రాయబారులందరూ భారతదేశంవచ్చి ఇక్కడనుంచే చీనాదేశం వెడుతున్నారు.

టిబెట్ ప్రధాన నగరమైన లాసాలో చీనా సైన్యాలను నిలవరించినప్పుడు, ఆ సైన్యాలకు భారతదేశం ఎక్కువదూరం కాదు. సిక్కిం, భూటాన్ రాజ్యాలమధ్యకల భారత భూభాగానికి టిబెట్‌లోని చుంబీలోయ అతిసమీపంలో ఉంది. చుంబీలోయ ఇదివరకే చీనా కమ్యూనిస్టు సేనల వశమయింది. కలింపాంగ్‌కు 144 మైళ్ళదూరంలోఉన్న యాటుంగ్‌లో భారత సైనికదళాన్ని తొలగించాలని చీనా ప్రభుత్వం అడిగినట్లయితే, భారతప్రభుత్వం అంగీకరించక తప్పదు. యాటుంగ్ టిబెట్‌కి చెందినది. అక్కడ చీనా కమ్యూనిస్టులే వ్యాపారమార్గాన్ని రక్షించడానికి తమ సైనికదళాన్ని నిలవరించవచ్చును. యాటుంగ్, డార్జిలింగ్ నగరానికి 146 మైళ్ళలో ఉంది. భూటాన్ ప్రధాన నగరమైన పునఖాకు 224 మైళ్లలోనూ, సిక్కిం ప్రధాన నగరమైన గాంగ్టక్‌కు 80 మైళ్లలోనూ ఉంది.

లడఖ్ లోయ ప్రాంతాన సంరక్షణ కూడా చాల అవసరం. సింకియాంగ్ రాష్ట్రంలో రష్యన్, చీనా కమ్యూనిస్టు అధికారుల సమిష్టి నిర్వహణలో రహస్య సన్నాహాలు ఏవో జరుగుతున్నాయి. పశ్చిమ టిబెట్ పర్వతప్రాంతంలో ఏటంబాంబుల తయారీకి అవసరమైన యురేనియం మొదలైన వున్నట్లు రష్యన్ విజ్ఞానశాస్త్ర ప్రవీణులు కనిపెట్టారనీ, అక్కడా, సింకియాంగ్ రాష్ట్రంలోనూ రష్యన్లు సైనిక వైమానిక స్థావరాలు స్థాపిస్తున్నారనీ అమెరికన్ పత్రికలు వ్రాస్తున్నాయి. సింకియాంగ్ రాష్ట్రం చీనాదేశానికి చెందినదైనప్పటికీ, అనేక సంవత్సరాలుగా రష్యన్లు అక్కడ గవర్నర్‌తో కుట్రచేసి రహస్యంగా తమ ప్రాబల్యాన్ని స్థిరపరుచుకొన్నారని అమెరికన్ ప్రభుత్వం ఇటీవల విమర్శించింది. ఇప్పుడు చీనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం స్థాపించబడిన తరవాత సింకియాంగ్‌లో తమ అధికార ప్రాబల్యాన్ని పునరుద్ధరించుకున్నప్పటికీ, అక్కడ రష్యన్ల సన్నాహాలకు మద్దతు ఇస్తున్నదని అమెరికన్లు చెప్తున్నారు. ఈరాష్ట్రంలోదక్షిణానగల కాష్గర్, యార్ఖండ్ నగరాలకూ లడఖ్ లోయలోని లే నగరానికీ మధ్య కారకోరం పర్వతమార్గంగుండా అనేక శతాబ్దాలుగా వ్యాపారం జరుగుతోంది. ఇటీవలనేచీనా కమ్యూనిస్టులు అక్కడ స్థిరపడినతరవాత కారకోరం కనుమమార్గాన్ని నిరోధించి, వ్యాపారం జరగరాదని నిషేధించారు. కాష్గర్‌లోని భారతప్రభుత్వపు కాన్సలేట్‌ని మూసివెయ్యాలని భారతప్రభుత్వానికి చెప్పారు. దీనినిబట్టి సింకియాంగ్ రాష్ట్రంలో రహస్య సన్నాహాలు జరుగుతున్నట్లు అనుమానించబడుతోంది. 1950 లో రష్యా, చీనాప్రభుత్వాల మధ్య జరిగిన ఒడంబడిక ప్రకారం సింకియాంగ్ రాష్ట్రంలోని ఖనిజసంపదను వినియోగంలోకి తేవడానికి ఒప్పందల కుదిరింది. రష్యానుంచి కాష్గర్‌కు పన్నెండురోజుల ప్రయాణం. లడఖ్ లోయకు సమీపంలో సింకియాంగ్‌లో కాష్గర్, యార్ఖండ్, కర్ఘాలిక్ నగరాలలో ప్రధాన స్థావరాలు నిర్మించబడుతున్నాయి. కాష్గర్ నుంచి లడఖ్ లోయలోని లే నగరమూ, శ్రీనగరూ దాదాపు 380 మైళ్లలో ఉన్నాయి.

కాశ్మీర్‌లో లడఖ్ లోయలో కాని, శ్రీనగర్, లే నగరాల మధ్య కాని, సరైన ప్రయాణసౌకర్యాలు లేవు. మోటార్లు వెళ్లడం కూడా దుర్ఘటం. అందువల్ల దండయాత్ర ప్రమాదమే ఉన్నట్లయితే, లడఖ్ లోయ అతి బలహీనస్థితిలో ఉందని చెప్పాలి.

అస్సాం ఈశాన్య సరిహద్దులో కొసనున్న రీమాపట్టణాన్ని చీనా కమ్యూనిస్టు సేనలు ఆక్రమించుకున్నాయి. ఈ ప్రాంతంలో సరిగ్గా ఈ పట్టణమే టిబెట్‌కీ అస్సాం రాష్ట్రానికీ సరిహద్దు. ఇక్కడ మొన్నమొన్నటివరకూ భారత సైనికదళం ఒకటి ఉండేది. ఈ పట్టణం ఎవరికి చెందుతుందో మెక్మహాన్ ఒడంబడిక స్పష్టపరచడంలేదు. అందువల్ల ఇప్పుడీ విషయమై భారత ప్రభుత్వం వివాదం మానుకుని, ముమ్ముందు రాయబారాలద్వారా పరిష్కరించుకోడానికి నిశ్చయించుకుంది.

రీమాను చీనా సేనలు ఆక్రమించుకోడంతో అవి దుర్గమమైన కొండప్రాంతంలో అస్సాం రాష్ట్రానికి పంచనే చేరాయన్నమాట. ఈ ప్రాంతమంతటా అస్సాంరాష్ట్రంలో నివసించేది అబోర్, మిష్మీ కొండజాతులవారు. దట్టమైన అడవులతోనిండిన ఈ పర్వతప్రాంతంలో సరిహద్దురక్షణ దుష్కరమైనది. ఈ కొండజాతులవారికీ బ్రహ్మపుత్రానదీతీరవాసులకూ సన్నిహిత బాంధవ్య మేదీలేదు. ఈ కొండజాతులవారు స్వేచ్ఛాజీవులు. నాగరకజీవన సౌకర్యాలు వీరికి కొరవ. అందువల్ల కమ్యూనిస్టులు వీరిని అరాచకచర్యలకు పురిగొల్పే అవకాశం ఉంది. కాబట్టి ఈచోట, అస్సాం తూర్పు సరిహద్దులోవలెనే, విశేషరక్షణ సన్నాహాలను ఏర్పాటుచెయ్యవలసిన అవసరం కలుగుతున్నది.

ఇంతేకాదు. రీమాకు అతిసమీపంలోనే తూర్పున బర్మా సరిహద్దుకూడా ఉంది, బర్మాలో ఆ ప్రాంతంకూడా అస్సాంలోవలెనే పర్వతాలూ అరణ్యాలతో నిండిఉంది. అస్సాం కొండజాతులలోవలెనే అక్కడకూడా కొండజాతులపై కమ్యూనిస్టుల ప్రభావం లేకపోలేదు.

అస్సాంకు ఉత్తరానకల ఈ సరిహద్దు సమస్య భారతదేశానికెంతప్రధానమో, తూర్పు పాకిస్తాన్‌కికూడా అంతే ప్రధానం. తూర్పు పాకిస్తాన్‌కీ, టిబెట్‌కీమధ్య డార్జిలింగ్ జిల్లా ఒక్కటే అడ్డుఉంది.

ఈమూడు మార్గాలే కాక పశ్చిమ టిబెట్‌నుంచి లడఖ్ లోయలోనికీ, ఉత్తరప్రదేశ్‌లోని ఆల్మోరా జిల్లాలోనికీ కనుమమార్గాలున్నాయి. అయితే ఆల్మోరా జిల్లా టిబెట్‌లమధ్య ఇంతవరకూ ఎన్నడూ రాకపోకలు జరగలేదు. చీనా కమ్యూనిస్టుల దేశపటచిత్రాల ప్రకారం మానసరోవర ప్రాంతం టిబెట్‌లో చేర్చబడింది. మానసరోవరం వరకూ టిబెట్‌నుంచిఇంతివరకెవరూ ప్రయాణంచెయ్యలేదు. ఈమార్గాన్ని ఇప్పుడు రహస్యంగా నిర్మించడానికి యత్నం జరుగుతున్నదని ఇదివరలో న్యూయార్క్ టైమ్స్ పత్రిక వ్రాసింది. కాని, ఈప్రాంతమంతా ఎల్లప్పుడూ మంచుతో నిండి ఉంటుంది. వేసవికాలంలో హిమపాతాలు, నదీ ప్రవంతులూ ప్రయాణానికి ఆటంకం కలిగిస్తాయి. ఇటువంటి చోట మార్గాన్ని నిర్మిస్తున్నారంటే నమ్మ శక్యంకాదు. పర్వతాలు విమానప్రయాణానికి ఆటంకం కలిగిస్తాయి. విమానయానమే ఇక్కడ సాధ్యపడితే, పశ్చిమ టిబెట్‌లోని గార్టక్‌కు, సిబ్జా, షిల్లీ, లదోఖ్ మొదలైన నగరాలకు సమీపం కాగలదు.




రీమా, కలింపాంగ్, ప్రాంతాల సరిహద్దు మెక్మహాన్ సమా వేశ నిర్ణయం ప్రకారం ఏర్పాటు కాబడిందని పైన చెప్పబడింది. ఇదివరలో ఎన్నడూ ఈప్రాంతాల ఆట్టే జనసంచారానికి గాని, సైన్యాల తరలింపుకు కాని సౌకర్యం లేకపోయినందువల్ల ఇక్కడ సరిహద్దు రక్షణసమస్య రాలేదు. కాని ఇప్పుడు సైన్యాల తరలింపు ఖీతి లేకపోలేదని, తూర్పు టిబెట్‌లో చీనాసైన్యాల సాహసమే నిరూపిస్తోంది. ఇంతకంటె ముఖ్యసమస్య కమ్యూనిస్టు గూఢచారులు రహస్యంగా ప్రవేశించకుండా కాపాడవలసిన అవసరం. కాని నిత్యం మంచుతో నిండి, భరించ శక్యంకాని చలిలో రక్షణదళాలను నిలవరించడం కష్టమే. రీమాకు పశ్చిమాన సరిహద్దు సరిగ్గా నిర్ణయం కానందువల్ల ఉభయపార్శ్వాలా మొత్తం దాదాపు 80 మైళ్ల మేర భూటాన్‌వరకూ 890 మైళ్ల పరిహద్దుపొడుగునా కాపలాపెట్టడం కష్టం. అందువల్ల ఈ సరిహద్దువిషయమై చీనా, భారతప్రభుత్వాల మధ్య త్వరలోనే సమాధానం కుదరవలసి ఉంది. సమాధానం కుదిరి నప్పటికీ గూఢచారులను అరికట్టడానికి భారతప్రభుత్వం రక్షణ స్థావరాలు స్థాపించవలసిన అవసరం కలుగుతున్నది.

బ్రిటిష్‌పాలకుల కాలంలో వారి సమస్య రష్యాకూ భారత దేశానికీ మధ్య దుర్బలమైన చిన్నదేశాలను స్వతంత్రంగా ఉంచి ఆ దేశాల స్వాతంత్ర్యాన్ని కాపాడ్డానికి ఉభయప్రభుత్వాలూ హామీ నిచ్చేవి. ఆ రీతిగా ఆఫ్ఘనిస్తాన్, టిబెట్ రాజ్యాలు ఉపకరించాయి. ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వం ఎక్కువ సైన్యం నిర్మించుకోరాదని, ఆ దేశపు స్వాతంత్ర్యాన్ని భంగపరచరాదనీ నిర్ణయిస్తూ రష్యా, బ్రిటిష్ ఇండియా, ఆఫ్ఘనిస్తాన్‌లు కాబూల్ ఒడంబడిక చేసుకున్నాయి. బ్రిటిష్ పాలకు లున్నంతకాలమూ ఆఫ్ఘనిస్తాన్‌లో తమ ప్రాబల్యం స్థిరపరుచుకొని, ఆ దేశీయులకు రష్యాతో ఎట్టి సంబంధమూ లేకుండా జాగ్రత్తపడుతూ వచ్చారు. దాదాపు ఉత్తరఆఫ్ఘనిస్తాన్ సరిహద్దు వరకూ, అనగా రష్యన్ టర్కిస్తాన్‌లోని కుష్క్ పట్టణం వరకూ, టర్కిస్తాన్ సైబీరియన్ రైల్వే ఒక శాఖ వస్తుంది. బ్రిటిష్‌ఇండియాలో వాయవ్య సరిహద్దున రైలుమార్గాలు, పెషావర్ వరకూ, బెలూచీస్తాన్‌లో క్వెట్టానుంచి చామన్‌వరకూ ఉన్నాయి. చామన్‌వద్దనుంచి ఆఫ్ఘనిస్తాన్‌లోని కాబూల్, కాంద

హార్ నగరాలగుండా కుష్క్ పట్టణానికి 600 మైళ్లు మాత్రం ఉంటుంది. ఇంత మేరా ఆఫ్ఘనిస్తాన్‌లో రైల్వే నిర్మించబడినట్లయితే, బ్రిటిష్ఇండియా రైల్వేలతో రష్యన్ రైల్వేలు కలిసేవి. కాని ఈవిధంగా కలిసినట్లయితే ఆఫ్ఘనిస్తాన్‌కే కాక బ్రిటిష్ ఇండియాకు కూడా ముప్పుఉందని భావించడంవల్ల ఆఫ్ఘనిస్తాన్‌లో రైలుమార్గాన్ని నిర్మించడం మేలుకాదని బ్రిటిష్‌వారు ఆఫ్ఘనిస్తాన్ పాలకులకు హితబోధ చేసేవారు. ఆఫ్ఘనిస్తాన్ కూడా ఈ అంతర్జాతీయ రాజకీయాలలో బలికాకూడదనే ఉద్దేశంతో రైలు మార్గాన్ని నిర్మించలేదు.

చీనాలో బలీయమైన కేంద్రప్రభుత్వం లేకపోయినందువల్ల టిబెట్‌కూడా ఇదేరీతిగా బ్రిటిష్ పాలకులకు వినియోగపడింది. కాని ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. ఆఫ్ఘనిస్తాన్‌తో సరిహద్దు రక్షణభారం పాకిస్తాన్‌పైన పడింది. ఈ విధంగా చూసినట్లయితే ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్‌ల రక్షణ, భారత ప్రభుత్వానికి క్షేమం. అందువల్ల ప్రపంచయుద్ధమే సంభవించి, భారతదేశం ప్రవేశించాలని రష్యన్లు తలపెట్టే పక్షంలో, అప్పుడా ముప్పుని ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, భారత ప్రభుత్వాలు ఏకమై నిరోధించవలసిన అవసరం కలుగుతుంది.

ఇదేరీతిగా నేపాల్, సిక్కిం, భూటాన్‌రాజ్యాల సంరక్షణకూడా భారత ప్రభుత్వానికి అవసరం. ఇటీవల నేపాల్‌లో జరిగిన సంఘటనల్నిబట్టి, ఆ దేశంలో సరిహద్దురక్షణ మరింత కష్టమని తెలుస్తుంది. నేపాల్ ఎప్పుడూ బ్రిటిష్‌వారిపట్ల స్నేహభావంతోనే ఉండేది. నేపాల్‌తో బ్రిటిష్‌వారికి 1814 లో ఒక్కసారే యుద్ధం జరిగింది. అప్పుడు జరిగిన సగౌలీ సంధి తరవాత కలత ఎన్నడూ సంభవించలేదు. 1927 లో బీహార్‌లోని రక్సౌల్ పట్టణంనుంచి అమ్లెక్‌గంజ్ వరకూ రైలుమార్గం నిర్మించబడింది. నేపాల్‌లోకూడా ఉత్తరాన ఉన్నత పర్వతప్రాంతంలో కిరాతులు, మగర్‌లు, భోటియాలుఅనే కొండజాతులవారున్నారు. వీరుకూడా స్వేచ్ఛాజీవులు. ప్రభుత్వ శాసనాలకు లోబడరు.

నేపాల్‌నుంచి టిబెట్‌కి ప్రయాణం కొంచెం సులువు. 1790 లో నేపాల్ నుంచి బయలుదేరి గూర్ఖాలు టిబెట్‌పై దాడిచేసి లాసా నగరాన్ని ఆక్రమించుకున్నారు. తరవాత చీనా సేనలు గూర్ఖాలను తరిమివచ్చి నేపాల్‌ను ఆక్రమించుకున్నాయి. చీనాసేనలు తరలిపోయిన కొంతకాలానికి నేపాల్ స్వాతంత్ర్యం పొందింది. తిరిగి 1854 లో టిబెట్ నేపాల్ దేశాలమధ్య యుద్ధం జరిగింది. మంచుకొండలమధ్య జరిగిన ఈ యుద్ధం చరిత్రలో అపూర్వమైనదని చెప్పబడింది. కాని యుద్ధం ఫలితంగా ఏమీ జరగలేదు. ఉభయదేశాలూ స్వతంత్రంగానే ఉన్నాయి. నేపాల్ టిబెట్ దేశాలమధ్య సులువుగా రాకపోకలు జరగడానికి వీలున్నందువల్ల, నేపాల్‌లో ఇటీవల మహారాజుకు ప్రధానమంత్రికీ మధ్యవచ్చిన కలహంవల్ల, భారత ప్రభుత్వానికి ఆందోళన కలిగింది. నేపాల్ సర్వస్వతంత్రమైన దేశమైనప్పటికీ, నేపాల్ శాంతి, దేశరక్షణలు, భారతప్రభుత్వానికి వాంఛనీయాలు. అందువల్ల మైత్రీభావంతో ఉభయులకూ హితవు బోధించి పండిట్ నెహ్రూగారు సామరస్యంచేకూర్చారు. కాలానుగుణంగా దేశపరిపాలనలో ప్రజాప్రతినిధులకు తావివ్వాలని భారతప్రభుత్వం ఇచ్చిన సలహాను ఉభయులూ ఆమోదించారు. నేపాల్ స్వతంత్ర దేశమైనప్పటికీ, ఇకనుంచి ఆ దేశపు విదేశవ్యవహారాలలోనూ, దేశరక్షణ వ్యవహారాలలోనూ భారతప్రభుత్వం శ్రద్ధవహించక తప్పదు. సిక్కిం, భూటాన్ రాజ్యాల క్షేమం దృష్ట్యా భారత ప్రభుత్వం 1950 లో ఒడంబడికలు చేసుకుంది. భూటాన్‌రాజ్యం భారతప్రభుత్వం సలహానుసరించి కాని విదేశాలతో ప్రమేయం పెట్టుకోదు. సిక్కిం రాజ్యపు విదేశాంగ, దేశరక్షణ వ్యవహారాలనూ, రవాణా సౌకర్యాలనూ భారత ప్రభుత్వమే నిర్వహించడానికి నిర్ణయమయింది. ఈరీతిగా ఉత్తరాన టిబెట్‌కి భారతదేశానికి మధ్యనున్న నేపాల్, సిక్కిం, భూటాన్ రాజ్యాల సంరక్షణలో భారతప్రభుత్వం ప్రత్యక్షంగానూ, నైతికంగానూ తోడ్పడవలసిన అవసరం కలిగింది.

అస్సాంరాష్ట్ర తూర్పు సరిహద్దు సంరక్షణకూడా అనేక కష్టాలతో కూడుకునిఉంది. అస్సాం, బర్మాలను ఉత్తరదక్షిణాలుగా వ్యాపించిఉన్న పట్‌కాయ్, నాగా, లూషాయ్ పర్వతశ్రేణులు విడదీస్తున్నాయి. మణిపుర సంస్థానం నాగా పర్వతాల మధ్య అన్యప్రాంతాలకు దూరంగా విడదియ్యబడిన పీఠభూమి. ఈ పర్వతశ్రేణులు హిమాలయశ్రేణులంత ఎత్తైనవికావు. అడవులూ పర్వతాలూ దుర్గమమైనవైనప్పటికీ, ఇక్కడ అనేకమంది కొండజాతులవారు నివసిస్తున్నారు. అనేకచోట్ల ఈ పర్వతశ్రేణులలో కనుమమార్గాలున్నాయి. కాని కొండజాతులవారికి భయపడి ఈ మార్గాలనెవరూ వినియోగించరు. దక్షిణాన లూషాయ్ పర్వత ప్రాంతాలలో అరకాన్‌కీ, తూర్పు పాకిస్తాన్‌కీమధ్యమాత్రం జనుల రాకపోకలకు వీలున్నాయి. మొత్తం 800 మైళ్లపైగా ఉన్న ఈ సరిహద్దు రక్షణ దుష్కరం. ఈ ప్రాంతాల కొండజాతులతో ఇంకా సామరస్యం సాధించవలసి ఉంది. నాగ, ఖాసీ, అబోర్, మిష్మి, మిరి, లూషాయ్ జాతులవారనేకులున్నారు. వీరిలో దాదాపు అందరూ భారతప్రభుత్వ పరిపాలనపట్ల కాని, ఏ ప్రభుత్వపరిపాలనపట్ల కాని విముఖులే.

నాగరికులైన అస్సాంరాష్ట్రవాసుల పట్ల కొండజాతులవారు వైరభావం వహిస్తారు. కాని క్రైస్తవమతం వీరిలో ఇటీవల అధికంగా వ్యాపిస్తున్నది. అందువల్ల ఈ పర్వత ప్రాంతాలలో సరిహద్దు రక్షణకేకాక, కొండజాతులవారు అన్యుల ప్రోద్బలంవల్ల అరాచకం రెచ్చకొట్టకుండా నివారించడానికీ, వారిదాడులను అరికట్టడానికీ, వారిలో వారి యుద్ధాలను నివారించడానికీ, ఈ ప్రాంతంలో రక్షణకు విశేషసన్నాహం చేయవలసిన అవసరం కలుగుతున్నది. మన రిపబ్లికన్‌రాజ్యాంగంలో అస్సాం అరణ్య, పర్వతప్రాంతాలలోని ప్రజలజీవన సౌకర్యాభివృద్ధి నిమిత్తం ప్రత్యేక ఏర్పాట్లు చెయ్యబడినాయి.

అస్సాం రాష్ట్రానికి మరొక ప్రధానమైన సమస్య ఉంది. ఉత్తరాన బీహార్‌లోని కొద్ది ప్రాంతంతోనూ పశ్చిమ బెంగాల్‌లోని డార్జిలింగ్ జిల్లా, కూచ్ బిహార్‌లతోనూ అస్సాం రాష్ట్రాని చిన్న సరిహద్దు మాత్రమే ఉంది. అస్సాం రాష్ట్రమంతా దాదాపు

భారతదేశానికి అంటకుండా విడిగానే ఉందని చెప్పవచ్చును. భారతదేశంనుంచి అస్సాం రాష్ట్రాన్ని, తూర్పు పాకిస్తాన్ విభదీస్తున్నది. బీహార్‌తో కలిసిన కొద్ది మేరా అరణ్యమూ కొండలతో నిండిఉంది. పాకిస్తాన్‌తో సఖ్యత చెడకముందు అస్సాంరాష్ట్రానికి తూర్పు పాకిస్తాన్‌గుండా ప్రయాణం చెయ్యవలసివచ్చేది. ఇప్పుడు బీహార్ రాష్ట్రాన్నీ అస్సాం రాష్ట్రాన్నీ కలుపుతూ ఒక రైలుమార్గం నిర్మించబడింది. ఆపైన అస్సాంరాష్ట్రంలో ప్రయాణ సౌకర్యాలు బహుకొద్దిఅని చెప్పాలి. తూర్పున బర్మాతో 800 మైళ్ళ పొడవున సరిహద్దుఉంటే, పశ్చిమాన తూర్పు పాకిస్తాన్‌తో 600 మైళ్లు పొడుగున సరిహద్దుఉంది. ఇదికాక అస్సాం నంటి పెట్టుకుని త్రిపురాసంస్థానం తూర్పు పాకిస్తాన్‌లోకి చొచ్చుకుని ఉంది.

బ్రిటిష్ పాలకులకు లేని దీర్ఘసరిహద్దుల సమస్య, దేశాన్ని రెండు రాజ్యాలుగా (నాలుగు ఖండాలుగా) చీల్చినందువల్ల వస్తున్నది. పశ్చిమపాకిస్తాన్‌కీ తూర్పు పాకిస్తాన్‌కీ మధ్యన రాజస్థాన్, మధ్యభారత్, ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాలున్నాయి. అస్సాంకీ భారత రిపబ్లిక్‌కీ మధ్యన, తూర్పు పాకిస్తాన్ ఉంది. ఈవిధంగా నాలుగు ఖండాలుగా చీల్చబడినందువల్ల భారత పాకిస్తాన్‌లకు, సరిహద్దుల మొత్తం పొడవు కొన్ని వేల మైళ్లుంది. సరిహద్దులని చెప్పబడుతున్న ఈప్రాంతమంతా, 1947 ఆగస్టు 15 కి పూర్వం ఒకే ప్రాంతంగా ఉండడంవల్ల, రైలుమార్గాలు, రోడ్లు అనేకం ఉభయరాజ్యాలలోనూ అల్లుకుని ఉన్నాయి. ఇప్పుడొక్కసారిగా ఈమార్గాలనునిరోధించి, సరిహద్దుల పొడుగునా ప్రయాణసౌకర్యాలను నిర్బంధించవలసి వస్తున్నది. స్వేచ్ఛా ప్రయాణానికి ఆటంకం కలుగుతున్నది. ఇంతమేరనూ కాపలా ఉంచాలంటే, సామాన్య సరిహద్దు గస్తీలు చాలవు. పోలీసు, సైనిక స్థావరాలను విస్తారం ఏర్పాటుచేయవలసివస్తున్నది.

భారత పాకిస్తాన్‌లమధ్య యుద్ధమే సంభవించినట్లయితే, వేలమైళ్ల పొడుగున వ్యాపించిన ఈ సరిహద్దులను అనేక చోట్ల దురాక్రమణపరులు అతిక్రమించి రావడానికి వీలున్నది. రక్షణసైన్యాలకు తెలియరాకుండా అకస్మాత్తుగా దాడిచెయ్యడానికి వీలున్నందువల్ల, భారతపాకిస్తాన్ల మధ్య సరిహద్దుల రక్షణ సమస్య అతి క్లిష్టమైన దౌతున్నది. కొన్ని దారులను కాపినంతమాత్రంచేత రక్షణ కట్టుదిట్టం కాజాలదు. యుద్ధం సంభవించేపక్షంలో, తూర్పుపాకిస్తాన్, అస్సాం రాష్ట్రాలకు ముప్పు అధికం. ఈ రెండూ కేంద్రప్రభుత్వాలకు దూరంగా ఉన్నాయి. తూర్పు పాకిస్తాన్‌కు మూడు వైపుల భారత రిపబ్లిక్ రాజ్యాలు, నాలుగోవైపున బంగాళాఖాతం ఉన్నాయి. తూర్పుపాకిస్తాన్‌పై దాడి జరిగేపక్షంలో, పశ్చిమ పాకిస్తాన్ సహాయం చెయ్యలేని స్థితిలో ఉంటుంది. సైన్యాలను సముద్రంమీదుగా ఓడల్లో భరత ఖండాన్నీ, సింహళద్వీపాన్నీ చుట్టి పంపవలసివస్తుంది. కాని పాకిస్తాన్‌కి సైనిక సహాయాన్ని పంపగల నౌకాబలం లేదు. మూడు దిశలనుంచీ భారత సైన్యాలు తూర్పు పాకిస్తాన్‌ను చుట్టుముట్టి ఇట్టే ఆక్రమించుకోగలుగుతాయి. పశ్చిమ పాకిస్తాన్ సైన్యాలు భారత రిపబ్లిక్‌లోని ఉత్తర రాజ్యాలన్నిటినీ (రాజస్థాన్, మధ్యభారత్, ఉత్తరప్రదేశ్, బీహార్) జయిస్తే కాని తూర్పు పాకిస్తాన్ చేరలేవు. అస్సాంరాష్ట్రాన్ని జయించడం ఇంత సులువుకాకపోయినప్పటికీ, మిగతా రిపబ్లిక్ రాజ్యాలనుంచి వేరుచెయ్యడం పాకిస్తాన్ సైన్యాలకి సులువౌతుంది. తూర్పుపాకిస్తాన్ సేనలు ఉత్తర సరిహద్దుదాటి డార్జిలింగ్ జిల్లాను ఆక్రమించుకుంటే, భారతదేశానికీ అస్సాంరాష్ట్రానికీ మధ్య సంబంధం తెగిపోతుంది. కాని భారత సైన్యాలతో ప్రత్యక్షయుద్ధంలో నిలిచి పోరాడగలబలం తూర్పు పాకిస్తాన్‌కి లేదు. పశ్చిమాన మాత్రం భారత పాకిస్తాన్ సైన్యాలకు దీర్ఘయుద్ధం జరగడానికి అవకాశాలుంటాయి.

సరిహద్దులలో ఎంత భారీసన్నాహాలు చేసినప్పటికీ రక్షణ దుష్కరమైన సమస్య. అందువల్ల భారత పాకిస్తాన్‌లు మైత్రీభావంతో ఉంటేతప్ప, సరిహద్దుల్ని రక్షించడమనేది అసంభవం. దేశరక్షణ సమస్యను ప్రపంచయుద్ధం దృష్ట్యా గమనించినట్లయితే, పశ్చిమాన పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ దేశాల సంరక్షణ భారతదేశానికికూడా ప్రధానం. ఈ రాజ్యాలు దురాక్రమణను నిరోధించలేనిపక్షంలో, భారతదేశానికి ముప్పు తప్పదు. అందువల్ల దేశరక్షణలో ఈ రాజ్యాలన్నీ సహకరించక తప్పదు. సహకరించినట్లయితే భూమార్గాలగుండావచ్చే దండయాత్రలను నిరోధించడానికి అవకాశం ఉంటుంది. అటువంటి ముప్పు వచ్చినప్పుడు, ఈ రాజ్యాలు వాటంతటవే సహకరించగలవు. అయితే నేటి ప్రపంచ సమస్యల దృష్ట్యా అగ్రరాజ్యాల దండయాత్రలకంటె, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, భారతదేశాలమధ్య సంఘర్షణలే సంభవాలని తోచకమానదు. కాశ్మీర్ సమస్య పరిష్కారమైతే, భారత పాకిస్తాన్ రాజ్యాలమధ్య సరిహద్దురక్షణ పెద్దసమస్య కాబోదు. ప్రకృతి ప్రసాదించిన రక్షణ సదుపాయాలకూ, అంతర్జాతీయ సహకారానికీ లోబడి ఉండగలవు. అప్పుడు సరిహద్దులు జాతులను, రాజ్యాలను దూరంచేసే నిరోధాలుగాకాక, వానిమధ్య సన్నిహితభావం కలిగించే అనుబంధాలు కాగలవు.

# కైలాసనాథ దేవాలయము

శ్రీ టి. యస్. రామచంద్రన్



భారతీయ దేవాలయాలు మానవాకృతికి ప్రతిబింబాల వంటివి. దేవాలయనిర్మాణాని కుపయోగించే చలవరాళ్లు మొదలైన వీ దేవాలయాలకు అస్థిపంజరాలని అనవచ్చును. దేవాలయాలశిల్పం మానవాకృతితో పోల్చవచ్చును. వీటిలోని శిల్పభంగిమలు, చిత్తరువులు మొదలైనవాటిని శరీరాలంకారభూతములైన నగలు, ఆకారసౌందర్యము, మొదలైనవాటితో సరిపోల్చవచ్చును.

అలంకృతమయిన మానవశరీరంలో ఆత్మాన్వేషణ అంత తేలికైన పని కాదు. అల్లాగే దేవాలయగర్భగృహంలో వేంచేసి ఉండే స్వామిని దర్శించడంకూడా కొంతవరకు దుష్కరమే. అందుచేత దేవాలయాలు దర్శించేసామాన్య ప్రేక్షకులు బాహిరమైన శిల్పసౌందర్యమే చూచి ఆనందిస్తారు. ఎవరికో కొద్దిమందికి మాత్రమే దేవాలయాలలో భగవత్సాక్షాత్కారం పొందే భాగ్యం కలుగుతుంది.

ఈలోటు పూర్తిచెయ్యడంకోసం దేవాలయ నిర్మాత లనేకులు, మనదేవాలయాల్లో భగవల్లీలలు ప్రదర్శించే శిల్పా లనేకం చెక్కడం ప్రారంభించారు. ఈశిల్పాలకోసం , వీరు సృష్టిస్థితిలయకర్తలైన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల లీలలే ప్రధానంగా స్వీకరించారు. ఈత్రిమూర్తుల లీలలు ఎల్లోరాలోని కైలాసనాథ దేవాలయంలో చెక్కబడినంత కన్నుల పండువుగా మరి ఏ ఇతరదేవాలయంలోను కనిపించవు. ఈ దేవాలయం హైదరాబాదుసంస్థానంలో ఉన్నది.

దక్షిణహిందూస్థానంలోని చిదంబర నటరాజ దేవాలయము, తంజావూరులోని బృహదీశ్వరాలయము శిల్పదృష్ట్యా ఈకైలాసదేవాలయంతో సరిపోల్చదగినవిగా ఉన్నాయి. ఈ దేవాలయాల లాగే కైలాసనాథ దేవాలయము, ఆ కాలపు శిల్పసంప్రదాయాల కొక కళాక్షేత్రంలా మనకళ్లల్లో మెరుస్తుంది. ఇంతేగాదు; పరమేశ్వరారాధనకు కూడా ఇదిఅనువైన మహాపుణ్యక్షేత్రమే.

దక్షిణదేశంలో పర్వతాలు దొలిచి చెక్కిన దేవాలయాలు మూర్తిశిల్పంలో బాగా ప్రసిద్ధికెక్కాయి. కైలాసదేవాలయంలో కూడా మూర్తిశిల్పాలు ప్రేక్షకుల నెక్కువగా ఆకర్షిస్తాయి. ఈ దేవా



“వెన్నెలలో ఎన్నూరు”

(టెంపోరా, వాష్ త్రివర్ణ చిత్రము)

చిత్రకారుడు :

శ్రీ దేవీప్రసాద్‌రాయ్ చౌదరి

అయినా అంతా బ్రహ్మాండమయిన ఏకైక శిల్పకళాఖండము. పర్వతాలు దొలిచి నిర్మించిన దేవాలయాలలో దీనితో సరిపోల్చదగిన దింకేదీ కనబడదు.

ఈ దేవాలయం సందర్శించే వారు, ఆధ్యాత్మిక భక్తిభావావేశంతో, రాళ్లు మలిచి సృజించిన ఇక్కడి శిల్పసంపద చూసి తన్మయులై, దేశకాలాతీతమైన సౌందర్యజగత్తులో ప్రవేశిస్తారు. దీని నిర్మాణము, అలంకారాలు పూర్తిచేసేసరికి ఇంచుమించుగా నూరేళ్లు పట్టింది. ఈ దేవాలయంలో కైలాసంలోని పరమేశ్వరుని స్వర్గము, అత్యుత్తమమైన శిల్పసృష్టి. దీనిలో శిల్పుల హృదయము, మేధ, సృజనసాధనాలైన హస్తాలు సమ్మిళితములై ఉత్తమ పురుషార్థసాధనాలలో నిమగ్నము లైనాయి. మహాపరాక్రమశాలి, కళాప్రియుడు అయిన ఉత్తమప్రభువుప్రాపకం ఉండడం వల్లనే ఇటువంటి కళాసృష్టి సాధ్యపడింది. ఈ ప్రభువు రాష్ట్రకూటవంశీయుడైన రెండవ కృష్ణుడని చరిత్రకారులు నిర్ణయించారు. ఈ రాష్ట్రకూటులు క్రీస్తు అనంతరం 753 లో, చాళుక్యుల తరవాత పశ్చిమదక్షిణాపథంలో గొప్ప పేరుబడి సాగించారు. వీరికి హైదరాబద్ సంస్థానంలోని మాల్ఖేడ్ రాజధానీనగరంగా ఉండేది. పైన చెప్పిన కృష్ణరాజు 757—783 సంవత్సరాల మధ్యన పరిపాలించిన విషయంకూడా చరిత్రకారులు స్థిరీకరించారు.

8వ శతాబ్ది ఉత్తరార్థంలో రెండవకృష్ణునిచే నిర్మింపబడిన ఈ దేవాలయంలో స్థాపత్య శిల్పకళలు రెండూ పరస్పరసమ్మిళితములై ఉత్తమోత్తమమైన సమున్నతస్థాయి అందుకున్నాయి. ఇదిసంపూర్ణమైన నిర్మాణ సౌందర్యంగల దేవాలయాలకు ఆదర్శప్రాయమైనది. కంచి, పట్టడకలోని విరూపాక్ష దేవాలయానికీ చాలా సాదృశ్యం ఉన్నది. కైలాసనాథ దేవాలయశిఖరం ద్రావిడశైలిలో నిర్మించారు. దీనికి 16 స్తంభాల మండపం ఉన్నది. దీనిపైకప్పు పొడుగు 70 అడుగులు. వెడల్పు 60 అడుగులు. ఈ దేవాలయంలోని నందిమండపం [illegible] అడుగులు ఎత్తున్నది. దీనికి 20 చదరపు అడుగుల వైశాల్యం గల నాలుగు పార్శ్వాలున్నవి. దీనిచుట్టూ ఒక విశాలమైన వెడపు కనిపిస్తుంది. దీని చుట్టూ దీనిని ఆనుకొని కొన్ని గదు లున్నాయి. ఇంతేకాక విమానానికి అయిదు గదు లున్నాయి. ఈ పెరటికి ఒకమూలగా నదీ దేవతల దేవాలయం ఉన్నది. ఈ దేవాలయంలో ఈ నదీమూర్తుల అర్ధశిల్పాలు(Relief)కనిపిస్తాయి. ఇవి కాక ఇక్కడ రెండు ధ్వజస్తంభాలు కూడా ఉన్నాయి. ఇవీ, ఈ దేవాలయంలోని మరికొన్ని ఇతరస్తంభాలూ కూడా, ఔత్తరాహ శైలిలోనే ఉన్నాయి. ఇవికాక మిగిలిన వన్నీ ద్రావిడ శైలిలోనే నిర్మించారు. అందుచేత కైలాసనాథ దేవాలయంలో వివిధ శిల్ప శైలుల సమ్మేళనం జరిగిందనే అనాలి. ఈ సమ్మేళనం ప్రాచీన చాళుక్య శిల్ప నిర్మాణాలలోనే కనిపిస్తున్నదని విమర్శకు లందరు అంగీకరించారు.

పర్వతం దొలిచి నిర్మించిన కైలాసనాథ దేవాలయము మొత్తం 300 అడుగుల పొడవు, 75 అడుగుల వెడల్పు గల ప్రదేశం ఆక్రమించిఉన్నది. ప్రధాన దేవాలయము, నందికేశ్వరాలయము, దేవాలయద్వారము అన్నీ తూర్పునించి పడమటికి ఒకే వరసలో కనిపిస్తాయి. ప్రధానదేవాలయం 164అడుగులపొడవు 109 అడుగుల వెడల్పుగల ప్రదేశంలో నిర్మించారు. దీని ఎత్తు 96 అడుగులు. ఈ దేవాలయ పీఠ ప్రదేశానికి దిగువగా జీవాకృతిగల 25 సింహ గజ శిల్పా లున్నాయి. ఈపీఠభూమికి కొంచెం ఎత్తుగా ఉన్న దేవాలయభాగం అంతా ప్రాచీన దాక్షిణాత్య దేవాలయాల శిల్పధోరణిలో ఉన్నది. ఈ దేవాలయగోపురానికి 3 వరసలమెట్లున్నాయి. పశ్చిమాన్నించి బయలుదేరిన సోపానశ్రేణి దేవాలయ గర్భగృహందాకా తీసుకుపోతుంది. ఈగర్భగృహంముందు ఒక చక్కని మండపం కనిపిస్తుంది.

కైలాసనాథదేవాలయంలో భారతదేశం అంతటిలోను సర్వోత్తమమైన మనోహర శిల్పా లున్నాయి. ఈదేవాలయ శిల్పమూర్తులలో ఆకృతిగాంభీర్యము, ఆధ్యాత్మికశక్తి, చక్కని సమ్మేళనం పొందాయి. రావణాసురుడు కైలాసపర్వతం కదలింప జూచేశిల్పము బ్రహ్మాండమైన ఉత్తమసృష్టి. ఈశిల్పంలో పర్వతం కదులుతున్నప్పుడు పార్వతి పరమేశ్వరునివైపు తిరిగి ఆయన భుజం ఆలంబనంగా గ్రహిస్తుంది. పార్వతీదేవి పరిచారిక పర్వత చలనానికి భయపడి పారిపోతుంది. పరమేశ్వరుడు దీనికి ఎంత మాత్రముచలించక కాలి

తన ఇరవై చేతులబలము ఉపయోగించి ఈ ఆపత్తు లోనుంచి తప్పించుకోడానికి ప్రయత్నిస్తాడు.

బొంబాయిలోని ఎలిఫెంటా గుహలో కూడా ఇలాంటిదే ఒకశిల్పం కనిపిస్తుంది. ఈశిల్పంలో ఉన్నంత క్రమిక భూగర్భనిర్మాణనైపుణి మరి ఏ ఇతర శిల్పంలోనూ కనిపించదు. ఈ దేవాలయంలో ఇంకా మరికొన్ని శిల్పాలున్నాయి. వీటిలో త్రిపురాంతకుడు, గంగాధరుడు, విష్ణువు, గరుడుడు మొదలయిన విగ్రహాలు ముఖ్యంగా పేర్కొనదగినవి. రావణుడు తన పదితలలు శివునికర్పింపబోయే శిల్పం కూడా వీటిలో ప్రధానంగా పేర్కొనదగినదే. ఈశిల్పంలో రావణుడు తన పదో శిరస్సుకూడా ఖండించి వెయ్యడానికి సిద్ధంగా ఉంటాడు. తాను ఇదివరకు అర్పించిన తొమ్మిదిశిరస్సులు శివుని మెడలోనూ మాలికగా వ్రేలాడవేశాడు. రామాయణంలోను మిగిల్ని కొన్ని ప్రాచీన గ్రంథాలలోనూ, రావణుడు తన శిరస్సులు బ్రహ్మదేవునికి అర్పించాడని ఉన్నది. రామాయణంలోని ఉత్తరకాండలో 10 వ సర్గలోని ఆ శ్లోకాలిక్కడ ఉదహరిస్తున్నాను.

"దశ వర్ష సహస్రంతు నిరాహారో దశాననః
పూర్ణే వర్ష సహస్రేతు శిరశ్చాగ్నౌ జుహావసః
ఏవం వర్ష సహస్రాణి నవ తీస్యాతిచక్రమః
శిరాంసి నవ చాప్యస్య ప్రవిష్టాని హుతాశనం
అథ వర్ష సహస్రేతు దశమే దశమం శిరః
చ్ఛేత్తుకామే దశగ్రీవే ప్రాప్తస్తత్ర పితామహః
పితామహస్తు సుప్రీతః సార్ధం దేవై రుపస్థితః
తవ తావద్దశగ్రీవ! ప్రీతోస్మీత్యభ్యభాషత.

కాని, కాళిదాసు రఘువంశంలో రావణాసురుడు తన శిరస్సులు శివునికే అర్పించాడని వ్రాశాడు:

"జేతారం లోకపాలానా స్వముఖైరర్చితేశ్వరం
రామ స్తులిత కైలాస మరాతిం బహ్వామన్యత."

ప్రాచీనశిల్పులు ఈకథాభాగమే తమశిల్పాల్లో చెక్కినట్లు కనిపిస్తుంది. ఎల్లోరాశిల్పులు కూడా ఈ పద్ధతే అవలంబించారు. కైలాసనాథ శిల్పంలో లింగాకృతిలో ఉన్న పరమేశ్వరునికే రావణుడు తన శిరస్సులు సమర్పిస్తాడు. శివమాహాత్మ్యం ప్రకటించడానికే కైలాసనాథ దేవాలయం నిర్మించటంచేత శిల్పులు ఈవిధమైన స్వల్పభేదం ప్రవేశపెట్టిఉంటారు.

కైలాసనాథ దేవాలయం భారతీయ స్థాపత్య శిల్పచరిత్రలో నిరుపమానమైనది. మానవులు క్షణకాలం దేవతాసన్నిధిలో నిలబడి, వారిలీలలు చూచి ఆనందించి స్వర్గీయమైన ఆధ్యాత్మికానందానుభూతి అందుకోవడానికే ఆమహాశిల్పులీ దేవాలయం నిర్మించారనటం అతిశయోక్తి కాజాలదు.



# షష్టిపూర్త్యుత్సవములు



శ్రీ నోరి నరసింహశాస్త్రి

## 1

వి[illegible] షష్టిపూర్తికి ఉత్సవ మేమని ప్రశ్నింపవచ్చును. అయితే యిటీవల మనము పలువురు పెద్దలకు జరిగిన, జరుగుచున్న జరుగనున్న, షష్ట్యబ్దపూర్త్యుత్సవములనుగూర్చి పత్రికలలో తరుచుగా వినుచున్నాముగదా! కాబట్టి యామాట మనకు పరిచితమైపోయినది. అందువలనే దానిలో నసంబద్ధమేమియు స్ఫురింపదు. ఐనను గోకులాష్టమికిని పిల్ల పండుగకును కల సంబంధమే షష్టిపూర్తికిని ఉత్సవములకును గలదనుట సత్యము!

గోపాలబాల లోకసంగ్రహార్థమున శ్రీకృష్ణభగవాను లవతరించిన మహోత్సవమును ఏటేట స్మరించుచు సానందముతో భారతీయులు జరుపుకొను సుత్సవము గోకులాష్టమి. బర్బర దేశములో హుసేనులు చనిపోయినవేళను స్మరించుచు ఏటేట ముసల్మానులు దుఃఖముతో జరుపుకొనునది మొహర్రము. ఒకటి ఆనందకారణమును స్మరించునది, మరియొకటి దుఃఖకారణమును స్మరించునది; ఒకటి హిందువులది మరియొకటి ముసల్మానులది. దుఃఖకారణము కనబడినప్పుడు ఉత్సవము చేసెదమనువారెవరైన నున్నచో, నట్టివారు షష్టిపూర్తిని ఉత్సవవేళగా భావింపవచ్చును.

మూలానక్షత్రమునకో, జ్యేష్ఠయందో, కాక ఆ రెండు నక్షత్రముల సంధికాలమున అభుక్తమూలమునందో దంపతులకు కుమారుడు కలిగినచో వారేమి చేయుదురు? అట్టి దంపతులు లోక[illegible]. అట్టి పుత్రుడు పుట్టినవేళ వారికి జన్మించినందుకు, వారి దుర్భాగ్యమునకు వారి నభినందించుచు ఆంధ్రదేశములోని పెద్దలందరును [illegible] లొసగి మహాసభ కావించి గౌరవించి యుత్సవ మొనర్తురా? అట్లు చేసినచో నది యెంత యసంబద్ధముగా నుండునో, షష్ట్యబ్దపూర్తిసమయమున ఉత్సవము జరుపుటయు నంతే యసందర్భమే!

## 2

మా చిన్నతనములో షష్టిపూర్తికి ఉత్సవములు చేయు వ్యాపారము కనిగాని వినిగాని యెరుగము. అప్పటి కింకను ఉత్సవాదులు నిర్ణయించునది తద్విదులగు పండితులే కాని ఉత్సాహప్రేరితమగు జనసామాన్యము కాదు. ఇప్పుడుమాత్రము ఈ యుత్సవములు సర్వసామాన్యమైనవి. నాయకుడ ననుకొను ప్రతి వ్యక్తియు అరవదియవ పడిలోపడగనే, నా షష్ట్యబ్దపూర్తి యెప్పుడా, యని వృద్ధవరుడు వివాహోత్సవమునకు వలెనే ఉవ్విళ్లూరుచుండుట చూచుచున్నాము.

ఈ మార్పునకు కారణమేమి? శ్రీ పానుగంటివారి 'కంఠాభరణమే' దీనికి మూలమని నా విశ్వాసము. ఆ నాటకము చదివిన వారును ప్రదర్శింపగా చూచినవారును షష్టిపూర్త్యుత్సవముల నుపక్రమించినట్లు తోచును. అందులో సుబ్బిసెట్టికి అరవైయేళ్లు నిండినవి. పాప మాతనికి ఉత్సవముచేయువా రెవరును ఊరిలో లేకపోయిరి. అంతట నాతను, 'ఈ కొత్త భాగ్యానికి ఇంకొకరు చేసే దేమిటి? మనమే చేసికొందామని' ఉపక్రమించినాడట!

'షష్టిపూర్తి' నిజముగా తానే యేదో చేసికొనవలెగానీ, ఇతరులు తన కిప్పు డుత్సవము చేయదగినదికాదని శ్రీ పానుగంటివారు తెలియక వ్రాసిరో, తెలిసియు చమత్కారమునకు వ్రాసిరో, మనము చెప్పజాలము కాని, ఆ భాగము చదివినప్పుడు గాని ప్రదర్శింపగా చూచినప్పుడుగాని పాఠకులును ప్రదర్శకులును కడుపుబ్బ నవ్వకుండ నుండరు. కాని వాస్తవ మెరింగినచో, అట్లా పాఠకులను ప్రేక్షకులును నవ్వుట చూచి, నవ్వుకొనదగినవాడు సుబ్బిసెట్టియే!

షష్టిపూర్తికి చేయదగినది యుత్సవము కాదు, శాంతి మూలా నక్షత్రాదులలో పుత్రజననమైనచో చేయదగిన దానికంటె తీవ్రతరమగు శాంతి, షష్ట్యబ్దపూర్తికి చేయవలెను. ఏ శాంతికర్మలలోనైనను ప్రధానమైనవి దానములు, జపములు, హోమములు! దానము లనగా నితరులకు ద్రవ్యము తామే యిచ్చుటగాని, యితరులయొద్దనుండి పరిగ్రహించుట కాదు!

## 3

శాంతికర్మలు ప్రదర్శించు గ్రంథములు పరిశీలించినవారికి ఉగ్రరథశాంతి, భీమరథశాంతి, విజయరథశాంతి—అను మూడు శాంతులు గోచరించియుండును. వానిలో అరువదవయేట ఉగ్రరథశాంతియు, డెబ్బదియవయేట భీమరథశాంతియు, డెబ్బదియైనిమిదవయేట విజయరథశాంతియు, నాచరింపదగినవి. అందులో షష్టిపూర్తికి చేయవలసిన ఉగ్రరథశాంతినిగూర్చి యొకింత విచారింతము.

నాకు తెలిసినంతవరకు ఈ ఉగ్రరథశాంతికర్మ చేయుటకు మూడు విధానము లున్నవి. ఒకటి శౌనకోక్తము, ఇంకొకటి బోధాయనోక్తము, మరియొకటి వైవాగమోక్తము. ఈ మూడింటి ప్రక్రియలును, మూలసూత్రముల నొకటియేయైనను, తంత్రము నఁపుటలోనను విస్తృతిలోనను విశేషభేదము లున్నవి. వానిలో నెల్ల శైవాగమోక్తశాంతి బహువిస్తృతమైనది. దాని నన్నదున్న ట్లాచరింపగల సమర్థుడు, మహారాజో చక్రవర్తియో! ఐనను యథాశక్తిగా సామాన్యగృహస్థులును ఆచరింపవచ్చును. అట్టిది ఒకసారి చూడగలిగిన నాబోంట్లకు, దాని యద్భుతరూపము లీలామాత్రముగనైనను, గోచరించిన దనుట అతిశయోక్తి కానేరదు.

ప్రయోగవిస్తృతిలో నెన్ని భేదము లున్నను, ఆ మూడును విధించినది శాంతియే యనుట కెట్టి సందేహమును లేదు. శౌనకు డిట్లు చెప్పుచున్నాడు:

"జన్మత షష్టిమే వర్షే మృత్యు రుగ్రరథో నృణామ్

..................................

హన్యాసా న్మృత్యు మాప్నోతి ధనహానిశ్చ జాయతే
పుత్రనాశో దారనాశో ధననాశ స్తథైవ చ

తద్దోషశమనార్థాయ శాంతిం కుర్యాద్విచక్షణః
జన్మర్క్షే జన్మమాసేచ స్వజన్మదివసే తథా
జన్మర్క్షేనైవ కర్తవ్యా శాంతి రుగ్రరథాహ్వయా
దేవాలయే నదీతీరే స్వగృహేవా శుభస్థలే..."

జన్మాదిగా నరువదియవయేట నరులకు, మృత్యువు ఉగ్రరథ రూపమున నావేశించి, వారికేకాక వారి పుత్రులకు పత్నులకు నాశమును ధనక్షయమును కలిగించును!

అదియే శైవాగమములో నిట్లు చెప్పబడియున్నది. ఈశ్వరుని గుహుడు దానినిగూర్చి ముం దిట్లు ప్రశ్నించినాడు:

"స్వామి న్నుగ్రరథో నామ సర్వప్రాణిభయంకరః
పుత్రపౌత్రక్షయకరో ధనధాన్య వినాశనః
రాజ్యభ్రంశకరో రాజ్ఞాం ఇత్యేవం బహుశశ్రుతమ్."

అది నిజమే యని యీశ్వరు డిట్లు వర్ణించెను.

'సాధు తే కథయిష్యామి తముగ్రరథమాదరాత్
మహామృత్యుసమః ప్రోక్తః ప్రాణినాం సర్వనాశనః
మహాకాయో మహాదంష్ట్రో ఘోరరూపే భయానకః
ఆవిర్భావే యస్యపుత్ర ధనధాన్యాది నాశనమ్
భవేత్పీడాచ మహతీ రాజ్ఞాం రాజ్యవినాశనమ్
అనావృష్టిశ్చమహతీ శత్రుపీడా తథైవచ
గజాశ్వరథనాశశ్చ స్వరాజ్యాద్భ్రంశనం తథా
ప్రాదుర్భావే భవన్త్యేతే దోషా ఉగ్రరథస్యవై
ఉత్పత్త్యబ్దా దుగ్రరథ షష్టిమేబ్దే ప్రకీర్తితః
యస్యావిర్భావమాత్రేణ సంసారీ భయమాప్నుయాత్.'

వీనినిబట్టి చూడగా అరువదియవయేడు ప్రవేశించుటయే భయంకరమైనది. అప్పుడు మహామృత్యుసముడగు ఉగ్రరథుడు ఆవిర్భవించును. కావున వెంటనే యథాశక్తిగా నుగ్రరథశాంతి యాచరించుట శ్రేయస్కరము.

ప్రయోగములతో మృత్యుంజయదేవతా కలశస్థాపనము, తత్ప్రతిమాస్థాపన పూజనములు ముఖ్యములు. అట్లే దుర్గను, గణేశుని, విష్ణువును, సముద్రములను, నదులను, దిక్పాలురను, నవగ్రహములను, చిరజీవులను కలశములలో నావాహన మొనర్చి తత్తత్ప్రతిమలు సువర్ణముతో నొనర్చి పూజాదికము చేయవలెను. మరియు కలశములలో నావాహనచేసి పూజింపదగినవారు,—అరువదిమంది సంవత్సర దేవతలు, అయన దేవత లిద్దరు, ఋతువులు, మాసములు, పక్షములు, తిథులు, వారములు, తారలు, యోగములు, కరణములు, రాసులు పండ్రెండు, పంచబ్రహ్మలు, సప్తవాయువులు, అష్టవసువులు, దశదిక్కులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు!—ఈ యధిష్ఠానదేవత లందరిని వేరువేరుగా కలశములలో నావాహన మొనర్చి సువర్ణప్రతిమలుంచి పూజాజపములు వేర్వేర నొనర్చి తిలదూర్వాంకురాదులతో హోమములు చేయవలెను. తుదకు యజమానిని ఆయుష్సూక్తము, మృత్యుసూక్తము ఇత్యాదిమంత్రములతో కలశోదకముల నభిషేకింపవలెను. ఆ పిమ్మట యజమాని ఆచార్యునకు ఋత్విక్కులకు ప్రతిమాదికములు దానమొనర్చి, మరియు కంబళదానము, గోదానము, కార్పాసదానము, ఆయసదానము, దశదానములు, నవగ్రహప్రీతికరములగు నవధాన్యదానములు ఇత్యాదిదానము లొనర్చి బ్రాహ్మణుల భుజింపజేసి దీనులను అనాథులనుగూడ తుష్టి నొందింపవలయును. ఇట్లు చేసినచో నరువదియవయేట నావేశించు నుగ్రరథుడు శాంతించును; దీర్ఘాయుర్దాయము కలిగి పుత్రపౌత్రవంతుడై సుఖముండును. ఇట్టిది ముఖ్యముగా షష్టిపూర్తికి చేయవలసిన క్రియ!

## 4

ఇంతవరకు చూచినవారికి షష్టిపూర్తి యన నెంత భయంకరమైనదో, అప్పుడు చేయదగిన శాంతి యెంత యుగ్రమైనదో, కొంతవరకవగతమై యుండవచ్చును. భీమరథశాంతి కూడ నిట్టిదే. అవి కేవల శాంతులే కాని యుత్సవము లెంతమాత్రము కానేరవు. ఆబ్దికమునాడు పెట్టిన గారెలు తిన్న యవనుడు వారింట నానాడు పండుగయనుకొని 'రోజూ మీ యింట్లో ఇట్లాగే ఉండవలె'నని యజమానిని దీవించినట్లు కథ యొకటి సర్వసామాన్యముగా చెప్పి నవ్వుకొనుచుందురు. ఆబ్దికమునాడు పితృదేవతలను పూజింతురు, కనుక అది పండుగయే అనుకొనుటలో గూడ ఆ యవను డెక్కువ పొరపాటు పడలేదు. షష్టిపూర్తి యొక యుత్సవసమయమని ప్రవర్తించుట మాత్ర మంతకంటె వేయిమడుగు లెక్కువ తప్పు; పైపెచ్చు, ఇది ఎంతో ప్రమాదకరమైన పొరపాటు! నవ్వుకొనునట్టిది కాదు.

శతసంవత్సరములు జీవించినవారును సహస్రచంద్రదర్శనము చేసినవారును గూడ శతాభిషేకమను నొక శాంతి చేసికొనవలెను. అవియు శాంతులేయైనను అందులో ఉత్సవవిశేషము కూడ నున్నది. వానివలన ఫలముకూడ పీడానివృత్తిమాత్రమే కాదు. అందులో శతాభిషేకమైన తర్వాత యజమాని రథమెక్కి, స్వస్తివాచనములతో దుందుభిశబ్ద పురస్సరముగా గ్రామము ప్రదక్షిణము చేయును. ఇది యొనర్చినచో నాతనికి లభించు ఫలమొక్క పీడానివృత్తియే కాదు. అట్టివాడు తనకు పూర్వులగు పదితరములవారిని, తన్ను, తన తర్వాతివచ్చు మరి పదితరములవారిని పునీతుల నొనర్చి, తాను పుత్రపౌత్రులతో షష్టివర్ష సహస్రములు స్వర్గలోకమున నుండి, యా పిమ్మట బ్రహ్మసాయుజ్య సాలోక్యముల నందునట. ఇవి బోధాయన భగవానుల వాక్యములు!

## 5

నా మిత్రులలో పలువుర కిప్పుడు షష్టిపూర్తి సమీపించుచున్నది. వారును ఆ సమయమున తమ్ము ఆంధ్రలోక మెట్టి యుత్సవ మొనర్చి సన్మానించునో యని నిరీక్షించుచు ఉవ్విళ్లూరుచుండవచ్చును. వారిలో కొందరికి, అది యొక వేడుకయే కాక, అవసరమగు ధనసంపాదనకు మూలమగు మార్గమును కావచ్చును. అట్టివారు ముఖ్యముగా ఈ వ్యాసరచయితను ప్రత్యక్షముగా గాకున్న మనస్సులోనైన నిందింపకపోరు. అందుచే నాకు కొంత ప్రత్యవాయ ముండవచ్చును. కాని షష్టిపూర్తి సన్మానసంఘములవారు చేయు బలవంతములకు మోమోటపడి విరాళము లిచ్చువారిలో పలువురుమాత్రము అది తప్పిపోయినందుకు, ఆనందపూర్వకముగా నాశీర్వదింతురు గదా!

షష్టిపూర్తి దగ్గరపడిన మిత్రు లందుచే దాని స్వరూపమెరిగి, యథాశక్తిగా తమ ద్రవ్యము వ్యయ మొనర్చి శాంతి గావించుకొని, చిరజీవులై, సహస్రచంద్ర దర్శనులు, శత సంవత్సర జీవులునై, అప్పుడు చేయవలసిన యుత్సవము చూచి యానందింప మా కవకాశ మిత్తురుగాక! వారును పునీతులై ముందుముందు ఉత్తమలోకములం బ్రాపింతురు గాక!

# రాజకీయ సిద్ధాంతాలు - ప్రజలు



శ్రీ టి. దేవరాజసుధి

మానవుడు తాను అన్నివిధాలా అభివృద్ధి చెందటానికే ప్రయత్నిస్తాడు. సౌఖ్యంగా మనాలని కోరుతాడు. కాని ఆ మార్గం స్వచ్ఛందంగా లేదు. కంటకావృతమై వుంది. దారిలో అతనికి చాల ఆటంకాలున్నవి. కాని నేడు మనకున్న …ంతో మన కళ్లముందు విలయతాండవం చేస్తున్న ఆకలి …లను, దారిద్ర్యాన్ని నిర్మూలించుకోవచ్చు. కాని విజ్ఞానం మానవావసరాలకు వినియోగించబడటం లేదు. మానవుడు అభివృద్ధి నిరోధకమైన పూర్వసాంప్రదాయాలకు, సనాతన సిద్ధాంతాలకు బలిచేయబడుతున్నాడు. ఊహామాత్రమైనటువంటి, "రాజ్యాంగం" "జాతి" "వర్గము" మొదలైన సమిష్టి భావనలకు, వ్యక్తి, త్యాగం చేయబడుతున్నాడు. ఈ సమిష్టి భావనలవలన మానవుడు మానవుణ్ణి బానిసగా చేయటానికి ఉపయోగపడుతున్నాడు. అందుకే సంఘాభివృద్ధికి మానవుడే కొలబద్ద. ఏ సమాజం కానీ, రాజ్యాంగం కానీ, జాతికాని ఎంత అభ్యుదయపథాన పయనిస్తుందో తెలిసికోవాలంటే దానిలోవున్న వ్యక్తులు విడివిడిగా ఎంత స్వేచ్ఛ ననుభవిస్తున్నారో తెలిసికోవాలి. మానవుడు తాను మానసికంగా అభివృద్ధి చెందటానికి, తన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవటానికి స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, అవకాశం, ఏ సంఘంలో వుంటుందో ఆ సంఘం అభ్యుదయగామి. ఇంతకంటే సంఘాభ్యుదయాన్ని పరిశీలించే మరో మంచి పరీక్ష లేదు.

అయితే ఈ ఆదర్శం ఊహామాత్రం (*Utopic*) అని నిరసించే వారుకూడ కొంద రుండవచ్చు. ఏ సాంఘిక తత్త్వంగాని, లేదా సాంఘిక పునర్నిర్మాణానికి చేసే ఏ సూచనగాని, అది వ్యక్తియొక్క ప్రాధాన్యతను గుర్తించనపుడు, స్వేచ్ఛావాదనను ఆచరణసాధ్యం కాని వట్టిఆదర్శంగా కొట్టివేసినపుడు, ఆ తత్త్వంకాని, ఆ సూచన కాని చాలినంత అభివృద్ధికరమైనదిగా వుండనేరదు. అది భావనగా అంగీకరించినపుడు ఆ భావనను ఎందుకు ఆచరణయోగ్యంగా చేయకూడదు ? ఆ భావన ఎంతవరకు సాధ్యమో దాని ప్రత్యేకత ఏమిటో పరిశీలిద్దాం.

ప్రపంచమానవాళికి శరణ్యంగా తలంపబడిన ఈ ఆదర్శాన్ని మనం సాధించాలి. నేడున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక పంథాలు నియమాలు ప్రపంచ వినాశనానికి దారి తీస్తున్నవి. అందులో మనదేశానికికూడ పాలున్నది. మానవ నాగరికతయే ప్రమాదావస్థలో వుంది. మరో ప్రపంచయుద్ధఘోష వినిపిస్తుంది. నియంతలు, అభివృద్ధినిరోధకులు యుద్ధశంఖారావం చేస్తున్నారు. ప్రజానీకం రానున్న విపరీత, విపత్కర పరిస్థితులను గూర్చి దరి . తెలియనిస్థితిలో పడిపోయింది. సత్యం అహింస అని విరివిగా ప్రచారంచేసి గాంధేయ కార్యకూరులని గంటలుమ్రోగించిన మనదేశంలో కూడ మిలటరీ బడ్జెట్ విరివిగా పెరిగిపోయింది. మారణాయుధాల ఉత్పత్తి లెక్కకు మించింది. సామాన్యమానవుడు ప్రశ్నిస్తున్నాడు. ఈ ఆర్భాటాలన్నీ దేనికి ? ఇవన్నీ శాంతి ప్రయత్నాలేనా? శాంతి, యుద్ధాలవల్ల సాధ్యమా ? రెండు ప్రపంచయుద్ధాలు జరిగిపోయినవి. శాంతి సాధింపబడలేదే! మానవజాతికి ఒరిగిందేమీ లేదే! అయితే శాంతి ఎలా సాధింపబడాలి? శాంతిసాధనకు ఏయేప్రాతిపదికలు అవసరం ?

నేడు ప్రపంచంలో మనముందర మూడురకాలైన రాజ్యాంగ పద్ధతులు అమలులో వున్నవి. ఈ 'ఇజాలు' : పార్లమెంటరిజం లేక పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, ఫాసిజం, కమ్యూనిజం. ఆయా ఇజాలు మన సమస్యలను ఎంతవరకు పరిష్కరించుకోవటానికి ఉపయోగపడ్డవో పరిశీలిద్దాం.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్నిగూర్చి తెలిసికొందాం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో అందరికీ వోటుచేసే హక్కు వుంటుంది. కాని ఓటర్లముందు ఒక నిర్మాణాత్మక కార్యక్రమాన్ని పెట్టరు. ఎన్నికలలో అణువులుగా మాత్రమే ఉపయోగించుకోబడతారు. వ్యక్తులు ఏకాంతంగా ఎవరికి వారే ఆలోచన లేకుండా ఇష్ట మొచ్చినట్టుగా వోటుచేస్తారు. ఇందుమూలంగా ఆర్థికదోపిడి వైజ్ఞానిక దాస్యం, పెచ్చు మీరుతవి. ఈ ఎన్నికలు గూడా స్వేచ్ఛాయుతంగా జరుగుతవనే నమ్మకం లేదు. ఆర్థికంగా ఏ కొద్దిమందో వ్యక్తులు మాత్రమే పూర్తిగా బలపడి వుంటారు. కాబట్టి ఎన్నికలు అర్థరహితంగా తయారవుతవి. పార్లమెంటరిజం సిద్ధాంతరీత్యా అందరికీ సమాన హక్కులను అంగీకరిస్తుంది. కాని ఆచరణలో కనపడదు. దానికి మూలకారణం ఆర్థికఅసమానత. సిద్ధాంతరూపేణా అందరికీ సమాన హక్కులని అంగీకరించినప్పటికి ఆర్థికఅసమానతను రూపుమాపని కారణంగా 'అందరికీ సమానహక్కులు' అనే సూత్రం అనివార్యంగా దెబ్బతింటుంది. ప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకునేహక్కు అయిదుసంవత్సరాలకు ఒకసారి మాత్రమే వుంది. ప్రతినిధులు ప్రజల చెప్పు చేతల్లో వుండాలనే నియమం లేదు. ఈ మధ్యకాలంలో ఒకసారి ఎన్నుకోబడిన ప్రభుత్వం నిరంకుశత్వంగా మారిపోవడానికి అవకాశం వుంది. ఈ అవకాశం

ఆర్థికదుస్థితికి, నిరుద్యోగసమస్యకు, సాంఘిక జడత్వానికి మూలం. ప్రజలపేరుతో ఒకపార్టీ పాలిస్తుంది. ప్రజలను అధికారాన్నుంచి దూరంచేస్తుంది. 'ప్రజలచే ప్రజాప్రభుత్వం' అనే ప్రధాన సూత్రమే దెబ్బతిన్నది. ప్రజాస్వామ్యంలోని ప్రధాన విషయాలే పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ప్రధాన లోపాలు కావటం మూలాన దోపిడీవర్గాలు ప్రజాస్వామ్య వినాశనానికి దారితీసి అధికారాన్ని చలాయించటానికి పూనుకొంటారు. ఈవిధంగా పార్లమెంటరీ డెమోక్రసీ తన్ను తాను రక్షించుకోలేని స్థితిలోకి దిగజారిపోతుంది. ఈలాంటి ప్రజాస్వామ్యంపై విసుగుచెందిన ప్రజ తమ సమస్యలను పరిష్కరించుకోవటానికి, ఏనాయకుడు ఉద్భవిస్తాడోనని ఎదురుచూస్తుంటారు. ఈవిధంగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఫాసిజానికి బాట వేర్పరుస్తుంది.

ప్రజాస్వామ్యం అంటే విసుగుచెందిన ప్రజ ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి తమసమస్యలను తాము పరిష్కరించుకోలేము, అనే దుస్థితికి దిగజారి ఏ మహత్తర నాయకుడో లేక ఏదైవాంశసంభూతుడో తమను దరిజేర్చుతాడని ఎదురుచూస్తుంది. ఈ వాతావరణం 'ఒకేనాయకుడు' అనే నియంతృత్వభావన కలిగిన ఫాసిజానికి నిలయం.

ఫాసిజం మానవుని వ్యక్తిత్వాన్ని గుర్తించదు. వ్యక్తిని జాతి అనే సమిష్టిభావనలో నిమగ్నం కమ్మంటుంది. జాతి తప్ప వేరె వ్యక్తిత్వం లేదంటుంది. ఒకే నాయకునిలో అంధ విశ్వాసం కలిగివుండాలి. ప్రజ వీరపూజ చేయాలి. నిరక్షరాస్యత, మౌఢ్యం, రాజకీయ పరిణతిలేమి, సాంస్కృతికంగా, సాంఘికంగా వెనకబడి వుండటం; ఇవి ఫాసిజానికి పునాది రాళ్లు.

అంతవరకూ ఎందుకు? మన కళ్లముందు జరిగిందే పరిశీలిద్దాం. జపానుప్రజలు మికాడోను తమ దైవ ప్రతి నిధిగా ఎంచటం, జర్మను, ఇటలీప్రజలు హిట్లరు, ముస్సోలినీలను అలాగే కొలవటం, ఫాసిజంలో వీరపూజకు, నాయకునిలో అంధవిశ్వాసానికి వున్న ప్రధానపాత్రను ధ్రువపరచటం లేదా! ఇది ఎప్పుడూ జాతియొక్క గొప్పదనాన్నిగూర్చి గంభీరోపన్యాసాలు చేస్తూ దేశభక్తిని గూర్చిన భావాలను అశేషంగా ప్రచారం చేస్తుంది. పూర్వసాంప్రదాయాలను ప్రాచీన నాగరికతనూ ఉద్ధరించాలనే ప్రాకులాటను జాతీయవాదంగా, దేశభక్తిగా ప్రచారం చేస్తుంది. జాతీయైక్యత, జాతిసౌభాగ్యం, జాతిఔన్నత్యం అనే పడికట్టు పదాలతో ప్రజలకు శివాలెత్తిస్తుంది. ఫాసిజం ఆర్థిక అసమానతను సుస్థిరం చేస్తుంది. ఫాసిస్టు రాజ్యాంగమే మానవజాతిని రక్షించునని ప్రచారం చేస్తుంది. మానవసమాజానికి అదీ ఒక సందేశాన్ని (?) ప్రకటిస్తుంది. కమ్యూనిస్టు వ్యతిరేకినని పూర్తిగా ఋజువు చేసికొంటుంది. సోషలిజానికి వ్యతిరేకప్రచారంచేసి పై వర్గాల వారిని, సోషలిస్టు ప్రచారంచేసి క్రిందివర్గాలవారిని, తీవ్రజాతీయ వాద ప్రచారం కొనసాగించి మధ్యతరగతివారిని, తన ప్రాబల్యంలోకి తీసికొనిరావటానికి ప్రయత్నిస్తుంది. 'జాతీయైక్యత' 'వర్గ సామరస్యం' 'శాంతి' అనే పేర్లతో వ్యతిరేకశక్తులను తలెత్తకుండా చేస్తుంది. ప్రజలను మభ్యపుచ్చటానికి జాతీయ పునర్నిర్మాణానికి పెద్దపెద్ద స్కీములు వేస్తుంది. 'జాతి' మహోన్నత స్థితిలో వుండటానికి మానవులను 'బలి' గోరుతుంది. స్త్రీ మాతృదేవత అని పొగడుతుంది. ఎక్కువమంది బిడ్డలను కన్నతల్లిని గౌరవిస్తుంది. కాని స్త్రీ స్వాతంత్ర్యాన్నపేక్షించదు. బానిసత్వాన్ని అభివృద్ధి చేస్తుంది. క్రమశిక్షణ కావాలని వత్తిడిచేస్తుంది. అది నిరంకుశ విధానం. కనుక ఫాసిజం అనివార్యంగా యుద్ధానికి దారి తీస్తుంది. ఇది మనకు అనుభవం నేర్పిన గుణపాఠం.

ఇప్పుడు మనం పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో కొన్ని ప్రధాన లోపాలున్నవని, ఆ లోపాలమూలంగా ఫాసిజానికి పునాది ఏర్పడుతుందనీ తెలిసికొన్నాం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై విసుగుచెందిన ప్రజకు ఫాసిజం శరణ్యమవుతుందని, అది పూర్తిగా లోపభూయిష్టమైనదనీ, వ్యక్తిత్వపు విలువలకు ప్రాధాన్యత లేదనీ, యుద్ధాలకు అనివార్యంగా దారి తీస్తుందనీ గమనించాము. ఈ రెంటిని అధిగమించి మానవుడు ముందుకు పోవటానికి, అంతేగాక మానవుని అంతిమదశగూడా, కమ్యూనిజమేనని కొందరు చెపుతున్నారు. ఈ కమ్యూనిజం ఎంతవరకు ప్రజోపయోగమో పరిశీలిద్దాం.

కమ్యూనిజం లేక మార్క్సిజాన్ని మనం శ్రద్ధగా పరిశీలించాలి. కమ్యూనిజంలో వర్గానికి ప్రాధాన్యత ఇవ్వబడింది. ఆ వర్గంపేరుతో వ్యక్తిని త్యాగం చేస్తున్నారు. మానవుడు మానవుడుగా వుండడు; యంత్రంగా తయారవుతున్నాడు. ప్రతివిషయాన్ని వర్గదృష్టితో ఆలోచిస్తుంది, వర్గం లేక వ్యక్తి లేడంటుంది. ఇది నియంతృత్వానికి దారి తీస్తుంది. 'శ్రామిక' అనే విశేషణాన్ని చేర్చి నియంతృత్వాన్ని ఉదాత్తమైనదిగా కొనియాడుతుంది. వ్యతిరేకపార్టీ ఇంకొకటి వుండటానికి ఫాసిజంకుమల్లే ఇది కూడ సహించదు. కాని పెట్టుబడిదారీ ప్రభుత్వంలో కమ్యూనిస్టు ప్రచారం చేసికోవటానికి హక్కు వున్నదని వాదిస్తుంది. బూర్జువా వ్యతిరేకదృష్టితో ప్రతి విషయంలోను నియంతృత్వ ధోరణి నవలంబిస్తుంది. ఒక పార్టీ స్వాతంత్ర్యాన్నే సర్వమానవ స్వాతంత్ర్యంగా యెంచుతుంది. కాపిటలిజంలోవున్న ప్రతిదాన్ని నాశనం చేయాలంటుంది. సామాన్యంగా వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యాలను కూడ నిరోధిస్తుంది. 'ఉత్తమాశయాన్ని సాధించడానికి ఉత్తమసాధన అవసరం' అనే సూత్రాన్ని గుర్తించదు. సాధనం ఎటువంటిదైనా ఆశయాన్ని చేరటమే ప్రధానలక్ష్యమంటుంది.

వ్యక్తిమీద సంఘం పెత్తనం వహిస్తుంది. శ్రామిక నాయకత్వాన హింసాత్మకమైన తిరుగుబాటు జరగాలి. అలా జరిగితేనే నూతన యుగోదయమై భూతలస్వర్గం అవతరిస్తుంది. నిరంకుశత్వ సమాజంవైపు పురోగమిస్తుంది.

కమ్యూనిస్టు పద్ధతుల్లో విప్లవం నెగ్గేట్టయితే యథాస్థితివాదం అభివృద్ధి పొందుతుంది. నిర్మాణాత్మకంగా శక్తి కలిగిన కార్య నిర్వాహకసభలు, పెద్దపెట్టున అధికారాన్ని కేంద్రీకృతం చేస్తవి. కార్మికవర్గం సమాజంమీద నియంతృత్వం వహిస్తుంది. కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గంమీద నియంతృత్వం వహిస్తుంది. నాయకుడు పార్టీ మీద నియంతృత్వం వహిస్తాడు. అతడే నియంత. నిరంకుశత్వం

సుస్థిరం. ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ప్రసాదించినప్పటికీ వైజ్ఞానిక దాస్యాన్ని బలీయం చేస్తుంది.

కార్మిక నియంతృత్వాన్ని గూర్చి మార్క్సు చెప్పినదానికి ఈరోజున దానిని ఆచరిస్తూవున్నదానికి సంబంధం లేకుండా వుండటంకూడ కమ్యూనిజం పతనానికి కారణమైంది. మార్క్సు అభిప్రాయంప్రకారం ప్రతిపెట్టుబడిదారీ ప్రభుత్వం బూర్జువా నియంతృత్వం, అయితే, దానిస్థానే యేర్పడే ప్రభుత్వం కార్మిక నియంతృత్వం కావాలి. కాని ఈరోజున ఈ నినాదాన్ని స్వతంత్రాన్ని నిరాకరించేందుకు ఉపయోగిస్తున్నారు. స్వతంత్రాలోచనగల వ్యక్తులు ఆర్థికపునర్నిర్మాణానికి ఎక్కువగా తోడ్పడతారు. ప్రభుత్వం బలంగా వుండటానికి కూడ ఉపయోగిస్తారు. అందువల్ల ప్రజల్లో స్వతంత్రభావాలు రేకెత్తించాలి. కమ్యూనిస్టు ఉద్యమం స్వాతంత్ర్యఆశయంతో గనక బయలుదేరి వున్నట్లయితే, దాని కధికారం లభించినప్పటినుంచి స్వతంత్రభావాలను ప్రజల్లో పురిగొల్పి వుండేది.

అందువల్ల ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం స్వాతంత్ర్య శక్తులతో చేతులు కలుపుకొంటున్నదంటే ఆశ్చర్యం లేదు. స్వతంత్ర ఆలోచనలేని వ్యక్తు లున్నపుడు, కమ్యూనిస్టుసంఘానికి ఫాసిస్టు సంఘానికి భేదంలేదు. రెండు సంఘాలు ప్రజల జీవితాన్ని ఒక ప్లానుప్రకారం నడిపిస్తాయి. రెండింటిలోను నిరంకుశాధికారం కొంతమంది వ్యక్తులకు లభిస్తుంది. వారు అటు బూర్జువా వర్గానికో, శ్రామికవర్గానికో చెందినవారవుతారు. వీ రిద్దరికీ కొద్ది తేడామాత్రం వుంటుంది. వ్యక్తికన్న సంఘం గొప్పదంటుంది కమ్యూనిజం. వ్యక్తికన్న దేశం గొప్పదంటుంది ఫాసిజం. మార్క్సుజంలోని హిస్టారికల్ డిటర్మినిజం, కర్మసిద్ధాంతానికే దారితీస్తుంది. అందువల్ల కమ్యూనిజం ఇక పతనమైపోవటం తథ్యం.

ఈ విధంగా ఈరోజున సిద్ధాంతరీత్యా మార్క్సుజంలోని లోపాలు ఆచరణలో బయటపడినవి. ప్రధానలోపం కొందరు మార్క్సుస్టులు మార్క్సుజాన్ని సర్వకాలాలకు పనికివచ్చే సిద్ధాంతంగా పరిగణించి, దాని నొక మతంగా చేయటంవల్లనే కలిగింది. మార్క్సుజం మానవుని మేధస్సునుంచి జనించినదేనని, కాబట్టి దానిని మార్చుకోవటానికి మానవునికి స్వాతంత్ర్యం వుండాలని చాలమంది గుర్తించటంలేదు. దినదిన ప్రవర్ధమానమవుతున్న విజ్ఞాన సాయంతో మార్క్సుజాన్ని పరీక్షించాలి. మార్క్సువలన 'మానవుడు తన్ను తాను చేసికోగలడు.' అని స్పష్టంగా బోధపడుతుంది గదా! ప్రతి పనికీ మానవుడే కర్త. కాని ఏ దేవుడూ, ఏ మానవాతీతమైనశక్తి, అతనిని నడపటంలేదు. మార్క్సుజం ఒక తత్త్వశాస్త్రం. మార్క్సుకుముందున్న తత్త్వశాస్త్రం ప్రపంచాన్ని నిర్వచించటానికే ప్రయత్నించింది. మార్క్సుజం అంతకంటె ముందుకుపోయి మరో ప్రపంచనిర్మాణానికి పునాదులు వేసింది. నేటికీ కూడ యీ సిద్ధాంతం కొంతవరకు మంచిదే. కాని పైన పేర్కొన్నట్లుగా అందులోవున్న లోపాలు సవరించాలి. మార్క్సుజాన్ని గ్రుడ్డిగా నమ్మకుండా, ప్రస్తుతమున్న విజ్ఞానఅనుభవాల ద్వారా పరిస్థితులను అర్థం చేసికోవాలంటే మార్క్సుజంకంటె ముందుకు పోవాలి. మార్క్సుజంకంటె ముందుకుపోయి చూడగల తత్త్వశాస్త్రం ఏది?

ఒక శతాబ్దంక్రిందట మార్క్సు మానవునకు ఒక ఆదర్శాన్ని చూపించాడు. ఆ ఆదర్శం ఈనాడు కనుమాపుమేరలో వుంది. అందువల్ల అంతకన్నా దూరం ఆలోచించాలి. మానవుని అభివృద్ధికి అంతు అనేదిలేదు. ఎప్పుడయితే ఆర్థిక కొరవ దీరి సమృద్ధియేర్పడుతుందో అప్పుడు అభివృద్ధి అవిచ్ఛిన్నంగా సాగుతుంది. ఈ అభివృద్ధి విజ్ఞానరంగంలో సాగుతుంది. ఈదృష్టితో మనం మార్క్సును అధిగమించాలి. భవిష్యత్తులోని విజ్ఞానాభివృద్ధి సోషలిజంతో ఆగిపోకుండా చూడాలి. అందువల్ల స్వాతంత్ర్య ఆశయం విప్లవప్రాతిపదికైనదిగా వుండి సోషలిజం స్వాతంత్ర్యంలో భాగం కావాలి.

ప్రజలలో ఒకరికొకరికి సంబంధంలేకుండా విడి విడిగా వున్నంతకాలం అన్నివిధాలా, అనేక సమయాల్లో శక్తిహీనులుగా వుంటారు. వారికి చెందిన రాజకీయఅధికారాన్ని అమలుపెట్టటానికిగాని, రాజకీయ యంత్రాన్ని ఎల్లప్పుడు తమ అదుపు, ఆజ్ఞల్లోవుంచుకోవటానికిగాని ప్రజలకు సరైన మార్గాలు లేవు. శాసనసభల ద్వారానే అమలుజరుగుతున్న ప్రస్తుత ప్రజాస్వామ్యంలోవుండే లోపాలు అనుభవంవల్ల బహిర్గతమయినవి. స్వేచ్ఛావాదం తప్పుదారి పట్టించబడింది. అధికారాన్ని పూర్తిగా ప్రతినిధుల పరం చేయడంవల్ల ఈలోపాలు సంభవిస్తున్నవి. అందుచేత ప్రజాస్వామికం సజీవంగా వుండాలంటే అధికారం ఎప్పుడూ కూడ ప్రజలపరంగానే వుండాలి. ఎప్పుడో ఒకప్పుడు ఎన్నికల సమయంలోనే గాకుండా రోజువారీగా ఈ రాజకీయాధికారాన్ని ప్రజలు తమ చెప్పుచేతల్లో పెట్టుకొనటకు గాను కావలసిన పద్ధతులు, విధానాలు వుండితీరాలి. రాజ్యాంగం (*State*) సంఘంయొక్క రాజకీయవ్యవస్థ కాబట్టి కమ్యూనిజంక్రింద అది అంతరించిపోవటం వట్టి ఊహాగానమని అనుభవంవల్ల తేలిపోయింది. పరిశ్రమలను సంఘపరంచేసే ఆర్థిక ప్రణాళికలను అమలుపెట్టుటకు బలీయమైన రాజకీయయంత్రం వుండాలి. అట్టి యంత్రం ప్రజాస్వామికుల అధీనంలో వున్ననాడు ఈ క్రొత్తపద్ధతిలోనైనా, స్వేచ్ఛను కాపాడేహక్కును యిస్తుంది. ఉపయోగానికే ఉత్పత్తి చేసే యేర్పాట్లు రాజకీయ ప్రజాస్వామికం, వ్యక్తి స్వేచ్ఛ ఉన్నపుడే సాధ్యమవుతుంది. కనుక మనం మరో నవ్యపథాన పయనించాలి. నేటి ఆ నవ్యపథమే నవ్యమానవవాదం.

మానవవాదం అనే సిద్ధాంతం ఇంతకు ముందునుంచీవుంది. ఈమానవవాదంలో చాల లోపాలున్నవి. అఘటనఘటనా శక్తి ఒకటి వుందని నమ్ముతుంది. ఒకడే దేవుడు. ఆదేవుని సృష్టి అయిన మానవులం మనం అంతా సమానం. ఇది ఆ మానవవాదానికి ప్రాతిపదిక. ఇది మానవుణ్ణి అస్వతంత్రునిగా చేసింది. అందరూ సమానం అనేభావన భావనగానే వుండిపోయింది. కాని మనం చెప్పేది అలాంటి మానవవాదం కాదు. మనది శాస్త్రీయ మానవవాదం. ఈ క్రొత్తమానవవాదం ప్రకారం 'సమానత్వం' ఒకడు స్వాతంత్ర్యాన్ననుభవించటానికి వారుగు వానికి స్వాతంత్ర్యం అవసరం అనే సూత్రంమీద ఆధారపడివుంటుంది. స్వాతంత్ర్య జిగీష, సత్యాన్వేషణలమీదనే సంఘపురోభివృద్ధి ఆధారపడివుంటుంది. క్రమబద్ధమైన ప్రకృతినుంచి జనించినవాడే మానవుడు. కనుక మానవుడు హేతువాది, నీతిమంతుడు. సమాజము, రాజ్యాం

గము, ప్రభుత్వము, వర్గము, దేవుడు, మతము మొదలైనవి ఎన్నో శతాబ్దాలనుంచీ జరుగుతున్న మానవ జీవితపోరాటంలో పుట్టుకొచ్చినవే. కనుక వీటన్నిటినీ సృష్టించింది మానవుడు. కనుక మానవుడే స్రష్ట. ఇవన్నీ మానవసౌఖ్యం కోసరం నిర్మింపబడినవే. అవి సమాజ పురోభివృద్ధికి మైలురాళ్లు. సమాజాభివృద్ధికి ఇది చెప్పే నిర్వచనం పూర్తిగా క్రొత్తది. అందుకోసమే దీన్ని నవ్యమానవ వాదం అంటున్నాం.

ఫాసిజాన్ని, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, కమ్యూనిజములు అరికట్టలేకపోవటంచేత, సాంఘిక పునర్నిర్మాణానికై మానవవాదం (*New Humanism*) ఒక తత్త్వశాస్త్రంగా ఉద్భవించింది. ఏరూపంలో వున్నా నియంతృత్వం, నిరంకుశత్వాలను ఎదిరించేవారికి ఇది మార్గం చూపెస్తుంది. సామాజిక ప్రజాస్వామ్యాన్ని ఇది అంగీకరిస్తుంది. ఆర్థికప్రణాళికప్రకారం (*Co-opertive Economy*) నిర్మింపబడ్డ సాంఘిక వ్యవస్థలో వ్యక్తిస్వాతంత్ర్యం దీని ప్రధానాశయం. ఇది ప్రత్యేకించి ఒక వర్గంయొక్క తత్త్వశాస్త్రం కాదు. ఫాసిజంతో ఎట్టి సంబంధబాంధవ్యాలూ వుండవు. నియంతృత్వంతో ముడిపెట్టుకొన్న కమ్యూనిజానికి ఇది దూరంగా వుంటుంది. మానవఅభివృద్ధిని, వ్యక్తిగతంగా మానసికాభివృద్ధిని కాంక్షిస్తుంది. సంపూర్ణంగా వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యాలుగల — ప్రణాళికాబద్ధమైన ఆర్థిక సమాజంలో—ప్రజాస్వామిక సూత్రాలమీద విశ్వాసం కలిగివుంటుంది. వోటర్ల ప్రజాకమిటీలద్వారా సేకరించి అసెంబ్లీ వర్గైరాలను ఎన్నుకునిపంపే ప్రజాప్రతినిధులను, ఆ కమిటీలకు బాధ్యులను చేస్తుంది. సహనము, వ్యతిరేకించుటకు హక్కు, స్వేచ్ఛగా విమర్శించుకొనుటకు వివేకవంతమైన రాజకీయ విద్యావిధానమును ప్రబోధించును. ప్రజాస్వామిక సూత్రాలు కేంద్రీకరించబడతై. ప్రతివిషయంలోను మూలంనుంచి బాగుచేస్తుంది. "ప్రజాస్వామికం క్రిందినుంచి రావాలి. సూక్తికన్న ఆచరణ ప్రధానం" అనే ఉదాత్త ఆశయాలను నమ్మి పనిచేస్తుంది.

ఒక పార్టీ నియమావళికి ఒక మతసాంప్రదాయానికి భేదం లేదు. మతంకూడ వ్యక్తి బాగునే ఉద్దేశిస్తుంది. అయితే ఆ బాగును వ్యక్తి తనలోని లోపాలను దిద్దుకొని తన శక్తులను అభివృద్ధిచేసికోవడంద్వారాగాక తనకన్న అతీతమైన ఏదో ఒక శక్తిని కొలవడంద్వారా సంపాయించుకోవాలని మతాలంటవి. కొన్నిమతాలు విగ్రహారాధనను ఒప్పుకోం అంటూ ఏదో ఒక రకమగు శక్తిని నిరాకారంగానో, సాకారంగానో కేంద్రీకరిస్తవి. అట్లాగే రాజకీయ పార్టీలుగూడ ఆరంభంలో వ్యక్తి బాగునే ఆశిస్తవి. కాని రాచరణలో ఆ బాగు వర్గశ్రేయస్సులోనో, దేశశ్రేయస్సులోనో మిళితమై మొదటి ఆశయం అంతరించిపోయి రాజకీయాలంటే అధికారంకోసంచేసే వ్యక్తిగత పెనుగులాట అనే నిర్ణయానికి వస్తవి.

స్వేచ్ఛాయుత మానవసంఘాన్ని సృష్టించాలంటే-ఆ సృష్టి, పార్టీ రాజకీయాలను-ఆర్థిక పునర్నిర్మాణాన్ని మించిపోవాలి.

మానవుని సౌఖ్యాన్ని ఎక్కువ చేసికోవటానికే ఈ సిద్ధాంతాలన్నీ ఏర్పరచుకోబడ్డవి. కాని సిద్ధాంతాలను మతాలుగాచేసి కూర్చోబెట్టడంవల్ల అవి అభివృద్ధినిరోధకాలుగా తయారైనవి. కనుక ఏసిద్ధాంతమూ సర్వకాలాలకూ పనికిరాదని, ఎప్పటికప్పుడు విజ్ఞాన, అనుభవాలతో సరిదిద్దుకొంటూపోవాలి. అలా కానినాడు అవి మానవజాతి పురోభివృద్ధికి తోడ్పడవు.

ఇదీ నేడు మన చుట్టూవున్న రాజకీయ సిద్ధాంతజగత్తు.

—

# ఉగాది



శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వర శర్మ

చ. చూతకిసాల సంగత ప్రసూనవన స్మదచంచరీకని
ష్పీతమరందధారలు వశీకృత చంపకగంధబంధుర
వ్రాతనితాంతగీతికలు రమ్యపురోపవనప్రచారని
ష్ణాత పురాంగనాచరణసక్త రజోమిళితమ్ము లీ వనుల్.

శారదకోకిలాకరుణ జల్పిత కల్పిత పాంథకామినీ
స్మేర కపోలదర్పణసమేతలసత్పులకాంకురమ్ము వి
స్తారసరోవర జ్వరవిదారిత కోకకులమ్ము చైత్రమా
కారముఁ దాల్చె నామదిఁ బ్రకాశ మొనర్చె నుషస్సు వ్యోమమున్.

వారణదంతనిర్మల ప్రవాహనదీనద సంతతస్థల
త్సారస దంపతీనివహ తర్పితలోచన వామలోచనా
వారసుహాస భాసుర నవారుణబింబ సమర్చనావల
త్కార వసంతవాసరమతీతముగా బొనరించె సంధ్యయున్.

చాలిత మాలతీ విటపశాఖల రక్తపలాశకోరక
జ్వాలిత కామినీ హృదయవల్గిత మర్మములన్ నిరంతర
క్ష్వేళిత నీలకంఠపరికీర్తిత మన్మథరాజసద్యశో
జాలముల న్మధుప్రవణసాదిత కామి జయమ్ము దోచెడిన్

కాలగళుల్లి ష్టయాంకముల గాఢతమాలరమావిమానిత
శాలిత పౌరయోషిత విశాల లసత్కబరీచయమ్ములన్
బాలమృణాలినీతులిత బాహులతావలయ ప్రసూనహానో
న్మీలిత విప్రలబ్ధపరిణీతము చైత్రము మించు సామ్యతన్.

కలమప్రరోహసంచయ ప్రకాశిత పౌషవసంతసంగమ
స్ఖలిత దిగంతరాళము సుఖాంకుర సంకుమదప్రసార ని
ర్గళిత కుచాంతరమ్ము నవగాంగజలస్రుతి రంజితేందు పే
శల కమనీయ శంకరవిశాలకపర్దముఁ దోచు మాఘమున్,

తెలతెల దు ల్పురోపవనవీథుల సాధుశిరీషయుక్త సా
కలలిత శీకధారులయి సాగత నవ్యవసంతవేళలన్

కలియుదు రాత్రి ధూర్తవిట నాగర సంఘముల న్మదంబునన్
స్ఖలకమలి న్యదాహృతపద ల్మదిత ప్రుధిరారుణాధరల్.

మధుమధురారవంబు ల సుమాళముగా వచియించు గాముకీ
ప్రథిత నయానుకూల రుచిర శ్రుతిరమ్య గృహాంగణమ్ములన్
శిథిలిత మానమానినుల శేఖరనిస్రుత మల్లికాంకుర
స్వధ వహియించి రుత్సుకవసంతసమేధిత చిత్తు లీవిటుల్.

కరుణవిలాసినీమృదుల గండగళ స్నవచందనార్ద్రముల్
వరుణ పురాంగనామధుర వర్తుల చారుకుచాగ్ర పత్రముల్
స్మరతరుణీకలస్వన ప్రశాంత మనోనవయావతశ్రవ
జ్వరములు వాసరమ్ములు రసారమణీనవదోహదమ్ములున్.

శామంతీ సుమసౌరభప్రభల విస్తారప్రభావోదయ
శ్యామాగ్రప్రథిత స్తనస్తబక నిశ్వాసంబులన్ వారుణీ
రామాంగమ్ముల వామలోచనలు మర్యాదాలన స్మధ్యలై
యామన్యందలరింపఁ బామరుల నాయాసంబుమాన న్వెసన్.

కమలి న్యభ్యుపయానమం దరుణసంక్రాంతి న్బ్రతీక్షించుచున్
రమచన్దోయిఁ బదమ్ముల న్నిలిపి వారంవారము న్నాట్యమున్
రమణుం జేర్పడ సల్పె నప్పుడు నుమాప్రాణేశచిత్తాబ్జ భృం
గముగా మన్మథుఁ జేసెఁ దూపులఁ బ్రియాంగమ్ము ల్జెడ న్మెప్పునన్.

పాతాళాంతరవాసఖేద మవశంబై దోప దర్వీకర
వ్రాతమ్ము ల్బరిపాలన మొ్మనర నేరం జాలకే తేరు చొ
ప్పై తళ్కొత్తు బురాంగనాకబరసంభారంబు శోభిల్లు స
త్ప్రాతిప్రత్యవిషాగ్నిధూమపటలీ తౌల్యంబున న్మత్సరిన్.

శ్రమ నందు న్మదగండయుగ్మకము విశ్వాసమ్మున న్బాహువుల్
సమయించు న్దపతేజమున్ స్తనయుగస్థానమ్ము బల్మారువ్యు
త్క్రమమై సంక్రమణు న్నతించు రజనీరాగమ్మునందు న్గనుల్
మమత న్జేరును బాదముల్జలముఁ బ్రేమ న్సౌరభద్యోతమై.

ఆవిర్భావమునందె సంగత వసంతారామధారేయ వి
ప్రావాసమ్ముల నావృతమ్మయి రమాప్రాణేశు నర్చ ల్సర
ప్రావారమ్ములు పండులై కొలిచిర ఖ్యాసమ్మునన్ మాధవ
గ్రైవేయమ్ము వసంతమున్ కమలసంఘ మ్ముల్లసిల్లె న్వెసన్.

అవనతశీర్షుఁడై మదనుఁ డర్ధనిమీలితనేత్రుఁడై నిలిం
పవనకుమారుఁ జేసె శరఘారము రాధనమేధితమ్ముగన్
రసికులసోము నుత్సవములందు ననహ్యసమారయుక్తుఁడై
యువనిజయుండచండములు కశ్చరలేమలు సాటియే? కహిన్.

---

# ప్రయివేటువ్యాపారము - ప్రభుత్వ కంట్రోలు



శ్రీ మోచర్ల దత్తాత్రేయులు

ప్రయివేటు ఆసాముల వ్యాపార సంస్థలమీద ప్రభుత్వపు కంట్రోలును వర్తింపజేయవలెననే భావము యించుమించు యిటీవలి కాలములో ఉద్భవించినదే. మన దేశములో ప్రయివేటు వ్యాపార సంస్థలను ప్రభుత్వము కంట్రోలు చేయవలెనను సంకల్పము గత ప్రథమ ప్రపంచ సంగ్రామమునాటివరకు మన దేశములో కలుగవలసిన అగత్యమే లేదు. అందుకు కారణమేమనగా మన దేశములోని పరిశ్రమ లింకను అప్పటికి స్థిరముగా నెలకొని వేరుపారియుండలేదు. అప్పటికి అమలులోనున్న ప్రయివేటు వ్యాపార పరిశ్రమ లేవైన ఉన్నయెడల అవి బ్రిటిష్ వ్యాపార సంస్థల చేతులలో నుండెను. ఈ బ్రిటిష్ వ్యాపార సంస్థలు దేశసంపదను యథేష్టముగా హరించివేయుటకు సమృద్ధిగా అవకాశమొసంగబడెను. ఆనాటి రైల్వే కంపెనీలమీద అప్పటి ఇండియా ప్రభుత్వము చలాయించిన కంట్రోలు అధికారమువంటి అధికారము, ఆ కంపెనీలలో తమ ద్రవ్యమును పెట్టుబడిపెట్టిన బ్రిటిష్ పెట్టుబడిదార్లకు లాభకరముగా, వ్యాపారస్థుల శ్రేయస్సును కోరి చలాయింపబడెను. కాని, కాలక్రమేణ యీ రైల్వే కంపెనీల వంటి ప్రయివేటు వ్యాపార సంస్థలతో ప్రభుత్వమునకు ఏర్పడిన ఒడంబడికలలోనే ఒక షరతుకూడా చేర్చబడెను. ప్రభుత్వమునకు యిష్టమైన ఒక తేదీనాటికి ప్రభుత్వమే తమకు యిష్టమైతే ఆ వ్యాపార సంస్థలను తీసికొని దఖలుపరచుకోవచ్చునను షరతు చేర్చబడెను.

ప్రభుత్వము తమ యిష్టానుసారంగా ఏ తేదీనాటికి ఆ వ్యాపారసంస్థలను దఖలుపరచుకోవచ్చునని వ్రాసికోబడెనో, ఆ తేదీ గడువువచ్చేసరికి, కాలచక్రము తిరిగిపోయింది. అభిప్రాయాలు కూడ మార్పు చెందుటవల్ల రైల్వేల నన్నింటిని ప్రభుత్వమే వశపరచుకొనుటతో వ్యవహారం సమాప్తమైంది. ఈ విధంగా ప్రయివేటు పెట్టుబడిదారుల వ్యాపార మండలము చాలావరకు ప్రత్యక్ష ప్రభుత్వాయత్తమైనది.

ఆయుధములను మందు గుండు సామగ్రులను తయారు చేయుటలో భారతీయ వ్యాపారస్థులను బ్రిటిష్‌వారు నమ్మజాలకపోయిరి. అందువల్ల తుపాకీ తోటాలను మందుగుండు సామగ్రులను తయారుచేసెడి ఫ్యాక్టరీలను, యీ దేశములో ఉన్నటువంటి వానిని, ప్రభుత్వమే నిర్వహించుచుండెను. అందువల్ల రైల్వేలను, జలపాత విద్యుదుత్పత్తి ప్రతిష్ఠాపనలను, మందుగుండు తయారు చేయు ఫ్యాక్టరీలను, అటువంటి మరికొన్ని యితర యంత్రప్రతిష్ఠాపనలను ప్రభుత్వమే స్వాధీనపరచుకొనుటకు సిద్ధపడిన సందర్భములో ప్రయివేటు వ్యాపార సంస్థలకును, ప్రభుత్వమునకును మధ్య వివాదసంఘర్షణ మేమియు కలుగలేదు. మొదటి ప్రపంచ సంగ్రామానంతరము కొన్ని పరిశ్రమలకు మనదేశములో యుద్ధకాలమునాటి గిరాకీవల్ల స్థిరస్థావర మేర్పడినది. అప్పుడు యీ పరిశ్రమలను ప్రభుత్వము భుక్తపరచుకోవలెననే సమస్య ఆలోచనలోనికి వచ్చినది. క్రొత్తగా తలయెత్తుచున్న కొన్ని యంత్రాగార పరిశ్రమలకు చౌక విదేశీ సరకుల దిగుమతివల్ల పోటీ రాకుండుటకై సంరక్షణ కావలెనని యీ నూతనావిర్భూత పరిశ్రమలు ఆందోళన చేయసాగెను. పోటీగా దిగుమతియగు విదేశీ సరకులకు హెచ్చుగా దిగుమతి సుంకములను ఎంతమేరకు విధించవలెనో నిర్ణయించుటకై సుంకవిచారణకమిటీ సూచించిన ప్రకారముగా సుంకనిర్ణయమండలి యొకటి ఏర్పాటుచేయబడెను. ఈ సుంకనిర్ణయమండలి ఆయావిదేశీసరకు దిగుమతులమీద ఎంతమేరకు దిగుమతి సుంకములను విధింపవలెనని సలహా యిచ్చుచుండెనో ఆ సలహా ఆయాకాలానుగుణముగా గవర్నమెంటు ఆమోదించినంతమేరకు అమలు జరుగుచుండెను. ఒక ప్రత్యేక పరిశ్రమయొక్క సంగతి సందర్భములనుగూర్చి ప్రభుత్వము పరిశీలించుటకు పూనుకొని, ఆ పరిశ్రమకు రక్షణనుగాని సహాయమునుగాని కలుగజేయవలెనని సంకల్పించిన సందర్భములో, ఆ పరిశ్రమవిషయమై ఏదోఒకవిధమైన కంట్రోలును అనగా నిర్వహణాధికారమును ప్రభుత్వము తప్పకుండా విధిగా వహిస్తుంది. కనుక యీరీతిగా, మన దేశములోని ప్రయివేటు వ్యాపార పరిశ్రమలమీద ప్రభుత్వ నిర్వహణాధికారము ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని చలాయింపబడుట మొదటి ప్రపంచసంగ్రామానంతరము సంభవించినది.

రెండవప్రపంచ సంగ్రామకాలములో అదివరకు మామూలుగా సప్లయిఅగుచుండిన ఆయా ఫ్యాక్టరీల తయారు సరకుల సరఫరా క్షీణించినందువల్ల యుద్ధావసరములకు సంబంధించిన జరూరు సప్లయిలకుగాని, దేశంలోని ప్రజావసరములకుగాని, సరిపోవునట్లుగా, దేశములోని సాధనసంపత్తిని వినియోగించుకొనలేనటువంటి అసమర్థత యొకటి రెండవప్రపంచ సంగ్రామకాలమందు బాగా వ్యక్తమైనది. అందువల్ల ప్రజలలో ఉత్సాహాభినివేశములను పురిగొల్పుటకు ప్రభుత్వము పూనుకొనవలసి వచ్చెను. యుద్ధానంతరము దేశభవిష్యత్తు దివ్యముగా నుండగలదనియు, దేశము సర్వసమృద్ధముగా సుభిక్షముగా నుండగలదనియు ప్రజను ప్రబోధించి ఉద్బోధించాలి. యుద్ధానంతరము దేశము అనేకవిధములుగా అభివృద్ధిపొందగలదనియు, దేశవస్తుసంపదను అత్యంత పరిమితివరకు వినియోగించి ప్రజల లాభైశ్వర్యములు వృద్ధిచేయబడుననియు తద్వారా, ప్రజలకు ఉచ్చస్థాయిలో సుస్థిరమైన ఉపాధులు కల్పింపబడుననియు ప్రచారముచేసిరి. ఇందుకొరకై ఇండియా ప్రభుత్వము ప్లానింగు కమిటీలను అనగా ఆర్థికాభ్యుదయ పథకనిర్ణయ సంఘములను ఏర్పాటుచేసిరి. వేర్వేరు రాష్ట్రప్రభుత్వములు కూడా [illegible] వంటి ప్లానింగుకమిటీలను నియమించవలెనని ఉత్తరువు చేసిరి. రాష్ట్రప్రభుత్వములున్నూ కేంద్రప్రభుత్వమున్నూ మూడునాలుగేండ్లవరకు కృషిచేసి ఆర్థికాభ్యుదయము నిమిత్తమై అనేక పథకములను తయారుచేసెను. భారతదేశంలోని వ్యాపార శిఖామణు లందరు కలిసి 15 సంవత్సరములలో రూ 10 వేల కోట్ల మొత్తమును వినియోగించుటకై ఒక పెద్ద పథకమును తయారు చేసిరి. చిన్నరకమువారు కూడా అనేక ఆర్థికాభ్యుదయ పథకములను తయారుచేసిరి. ఆ రోజులలో దేశాభివృద్ధిపథకముల గూర్చిన గ్రంథసంపుటి చాలా వెలువడింది.

ఇండియా గవర్నమెంటు పారిశ్రామికాభివృద్ధివిషయములో తమ భవిష్యద్విధానమును నిర్వచించుచు 1945 సంవత్సరములో ఒక ప్రకటన చేసియుండిరి. పారిశ్రామిక సంస్థలయందు ప్రభుత్వము ఎంతవరకు పాల్గొనగలదో యీ ప్రకటనలో నిర్వచింపబడెను. విమాననిర్మాణము మోటారుకారుల నిర్మాణము ట్రాక్టరులు, రసా

యనిక ద్రవ్యములు రంగులు, ఇనుము ఉక్కు రహదారీ శకటములు విద్యుద్యంత్ర పరికరములు, యంత్రములు, యంత్రముల పనిముట్లు, విద్యుత్ప్రదకరసాయనద్రవ్యములలో యినుము లేని యితర లోహములు ముద్ద సరుకును తయారుచేయుటకు సంబంధించిన కొన్ని మూలపరిశ్రమలను నెలకొల్పుటకు ప్రయివేటు వ్యాపారస్థులు తగినంత పెట్టుబడి ద్రవ్యంతో ముందంజ వేయనియెడల యీ పరిశ్రమలను ప్రభుత్వాయత్తముచేయుట జరుగును. తదితరములైన ఆయాపరిశ్రమలన్నియు వేర్వేరు స్థాయీభేదములలో ప్రభుత్వపు కంట్రోలునందు ఉంచబడి, ప్రయివేటు వ్యాపారసంస్థల తాలూకు పరిశ్రమలుగానే సాగుచుండగలవు. ఈ ప్రయివేటు వ్యాపార సంస్థల తాలూకు పరిశ్రమలయందు కార్మికులకు న్యాయమైన జీవనవసతు లుండునట్లుగా చూచుచుండుటకును, యితర వ్యాపార సంస్థలతో పోటీ నిరాటంకముగా నుండునట్లుగా చూచుచుండుటకును ప్రభుత్వము తన కంట్రోలు అధికారమును చలాయించుచుండును. నౌకానిర్మాణము, రైలు ఇంజనులు బాయిలరుల నిర్మాణము యీ సంబంధమైన ప్రధానదేశావసర పరిశ్రమలు మాత్రము ప్రభుత్వముచేతను ప్రయివేటు వ్యాపారస్థులచేతను కూడా నిర్వహింపబడుచుండగలవు. ప్రభుత్వప్రతిష్ఠాపనలు మాత్రము ప్రభుత్వముచేతనే నిర్వహింపబడవచ్చును. లేదా కొన్ని పబ్లిక్ నిర్వాహక సంఘములచేత నిర్వహింపబడవచ్చును. 1945 సంవత్సరములో అప్పటి ఇండియాగవర్నమెంటుచే మొట్టమొదటగా యీ విషయమై చేయబడిన ప్రకటన యిది. ఈ ప్రకటనమూలంగా దేశములో అందుకు వ్యతిరేకమైన ఆందోళనగాని అధిక్షేపణగాని విశేషించి ఏమియును పరిస్ఫుటము కాలేదు.

దేశముయొక్క ఆర్థికాభ్యుదయమునకై బాహుళ్యమైన పథక మొకటి తయారుచేయబడిన సందర్భములో, మునుముందేర్పడు పరిశ్రమలమీదనేగాక, ప్రస్తుతము అమలునందున్న పరిశ్రమలమీద కూడా ప్రభుత్వముయొక్క కంట్రోలు తరతమ భేదంగా వర్తించుచుండునన్న భావం అంతర్గతంగా ఉంది. ఎందుచేతనంటే, ఒక ఆర్థిక లక్ష్యమును సాధించుటకై దేశసంపదనంతను సక్రమంగా వినియోగించి నిగ్రహించవలసియుండును. దేశమధ్యంలోను బయటను గిరాకీ ఉన్నటువంటి ప్రజాసామాన్యానికి వినియోగపడు ఏ వస్తుసంబంధ పరిశ్రమనైనను ఉదాహరణార్థం పరిశీలించి చూడండి. ఆ వస్తువులు దేశమధ్యంలో ప్రజలకు ఎక్కువ అవసరమైనవని ప్రభుత్వానికి తెలిసినప్పటికీ, ఆ వస్తువులనే యితర దేశాలకు రవాణాచేసి విదేశీయులకు అమ్మివేయుటవల్ల ఆ విదేశద్రవ్యం సమృద్ధిగా లభించగలదనియు, ఆ ద్రవ్యంతో ఆయావిదేశాలనుంచి యంత్ర సామగ్రులను కొనుక్కోవచ్చుననియు తద్వారా యితర దేశపరిశ్రమల వృద్ధిచేయవచ్చుననియు, ప్రభుత్వము ఉద్దేశించి ఆ ప్రకారంగా విదేశాలకు ఆ సరకును రవాణా చేయవచ్చును. అందుమూలంగా ఆ సరకు దేశమధ్యంలోని ప్రజలకు అలభ్యము చేయవచ్చును.

ప్రయివేటు వ్యాపారసంస్థలమీద ప్రభుత్వముయొక్క కంట్రోలు అవసరమనే విషయము యీ ఉదాహరణమునుబట్టి బోధపడుచున్నది. ఏ పరిశ్రమలు దేశములో ముఖ్యముగా జరూరుగా ముమ్మరంగా విస్తరించవలెనో, అట్టివానికే ప్రభుత్వము అగ్రగణ్యత నొసంగి, అట్టివానినే నెలకొల్పి ప్రారంభించవలెను. ఏవ్యాపారస్థుడైనను ఒకానొక పరిశ్రమను తాను ప్రతిష్ఠించి అపారలాభములను వెంటనే పొందవచ్చునని ఆశించినప్పటికీ, అట్టి అవకాశము అతనికి లేకుండా ప్రభుత్వము అడ్డగించవచ్చును. మన ఆర్థికాభ్యుదయపథకమును నిర్ణయించెడి అధికారవర్గము తయారుచేసిన ఆయాపరిశ్రమల జాబితాలో అత్యవసరమైన పరిశ్రమలకు అగ్రస్థానము నొసంగును. అట్టి అగ్రగణ్యతగల పరిశ్రమల పట్టికలో చేరనటువంటి ఒక పరిశ్రమను నెలకొల్పవలెనని ఒక వ్యాపారస్థ కంపెనీని స్థాపించదలంచి అనుమతికై దరఖాస్తు చేసికొనినయెడల, పెట్టుబడివాటాల కంట్రోలరు ఆ దరఖాస్తును పరిశీలించును. ఈ వ్యాపారపు కంపెనీ ఏప్రయోజనమునకై ఏర్పడుచున్నదో పరిశీలించి, ఆ పరిశ్రమను నెలకొల్పుటకు అనుమతిని నిరాకరింపవచ్చును. ఆయాపరిశ్రమలను ప్రతిష్ఠించుటవల్ల ప్రజలకు ప్రభుత్వానికికూడా అత్యధికశ్రేయోలాభము చేకూరునట్లుగా పారిశ్రామిక వ్యవహారవిధానము ప్రభుత్వము సక్రమముగా నిగ్రహించవలసియున్నది. అట్టిది కూడదని ఎవ్వరూ వాదింపజాలరు. ఈవిధంగా గత 30 లేక 35 సంవత్సరములకాలములో మన ఊహాధోరణి చాలావరకు మారిపోయినది. ఆర్థిక వ్యవహారరంగములో వ్యక్తుల వ్యాపార స్వాతంత్ర్యమునకు అవరోధములను కల్పించెడి అనేక ప్రభుత్వచర్యలు ప్రయివేటు ఆసాముల హక్కులకు ప్రతికూలములు కావనెడి భావము ఏర్పడినది.

మన దేశమునకు స్వాతంత్ర్యము రాగానే, మన దేశములోని పారిశ్రామికులును, పెట్టుబడిదారులును, విదేశాలలోని పారిశ్రామికులును పెట్టుబడిదార్లను భవిష్యద్భారతదేశాభివృద్ధి పథకములో తమ ఉత్తరగతి ఏమిటని తెలిసికొనగోరుచున్నారు. భారతదేశ స్వాతంత్ర్యమునకై కాంగ్రెసు మహాసభ ఆందోళన సాగించిన దినములలో, మన దేశ ప్రజలలోని అన్నివర్గములవారికిని నిండైన వాగ్దానములు చేయబడెను. దేశానికి స్వాతంత్ర్యం రాగానే కార్మికునకు కడుపునిండా భోజనం లభించగలదన్నారు. వ్యవసాయదారునకు సరసమైన ధరలు పంటసరకులకు లభించగలవన్నారు. యంత్రాగార పరిశ్రమలుగలవారికి కావలసిన ప్రభుత్వ సహాయ సంపత్తి లభించగలదన్నారు. ప్రజల కందరికి ఉద్యోగాలు ఉపాధులు కల్పించబడు నన్నారు. బాగా అభివృద్ధిచెందిన రాజ్యాలలో ప్రజలకుగల సౌకర్య సదుపాయములు సమకూర్చబడు నన్నారు. సామాన్యపౌరుని శ్రేయస్సుకై ప్రభుత్వము వహించవలసిన శ్రద్ధ యావత్తు వహించగలదనిరి. సామాన్యపౌరుని క్షేమాభివృద్ధికి ప్రతికూలములైన హక్కులేవియును పవిత్రప్రమాణములుగా శిరసావహింపబడవని చెప్పిరి.

కాంగ్రెసుసంస్థ దురవస్థలపాలై ప్రాకులాడుచుండినంత కాలము ఆ రీతిగా చేయబడిన వాగ్దానములను వాటివల్ల బాధితులయ్యెడివా రెవ్వరూ స్థిరప్రమాణంగా స్వీకరింపలేదు. కాని కాంగ్రెసుపార్టీ అధికారంలోనికి వచ్చినపిమ్మట, నూతన ప్రభుత్వ విధానంలో ఆయా బాధిత వర్గములవారు తమ ఉత్తరగతి ఏమిటో తెలిసికొనుటకై దానిని నిర్ధారణగా నిర్వచింపవలెనని కోరిరి. బ్రిటిష్ గవర్నమెంటుతో కాంగ్రెసు పోరాటమును సాగించుచున్నంతకాలము, విదేశీయుల విషయములలో వారి స్వలాభ ప్రయోజనములను కాంగ్రెసుపక్షమువారు త్రోసివేసి తృణీకరించుచునే యుండిరి. కాంగ్రెసు పరిపాలనాధికారములో స్వతంత్ర భారత రాజ్యములో తమ పరిస్థితి ఏమిటియని వీరు సహజంగా ప్రశ్నించుచునే యుండిరి. వారికి గల హక్కుభుక్తములవిషయములలో కాంగ్రెసుప్రభుత్వము జోక్యము కలుగజేసికొనదు అని విదేశీ పెట్టుబడిదారులకు అప్పుడప్పుడు అభయహస్త ప్రకటనలను చేయుచునే యుండిరి.

అంతేకాదు, భారతదేశపరిశ్రమలను పెంపొందించుటకై విదేశీ పెట్టుబడిదారులు ఇంకను మరికొంత ద్రవ్యము యీ దేశములో పెట్టుబడిపెట్టియెడల వారివిషయములో ప్రత్యేకాదరణ చూపబడునని కూడ వాగ్దానము చేసిరి. కాని భారతదేశములోని ధనికవర్గములకు తృప్తికలుగలేదు—భారతదేశములోని యీ ధనికవర్గములు యుద్ధకాలములో ఆకస్మిక లాభైశ్వర్యములను గడింప

వీలైనమార్గములను పన్నులను చెల్లింపక తప్పించుకొను మార్గములను నేర్చుకొనియుండిరి. అతి రహస్యంగా నిల్వచేసిన గుప్తద్రవ్యమును క్రొత్తవ్యాపారసంస్థలయందు వినియోగించుటకు వారు సమ్మతించుటలేదు. చాటుగా దాచిన ద్రవ్యమును దేశపరిశ్రమాభివృద్ధికై వారు పెట్టుబడిపెట్టుటకును వినియోగించుటకును వెనుకాడుట కొక కారణమును చెప్పుచున్నారు. ఉత్తరోత్తర గవర్నమెంటువారు ఏ వ్యవహారధోరణిని అనుసరింతురో, అందుమూలంగా యీ వ్యాపార పారిశ్రామికులస్థితి ఏమగునో, తమకు బోధపడుట లేదనియు, అందువల్లనే, పరిశ్రమాభివృద్ధికై తమ ద్రవ్యమును పెట్టుబడి పెట్టుటకు సాహసించుటలేదనియు సమాధానము చెప్పుచున్నారు.

ఈ సమస్యకు సంబంధించిన ముఖ్యసారాంశములను అన్నింటిని ఇండియా ప్రభుత్వము జాగ్రత్తగా పరిశీలించినమీదట, దేశ పరిశ్రమాభివృద్ధి విషయములో తాము అనుసరింపదలచిన వ్యవహార విధానమును క్రోడీకరించుచు 1948 ఏప్రిలు 6 తేదీని ఒక తీర్మానము చేసిరి. ఆ తీర్మానములో వెనుకటివలెనే యీ క్రిందివిధంగా నిర్వచించిరి. బొగ్గుగనులు, ఇనుము ఉక్కు సామానులు, విమానాల నిర్మాణము, నౌకానిర్మాణము వగైరా మూలపరిశ్రమలు మాత్రము పూర్తిగా ప్రభుత్వపరిశ్రమలుగా నుండగలవు కాని, ప్రస్తుతము అమలులోనున్న పారిశ్రామికసంస్థలను పది సంవత్సరములవరకు యథాతథంగానే ఉంచి, పది సంవత్సరముల యనంతరము ఈ పరిశ్రముల పరిస్థితులన్నియు ఒకమారు పునరాలోచన చేయబడును. మోటారుకార్లు, ట్రాక్టర్లు, భారీయంత్రాలు, వస్త్రాలకు సంబంధించిన మరికొన్ని మూలపరిశ్రమలు ప్రభుత్వముయొక్క సన్నిహిత పర్యవేక్షణలో నిర్వహింపబడుచుండును. ఇక గృహపరిశ్రమలను భారీప్రమాణంలో సాగుచుండే పెద్ద పరిశ్రమలతో సమన్వయించి వాటికి తోడ్పాటుగా సాగించవలెనని పారిశ్రామిక మహాసభ సూచించిన సలహాను గవర్నమెంటు ఆమోదించినది.

దీని తర్వాత ఆలోచింపబడిన సమస్య ఏదనగా, పెట్టుబడిదార్లను, కార్మికులును ఆయా పరిశ్రమలవల్ల పొందదగిన లాభ ప్రతిఫల విషయమైయున్నది. ఈ విషయములో 1947 సంవత్సరము డిసెంబరులో జరిగిన పారిశ్రామిక మహాసభ చేసిన తీర్మానమును గవర్నమెంటు ఆమోదించెను. ఈ తీర్మానములో చెప్పబడిన దేమనగా, కార్మికులకు సక్యమైన వేతనములను లభింపజేసినపిమ్మట పెట్టుబడి దార్లకు న్యాయమైన ప్రతిఫలమును ప్రత్యేకించినపిమ్మట, పరిశ్రమను నిర్వహించుటకును ఉత్తరోత్తర పెంపొందించుటకును సమంజసమైన మొత్తమును మూలనిధిగా ప్రత్యేకించవలెను. ఈ తీర్మానమును ఆచరణలోనికి తెచ్చుటకై పరిశ్రమల సలహాసంఘములను కేంద్రమునందును రాష్ట్రములందును గవర్నమెంటువారు నియమించిరి.

ఇక, భారతదేశ పరిశ్రమలను సాగించుచున్న విదేశీయ పెట్టుబడిదార్ల విషయములో గవర్నమెంటు తెలియజేసిన అభిప్రాయమేమనగా అట్టి పరిశ్రమలు దేశక్షేమ లాభములకై నిర్వహింపబడునట్లుగా వానిని నిగ్రహించుటకు కావలసిన అధికారమును ప్రభుత్వమున కొసంగెడి చట్టములను తయారుచేయగలమని తెలియజేసిరి. అయితే, అట్టి పారిశ్రామిక సంస్థలందు అధికారస్వామ్యముగాని నిర్వహణాధికారముగాని అధికభాగము భారతీయులకై యుండవలెను.

1948 సంవత్సరములో ప్రభుత్వము యీ సంకల్పప్రకటన చేసిన తోడనే మనదేశ పారిశ్రామికులు ఇండియాప్రభుత్వముమీద ధ్వజమెత్తుటకది కారణమాత్రమయినది. దేశపరిశ్రమాభివృద్ధికి కలిగిన ప్రతి అవాంతరమునకును ప్రభుత్వధోరణియే కారణభూతమని వాదింపజొచ్చిరి. కార్మికవర్గము సర్వసామాన్యముగా సందర్భావసరమునుబట్టి పోతూఉంటుందిగాని, యుక్తాయుక్త పరిజ్ఞానమునుబట్టికాదు. అందువల్ల ప్రభుత్వము చేసిన తీర్మానమునుబట్టి తమ సమ్మెలద్వారా వస్తూత్పత్తిని నిరోధించుటకు మంచి అవకాశము కలదని కార్మికులు గ్రహించిరి. సమ్మెలు చేసెదమని అనేక సందర్భములలో బెదరించుటయు, ప్రత్యక్షంగా సమ్మెలు చేయుటయు జరిగింది.

ఆ సందర్భములలో గవర్నమెంటువారు ప్రమేయము కల్పించుకొనవలసివచ్చింది; కార్మికుల వేతనప్రమాణములను నిర్ణయించి లాభములలో కార్మికులకు చెందవలసినవంతును నిర్ణయించి కార్మిక తగాదాలను పరిష్కరించునిమిత్తమై కార్మిక వివాద పరిష్కర్తలను గవర్నమెంటు నియమించి పది సంవత్సరముల అనంతరము దేశపరిశ్రమలు ప్రభుత్వాయత్తము చేయబడునని గవర్నమెంటు బెదరించుటవల్ల పెట్టుబడిదారుల స్థితి కేవలము "సప్పంబు పడగనీడను గప్ప వసించురీతి గదరా" అన్నట్లు ఉన్నదనియు ఆ కారణముచేతనే, పెట్టుబడివాటాల జల అంతకంతకు ఎండిపోవుచున్నదనియు పారిశ్రామికులు ప్రభుత్వమును నిందింపసాగిరి. ఇక విదేశీయ పెట్టుబడిదార్లు తమ పెట్టుబళ్ళకు భారతదేశపు శీతోష్ణస్థితి ఏంతమాత్రమూ అనుకూలముగా లేదనిరి. ఎందుచేతనగా ఈ దేశములో తాము పెట్టుబడిపెట్టిన ద్రవ్యమును తాము ఎప్పుడు కోరితే అప్పుడు తమ సొంతదేశాలకు తిరిగి చేర్చుకొనగల సదుపాయసౌకర్యము తమకు సర్వదా ఉండవలెనని కోరిరి.

సరిగ్గా యీ సమయంలోనే, వ్యాపారలాభముల పన్నును ప్రభుత్వము ఉపసంహరించకుండా ఉంచింది. అదిన్నీగాక, వ్యాపారసంస్థలో తమ వాటాదార్లకు పంచిపెట్టదగిన లాభ పంపిణీ నూటికి 6 వంతులకంటె మించియుండరాదని నిబంధింపబడెను. గత రెండు సంవత్సరములకు వర్తించెడి లాభపంపిణీలకున్నూ ఇదే మొదటిసారిగా యివ్వబడుచున్న లాభపంపిణీలకున్నూ ఆ నిబంధన చేయబడెను. నిరభ్యంతరంగా వడ్డీవ్యాపారం చేసికొనుటకు అవకాశముగల యీ దేశములో మంచి తాకట్టు హామీగల ఋణములకు కూడా నూటికి రూ 9 వంతు మొదలు నూటికి రూ 12 వంతు వరకు వడ్డీలు వసూలుచేసికొనుచున్న సందర్భములో, యంత్ర పరిశ్రమలయందు తమ పైకమును పెట్టుబడి పెట్టువారు నూటికి రూ 6 వరకు రేటు లాభ పంపిణీలతో తృప్తిపడియుండుట అసంభవం.

అంతేకాదు వారి స్థితి మరింత అధ్వాన్నముగా నుండును. ఎందుచేతనగా ఏదైనా యంత్రాగారపరిశ్రమలో తన ద్రవ్యమును పెట్టుబడి పెట్టితే, ఆ పరిశ్రమ లాభదాయక మగుటకు నాలుగైదేండ్లు పట్టును. అయినా ఆ పరిశ్రమ ఏవిధమైన అంతరాయములు విఘ్నములు మధ్యలో లేకుండా సంతత సంపల్లాభములు గడించుననుటకు వీలులేదు. దీనికి తోడు, పదేండ్లయినపిమ్మట, ఆ పరిశ్రమ ప్రభుత్వాయత్తము కాగలదనే బెదరింపుమూలంగా లాభాల పంపిణీవిషయములో స్థిరనిశ్చయం పోయింది. ఈ కారణాలవల్ల ఈ విషయములో విడువకుండా ఆవేదన ఆందోళన సాగింది. కొలదికాలములో పరిశ్రమలను ప్రభుత్వాయత్తము చేయవలెననే సంకల్పము ప్రభుత్వమునకు లేనేలేదని ప్రభుత్వప్రతినిధులే అనేక సందర్భములలో అధికారరీత్యా కొన్ని అర్థనిర్వచనములను చేయుచూ వచ్చిరి. వీరి మాటలు మనకు జీర్ణమై అవగాహన కాకపూర్వమే, ఒక మంత్రిశేఖరుడు ఏ సభాసమావేశములోనో ఉపన్యసిస్తూ, పారిశ్రామికులు సవ్యంగా వ్యవహరించక పోయినట్లయితే, వారి పరిశ్రమలను ప్రభుత్వాయత్తము చేయబడుట కెట్టి సందేహము వుండదని తలవని తలంపుగా ఒకమాట నోరుజారి అనడం తటస్థించెను. కాని, యిదంతా అవ్యక్తప్రతాపమని వారు ఏమాత్రమూ గ్రహించుటలేదు. నిజంగా కరిచే కుక్క మొఱగదు. వీరి ప్రతాప

ముల మూలంగా పారిశ్రామికుల తరఫువారు మరింత ప్రకోపించి మరికొన్ని మాటలు అలాపనచేశారు. లాభపంపిణీల విషయములో చేయబడిన నిబంధనను వ్యాపారలాభముల పన్నుతోసహా గవర్నమెంటువారు తీసివేసిరి. ఈవిధంగా తమ కట్టుబాట్లను సడలించి తొలగించుటమూలముగాను, కేంద్రములోను రాష్ట్రములందును ఇండస్ట్రియలు ఫైనాన్సు కార్పొరేషనుద్వారా,(పారిశ్రామిక ద్రవ్య సహాయసంస్థ ద్వారా) చౌకవడ్డీరేట్లకు ద్రవ్యమును సప్లయిచేయుట మూలముగాను చేయూతనొసంగుచు ప్రయివేటు వ్యాపారసంస్థలకు సహాయం చేయవలెనని ప్రభుత్వము సంకల్పించుకొన్నది. 1949 సంవత్సరము ఫిబ్రవరిమాసములో మద్రాసునందు వాణిజ్యమండలివారు సర్దారుపటేలుకు సమర్పించిన వినతిపత్రమునకు ఆయన సమాధాన మిచ్చుచు యీ క్రిందిరీతిన ఘంటాపథముగా ఒకమాట అన్నారు.

“పరిశ్రమలు ప్రభుత్వాయత్తము చేయబడునని భయపడవద్దు. ఏ పరిశ్రమనైనను ప్రస్తుతము ప్రభుత్వము దఖలుపరచుకొనుటకు తగిన శక్తిసామర్థ్యం యీ ప్రభుత్వానికి లేదని వేదవాక్యంగా నా మాట నమ్మండి. కాబట్టి, దేశపరిశ్రమలు ప్రభుత్వాయత్తమొనర్పబడునని ఎవరైనను పల్కినయెడల, అట్టివాడు తానొక బ్రహ్మాండనాయకుణ్ణి కావలెననే తలంపుతో అవిధంగా పల్కుచుండును. అటువంటివాళ్ళను నేను నమ్మను.”

భారత ప్రభుత్వ ఉపప్రధాని అధికారరీత్యా చేసిన యీ బహిరంగప్రకటనద్వారా, ఆందోళనపడినవారి కందరికి చిత్తశాంతి కలిగియుండవచ్చు. కాని, దౌర్భాగ్యవశమున మన జాతికి వాచాలత్వ మెక్కువ. పైజెప్పిన బహిరంగప్రకటన జరిగినపిమ్మట కూడా, కొందరు మంత్రులింకను పరిశ్రమల ప్రభుత్వ వశీకరణ ప్రస్తావన చేయుచునేయుండిరి. ఈ విధమైన ప్రలాపనలమూలముగానే యీ దేశములోని సమస్త దురవస్థలు దుర్భిక్షములు సంభవించుచున్నవని పారిశ్రామికులు బాహాటముగా చాటించుచున్నారు.

ఈ విషయములో సర్వతోముఖపరిశీలన చేసి చూడగా, అసమర్థులమైన మనము, ఇతరులను పాపాలభైరవులుగా చేసి, మన అప్రయోజకత్వమునకు వారే కారకులనుచున్నాము. చాలా ఉన్నత స్థాయిలోఉన్న ఏ కొలదిమంది పారిశ్రామికులనో మినహాయించితే, పారిశ్రామికులమని చెప్పుకొని, కొన్ని పరిశ్రమలను నెలకొల్పి నిర్వహించుచున్నవా రందరికీ, పారిశ్రామికశబ్దం సార్థకంగా అన్వయించదు. ఇట్టివా రందరూ సర్వదా వ్యాపార లాభకాంక్షతో ప్రవర్తిస్తూ గ్రహపాటున పరిశ్రమల రంగములోనికి దిగిన సాధారణ స్వల్ప వ్యాపారస్థులనియే చెప్పవలసియున్నది. ఏ పారిశ్రామికుడైనను లాభాల కాంక్షతోనే పరిశ్రమను ప్రారంభిస్తాడు. ఆ మాట నిజమే. కాని అతడు నిజమైన పారిశ్రామికుడైనట్లయితే, నిర్మాణాత్మకమైన ఆత్మసంకల్పోద్వేగ మొకటి అతనిలో ప్రధానంగా ఉంటుంది. సమర్థంగా పనిచేసే భారీసంస్థ నొకదానిని నిర్మాణం చేసి, దానిద్వారా శుద్ధమైన వస్తూత్పత్తి సవ్యంగా సమర్థంగా జరుగుచున్నప్పుడే అతనికి సంతృప్తి కలుగును. ఆ పరిశ్రమను స్థాపించిన కొన్ని ఏండ్లయనంతరమే అతడు లాభాల సంగతి తలపోయును. ప్రథమ ప్రదక్షిణముననే సద్యోగర్భములై కోరికలు ఫలించవలెనని ఆశింపడు.

మన కార్మికుల వ్యవహారము మరింత అధ్వాన్నముగా నున్నది. వీరు సంకల్పశుద్ధిగా ఎనిమిది గంటలు పని చేసినట్లయితే మన పరిశ్రమలు చాలా సుసంపన్నస్థితిలోనికి రాగలవు. మన పారిశ్రామికులలోను, మన కార్మికులలోను ఏర్పడిన సామర్థ్యలోపం వల్ల దేశానికి ఆర్థికంగా దుర్భిక్షం యేర్పడుతోంది. ఈ ప్రపంచంలో ఠీవిగల యొక జాతిగా నిలిచి వర్ధిల్లవలెనంటే, పై చెప్పిన ఉభయవర్గముల అసమర్థతాదోషం పోవాలి. ఉభయవర్గములు ఏకైక సమసంకల్పదీక్షతో పనిచెయ్యాలి. లాభైశ్వర్యములవిభాగవిషయములో ఉభయులును వివాదపడుటకు పూర్వము ఉభయుల కృషివల్లను, అధికోత్పత్తియును, లాభైశ్వర్య వృద్ధియును కలుగవలసియున్నది.

ప్రభుత్వాయత్తమైనంతమాత్రమున పరిశ్రమలు సమర్థముగా పనిచేయునని వాదింపవీలులేదు. మీదుమిక్కిలి సర్కారు అధికారులు పైన పెత్తనం వహించినప్పుడు, క్రిందివాళ్లకు బేజవాబుదారీ సహజంగా ఏర్పడుతూ ఉంటుంది. క్రిందిశ్రేణిలో మందగతి ఏర్పడుతుంది. ఒక సంస్థను నడిపించేవారికి, ఆ సంస్థలో వారికి ఉండే ఆసక్తి ఆత్మప్రేరణ అంతరించినప్పుడు, పైన ఎంత అజమాయిషీ చేసినప్పటికీ, దానిని చక్కదిద్దుటకు సాధ్యము కాదు. ప్రయివేటు ఆసాములు కార్మికవర్గము, కలిసి మెలిసి కృషిచేసి, వస్తూత్పత్తిని అధికంగా వృద్ధిచేయవలెనంటే నిరంతర ప్రబోధ ప్రచారములును, మంచి లక్ష్యాలక్షణ శిక్షణయును కావలసియున్నవి. ప్రభుత్వ వశీకరణము కొంత అవసరమే. కాని, అది అతిస్వల్పముగా నుండవలెను.

మన దేశంలో వస్తూత్పత్తి తగ్గిపోవుటకుగాని, లేదా క్రొత్త పరిశ్రమల ప్రతిష్ఠించుటకై పెట్టుబడిదారులు ముందంజవేయకపోవుటకుగాని దేశపరిశ్రమలు ప్రభుత్వాయత్త మొనర్పబడు ననెడి ప్రభుత్వప్రకటనలు వాస్తవమైన మూలకారణములు కావు. అదే విధముగా, విదేశీయ పెట్టుబడిదారులు కూడా మనదేశమందు పరిశ్రమలను ప్రతిష్ఠించుటకై తమ పెట్టుబడిద్రవ్యముతో ముందుకు రాకపోవుటకు కారణము మన ప్రభుత్వము చేసిన బాహాటప్రకటన కాదు, ఆ విదేశీయుల సొంతదేశములలోనే వారి పెట్టుబళ్లకు హెచ్చులాభ ప్రతిఫలము లభించుచుండుటవల్లనే వారిచటకు విచ్చేయలేదు. మన ఆర్థికసంపత్తి అల్పమైనదేగాని అపారమైనది కాదు. గత యుద్ధకాలంలో ప్రజాద్రవ్యము చాలావరకు పీల్చి పిండిజేసినట్లయినది. ఈ దేశములో బ్రిటిష్‌వారికి గల అనేక వ్యాపారసంస్థలను అప్పటి హెచ్చుధరలకు మనదేశస్థులు కొనుక్కొని వారికి ద్రవ్యం కుమ్మరించిరి.

అప్పటి ప్రభుత్వము జారీచేసిన దీర్ఘవాయిదా ఋణపత్రములలో ప్రబలద్రవ్యము విశేషముగా వినియోగింపబడినది. ఆ ద్రవ్యమే కొలదికాలములో అనేక అవసరములకు కావలసి వచ్చును. మన మిప్పుడు ఉన్నదానిని చక్కదిద్దుకొనుచు, పాత క్రొత్తల సమన్వయావస్థలో ఉన్నాము. ఇక రాబోవు రెండుమూడు సంవత్సరములలో పెట్టుబడిదార్ల వ్యాపారరంగము స్తిమితమై అనివార్యమైన కొలది పరిమిత ప్రభుత్వ నిగ్రహాధికారముతో ప్రయివేటు ఆసాముల వ్యాపారాభినివేశ మభివృద్ధి గాంచగలదు.

# భారతీయ చిత్రకళ — శ్రీ రాయచౌదరి



నేటి భారతీయ చిత్రకారులలో, శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌదరి అగ్రశ్రేణినున్న వారిలో లెఖ్ఖకువస్తాడు. తక్కిన ప్రముఖచిత్రకారులకూ దేవీప్రసాద్ రాయ్ చౌదరికి ఒక ప్రత్యేక విభేదమున్నది. వంగచిత్రకారులలో ముఖ్యులైన అవనీంద్రుడు, నందలాల్, మొదలైనవారు, అజంత మొదలైన, పూర్వభారత చిత్రకళా సంపత్తినుంచే, తమ ప్రతిభకు మెరుగు దిద్దుకొన ప్రయత్నించారు. చొగతాయి మొదలైన మరి కొందరు, మొగలు సాంప్రదాయకుల ప్రభావమునుకూడ మేళవించుకొని రేఖా సౌమ్యతలలోనూ, వర్ణసమ్మేళనంలోనూ, కేవలం ప్రాచ్యకళా విధానమే పెంపొందించ ప్రయత్నించారు. కాని రాయచౌదరి చిత్రాలు చూస్తూంటే, రేఖాసౌమ్యత్వాన్ని, అతీంద్రియ భావస్ఫురణకు, సాంకేతికమాత్రంగానే, భారతీయ అజంతా, మొగల్, రాజపుట్, సాంప్రదాయాలనుంచి, తదితర ప్రాచ్యఖండ సంప్రదాయాలనుంచి తీసికొని, తక్కిన తన కళాసంపత్తి కంతకూ, పాశ్చాత్యచిత్రకారుల, సాంప్రదాయ, విప్లవ, వర్ణ విధానాలను జీర్ణించుకొని వాటిని తన స్వప్రతిభాసంపత్తి కనుగుణంగా వెలువరుస్తున్నాడా అనిపిస్తుంది.

చిత్రకళలోగాని తద్విమర్శలోగాని, ప్రవీణుల దృష్టిలో చిత్రాలను పరిశీలించటం, సామాన్యులమైన మన కందరికీ అందుబాటుగాని విషయం. అందుబాటైనా ఆ దృష్టి ఒక్కొక్క చిత్రణా విధానాన్ని మాత్రమే ఒక మతంగా చేసి, తక్కినవాటి వేటికన్నా అగ్రస్థాన మిచ్చి, ఒక ప్రత్యేక సంస్కారాన్ని మాత్రమే, కృతకంగా, రసగ్రహణతకు గీటురాయిని చేసి, సామాన్యమానవుని, నైసర్గిక రసానందశక్తిని, పేలవంగా చూపించి, తిరస్కార పాత్ర మొనరిస్తుంది. అందుచేత ఏ పద్ధతికి చెందిన చిత్రమైనా, సామాన్యులమైన మనకు, పరిపూర్తిగా అవగాహన కాకపోయినా, తన సహజ గాంభీర్యంవల్లగాని, రామణీయకతవల్లగాని, మనలో ఆకర్షణ, గౌరవము, మనస్సులో ఉద్విగ్నత, ఏ అంతస్థువారికా అంతస్థుమాత్రంగానైనా కల్పించ గలిగేదిగా ఉండాలి. ప్రపంచ వ్యాప్తంగా శాశ్వతమైన పేరుగాంచిన పూర్వ అధునాతన ఉత్తమచిత్రాలకు, పాశ్చాత్యులవైనా ప్రాచ్యులవైనా ఈ సుగుణం ఉంటుంది. లియనార్డోడావిన్సీ, మైకేల్ ఏంజిలో, రెంబ్రాండ్టు, గాగూయిన్, మానెట్ మొదలుగాగల పూర్వ,నవీన పాశ్చాత్యుల చిత్రాలు, అజంతా, మొదలైన భారతీయచిత్రాలు, ప్రముఖంగా నిలచిపోయినవన్నీ, ఈ సుగుణం కలిగే ఉంటాయి.

రాయచౌదరిచిత్రాలలో చాలావాటిల్లో ఈ దార్ఢ్యము, గాంభీర్యత, గౌరవనీయంగా వ్యక్తమవుతాయి.

ప్రాచ్య, పాశ్చాత్య, సంప్రదాయాలను స్థూలదృష్టితో చూస్తే ఒక విభేదము కనబడుతుంది. ప్రాచ్యచిత్రకారులు అతీంద్రియస్ఫురణకు, రేఖాసౌజన్యాన్నే ఎక్కువ ఆలంబనగా చేసుకొన్నారు. రూపవాస్తవికతకన్న, రేఖామాధుర్యాన్నే రసానందకల్పనకు, ఆధారభూతంగా చేసుకొన్నారు.

అలంకరణలలో వాస్తవికత కిచ్చిన ప్రథమస్థానము, చిత్రప్రముఖవస్తురూపంలోనూ, సందేశార్థంలోనూ కడస్థానం అందుకోచేశారు. అందుచేత చిత్రంలో వర్ణసమ్మేళనలో, స్వరసమ్మేళన (*Harmony*) మాత్రానికే దృష్టికేంద్రీకరించుకొన్నారు. చిత్రం వాస్తవికప్రమాణ గుణత్రయాత్మకంగా కనిపించటంమీదకాక, కాల్పనిక భావసౌందర్యంతోనే, అతీంద్రియ స్ఫురణను ద్రష్టకు కలిగించేందుకు ప్రయత్నించారు. అజంతా చిత్రకారులు, ఈస్వల్ప పరిధిలోనే తమ ఆశయం సిద్ధించుకొన్న మహాప్రతిభులు. సామాన్య ప్రజ్ఞల కిది ద్రావిడప్రాణాయామమే. అందుకనే అజంతా కళను పునస్సరించ చూసే సామాన్య చిత్రణల నన్నింటిలోనూ, ఆవిధానపు సూత్రము మిగిలి, చిత్రమునకు ప్రాణమైనట్టి సందేశస్వరూపం వెలువడటంలేదు.

పాశ్చాత్యులింతకన్న ప్రాకృతిక ఆశయాలతో తమ కళకు పునాదులు వేసుకొన్నారు. ప్రత్యక్షరూపాలపైనే, తమ అతీంద్రియచిత్రసందేశాలను ఆవాహనం చేసుకున్నారు. రూపము, వర్ణము, సృష్టి యాదార్థ్యతలోనే, భావశబలతకు పట్టుగొమ్మలను కుదిర్చి తమ చిత్రాలలో రససిద్ధిని సాధించుకొన్నారు.

వెలాస్క్వెజ్, మొదలైనవారి నాటికే, ప్రకృతిసిద్ధమైన వర్ణశబలతలోనే, జటిలమైన రంగుముద్దల కందక, కంటినలరించే వాతావరణమూ, ఎండనీడల మార్పులూ, దరి దాపుల భేదములతో కల్గింగలవర్ణ విశేషములు కలవనీ, వాటిని కూడా, రంగులలోనే స్ఫురింప చేయాలనీ, పాశ్చాత్య చిత్రకారులలో ప్రయత్నం జరిగింది. మానెట్ అనే ఫ్రెంచి చిత్రకారుడు ఒక గడ్డిమేటివంటి సామాన్య వస్తువును, వివిధఋతువుల, ఎండనీడలలో వాతావరణాలలో, వస్తువు నావరించుకొనే, వాతావరణంతోనూ, వాతావరణాతీతమై వస్తువు నావరించి రూపరహితంగానే నిత్యం మారే ఒక సహజ సంపద్విశేషాన్ని చిత్రించాడు. ఇక్కడికి వచ్చేటప్పటికి చిత్రకారులు వాస్తవికతకు, తృతీయ చతుర్థస్థానాలియ్య వలసివచ్చింది. గాగుయిన్, వాన్‌గాగ్, మొదలైనవారు ఉద్రేకాలను, అరిషడ్వర్గాన్ని, చరాచరవస్తుజాలాన్నంతకీ ఆవరింపచేసి, వాస్తవికతకు కడమస్థానమిచ్చి వర్ణసమ్మేళనంలోనే భారతీయులు రేఖలలో సాధించదలచుకొన్న అతీంద్రియ సందేశాల నియ్య ప్రయత్నించారు. అంతతో సామాన్యులకందుబాటుగాని డాడాయిజమ్ములు, ఇంప్రెషనిజంలు, క్యూబిజంలు, చిత్రవీధిని ప్రవేశించాయి. ఇన్ని చేసినా పాశ్చాత్య చిత్రకారులు, తను కళ్ళముందు కనబడే వాస్తవిక లోకాన్ని మూలా